నియమముగా ఉండి మితాహారియై, జితేంద్రియుడై, భక్తితో భాగవత పాఠ, శ్రవణాదులు చేయాలి. సమాపనముగా వస్త్రాలంకార ద్రవ్యములచే పాఠకుని, పౌరాణికుని పూజించి, రుక్మిణీ కల్యాణము చేయించి, బ్రాహ్మణులకు, అన్నసంతర్పణ చేయాలి. బంగారు సింహాసనమును చేయించి దానిమీద చేతితో వ్రాసిన భాగవత గ్రంథమును ఉంచి పౌరాణికునికి దానం చేయడం వలన మోక్షప్రాప్తి కలుగుతుంది. భాగవత సప్తాహ శ్రవణము భాద్రపద నవమి నుండి పౌర్ణమి వరకు సమాప్తి చేయాలి. శ్రీశుక ముఖతః పరీక్షిత్తు ఇదే సమయములో శ్రవణము చేశాడు.

శ్లో । మనుకర్దమసంవాదపర్యంతం ప్రథమే ఽహని ।
భరతాఖ్యానపర్యంతం ద్వితీయేఽహని ।
తృతీయే చ దినే కుర్యాత్ సప్తమస్కంధపూరణమ్ ।
కృష్ణావిర్భావ పర్యంతం చతుర్థే దివసే పఠేత్ ।
రుక్మిణ్యుద్వాహపర్యంతం పంచమేఽహని శస్యతే ।
శ్రీ హంసాఖ్యాన పర్యంతం షష్ఠేఽహని పఠేత్సుధీః ।
సప్తమే తు దినే కుర్యాత్ పూర్తిం భాగవతస్యవై ।
ఏవం నిర్విఘ్నతా సిద్ధిర్విషయస్య న చాన్యథా ॥

మరి కొందరి మతంలో. శ్లో ॥ ఆద్యే హిరణ్యాక్ష వధో ద్వితీయే భరతావధి ।
తృతీయేత్వబ్ధి మథనం చతుర్థే కృష్ణ జన్మ చ ।
పంచమే రుక్మిణ్యుద్వాహః షష్ఠేచోద్ధవ వాచకమ్ ।
సప్తమే ఽహ్ని సమాప్తిః స్యాత్ సప్తాహం మునిరబ్రవీత్ ॥

అని శ్రీమద్భాగవత మాహాత్మ్యం స్కాంద పురాణంలో వైష్ణవ ఖండంలో వివరించబడినది.“ శ్రీమద్భాగవతాఖ్యోయం ప్రత్యక్షః కృష్ణ ఏవహి”. అని పద్మపురాణమున కలదు. శ్రీమద్భాగవతము అక్షరరూప శ్రీకృష్ణ స్వరూపము. పద్మ పురాణములో ఉద్ధవుడు శ్రీకృష్ణ నిర్యాణ సమయమున “స్వామీ ! కలి కాలమున మానవులెలా ఉద్ధరింపబడగలరు. పాపాత్ములు, అల్పాయుష్మంతులు, ఉగ్రరోగబాధితులు బాగుపడే మార్గము చెప్పుము.” అని ప్రార్థించగా తన తేజస్సును శ్రీకృష్ణపరమాత్మ శ్రీమద్భాగవతమున ఉంచెను. ద్వాదశ స్కంధాత్మక శ్రీభాగవతము ద్వాదశాదిత్య సమానము. సూర్యుడు తమస్సును రూపుమాపి వెలుగును ప్రసరింపజేసినట్లు శ్రీమద్భాగవతము అజ్ఞానమనెడి చీకటిని తొలగించి భక్తి, జ్ఞాన, వైరాగ్యములనెడి వెలుతురు కలిగించెడి గొప్ప కల్పతరువు. “కలౌ నష్ట దృశామేష పురాణార్కో ऽ ధునోదితః”. అన్నారు. భక్తి జ్ఞాన వైరాగ్య జనకమగు భాగవతము త్రివిధగతి గల సూర్యునితో సమానమేగాక సూర్యునికన్న మిక్కిలి విశిష్టమైన వ్యతిరేకాలంకారాలలో వివరించబడినది. సూర్యుడు పగలు మాత్రమే ప్రకాశిస్తాడు, కాని శ్రీమద్భాగవతము రాత్రింబవలు కూడా వెలుగుతుంది. సూర్యుడు మనోగుహలోని అంధకారాన్ని తొలగించలేడు, కాని భాగవతము మనోగుహాగతమైన అజ్ఞానమనెడి మాలిన్యాన్ని కూడా తొలగించగలదు. భాగవత పురాణ ప్రవచనము జరిగినచోట సర్వ శ్రేయస్సులు చేకూరుతాయి. భాగవత సప్తాహ శ్రవణము వలన ఈ లోకమున ఆయురారోగ్య ఐశ్వర్యాది సత్ఫలితములే కాక అంత్యమున మోక్షము కూడా లభించును. “నాన్యః పంథా విద్యతేయనాయ” అని శ్రుతి. మోక్షానికి జ్ఞానమే కారణము.

భాగవత సప్తాహము సర్వోత్కృష్టమగు జ్ఞాన యజ్ఞము. ఇది భక్తుల పాలిటి పెన్నిధి.

శ్లో ॥ శ్రీమద్భాగవతం పురాణ తిలకం యద్వైష్ణవానాం ధనమ్ ।
యస్మిన్ పారమహంస్యమేకమమలం జ్ఞానం పరం గీయతే ॥
యత్ర జ్ఞానవిరాగభక్తిసహితం నైష్కర్మ్యమావిష్కృతమ్ ।
తచ్ఛృణ్వన్ ప్రపఠన్ విచారణ పరో భక్త్యా విముచేన్నరః ॥

శ్రీమద్భాగవతము 12 స్కంధములు కలది. 12 అక్షరములు గల వాసుదేవ ద్వాదశాక్షరీ మహామంత్రమునకు సమానమని భావింపబడుచున్నది. శ్రీమద్భాగవతము గహనము. అంత సులభముగా అర్థముగాదు. భాగవతార్థము వ్యాఖ్యాగమ్యము. అనేకమంది పండిత ప్రకాండులు భాగవతానికి వ్యాఖ్యలు రచించారు.



వ్యాఖ్యానాలకు వ్యాఖ్యలు కూడా వెలుబడినవి. అన్నిటికన్నా శ్రీధరీయ వ్యాఖ్యానము ముఖ్యమైనది. శ్రీధరస్వామి రచించిన భావార్థ దీపిక అను అద్వైత సిద్ధాంతపరమైన వ్యాఖ్యానము మిక్కిలి విశిష్టమైనది. శ్రీమద్భాగవతము అద్వైత వేదాంత సిద్ధాంతముతో నిండియున్నదనుటకు సందేహము లేదు. దాన్ని ప్రతిపాదించునది భావార్థదీపిక. యథార్థమైనభావమును ప్రకాశింపజేయునది. శ్రీధరస్వామి గొప్ప నృసింహ భక్త్యుపాసనలు కల మహాపండితుడు. అంతటి ఉపాసకునికి గూడా భాగవత శ్లోకాలకు సరియైన అర్థము కొన్నిచోట్ల గోచరించకపోతే ఆయన ముఖముపై వస్త్రం వేసుకొని నృసింహ ధ్యానం చేస్తూ కూర్చొనేవాడనీ, కొద్ది సేపటికి ముఖవస్త్రం తీసి చూడగా అచట కొన్ని పంక్తులు చక్కని అర్థమును వివరించేవి వ్రాసియుండెడివని చివరన "అయం భావః" అని ఉండిందనీ, ఆ అర్థాలను స్వయంగా నృసింహస్వామి తెల్పినాడని ప్రతీతి. శ్రీధరీయ వ్యాఖ్యానాన్ని ఇతర వ్యాఖ్యానాలను పరికించి పండితులు ఏది గొప్పదని ఆలోచించి శ్రీధర వ్యాఖ్యలేనిచో, భాగవత నిగూఢార్థము ఎవ్వరికినీ తెలిసేది కాదని నిర్ధారించారు.

అట్టి శ్రీధర వ్యాఖ్య భావార్థదీపికకు వంశీధర వ్యాఖ్యానం కూడా వెలుబడింది. అంతేకాక ఈ వ్యాఖ్యానాలనన్నింటినీ జగన్నాథస్వామి గుడిలో ఉంచితే దేనిని స్వామి పరిగ్రహించునో అది గొప్పదని, తెలుసుకుందామని ఆ విధముగా గుడిలో ఉంచితే శ్రీధర వ్యాఖ్య జగన్నాథస్వామి చేతిలో కనిపించినదని ప్రతీతి.

శ్రీధర వ్యాఖ్యానము ప్రతులలో అనేక పాఠభేదాలు కలవని వాటిని శోధించి సుష్ఠు పాఠములను పండితవర్య నారాయణ శాస్త్రి ప్రభృతులు నిర్ణయించి ముద్రించారు. అందుకే........"వ్యాసో వేత్తి శుకో వేత్తి సంజయో వేత్తి రాజా వేత్తి న వేత్తి వా న వా శ్రీధరః సకలం వేత్తి శ్రీనృసింహప్రసాదతః ". అని ఆభాణకం వెలుబడినది. శ్రీధర వ్యాఖ్య గూడా చాలా జటిలం, వంశీధరవ్యాఖ్యయేకాక శ్రీధరీయానికి చాలా వ్యాఖ్యానాలు వెలుబడినవి. అట్టి శ్రీధరస్వామి భావార్థదీపిక సంస్కృత వ్యాఖ్యానానికి తెలుగు అనువాదం పండితులచే వ్రాయించి ప్రచురించాలని శ్రీగురు మదనానంద సరస్వతీ పీఠం సంకల్పించినది. శ్రీధరులు కఠిన పదాలకు మాత్రమే అర్థం వివరించారు. అనువాదం అటులనే చేసిన పాఠకులకు అగమ్యగోచరమగును. కావున శ్రీమద్భాగవతమునకు శ్రీధరవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ఈ గ్రంథ ధ్యేయము.

డా॥ బ్రహ్మశ్రీ శివునూరి విశ్వనాథశర్మ
పీఠకార్యనిర్వాహక సభ్యులు

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,

ప్రథమోऽధ్యాయః

టీ:- శ్లో. గుణాయం గుణతావాప్త్యై వృణుతే కరుణానిధిమ్,
తమహం శరణం యామి పరమానందమాధవమ్.
త్రిగుణాష్టభిరధ్యాయైర్వైవస్వతసుతాన్వయః,
నవమే కృష్ణసత్కీర్తి ప్రసంగాయ వితన్యతే.
ఏవముక్తోऽష్టమస్కంధే సద్ధర్మస్సత్త్వశోధకః,
కర్తృపాలకవక్త్రాదిమన్వాదీనాం నిరూపణైః.
సద్ధర్మ శుద్ధసత్త్వానామంతరం గేశ సత్కథా,
సూర్యసోమాన్వయాఖ్యానైరధునా సంగతోచ్యతే.
త్రయోదశభిరధ్యాయైః సూర్యవంశోऽనువర్ణ్యతే,
ఏకాదశభిరధ్యాయైః సోమవంశస్తతః పరైః.
తత్రతు ప్రథమోऽధ్యాయే వైవస్వతసుతాన్వయే,
సోమవంశ ప్రవేశోక్త్యై సుద్యుమ్న స్త్రీత్వముచ్యతే.

శ్రీమద్భాగవతము. నవమస్కంధము. శ్రీధరీయ

టీకాంధ్రానువాదము 1 వ అధ్యాయము.

విష్ణువు వలికెను.

ఈ నవమ స్కంధమున శ్రీకృష్ణ కథా ప్రసక్తముగా ఇరువది నాలుగు అధ్యాయములలో వైవస్వతమను, సుతుల వంశముల గురించి విస్తారముగా తెలుపబడుచున్నది. అందు పదమూడు అధ్యాయములలో సూర్యవంశము, పదకొండు అధ్యాయములలో చంద్రవంశము అభివర్ణించబడుచున్నది.

విష్ణురాత ఉవాచ

శ్లో॥ మన్వంతరాణి సర్వాణి త్వయోక్తాని శ్రుతాని మే ।
వీర్యాణ్యనంత వీర్యస్య హరేస్తత్ర కృతాని చ ॥ 1

పరీక్షిన్మహారాజు శుకమహర్షితో ఇటుల వలికెను.

నీచే చెప్పబడిన సమస్త మన్వంతరముల గురించి శ్రీహరి చేత చేయబడిన సమస్త పరాక్రమముల గురించి తెలిసికొంటిని. 1

శ్లో॥ యోఽసౌ సత్యవ్రతోనామ రాజర్షిర్ద్రవిళేశ్వరః ।
జ్ఞానం యోఽతీతకల్పాంతే లేభే పురుషసేవయా ॥ 2

ద్రవిళాధిపతియగు సత్యవ్రత మహారాజు గత కల్పాంతమున జ్ఞానము నొందిన విషయమును వింటిని. 2

శ్లో॥ స వై వివస్వతః పుత్రో మనురాసీదితి శ్రుతమ్ ।
తతస్తస్య సుతాః ప్రోక్తా ఇక్ష్వాకు ప్రముఖా నృపాః ॥ 3

వైవస్వత పుత్రుడు మనువైనదియు తెలిసుకొంటిని, అతని పుత్రులగు ఇక్ష్వాకువు మొదలగు పదిమంది పుత్రులను గురించి చెప్పితివి. 3

శ్లో॥ తేషాం వంశం పృథగ్బ్రహ్మన్ వంశానుచరితాని చ ।
వర్ణయస్వ మహాభాగ నిత్యం శుశ్రూషతాం హి నః ॥ 4

ఓ శుకబ్రహ్మ ఇపుడు ఆ వైవస్వతమను పుత్రుల యొక్క వంశములను వారి వంశములో కలుగు వారల చరిత్రను ప్రత్యేకముగా (వంశానుచరితము) తెలుపుము. నాకు వినవలెనని కోరిక కలుగుచున్నది. 4

శ్లో॥ యే భూతా యే భవిష్యాశ్చ భవంత్యద్యతనాశ్చ యే ।
తేషాం నః పుణ్యకీర్తీనాం పూర్వేషాం వద విక్రమాన్ ॥ 5

ఇదివరలో జన్మించినట్టి, ముందు జన్మించబోవునట్టి, ఇప్పుడు ఉన్నట్టి, పుణ్యవంతులైన పూర్వుల యొక్క పరాక్రమములను తెలుపుము. 5

సూత ఉవాచ

శ్లో॥ ఏవం పరీక్షితా రాజ్ఞా సదసి బ్రహ్మవాదినామ్ ।
పృష్టః ప్రోవాచ భగవాన్ శుకః పరమధర్మవిత్ ॥ 6

సూతపౌరాణికులు పలికెను

బ్రహ్మవేత్తల సభలో పరీక్షిన్మహారాజుచే ఈ విధముగా అడుగబడగా గొప్ప ధర్మవేత్తయగు శుకబ్రహ్మ చెప్పదొడిగెను. 6

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ శ్రూయతాం మానవో వంశః ప్రాచుర్యేణ పరంతప ।
న శక్యతే విస్తరేణ వక్తుం వర్షశతైరపి ॥ 7

టీ:- "శ్లో. ఉక్తానువాదపూర్వకం వైవస్వతమనోర్వంశం పృచ్ఛతి - మన్వంతరాణీత్యాదిపంచభిః."(1-7)

శ్లో॥ పరాపరేషాం భూతానామాత్మా యః ప్రకృతేః పరః ।
స ఏవాసీదిదం విశ్వం కల్పాంతేఽన్యన్న కించన ॥ 8

టీ:- అనుక్తం వంశం వక్తుం పూర్వోక్తమేవ తావద్వంశం. తత్ప్రవర్తకం శ్రీ నారాయణ మారభ్య అనుస్మారయతి -పరాపరేషామిత్యాది పంచభిః (8-11)

శ్లో॥ తస్య నాభేస్సమభవత్పద్మకోశో హిరణ్మయః ।
తస్మిన్ జజ్ఞే మహారాజ స్వయంభూర్భూతభావనః ॥ 9

శ్లో॥ మరీచిర్మనసస్తస్య జజ్ఞే తస్యాపి కశ్యపః ।
దాక్షాయణ్యాం తతోఽదిత్యాం వివస్వానభవత్సుతః ॥ 10

శుకుడు పలికెను.

మనువుల వంశమును గూర్చి నూరు వత్సరములు చెప్పినను పూర్తికాదు. అయినప్పటికి నాకు తెలిసినంత వరకు తెలిపెదను. 7

బృహద్రూపములకు, అణురూపములకు మూల భూతుడగు శ్రీమన్నారాయణుడు కల్పాంత సమయమున తానే విశ్వమంతయు వ్యాపించి యుండెను. 8

శ్రీమన్నారాయణుడి నాభి నుండి హిరణ్మయమగు ఒక పద్మము ఉద్భవించెను. ఆ పద్మమునుండి బ్రహ్మ ఉద్భవించెను. 9

ఆ బ్రహ్మ మనస్సు నుండి మరీచి జన్మించెను. మరీచికి కశ్యపుడు, కశ్యపునకు దక్షప్రజాపతి పుత్రికయగు అదితి యందు సూర్యుడు జన్మించెను. 10



శ్లో॥ తతో మనుః శ్రాద్ధదేవస్సంజ్ఞాయామాస భారత ।
శ్రద్ధాయాం జనయామాస దశపుత్రాన్ స ఆత్మవాన్ ॥ 11

శ్లో॥ ఇక్ష్వాకు నృగ శర్యాతి దిష్టధృష్ట కరూశకాన్ ।
నరిష్యంతం వృషధ్రం చ నభగం చ కవిం విభుమ్ ॥ 12

టీ:- ఇక్ష్వాక్విత నాభాగం చేతి పాఠేఽపి. నభగ ఏవ నాభాగః. కవిరిత్యస్య వసుమానిత్యపి నామాంతరసద్భావాత్. అష్టమస్కంధీయ త్రయోదశాధ్యాయ ప్రతిపాదితనామానుక్రమణికాయా న కోఽపి విరోధః. విష్ణుపురాణే హరి వంశే చ. వైవస్వతస్య ఇక్ష్వాకు ప్రభృతి పుత్ర నవకమేవాభిహితం న దశమస్య కవేః బాల్య ఏవ మృతత్వాత్. ఏవమేవాత్ర ద్వితీయేఽధ్యాయే. 14. శ్లో. వివేశ కైశోరవయాః పరాం గతిమితి వక్ష్యమాణత్వాత్. 12

ఆ సూర్యునకు సంజ్ఞయను భార్యయందు శ్రాద్ధదేవుడు జన్మించి మనువయ్యెను. ఆ శ్రాద్ధదేవుడు శ్రద్ధయను భార్యయందు ఇక్ష్వాకుడు, నృగుడు, శర్యాతి, దిష్టుడు, ధృష్టుడు, కరూశకుడు, విరిష్యంతుడు, వృషధ్రుడు, నభగుడు, కవి అను పదిమంది పుత్రులను కనెను. 11-12

శ్లో॥ అప్రజస్యమనోః పూర్వం వసిష్ఠో భగవాన్ కిల ।
మిత్రావరుణయోరిష్టిం ప్రజార్థమకరోద్విభుః ॥ 13

టీ:- సూర్యపౌత్రసుద్యుమ్నస్య స్త్రీత్వే సతి. బుధాత్పురూరవః ప్రభృతి సోమవంశసంచారం వక్తుం స ప్రస్తావమిళోపాఖ్యానమాహ- అప్రజస్య మనోః పూర్వమిత్యాదినా యావదధ్యాయ సమాప్తి. అప్రజస్యేతి. పూర్వమిక్ష్వాకు ప్రభృతీనాముత్పతేః ప్రాక్. 13

ఈ పదిమంది పుత్రులను కనుటకంటే ముందు మనువు అపుత్రకుడై, పుత్రుల కొరకు మిత్రావరుణులనుద్దేశించి యజ్ఞము కావించెను. 13

శ్లో॥ తతశ్శ్రద్ధా మనోః పత్నీహోతారం సమయాచత ।
దుహిత్రర్థముపాగమ్య ప్రణిపత్య పయోవ్రతా ॥ 14

టీ:- తత ఇతి. దుహిత్రర్థం. మమ కన్యా యథా భవేత్తథా యజేతి. హోతారం సమ్యగయాచత. పయ ఏవ వ్రతమాహారఽనియమో యస్యాః 14

ఆ సమయమున శ్రాద్ధమనువు భార్య హోత నాశ్రయించి తనకు పుత్రిక కలుగునటుల యాగ కర్మల నాచరింపుమని వేడెను. అందులకై పయోవ్రతమాచరించెను. 14

శ్లో॥ ప్రేషితోఽధ్వర్యుణా హోతా తద్ధ్యాయన్ వ్యచరత్తదా ।
గృహీతే తేన హవిషి వషట్కారం గృణన్ ద్విజః ॥ 15

ఆమె కోరికననుసరించి అధ్వర్యునిచేత ప్రేరేపించబడిన హోత పుత్రిక కలుగుటకై హవిస్సును హుతము చేసెను. 15

శ్లో॥ హోతు స్తద్వ్యభిచారేణకన్యేళానామ సాభవత్ ।
తాం విలోక్యమనుఃప్రాహనాతిహృష్టమనా గురుమ్ ॥ 16

టీ:- ప్రేషిత ఇతి. అధ్వర్యుణా. హే హోతః. యజ. ఇతి ప్రేషితో హోతా తేన గృహీతే హవిషి సతి. తత్ తయా ప్రార్థితం. ధ్యాయన్ వ్యచరత్ అజయత్. తదధ్యాయత్సమాహిత ఇతి. పాఠాంతరే తత్ అధ్యాయత్. వాచా వషట్కారం గృణన్ వౌషడిత్యుచ్చారయన్. (15-16)

శ్లో॥ భగవన్ కిమిదం జాతం కర్మవో బ్రహ్మవాదినామ్ ।
విపరీతమహో కష్టం మైవం స్యాద్బ్రహ్మవిక్రియా ॥ 17

ఆ హోమ ప్రభావముతో ఇళా అను కన్యక జన్మించెను. ఆ ఇళను గాంచిన మనువు అసంతుష్టుడై కులాచార్యుడగు వసిష్ఠుని చేరి ఇటుల పలికెను. ఓ మహర్షీ! నేను పుత్రకామనముతో యాగమాచరించగా తద్విపరీతముగా పుత్రిక కలిగినదేమి. మీ లాంటి గొప్ప మంత్రవేత్తల సంకల్పము ఏ విధముగా తప్పినదని ప్రశ్నించెను. (16-18)

శ్లో॥ యూయం మంత్రవిదోయుక్తాస్తపసా దగ్ధ కిల్బిషాః ।
కుతస్సంకల్పవైషమ్యమనృతం విబుధేష్వపి ॥18

టీ:- భగవన్నితి. బ్రహ్మ విక్రియా మంత్రాన్యధాత్వం. (17-18)

శ్లో॥ తన్నిశమ్య వచస్తస్య భగవాన్ ప్రపితామహః ।
హోతుర్వ్యతిక్రమం జ్ఞాత్వా బభాషే రవి నందనమ్ ॥ 19

టీ:- తదితి. ప్రపితామహో వసిష్ఠః.19

ఆ మాటలు విని వసిష్ఠ మహర్షి హోత యొక్క వ్యతిక్రమముచే అటుల జరిగినదని ఎరింగి శ్రాద్ధదేవునితో ఇటుల పలికెను. 19

శ్లో॥ ఏతత్సంకల్ప వైషమ్యం హోతుస్తేవ్యభిచారతః ।
తథాపి సాధయిష్యేఽహం సుప్రజాస్త్వం స్వ తేజసా ॥ 20

టీ:- ఏతదితి. వ్యభిచారతః అన్యవృత్తి మనస్కత్వాత్. సుప్రజాస్త్వం. సుపుత్రవత్త్వం. 20

ఈ వైపరీత్యము హోత యొక్క కర్మచే కలిగినది. అయినను నేను నిన్ను సుపుత్రవంతుని నొనర్చెదను. 20

శ్లో॥ ఏవం వ్యవసితో రాజన్ భగవాన్ స మహాయశాః ।
అస్తౌషీదాదిపురుష మిళాయాః పుంస్త్వకామ్యయా ॥ 21

శ్లో॥ తస్మై కామవరం తుష్టో భగవాన్ హరిరీశ్వరః ।
దదావిళాభవత్తేన సుద్యుమ్నః పురుషర్షభః ॥ 22

అని చెప్పి ఆయా మంత్రములతో శ్రీమన్నారాయణుని స్తుతించి, విష్ణువును సంతసింప చేసి ఇళను సుద్యుమ్నుడను పురుషునిగా మార్చెను. 21-22

శ్లో॥ స ఏకదా మహారాజ విచరన్ మృగయాం వనే ।
వృతః కతిపయామాత్యైరశ్వమారుహ్య సైంధవమ్ ॥ 23

ఆ సుద్యుమ్నుడు ఒకసారి అద్భుతములగు ఆయుధములను ధరించి అశ్వమునధిరోహించి వేటకై అరణ్యమున ప్రవేశించెను. 23

శ్లో॥ ప్రగృహ్య రుచిరం చాపం శరాంశ్చ పరమాద్భుతాన్ ।
దంశితోఽను మృగం వీరో జగామ దిశముత్తరామ్ ॥ 24

శ్లో॥ స కుమారో వనం మేరోరధస్తాత్ప్రవివేశ హ ।
యత్రాస్తే భగవాన్ శర్వో రమమాణస్సహోమయా ॥ 25

ఆ వనమున మృగములవేటాడుచు ఉత్తర దిక్కుగా పయనించి మేరు పర్వత ప్రాంతమున గల కుమార వనమున ప్రవేశించెను. ఆ కుమారవనమున పార్వతీ పరమేశ్వరులు ఎల్లప్పుడు విహరించుచుందురు. 24-25

శ్లో॥ తస్మిన్ ప్రవిష్ట ఏవాసౌ సుద్యుమ్నః పరవీరహా ।
అపశ్యత్స్త్రియమాత్మా నమశ్వం చ బడబాం నృప ॥ 26

సుద్యుమ్నుడు ఆ వనములో ప్రవేశించినంతనే స్త్రీగా మారెను. అతడధిరోహించిన గుఱ్ఱము ఆడ గుఱ్ఱముగా మారెను. 26

శ్లో॥ తదా తదనుగాస్సర్వేహ్యాత్మలింగ విపర్యయమ్ ।
దృష్ట్వా విమనసోఽ భూవన్వీక్షమాణాః పరస్పరమ్ ॥ 27

అతనిననుసరించి వచ్చిన భటులును స్త్రీలుగా మారి పరస్పరము వీక్షించుకొనుచు ఆశ్చర్యమొందుచుండిరి. 27

రాజోవాచ

శ్లో॥ కథమేవం విధో దేశః కేనవా భగవన్ కృతః ।
ప్రశ్నమేతం సమాచక్ష్వ పరం కౌతూహలం హి నః ॥ 28

శుకమహర్షి చెప్పిన ఆ విషయము వినిన పరీక్షిన్మహారాజు ఆశ్చర్యమొంది ఈ కుమారవనములో ప్రవేశించిన పురుషులు స్త్రీలుగా మారునటుల భగవంతుడు ఎందులకు చేసినాడని ప్రశ్నించెను. 28

టీ:- ఏవమితి. ఆదిపురుషం శ్రీహరిం. స భగవాన్ వసిష్ఠః. అస్తౌషీత్ తత్తన్మంత్రాణాం యథోక్తప్రాయశ్చిత్తాద్యనుష్ఠానేన యథావిధ్యనుష్ఠిత కర్మణామివ ఫల ప్రదాతారం హరిం ప్రార్థయామాసేత్యర్థః.(21-28)

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఏకదా గిరిశం ద్రష్టుమృషయ స్తత్ర సువ్రతాః ।
దిశోవితిమిరాభాసాః కుర్వంతస్సముపాగమన్ ॥ 29

అప్పుడు శుకమహర్షి ఈ విధముగా చెప్పదొడిగెను. పూర్వమొక సమయమున (పార్వతీ పరమేశ్వరులు వినోదించుచుండగా) భగవంతుడగు శంకరుణ్ణి దర్శించుటకై దశ దిక్కులను తేజోవంత ములుగా ఒనరించుచు కొందరు మునులచటికి వచ్చిరి. 29

శ్లో॥ తాన్ విలోక్యాంబికా దేవీ వివస్త్రా వ్రీడితా భృశమ్ ।
భర్తురం కాత్సముత్థాయ నీవీమాశ్వథ పర్యధాత్ ॥ 30

ఆ సమయమున శంకరుని ఉత్సంగమున నున్న పార్వతి వారిని చూచి సిగ్గిలి. శంకరుని ఉత్సంగము వదలి దూరముగా వెడలి వస్త్రమును ధరించెను. 30

టీ:- ఏకదేతి. విగతం తిమిరం. ఆభాసః. అన్యస్యప్రకాశః యాసు తథా భూతా దిశః కుర్వంతః. (29-30)

శ్లో॥ ఋషయోఽపి తయోర్వీక్ష్య ప్రసంగం రమమాణయోః ।
నివృత్తాః ప్రయయుస్తస్మాన్నరనారాయణాశ్రమమ్ ॥ 31

దూరమునుండియే ఈ విషయమును గాంచిన ఋషులుకూడా, స్త్రీ ప్రసంగమును దర్శించుటచే తమ మనస్సులు కలుషితమైనవని తలంచి, ఆ కాలుష్యాన్ని తొలగించుకొనుట కొరకు, స్త్రీ ప్రసంగ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

టీ:- ఋషయ ఇతి. ప్రసంగం రత్యభినివేశం. స్త్రీ ప్రసంగదర్శన కలుషిత మనసస్సంతః. తత్కలుష నివృత్త్యర్థమేవ. తత్రప్రసంగశూన్యం నరనారాయణాశ్రమం ప్రయయుః. (31-32)

శూన్యమైనట్టి నర నారాయణాశ్రమమగు బదరికా వనమునకు వెడలిరి. 31

శ్లో॥ తద్దైవం భగవానాహ ప్రియాయాః ప్రియకృద్విభుః ।
స్థానం యః ప్రవిశేదేతత్స వై యోషిద్భవేదితి ।
తత ఊర్ధ్వం వనం తద్వై పురుషావర్జయంతి హి ॥ 32

ఇది గ్రహించి శంకరుడు తన ప్రియురాలగు పార్వతికి ప్రియమొనర్చుటకై ఈ కుమార వనమున ప్రవేశించిన పురుషులు స్త్రీలుగా మారునట్లు నియమమొనర్చెను. అప్పటి నుండి పురుషులు ఈ వనమున ప్రవేశించక వదులుచుండిరి. 32

శ్లో॥ సా చానుచర సంయుక్తా విచచార వనాద్వనమ్ ।
అథ తామాశ్రమాభ్యాశే చరంతీం ప్రమదోత్తమామ్ ॥ 33

ఈవిషయమెరుగక కుమారవనమున ప్రవేశించిన సుద్యుమ్నుడు అతని అనుచరులు స్త్రీలైరి. యువతి రూపములో నున్న సుద్యుమ్నుడు తన చెలికత్తెలతో కలసి ఆ వనములలో తిరుగుచుండెను. 33

శ్లో॥ స్త్రీభిః పరివృతాం వీక్ష్య చకమే భగవాన్ బుధః ।
సా పి తం చకమే సుభ్రూస్సోమరాజ సుతం పతిమ్ ॥ 34

శ్లో॥ స తస్యాం జనయామాస పురూరవ సమాత్మజమ్ ।
ఏవం స్త్రీత్వమనుప్రాప్తస్సుద్యుమ్నో మానవో నృపః ॥ 35

ఆ ప్రాంతమున చంద్రుని పుత్రుడగు బుధుడు తపమాచరించుచుండెను. చెలులతో కలిసి తిరుగుచున్న యువతి రూపముననున్న సుద్యుమ్నుని బుధుడు చూచెను. ఆ యువతియు బుధుని గాంచెను. పరస్పరము వలపు కలవారైరి. ఆ యువతి బుధుని పతిని గావించుకొనగా ఆ ఇరువురు దంపతులకు పురూరవుడు అను పుత్రుడు జన్మించెను. 34-35

శ్లో॥ సస్మార స్వకులాచార్యం వసిష్ఠమితి శుశ్రుమః ।
స తస్య తాం దశాం దృష్ట్వా కృపయా భృశపీడితః ॥ 36

శ్లో॥ సుద్యుమ్నస్యార్థయన్ పుంస్త్వముపాధావత శంకరమ్ ।
తుష్టస్స తస్మైభగవానృషయే ప్రీతిమావహన్ ॥ 37

శ్లో॥ స్వాం చ వాచమృతాం కుర్వన్నిదమాహ విశాంపతే ॥ 38

శ్లో॥ మాసం పుమాన్ స భవితా మాసం స్త్రీ తపసా తవ ।
ఇత్థం వ్యవస్థయా కామం సుద్యుమ్నోఽవతు మేదినీమ్ ॥ 39

టీ:- ప్రాసంగికముక్త్వా ప్రస్తుతమనువర్ణయతి - సా చేతి. అనుచరీ సంయుక్తేతి చ వక్తవ్యే భూతపూర్వగత్యా. పుంస్త్వనిర్దేశః. (33-39)

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఆచార్యానుగ్రహాత్కామం లబ్ధ్వా పుంస్త్వం వ్యవస్థయా ।
పాలయామాస జగతీం నాభ్యనందన్ స్మ తం ప్రజాః ॥ 40

ఈ విధముగా స్త్రీత్వమొందిన సుద్యుమ్నుడు కొంతకాలమునకు భ్రాంతి తొలగగా తన కుల గురువగు వసిష్ఠుని స్మరించి తన గోడు వినిపించెను. వసిష్ఠుడు సుద్యుమ్నుని స్థితిని గాంచి బాధచెందెను. 36

వసిష్ఠుడు ఆ యువతి తిరిగి పురుషుడుగా మారునటుల శంకరుణ్ణి ప్రార్థించెను. వసిష్ఠుని ప్రార్థనకు తుష్టుడైన శంకరుడు తాను పూర్వ మొనరించిన నియమమునకు భంగము కలుగకుండా వసిష్ఠుని కోరిక తీరునటుల సుద్యుమ్నుని ఒక నెల స్త్రీగా, ఒక నెల పురుషునిగా ఉండునటుల గావించెను. ఈ విధముగా సుద్యుమ్నుడు ఒక మాసము పురుషునిగా, ఒక మాసము స్త్రీగా గడుపుతూ రాజ్యపాలన గావించు గాక. (37-39)

ఈ విధముగా వసిష్ఠుని అనుగ్రహముతో పురుషత్వము నొంది, ఒక నెల పురుషునిగా, ఒక నెల స్త్రీగా నుండి ప్రజాపాలన గావించు చుండ ప్రజలతనిని అభినందించకుండిరి. 40

శ్లో॥ తస్యోత్కలో గయో రాజ్ఞో విమలశ్చ సుతాస్త్రయః ।
ఉత్తరాపథ రాజానో బభూవుర్ధర్మవత్సలాః ॥ 41

ఆ సుద్యుమ్నునకు ఉత్కలుడు, గయుడు, విమలుడు అను ముగ్గురు పుత్రులు కలిగి ధర్మపరులై ఉత్తరాపథమును పాలించిరి. 41

శ్లో॥ తతః పరిణతేకాలే ప్రతిష్ఠానపతిః ప్రభుః ।
పురూరవస ఉత్సృజ్య గాం పుత్రాయ గతో వనమ్ ॥ 42

సుద్యుమ్నుడు ముసలితనము నొంది పుత్రుడగు పురూరవునకు రాజ్యమప్పగించి ప్రతిష్ఠానపురము నొదిలి తపస్సునకై అరణ్యమునకు వెడలెను. 42

టీ:- ఆచార్యేతి. నాభ్యనందన్. స్త్రీత్వే తస్య లజ్జయా మాసం నిలీయావసానాత్. (40-42)

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
ప్రథమోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
మొదటి అధ్యాయము సమాప్తము.

ద్వితీయోఽధ్యాయః

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఏవం గతేఽథ సుద్యుమ్నే మనుర్వైవస్వతస్సుతే ।
పుత్రకామస్తపస్తేపే యమునాయాం శతం సమాః ॥ 1

టీ:- శ్లో. ద్వితీయే మనుపుత్రాణాం ద్వావపుత్రౌ విరాగతః, కరూశకాది పంచానాం వంశానాహ లఘుక్రమాత్. వైవస్వతో మనుః శ్రాద్ధదేవః. 1

శ్లో॥ తతోఽయజన్మనుర్దేవమపత్యార్థే హరిం ప్రభుమ్ ।
ఇక్ష్వాకు పూర్వజాన్ పుత్రాన్ లేభే స్వసదృశాన్ దశ ॥ 2

టీ:- తత ఇతి. ఇక్ష్వాకుః పూర్వజో యేషాం తాన్. 2

శ్లో॥ పృషధ్రస్తుమనోః పుత్రో గోపాలో గురుణాన్వితః ।
పాలయామాస గాః యత్తో రాత్ర్యాం వీరాసనవ్రతః ॥ 3

టీ:- తత్ర పృషధ్రస్య వంశో నాభవదితి సహేతుకమాహ - పృషధ్రస్త్వితి ఆరభ్య కవిః కనీయా నిత్యతః ప్రాక్తనేన గ్రంథేన. పృషధ్ర ఇతి. ఖడ్గపాణేస్సతః తిష్ఠతో జాగరణం వీరాసనం. తదేవం వ్రతం యస్య. యత్తః అవహితస్సన్. గాః పాలయామాస. 3

2 వ అధ్యాయము

ఈ రెండవ అధ్యాయమున మనువు పుత్రులలో వృషధ్రుడు, నభగుడు ఇరువురువిరాగులై సంతానహీనులగు విషయము, కరూశుడు మొదలగు ఐదుగురి వంశము తెలుపబడుచున్నది.

ఈ విధముగా సుద్యుమ్నుడరణ్యమునకు వెడలగా వైవస్వత మనువగు శ్రాద్ధదేవుడు పుత్రార్థియై యమునాతీరమున వంద సంవత్సరములు తపమాచరించెను. 1

ఆ పిదప విష్ణువు గురించి యజ్ఞమొనరించి తనతో సమానులగు ఇక్ష్వాకు మొదలగు పదిమంది పుత్రులనొందెను. 2

మనువు పదిమంది పుత్రులతో పృషధ్రునకు సంతానము కలుగలేదను విషయము కారణయుక్తముగా తెలుపుచున్నాడు. అందులో పృషధ్రుడను నాతడు గురువుగారి యాజ్ఞతో గోవులను కాచు చుండెను. ఒకనాడడవికి వెళ్ళి గోవులను మేపుచుండగా రాత్రి యయ్యెను. ఆ రాత్రి పృషధ్రుడు వీరాసన వ్రతుడై ఖడ్గము ధరించి నిలబడి జాగరూకతతో గోవులను రక్షించుచుండెను. 3

శ్లో॥ ఏకదా ప్రావిశద్గోష్ఠం శార్దూలో నిశి వర్షతి ।
శయానా గావ ఉత్థాయ భీతాస్తా బభ్రముర్వ్రజే ॥ 4

శ్లో॥ ఏకాం జగ్రాహ బలవాన్ సా చుక్రోశ భృశాతురా ।
తస్యాస్తత్క్రందితం శ్రుత్వా పృషధ్రోఽభిససార హ ॥ 5

టీ:- ఏకదేతి. శార్దూలో వ్యాఘ్రః వర్షతి సతి. పర్జన్య ఇతి శేషః. (4-5)

ఒకసారి రాత్రివేళ వర్షము కురియుచుండగా ఒక పులి ఆవుల మందలో ప్రవేశించెను. నిద్రించుచున్న గోవులు మేల్కొని భీతిల్లి మందలో చెదిరి తిరుగుచుండగా, ఆ పులి ఒక ఆవును గ్రహించెను. ఆ గోవు బాధతో అరుచుచుండగా ఆ ఆర్తనాదము విని పృషధ్రుడు ఆ పులిననుసరించి వెడలెను. (4-5)

శ్లో॥ ఖడ్గమాదాయ సహసా ప్రలీనోడుగణే నిశి ।
అజానన్నచ్ఛినద్బభ్రోశ్శిర శ్శార్దూల శంకయా ॥ 6

టీ:- ఖడ్గమితి. ప్రలీనా ఉడుగణా యస్మిన్. సమయ ఇతి శేషః బభ్రోః కపిలాయా గోః. 6

పృషధ్రుడు ఖడ్గపాణియై నక్షత్రములులేని ఆ రాత్రి పోల్చుకోలేక పులియనుకొని కపిలగోవు తలను ఒక్క వ్రేటులో ఖండించెను. 6

శ్లో॥ వ్యాఘ్రోఽపి వృక్ణశ్రవణో నిస్త్రింశాగ్రహతస్తతః ।
నిశ్చక్రామ దృఢం భీతో రక్తం పథి సముత్సృజన్ ॥ 7

టీ:- వ్యాఘ్ర ఇతి. గాం కామతో న జఘానేతి ఖ్యాపయితుం వృక్ణ శ్రవణః ఇత్యాద్యుక్తం వృక్ణశ్రవణః ఖండితశ్రోత్రః. 7

ఆ ఖడ్గపు వ్రేటు తాకిన పులియు చెవులు తెగినదై మిక్కిలి భీతిల్లి మార్గమున రక్తమోడుచు వెడలిపోయెను. 7

శ్లో॥ మన్యమానో హృతం వ్యాఘ్రం పృషధ్రః పరవీరహా ।
అద్రాక్షీత్స్వహతాం బభ్రుం వ్యుష్టాయాం నిశి దుఃఖితః ॥ 8

టీ:- మన్యమాన ఇతి. వ్యుష్టాయాం ప్రభాయతాం. 8

పులిని చంపానని తలంచుచున్న పృషధ్రుడు, తెల్లవారిన పిదప తన చేత చంపబడిన కపిల గోవును చూచి దుఃఖితుడాయెను. 8

శ్లో॥ తం శశాప కులాచార్యః కృతాగసమకామతః ।
న క్షత్రబంధు శ్శూద్రస్త్వం కర్మణా భవితామునా ॥ 9

ఈ విషయము తెలిసిన కులాచార్యుడగు వసిష్ఠుడు తెలియక పాపమాచరించిన పృషధ్రుణ్ణి ఈ పాపపు పనిచే నీవు క్షత్రియుడవు కూడా కాక శూద్రుడవు కమ్ము అని శపించెను. 9

శ్లో॥ ఏవం శప్తస్స్వగురుణా ప్రత్యగృహ్ణాన్ కృతాంజలిః ।
అధారయద్వ్రతం వీర ఊర్ధ్వరేతా మునిప్రియమ్ ॥ 10

శ్లో॥ వాసుదేవే భగవతి సర్వాత్మని పరేఽమలే ।
ఏకాంతిత్వం గతో భక్త్యా సర్వభూతసుహృత్సమః ॥ 11

శ్లో॥ విముక్తసంగశ్శాన్తాత్మా సంయతాక్షోఽపరిగ్రహః ।
యదృచ్ఛయోపపన్నేన కలయన్ వృత్తిమాత్మనః ॥ 12

శ్లో॥ ఆత్మన్యాత్మానమాధాయ జ్ఞానతృప్తస్సమాహితః ।
విచచార మహీమేతాం జడాంధ బధిరాకృతిః ॥ 13

టీ:- తమితి. క్షత్రబంధురపి. త్వం న భవితా. అపితు. శూద్రో భవేతి. (9-13)

ఇలా శపించబడిన పృషధ్రుడు కృతాంజలియై గురువును ప్రార్థించి ఊర్ధ్వరేతస్కుడై మునుల కిష్ఠమైన వ్రతమును ధరించి సర్వాంతర్యామియు, భగవంతుడనగు వాసుదేవుణ్ణి తన మనస్సున ఉంచుకొని ఏకాంతియై భక్తితో సర్వభూత హితుడై సంగము వదిలి శాంతమైన ఆత్మతో ఎవరిని ఏది కోరక దొరికిన దానితో జీవికను గడుపుచు ఆత్మలో లీనుడై జ్ఞానతృప్తి పొంది జడునివలె, అంధునివలె, చెవిటివానివలె, అడవులలో సంచరిస్తూ చివరకు ఒక దావాగ్నిలో పడి ప్రాణములు విడిచి బ్రహ్మ సాయుజ్యమొందెను. (10-14)

శ్లో॥ ఏవం వృత్తోవనం గత్వా దృష్ట్వా దావాగ్ని ముత్థితం ।
తేనోపయుక్తకరణో బ్రహ్మావాప పరం మునిః ॥ 14

టీ:- ఏవమితి, ఉపయుక్త కరణః దగ్ధదేహః. 14

శ్లో॥ కవిః కనీయాన్ విషయేషునిస్పృహో
విసృజ్య రాజ్యం సహబంధుభిర్గృహాన్ ।
నివేశ్యచిత్తే పురుషం సర్వోచిషం వివేశ
కైశోరవయాః పరాం గతిమ్ ॥ 15

శ్లో॥ కరూశాన్మానవాదాసన్ కారూశాః క్షత్రజాతయః ।
ఉత్తరాపథగోప్తారో బ్రహ్మణ్యా ధర్మవత్సలాః ॥ 16

టీ:- కవేరపి వంశోనాభవదిత్యాహ-కవిరితి. బంధుభిస్సహ రాజ్యం విసృజ్య. (15-16)

శ్లో॥ ధృష్టాద్ధార్ష్టమభూత్ క్షత్రం బ్రహ్మ భూయం గతం క్షితౌ ।
నృగస్య వంశ్య స్సుమతిర్భూతజ్యోతి స్తతో వసుః ॥ 17

టీ:- ధృష్టాదితి. బ్రహ్మభూయం బ్రాహ్మణత్వం. నృగస్య వంశ్యః పుత్రః సుమతిః. తతో భూతజ్యోతిః. తతో వసుః. 17

ఇక చివరివాడగు కవి విరాగియై రాజ్యమును, రాజ భవనములను వదిలి బంధువులతో సహా అరణ్యమునకు వెడలి మనస్సులో పరమ పూరుషుడగు శ్రీహరిని ధ్యానిస్తూ చిన్న వయస్సులోనే ముక్తి నొందెను. 15

కరూశుడను వాని నుండి కారూశులను క్షత్రియులు జన్మించి ధర్మపరులై బ్రాహ్మణ భక్తులై ఉత్తరాపథమును పాలించిరి. 16

ధృష్టుని వలన ధార్ష్ట మను వంశమేర్పడి బ్రాహ్మణత్వము నొంది ప్రసిద్ధమైనది. నృగుని వంశమున సుమతి జన్మించెను. అతనికి భూతజ్యోతి, భూతజ్యోతికి వసువు జన్మించెను. 17

శ్లో॥ వసోః ప్రతీతస్తత్పుత్ర ఓఘవానోఘవత్పితా ।
కన్యాచౌఘవతీ నామసుదర్శన ఉవాహతామ్ ॥ 18

టీ:- వసోరితి. ఓఘవతః పితా. తత్పుత్రోఽప్యోఘవానేవేత్యర్థః. 18

వసువునకు ప్రతీతుడు, అతనికి ఓఘవంతుడు జన్మించిరి. ఓఘవంతునకు, ఓఘవంతుడను పుత్రుడు, ఓఘవతియను పుత్రిక జన్మించిరి. ఆ ఓఘవతిని సుదర్శనుడు వివాహమాడెను. 18

శ్లో॥ చిత్రసేనో నరిష్యంతాద్దక్ష స్తస్యసుతోఽభవత్ ।
తస్య మీఢ్వాం స్తతశ్శర్వ ఇంద్రసేనస్తుతత్సుతః ॥ 19

శ్లో॥ వీతిహోత్రస్త్వింద్రసేనాత్తస్య సత్యశ్రవాస్సుతః ।
ఉరుశ్రవాస్సుత స్తస్య దేవదత్త స్తతో ఽభవత్ ॥ 20

టీ:- తదేవం త్రిభిః శ్లోకైః కరూశధృష్టనృగాణాం వంశా ఉక్తాః. నరిష్యంతస్యవంశమాహ-చిత్రసేన ఇత్యాదిసార్ధైస్త్రిభిః. తత ఇత్యాదే ర్యత్రాధిక్యం స్యాత్తత్రానంతర్యే తత ఇత్యాదిపదం వ్యాఖ్యేయం. యత్ర యత్ర తు న్యూనత్వం తత్ర పూర్వస్య పరస్య వా అనుషంగాదిభిః వ్యాఖ్యేయం. (19-20)

నరిష్యంతుడను మను సుతునకు చిత్రసేనుడు, చిత్రసేనునకు దక్షుడు, దక్షునకు మీఢ్వాంసుడు. మీఢ్వాంసునకు శర్వుడు, శర్వునకు ఇంద్రసేనుడు, అతనికి వీతిహోత్రుడు. వీతిహోత్రునకు సత్యశ్రవుడు ఆయనకు ఉరుశ్రవుడు, ఉరుశ్రవునకు దేవదత్తుడు జన్మించిరి. (19-20)

శ్లో॥ దేవదత్తస్య భగవానగ్ని వేశస్సుతోఽభవత్ ।
కానీన ఇతి విఖ్యాతో జాతుకర్ణో మహానృషిః ॥ 21

దేవదత్తునకు అగ్నివేశుడను పుత్రుడు కలిగెను. ఆ అగ్నివేశుడు కానీనుడని ప్రసిద్ధిచెంది పిదప జాతుకర్ణుడను మహర్షి యయ్యెను. 21

శ్లో॥ తతో బ్రహ్మకులం జాతమాగ్నివేశ్యాయనం నృప ।
నరిష్యంతాన్వయః ప్రోక్తో దిష్టవంశమథో శృణు ॥ 22

అగ్నివేశుని నుండి అగ్నివేశ్యయను బ్రాహ్మణ కులము ద్భవించెను. ఇంతవరకు నరిష్యవంతుని వంశము చెప్పబడినది. ఇప్పుడు దిష్టవంశము గురించి వినుము. 22

టీ:- దేవదత్తస్యేతి. అగ్నివేశ ఏవ కానీన ఇతి జాతుకర్ణ ఇతి చ వ్యాఖ్యాతః. (21-22)

శ్లో॥ నాభాగో దిష్టపుత్రోఽన్యః కర్మణా వైశ్యతాం గతః ।
హలంధనస్సుత స్తస్య వత్స ప్రీతిర్హలంధనాత్ ॥ 23

ఇక దిష్ఠుడను మను పుత్రునకు నాభాగుడను వాడు జన్మించెను. అతడు ఆచరించు కర్మననుసరించి వైశ్యుడాయెను. నాభాగునకు హలంధనుడు, అతనికి వత్సప్రీతి కల్గిరి. 23

శ్లో॥ వత్సప్రీతేః సుతః ప్రాంశు స్తత్సుతః ప్రమితిర్విభో ।
ఖమిత్రః ప్రమితేస్తస్మాచ్చాక్షుషోఽథ వివింశతిః ॥ 24

వత్సప్రీతికి ప్రాంశువు, ప్రాంశువునకు ప్రమితి, ప్రమితికి ఖమిత్రుడు, ఖమిత్రునకు చాక్షుషుడు. అతనికి వివింశతి కలిగెను. 24

శ్లో॥ వివింశతిసుతో రంభః ఖనినేత్రోఽస్య ధార్మికః ।
కరంధనో మహారాజ స్తస్యాసీదాత్మజో నృప ॥ 25

వివింశతికి రంభుడు, రంభునకు ధార్మికుడగు ఖనినేత్రుడు జన్మించెను. ఆతనికి కరంధన మహారాజు జన్మించెను. 25

టీ:- నాభాగ ఇతి. దిష్టస్యపుత్రో నాభాగః. వక్ష్యమాణాన్నాభాగాదన్య ఇతి భ్రాంతివ్యుదాసార్థమనువాదమాత్రం. (23-25)

శ్లో॥ తస్యావిక్షత్సుతో యస్యమరుత్తశ్చ క్రవర్త్యభూత్ ।
సంవర్తో2యాజయద్యేన మహాయోగ్యంగిరస్సుతః ॥ 26

టీ:- తస్యేతి. అంగిరసః సుతో మహాయోగీ సంవర్తః. యమయాజయత్. సమరుత్తః. 26

కరంధమునకు అవిక్షిత్తు, అవిక్షిత్తునకు చక్రవర్తియగు మరుత్తుడు జన్మించెను. ఆ మరుత్తు అను మహారాజుతో ఆంగీరస పుత్రుడు, మహాయోగియగు సంవర్తకుడు, యాజకుడై యాగము చేయించెను. (26)

శ్లో॥ మరుత్తస్యయా యజ్ఞో న తథాన్యో౽స్తి కశ్చన ।
సర్వం హిరణ్మయం చాసీద్యత్కించిచ్చాస్య శోభనమ్ ॥ 27

టీ:- మరుత్తస్యేతి. అస్య. యత్కించిత్పాత్రాదికమాసీత్తత్తు సర్వం. హిరణ్మయం శోభనమభవత్. 27

మరుత్తు చేత చేయబడిన యజ్ఞ మంతటి యజ్ఞము మరొకటి లేదు. ఆ యజ్ఞములోని ప్రాతాదికములన్నియు హిరణ్మయములై నుండెను. 27

శ్లో॥ అమాద్యదింద్రస్సోమేన దక్షిణాభిర్ద్విజా యతః ।
మరుతః పరివేష్టారో విశ్వే దేవాస్సభాసదః ॥ 28

ఆ యజ్ఞమున సోమరసముతో ఇంద్రుడు మదము పొందెను. బ్రాహ్మణులు సమృద్ధమైన దక్షిణలతో సంతసించిరి. ఆ యజ్ఞమునందు విశ్వేదేవతలు సదస్యులైరి. 28

శ్లో॥ మరుత్తస్య దమః పుత్రో తస్యాసీద్రాజవర్ధనః ।
సుధృతిస్తత్సుతో యజ్ఞేసౌధృతేయో నరస్సుతః ॥ 29

అట్టి మరుత్తునకు దముడు, దమునకు రాజవర్ధనుడు అతనికి సుధృతి, సుధృతికి నరుడు జన్మించెను. 29

శ్లో॥ తత్సుతః కేవల స్తస్మాద్బంధుమాన్వేదవాం స్తతః ।
బంధుస్తస్యాభవత్తస్య తృణబిందుర్మహీపతిః ॥ 30

టీ:- అమాద్యదితి. అమాద్యత్ మదం ప్రాప. (28-30)

నరునకు కేవలుడు ఆతనికి బంధుమంతుడు, బంధుమంతునకు వేదవంతుడు, వేదవంతునకు బంధుడు. బంధునకు తృణబంధు మహారాజు జన్మించెను. 30

శ్లో॥ తంభేజేఽలంబుసా దేవీ భజనీయగుణాలయమ్ ।
వరాప్సరా యతః పుత్రాః కన్యా చేలబిలాభజత్ ॥ 31

మంచి గుణవంతుడగు తృణబందువును అప్సర స్త్రీయగు అలంబుస వివాహమాడెను. ఆ దంపతులకు ఇలబిల అను కన్యక జన్మించెను. 31

శ్లో॥ తస్యాముత్పాదయామాస విశ్రవా ధనదం సుతం ।
సోఽవాప విద్యాం పరమామృషేర్యోగేశ్వరాత్పితుః ॥ 32

ఆ ఇలబిల యందు విశ్రవసుడు కుబేరున్ని పుత్రునిగా పొందెను. ఆ ధనదుడు యోగీశ్వరుడగు త్యాజనకుని వలన పరమ విద్యను పొందెను. 32

శ్లో॥ విశాలశ్శూన్య బంధుశ్చ ధూమ్రకేతుశ్చ తత్సుతాః ।
విశాలో వంశకృద్రాజా వైశాలీం నిర్మమే పురీమ్ ॥ 33

టీ:- తమితి. యతః యస్యాం తృణబిందోః పుత్రా అభవన్. 31-33

మరియు ఆ తృణబంధువునకు విశాలుడు, శూన్యబంధుడు, ధూమ్రకేతువు అను ముగ్గురు పుత్రులు కలిగిరి. వారిలో విశాలుడు వంశాభివృద్ధికరుడై వైశాలియను నగరమును నిర్మించెను. 33

శ్లో॥ హేమచంద్రస్సుతస్తస్య ధూమ్రాక్షస్తస్య చాత్మజః ।
తత్పుత్రస్సహదేవస్తు కృశాశ్వస్తస్య చాత్మజః ॥ 34

శ్లో॥ కృశాశ్వాత్సోమదత్తోఽభూద్యోఽశ్వమేధైరిడస్పతిమ్ ।
ఇష్ట్వా పురుషమేవాగ్ర్యాం గతిం యోగేశ్వరాదృతామ్ ॥ 35

ఆ విశాలునకు హేమచంద్రుడు, హేమచంద్రునకు ధూమ్రాక్షుడు, ధూమ్రాక్షునకు సహదేవుడు, సహదేవునకు కృశాశ్వుడు, కృశాశ్వునకు సోమదత్తుడు జన్మించి అశ్వమేధ యాగముచేసి యోగీశ్వరుల చేత ఆదరించబడు పుణ్యగతినొందెను. (34-35)

టీ:- హేమేతి. తత్పుత్రః సహదేవః పాఠాంతరే నామాన్యత్వమాత్రం అర్థస్తు స ఏవ. (34-35)

శ్లో॥ సోమదత్తాత్తు సుమతి స్తత్సుతో జనమేజయః ।
ఏతే వైశాలభూపాలాస్తృణబిందోర్యశోధరాః ॥ 36

ఆ సోమదత్తునకు సుమతి, సుమతికి జనమేజయుడు జన్మించెను. వీరందరు వైశాల భూపాలురుగా పేరొంది తృణబంధువు కీర్తిని విస్తరిస్తూ రాజ్యమేలిరి. 36

టీ:- సోమేతి. వైశాలభూపాలాః విశాలస్యాన్వయే జాతాః. 36

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
ద్వితీయోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
రెండవ అధ్యాయము సమాప్తము.

తృతీయో௨ధ్యాయః

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ శర్యాతిర్మానవో రాజా బ్రహ్మిష్ఠస్స బభూవ హ ।
యో వాహ్యాంగిరసాం సత్రే ద్వితీయమహరూచివాన్ ॥ 1

టీ:- శ్లో. "తృతీయే మనుపుత్రస్య శర్యాతేః కీర్త్యతే௨న్వయః. యత్ర సౌకన్యమాఖ్యానం రైవతం చ మహాద్భుతమ్." శర్యాతిరితి. బ్రహ్మిష్ఠః వేదార్థతత్వజ్ఞః తదేవాహ-యో వా ఇతి. ద్వితీయమహః ద్వితీయే௨హ్ని. క్రియమాణం కర్మ ఊచివాన్ ఉవాచ. 1

శ్లో॥ సుకన్యా నామ తస్యాసీత్కన్యాకమలలోచనా ।
తయా సార్ధం వనగతో హ్యగమచ్చ్యవనాశ్రమమ్ ॥ 2

శ్లో॥ సా సఖీభిః పరివృతా విచిన్వంత్యంఘ్రిపాన్వనే ।
వల్మీకరంధ్రే దదృశేఖద్యోతే ఇవ జ్యోతిషీ ॥ 3

3 వ అధ్యాయము

ఈ మూడవ అధ్యాయమున మనుపుత్రుడగు శర్యాతి వంశము సుకన్యోపాఖ్యానము రైవతకుని కథ వర్ణించబడుచున్నది.

శ్రీ శుకుడు వలుకుచున్నాడు

మనుపుత్రుడగు శర్యాతి బ్రహ్మిష్ఠుడై (వేదార్థములు తెలిసిన వాడు) ప్రసిద్ధిచెందెను. ఈ శర్యాతి అంగీరసుని సత్ర యాగమున రెండవరోజు చేయదగిన కర్మలను (చెప్పెను) నెరిగించెను. 1

ఈయనకు (వర్యాతికి) సుకన్య అను పుత్రిక కలిగెను. శర్యాతి పుత్రికయగు సుకన్యను వెంటనిడుకొని చ్యవన మహర్షి ఆశ్రమమునకు వెడలెను. 2

ఆ సుకన్య తన చెలులతోకూడి చ్యవనుని ఆశ్రమప్రాంతమున సంచరిస్తూ ఒక పుట్టలో మిణుగురు పురుగువలె వెలుగుచున్న రెండుజ్యోతుల గాంచెను. 3



శ్లో॥ తే దైవచోదితా బాలా జ్యోతిషీ కంటకేన వై ।
అవిధ్యన్ముగ్ధభావేన సంస్రావాస్సృక్తతో బహు ॥ 4

వాటిని మిణుగురు పురుగులుగా భావించి ముగ్ధయగు ఆ సుకన్య ఒక ముల్లుతో ఆ జ్యోతులను పొడిచెను. వాటినుంటి రక్తము కారెను. 4

శ్లో॥ శకృన్మూత్రనిరోధోఽభూత్సైనికానాం చ తత్క్షణాత్ ।
రాజర్షిస్తానుపాలక్ష్య పురుషాన్ విస్మితోఽబ్రవీత్ ॥ 5

టీ:- తస్య వంశం ఉత్తానబర్హి రానర్త ఇత్యాదినా వక్ష్యతి. ఆదౌ తావత్ తత్కన్యావృత్తాంతమాహ-సుకన్యానామేత్యాదినా. (2-5)

ఆ వెంటనే శర్యాతితో వచ్చిన సైనికులకు మూత్ర బంధమేర్పడెను. ఆ సైనికులను గాంచిన శర్యాతి అచ్చెరువంది ఇటుల పలికెను. 5

శ్లో॥ అప్యభద్రం న యుష్మాభిర్భార్గవస్య విచేష్టితం ।
వ్యక్తం కేనాపి నస్తస్య కృతమాశ్రమదూషణం ॥ 6

ఓ సైనికులారా మీరు చ్యవన మహర్షి విషయమున ఏదేని అపరాధము గావించితిరా? మనలో ఏవరో ఈ చ్యవనాశ్రమమున ఏదో అపరాధమొనర్చినట్లు నాకు స్పష్టమగుచున్నదనెను. 6

శ్లో॥ సుకన్యా ప్రాహ పితరం భీతా కించిత్కృతం మయా ।
ద్వేజోతిషీ హ్యజానంత్యా నిర్భిన్నే కంటకేనతే ॥ 7

అపుడు సుకన్య భీతిల్లి తండ్రితో నేను పుట్టలోని రెండు జ్యోతులను కాంచి వాటిని గురించి తెలిసికొనక ముల్లుతో పొడిచితినని తెలిపెను. 7

శ్లో॥ దుహితు స్తద్వచశ్శ్రుత్వా శర్యాతిర్జాతసాధ్వసః ।
మునిం ప్రసాదయామాసవల్మీ కాంతర్హితం శనైః ॥ 8

టీ:- అపీతి. భార్గవస్య చ్యవనస్య. అభద్రమపరాధః (6-8)

ఆ సుకన్య మాటలు వినిన శర్యాతి భయమునొంది, ఆ పుట్టను చేరి అందులోనున్న చ్యవన మహర్షిని తన పుత్రిక చేసిన అపరాధమును క్షమించమని ప్రార్థించి శాంతింపచేసుకొనెను. 8

శ్లో॥ తదభిప్రాయమాజ్ఞాయ ప్రాదాద్దుహితరం మునేః ।
కృచ్ఛ్రాన్ముగ్ధేయమామంత్ర్య పురం ప్రాయాత్సహానుగః ॥ 9

శ్లో॥ సుకన్యా చ్యవనం ప్రాప్య పతిం పరరమకోపనం ।
ప్రీణయామాస చిత్తజ్ఞా హ్యప్రమత్తానువృత్తిభిః ॥ 10

టీ:- తదితి. ముగ్ధేయం మమ కన్యా. క్షంతవ్యం త్వయేత్యుచ్యమానే కతివర్షాణ్యస్యాః విరహః కృతో న వేత్యాదివాక్యైః. తదభిప్రాయం తస్య అభిప్రాయం. జ్ఞాత్వా. మునేః. మునయే. తాం దుహితరం ప్రాదాత్. (9-10)

శ్లో॥ కస్యచిత్త్వథ కాలస్య నాసత్యావాశ్రమం గతౌ ।
స పూజయిత్వా ప్రోవాచ వయో మే దత్తమీశ్వరౌ ॥ 11

టీ:- కస్యేతి. హే ఈశ్వరౌ సద్వైద్యౌ యువాం. మహ్యం వయః తారుణ్యం. దత్తం సంపాదయతం. 11

శ్లో॥ గ్రహం గ్రహీష్యే సోమస్య యజ్ఞే వామప్యసోమపోః ।
క్రియతాం మే వయోరూపం ప్రమదానాం యథేప్సితం॥ 12

నా కూతురు తెలియనితనముతో చేసిన పనిని క్షమించమని శర్యాతి, చ్యవనమహర్షిని వేడుకొనెను. ఆ చ్యవన మహర్షి అభిప్రాయము తెలిసికొని తన కూతురగు సుకన్య నతనికిచ్చి వివాహము చేసి ఆమె నుండి అతి కష్టముగా వీడ్కోలునొంది తన సైన్యముతో తన పురమునకు వెడలి పోయెను. 9

ఆ సుకన్య పరమకోపనుడగు చ్యవనుని భర్తగాపొంది అతని మనస్సును తెలిసికొని అప్రమత్తముతో పరిచర్యలు చేస్తూ చ్యవనుని సంతసింప చేయుచుండెను. 10

కొంతకాలము గడిచిన పిదప అచటికి దేవ వైద్యులగు అశ్వినీ దేవతలు వచ్చిరి. చ్యవనుడు వారిని పూజించి ఓ అశ్వినీ దేవతలారా! మీరు నాకు స్త్రీలు కోరుకునేటటువంటి రూపమును యౌవనమును ఇవ్వండి. నేను యాగములలో సోమభాగములేని మీకు సోమ పూర్ణమగు పాత్ర నొసగుదును. అనగా మిమ్ములను సోమయాగములో యజించెదనని పలికెను. (11-12)

టీ:- గ్రహమితి. అసోమపోః సోమపానరహితయోరపి. వాం యువయోః సోమస్య గ్రహం సోమపూర్ణం పాత్రం. గ్రహీష్యేదాస్యామి. యువాం సోమేన యక్ష్యే ఇత్యర్థః. శ్రు. "ఇంద్రవాయవం గృహ్ణాతీ" త్యాదిషు ద్రవ్యస్య దేవతాసంబంధానుపపత్త్యా గృహ్ణాతేర్యాగ పర్యవసాయిత్వాత్. 12

శ్లో॥ బాఢమిత్యూ చతుర్విప్రమభినంద్య భిషక్తమౌ ।
నిమజ్జతాం భవానస్మిన్ హ్రదేసిద్ధవినిర్మితే ॥ 13

ఆ మాటలు విని దేవ వైద్యులు తప్పక నీవు కోరినటుల ఒనరించెదమని చెప్పి సిద్ధులచే నిర్మించబడిన ఈ సరస్సులో మాతో కూడి మునుగుమనిరి. 13

టీ:- బాఢమితి. బాఢమిత్యభినంద్య భవానస్మిన్ని మజ్జతా మిత్యూచతుః. 13

శ్లో॥ ఇత్యుక్తోజరయా గ్రస్తదేహోఽథమునిసత్తమః ।
హ్రదం ప్రవేశితోఽశ్విభ్యాం వళీపలితవిక్రియః ॥ 14

ముసలితనముతో ముడుతలు పడిన చర్మము తెల్లని వెంట్రుకలు గల చ్యవనుడు అశ్వనీ దేవతలతో సహా ఆ సరస్సులో మునిగెను. 14

శ్లో॥ పురుషాస్త్రయ ఉత్తస్థురపీచ్యా వనితాప్రియాః ।
పద్మస్రజః కుండలినస్తుల్యరూపాస్సువాససః ॥ 15

టీ:- ఇతీతి. హ్రదం ప్రవేశితః తావపి. తమతివృద్ధం గృహీత్వా. ప్రవిష్టావిత్యర్థః. (14-15)

అంతట ఆ సరస్సు నుండి పద్మమాల, కర్ణాభరణములు, మంచి వస్త్రములను ధరించి సమాన రూపములు కలిగి యౌవనవంతులగు మువ్వురు పురుషులు పైకి వచ్చిరి. 15

శ్లో॥ తాన్నిరీక్ష్య వరారోహా సరూపాన్ సూర్యవర్చసః ।
అజానతీ పతిం సాధ్వీ హ్యశ్వినౌ శరణం యయౌ ॥ 16

సూర్యునివలె ప్రకాశించెడు ఒకేరకమైన ఆ ఆకారములు గల ఆ ముగ్గురిని గాంచి సుకన్య తన భర్తను తెలుసుకొనలేక ఆ అశ్వినీ దేవతలను తన భర్తను తెలుపుమని ప్రార్థించెను. 16

శ్లో॥ దర్శయిత్వా పతిం తస్యై పాతివ్రత్యేన తోషితౌ ।
ఋషిమామంత్ర్య యయతుః స్తూయమానౌ త్రివిష్టపం ॥ 17

అపుడు ఆ దేవ వైద్యులు సుకన్య పాతివ్రత్యమునకు సంతసించి ఆవిడకు ఆమె భర్తను చూపించి చ్యవనునిచేత స్తుతించబడిన వారలై, వీడ్కోలు నొంది స్వర్గమునకు వెడలిరి. 17

శ్లో॥ యక్ష్యమాణోऽథ శర్యాతిశ్చ్యవనస్యాశ్రమం గతః ।
దదర్శ దుహితుః పార్శ్వే పురుషం సూర్యవర్చసం ॥ 18

ఆ పిదప కొంతకాలమునకు శర్యాతి యాగము చేయదలచిన వాడై, చ్యవనుని ఆశ్రమమునకు వచ్చి తన కూతురగు సుకన్య వద్ద సూర్యునివలె ప్రకాశించెడి పురుషుని కాంచెను. 18

శ్లో॥ రాజాదుహితరం ప్రాహ కృతపాదాభి వందనామ్ ।
ఆశిషో న ప్రయుంజానో నాతిహృష్టమనా ఇవ ॥ 19

తనకు పాదాభివందనము చేయుచున్న సుకన్యకు ఆశీస్సులను ఇవ్వకుండా అసంతుష్టుడై ఇటుల పలికెను. 19

టీ:- తానితి. అశ్వినౌ శరణం యయౌ. యువాం పృథక్ స్థిత్వా మత్పతిం దర్శయతమితి ప్రార్థయామాసేత్యర్థః.(16-19)

శర్యాతి రువాచ

శ్లో॥ చికీర్షితం తే కిమిదం పతిస్త్వయా
ప్రలంభితో లోక నమస్కృతో మునిః ।
యా త్వం జరాగ్రస్తమసత్యసంమతం
విహాయ జారం భజసేఽముమధ్వగమ్ ॥ 20

టీ:- చికీర్షితమితి. ప్రలంభితో వంచితః. హే అసతి. అసమంతం అనభీష్టం. 20

శర్యాతి పలికెను

ఓ పుత్రీ! లోకములచే నమస్కరించబడెడి నీ పతియగు చ్యవనుని మోసగించి ఏమి కోరుచున్నావు. ముసలివాడు, నీ కిష్టుడును కానట్టి ఆ చ్యవనుని వదిలి పథికుడగు ఈ జారుని భజించుచున్నావు. 20

శ్లో॥ కథం మతిస్తేఽవ గతాన్యథా సతాం
కులప్రసూతే కులదూషణం త్విదమ్ ।
బిభర్షి జారం యదపత్ర పాకులం
పితుశ్చ భర్తుశ్చ నయస్యధస్తమః ॥ 21

సత్కులములో జనించిన నీ యొక్క బుద్ధికి వంశదూషణము కలుగజేసెడి ఈ విపరీత ప్రవృత్తి ఎలా కలిగినది. నిర్లజ్జగా ఈ జారుని భజిస్తూ నీ తండ్రి, భర్తల యొక్క యశస్సును చెరిపి వేస్తున్నావు అని పలికెను. 21

శ్లో॥ ఏవం బ్రువాణం పితరం స్మయమానా శుచిస్మితా ।
ఉవాచ తాత జామాతా తవైవ భృగునందనః ॥ 22

శ్లో॥ శశంస పిత్రే తత్సర్వం వయోరూపాభిలంభనం ।
విస్మితః పరమప్రీతస్తనయాం పరిషస్వజే ॥ 23

ఈ విధముగా పలికెడి తండ్రితో ఆశ్చర్యముతో కూడిన చిరునవ్వు నవ్వుతూ ఆ సుకన్య ఓ తండ్రీ! ఈతడు నీ అల్లుడు, భృగు నందనుడగు చ్యవనుడే అని చెప్పి ఆ చ్యవనునకు యౌవన, సురూపములు కలుగుటకు జరిగిన వృత్తాంతమంతయు తెలిపెను. అది తెలుసుకొనిన శర్యాతి ఆశ్చర్యచకితుడై తన పుత్రికను సంతసముతో హత్తుకొనెను. (22-23)

టీ:- కథమితి. హే సతాం కులప్రసూతే మతిః. అన్యథా తద్వి పర్యయేణ కథం అవగతా అవసన్నా అధ్యవసితేతి వా. తదేవాహ - కులదూషణం త్విదమిత్యాది. (21-23)

శ్లో॥ సోమేనాయాజయద్వీరం గ్రహం సోమస్య చాగ్రహీత్ ।
అసోమపోరప్యశ్వినోశ్చ్య వనస్స్వేన తేజసా ॥ 24

చ్యవన మహర్షి తన తేజస్సుతో వీరుడగు శర్యాతిచేత సోమ యాగము చేయించి సోమపానార్హత లేని అశ్వినీ దేవతలకు సోమ రసంతో నిండిన పాత్రనొసంగి తన వాగ్ధానమును నిలబెట్టుకొనెను. 24

శ్లో॥ హంతుం తమాదధే వజ్రం శతమన్యురమర్షితః ।
సవజ్రం స్తంభయామాస భుజమింద్రస్య భార్గవః ॥ 25

దానితో కోపించిన ఇంద్రుడు చ్యవనుని సంహరించుటకై వజ్రాయుధమునెత్తెను. చ్యవనుడు వజ్రాయుధముతో గూడా ఇంద్రుని భుజమును స్తంభింపజేసెను. 25

శ్లో॥ అన్వజానం స్తతస్సర్వే గ్రహం సోమస్య చాశ్వినోః ।
భిషజావితి యత్పూర్వం సోమాహుత్యాం బహిష్కృతౌ ॥ 26

పూర్వము, వైద్యులని సోమాహుతి నుండి బహిష్కరించబడిన దేవ వైద్యులగు అశ్వినీదేవతలకు అప్పటినుండి సోమభాగమునందరు సమ్మతించిరి. 26

శ్లో॥ ఉత్తానబర్హి రానర్తో భూరిషేణ ఇతి త్రయః ।
శర్యాతేరభవన్ పుత్రా ఆనర్తా ద్రైవతోఽభవత్ ॥ 27

శర్యాతికి ఉత్తానబర్హి, ఆనర్తుడు, భూరిషేణుడు అను ముగ్గురు పుత్రులు కలిగిరి. అనర్తునకు రైవతుడను పుత్రుడు కలిగెను. 27

టీ:- సోమే నేతి. వీరం శర్యాంతిం. శ్లో. గ్రహం గ్రహీష్యే సోమస్యే త్యుక్త ప్రకారేణ. సోమస్య గ్రహమ గ్రహీత్. (24-27)

శ్లో॥ సోऽంతస్సముద్రే నగరీం వినిర్మాయ కుశస్థలీమ్ ।
ఆస్థితోऽభుఙ్క్త విషయానానర్తాదీనరిందమః ॥ 28

టీ:- స ఇతి. విషయాన్ దేశాన్ అభుఙ్క్త అపాలయత్. 28

ఆ రైవతుడు సముద్ర మధ్యలో కుశస్థలి అను నగరమును నిర్మించి, శత్రువులను జయించి అనేక రాజ్యములు పరిపాలించెను. 28

శ్లో॥ తస్య పుత్రశతం జజ్ఞే కకుద్మి జ్యేష్ఠముత్తమమ్ ।
రైవతో రేవతీం కన్యాం సమాదాయ విభుం గతః ॥ 29

టీ:- తస్యేతి. కకుద్మిః జ్యేష్ఠో యస్మిన్ తత్. విభుం బ్రహ్మాణం. 29

అతనికి వందమంది పుత్రులు కలిగిరి. వారిలో కకుద్మి అను వాడు పెద్దవాడు. రైవతునకు రేవతి అను కన్యక కలిగెను. రైవతుడు తన పుత్రిక యగు రేవతికి తగిన వరుణ్ణి విచారించుటకై బ్రహ్మ లోకమునకు వెడలెను. 29

శ్లో॥ పుత్ర్యావరం పరిప్రష్టుం బ్రహ్మలోకమపావృతమ్ ।
ఆవర్తమానే గాంధర్వేస్థితోऽలబ్ధక్షణః క్షణం ॥ 30

టీ:- పుత్ర్యా ఇతి. అలబ్ధః క్షణః అవసరో యేన సః. 30

శ్లో॥ తదంత ఆద్యమానర్చ్య సాభిప్రాయం న్యవేదయత్ ।
తచ్ఛ్రుత్వా భగవాన్ బ్రహ్మా ప్రహస్య తమువాచ హ ॥ 31

టీ:- తదంత ఇతి. ఆద్యం బ్రహ్మాణం. 31

బ్రహ్మలోకమున గాంధర్వులు గానము చేయుచుండిరి. క్షణ మాగి ఆ గానము పూర్తి అయిన పిదప బ్రహ్మను పూజించి బ్రహ్మతో తన పుత్రికకు తగిన వరునకై విన్నవించెను. ఆ మాటలువిని బ్రహ్మ నవ్వుచు ఇటుల పలికెను.(30-31)

శ్లో॥ అహో రాజన్నిరుద్ధాస్తే కాలేన హృది యే కృతాః ।
తత్పుత్ర పౌత్ర నప్తౄణాం గోత్రాణి చ న శృణ్మహే ॥ 32

టీ:- అహో ఇతి. తే త్వయా హృది యే కృతాస్తే సర్వే కాలేన. నిరుద్ధాః సంహృతాః. 32

ఓ రాజా ! నీవు ఇచట గాంధర్వ గానము విన్న ఏ సమయమైతే కలదో ఆ సమయమున నీ పుత్రులు, పౌత్రులు, నీ ఆప్తులు వారి గోత్రములు కూడా అంతమైపోయినవి. 32

శ్లో॥ కాలోఽతి యాతస్త్రిణవశ్చతుర్యుగ వికల్పితః ।
తద్గచ్ఛ దేవ దేవాంశో బలదేవో మహాబలః ॥ 33

టీ:- కాల ఇతి. త్రినవః. సప్తవిశంతిః చతుర్యుగాని. తైః వికల్పితో విభక్తః యో దేవస్యాంశోఽస్తి. 33

శ్లో॥ కన్యారత్నమిదం రాజన్నరరత్నాయ దేహి భో ।
భువో భావావతారార్థో భగవాన్ భూతభావనః ॥ 34

శ్లో॥ అవతీర్ణో నిజాంశేన పుణ్యశ్రవణకీర్తనః ।
ఇత్యాదిష్టోఽభివంద్యాజం నృపస్స్వపుర మాగతః ॥ 35

టీ:- కస్యేతి. తస్మై నరరత్నాయ దేహి. తదేవాహ-భువఇతి. (34-35)

చతుర్యుగములు ఇరవైఏడు సార్లు తిరిగిన కాలము గతించినది. ప్రస్తుతము భూలోకమున భగవదంశముగా భూ భార హరణమునకై మహా బలవంతుడగు బలదేవుడు అవతరించినాడు. ఆ పురుష రత్నమగు బలదేవునకు నీ కన్యారత్నము నిమ్మని తెలిపెను. బ్రహ్మచేత ఆ విధముగా తెలుపబడిన రైవతకుడు బ్రహ్మకు నమస్కరించి తన పురమగు కుశస్థలికి చేరెను. (33-35)

శ్లో॥ త్యక్తాం పుణ్యజనత్రాసాద్భ్రాతృభిర్దివ్యవస్థితైః ।
సుతాం దత్వా నవద్యాంగీం బలాయ బలిశాలినే ।
బదర్యాఖ్యం యయౌ రాజా తప్తుం నారాయణాశ్రమమ్ ॥ 36

టీ:- త్యక్తామితి. పుణ్యజనత్రాసాత్ యక్షభయాత్. పూర్వమేవ పురం భ్రాతృభిస్త్యక్తాం దివ్యతవస్థితైః స్వర్గం గతైః. 36

కుశస్థలిలో స్వర్గస్థులగు తన బంధువులను తలచి, తన పుత్రికను బలశాలియగు బలరామునకిచ్చి వివాహముచేసి. తపస్సునకై నారాయణాశ్రమమగు బదరికి వెళ్ళెను. 36

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
తృతీయోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
మూడవ అధ్యాయము సమాప్తము.

చతుర్థోఽధ్యాయః

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ నాభాగో నభగాపత్యం యన్న తద్భ్రాతరః కవిం ।
యవిష్ఠం వ్యభజన్ దాయం బ్రహ్మచారిణమాగతం ॥ 1

టీ:- శ్లో."చతుర్థే మనుపుత్రస్య నాభాగస్య కథోచ్యతే, తత్సూనో శ్చాంబరీషస్య కృత్యా ప్రతిహతా యతః." నభగస్య వంశమాహ.- నాభాగ ఇతి నభగస్యాపత్యం నాభాగః. నాభాగా దంబరీషో మహాభాగవతోఽభూదితి వివక్ష్యన్. తత్ర హేతుత్వేన వంశ ప్రవర్తకస్య నాభాగస్య. నిష్కపటం చరితం. తేన తు శ్రీరుద్ర ప్రసాదనమాహ - యమిత్యాదినా బ్రహ్మచారిణం బహుకాలం గురుకులే వసంతం. నైష్ఠికోఽసావితి మత్వా విభాగసమయే తస్మై భాగమప్రకల్ప్యైవ భ్రాతరః సర్వే దాయం వ్యభజన్. గురుకులాదాగతం యం భాగార్థినం. కవిం విద్వాంసం. యవిష్ఠం ప్రతి పితరమేవ. దాయం వ్యభజన్నిత్యర్థః. 1

శ్లో॥ భ్రాతరోఽభాఙ్క్ష కిం మహ్యం భజామ పితరం తవ ।
నాభాగస్తు పితా పుత్రం ప్రాహ తం బ్రహ్మచారిణమ్ ॥ 2

టీ:- ఏతదేవ ప్రశ్నోత్తరాభ్యాం దర్శయతి - తత్ర నాభాగః పృచ్ఛతి.-

4 వ అధ్యాయము

ఈ నాల్గవ అధ్యాయమున వైవస్వత మనుపుత్రుడగు నభగుని సుతుడగు నాభాగుని చరితము, అతని పుత్రుడగు అంబరీషుని చరితము వర్ణించబడుచున్నది. నభగుని పుత్రుడగు నాభాగునకు భాగవతోత్తముడగు అంబరీషుడు జన్మించినాడని చెప్పబోవుచు దానికి హేతువగు వంశప్రవర్తకుడగు నాభాగుని నిష్కపటమగు చరిత్రను అతనికి రుద్రప్రసాదనమును (ప్రసన్నుడవడము) తెలుపుచున్నాడు.

శ్రీ శుకుడు పలికెను

నభగుడను మను పుత్రునకు నాభాగుడను పుత్రుడు కలిగెను. నాభాగుడు చాలాకాలము గురుకులమున నుండుటచే విద్వాంసుడైన అతనిని నైష్ఠిక బ్రహ్మచారిగా తలంచి అతని సోదరులు అతనికి భాగమివ్వకయే ఆస్థిని పంచుకొనిరి. 1

అప్పుడు నాభాగుడు సోదరులరా నా భాగమున కేమిచ్చినారని అడుగగా సోదరులు, అప్పుడు నిన్ను మరచితిమి. ఇప్పుడు నీ భాగమునకు తండ్రిని పంచితిమి. సేవించుకొనుమనిరి. ఆ నాభాగుడు తండ్రి దగ్గరకు వెడలి ఓ తండ్రీ జేష్ఠ్య సోదరులు నా భాగమునకు

భ్రాతర ఇతి. హే భ్రాతరః మహ్యం కిమభాజ్క్ష వ్యభజన్. కం భాగం మదర్థం యూయం ప్రకల్పితవంతః? భ్రాతర ఆహుః. - తదా విస్మృతమస్మాభిః. ఇదానీం తు తవ పితరం. భజామ విభజామ. త్వం పితరం గృహాణేత్యర్థః. 2

శ్లో॥ త్వాం మమార్యా తతాభాంక్షుర్మాపుత్రక తదాదృథాః ॥ 3

టీ:- స చ పితరం గత్వాహ-త్వామితి తత హే తాత, ఆర్యాః జ్యేష్ఠాః .మమత్వాం. అభాంక్షుః మదీయో భాగః త్వమిత్యర్థః. పాఠాంతరే. హే తాత. కిమిదం మమ అభాంక్షుః. భజామ పితరం తవేత్యుక్తవంతః ఆర్యాస్త్వాం మహ్యం కిమర్థం దదురిత్యర్థః పితాహ- హే పుత్రక తత్ తైరుక్తం మా ఆదృథాః. ప్రతారణమాత్రం తైః కృతం. తస్మిన్నాదరం మాకార్షీః. న హ్యహం దాయ ఇవ భాగస్య సాధనమిత్యర్థః. 3

శ్లో॥ ఇమే హ్యంగిరసస్సత్రమాసతే౽ద్య సుమేధసః ।
షష్ఠం షష్ఠముపేత్యాహః కవే ముహ్యంతి కర్మణి ॥ 4

టీ:- తథాపి తైర్భాగత్వేన కల్పితో౽హం తవ జీవనోపాయ ముప దేక్ష్యామీత్యాహ - ఇమ ఇతి. స పాదాభ్యాం ద్వాభ్యాం. శ్రు.“అభిప్లవః

నిన్ను పంచినారని అనగా తండ్రి బ్రహ్మచారియగు ఆ నాభాగునితో వారిమటలనాదరించకుము. నేను దాయ (ఇవ్వబడిన) భాగమును కాదనెను. కాని వారిచే నీ భాగముగా పంచబడినట్లు చెప్పబడినందున నేను నీకు జీవనోపాయము నుపదేశించెదను. (2-3)

ఓ విద్వాంసుడా! అంగీరసులు సత్రయాగ మొనరించు చున్నారు. వారు బుద్ధిమంతులైకూడా ఆరవరోజు చేయదగిన “అభిప్లవః పూర్వమహర్భవతి పృష్ఠ్యషడహో భవతీ” అని శ్రుతిచే బోధించబడిన కర్మలో సూక్త విశేషము తెలియక పోవుటచే మూఢులగుదురు. 4

పూర్వమహర్భవతి పృష్ఠ్యషడహో భవతీ" తి విహితేషు షడహేష్వావర్త్య మానేషు. షష్ఠం షష్ఠమహః కర్మోపేత్య ప్రాప్య. కర్మణి తదనుష్ఠానే. సుమేధసోఽపి. తే సూక్తవిశేషాజ్ఞానేన ముహ్యంతి.కవే హే విద్వన్.4

శ్లో॥ తాం స్త్వం శంసయ సూక్తే ద్వే వైశ్వదేవే మహాత్మనః ॥ 5

టీ:- తానితి. తాన్ మహాత్మనోఽపి.శ్రు."ఇదమిద్ధారౌద్రమి"తి చ. శ్రు."యే యజ్ఞేన దక్షిణయే" తి చ. వైశ్వదేవే ద్వే సూక్తే శంసయ పాఠయ. 5

నీవు వారికి "ఇదమిద్ధారౌద్రః" అనునదియు "యే యజ్ఞ స్సదక్షిణీయే" అను రెండు వైశ్వ దేవసూక్తముల తెలుపుము. 5

శ్లో॥ తే స్వర్యంతో ధనం సత్రే పరిశేషితమాత్మనః ।
దాస్యంతి తేఽథ తాన్ గచ్ఛ తథా స కృతవాన్ యథా ॥ 6

టీ:- తత ఇతి. తతః కర్మణి సమాప్తే సతి. తే స్వర్యంతః స్వర్గం గచ్ఛంతః. స్వసత్రే పరిశేషితమవశిష్టమాత్మనో ధనం. తే తుభ్యం. దాస్యంతి. అథ తస్మాత్. తాత్ గచ్ఛేతి. తథేత్యాది శుకవాక్యం యథావత్కృతవాన్. 6

ఆ యజ్ఞకర్మ పూర్తియైన పిదప వారు స్వర్గమునకు వెళ్ళుతూ నీకు యజ్ఞ పరిశిష్టమగు (మిగిలిన) ద్రవ్యము నిత్తురు అని తెలిపెను. నాభాగుడు తండ్రి చెప్పిన విధముగ అచటకు వెడలి తండ్రి చెప్పిన విధముగ చేసెను. 6

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ తస్మై దత్వా యయుస్స్వర్గం తే సత్రపరివేష్టితమ్ ॥ 7

టీ:- తస్మా ఇతి. సత్రపరివేష్టితం సత్రావశిష్టం ధనం. 7

శ్లో॥ తం కశ్చిత్స్వీకరిష్యంతం పురుషః కృష్ణదర్శనః ।
ఉవాచాంతరతోఽభ్యేత్య మమేదం వాస్తుగం వసు ॥ 8

టీ:- తమితి. పురుషః శ్రీరుద్రః. దృశ్యత ఇతి దర్శనం శరీరం. కృష్ణం దర్శనం యస్యసః. వాస్తుగం యజ్ఞభూమిగతం. వసుం ధనం. మమేత్యువాచ. 8

శ్లో॥ మమేదమృషిభిర్దత్తమితి తర్హి స్మ మానవః ।
స్యాన్నౌ తేపితరి ప్రశ్నః పృష్టవాన్ పితరం తథా ॥ 9

టీ:- మమేతి. తర్హి స్మ తదైవ. మమేదమితి. మానవో నాభాగ ఉవాచ. పునశ్చ రుద్ర ఉవాచ నౌ ఆవయోః. అస్మిన్ వివాదే. తే పితరి ప్రశ్నః స్యాదితి పృష్టవానితి శుకోక్తిః. 9

శ్రీ శుకుడు పలికెను

ఆ అంగీరసులు యజ్ఞ పరిశిష్టమగు (మిగిలిన) ద్రవ్యమును నాభాగున కిచ్చి స్వర్గమునకు వెడలిరి. 7

ఆ ధనమును నాభాగుడు స్వీకరించుటకుద్యుక్తుడుగా నలుపు వర్ణముగల ఒక పురుషుడు (రుద్రుడు) వచ్చి యజ్ఞ భూమి తనది కావున ధనము తనదనెను. 8

నాభాగుడు ఈ ధనము ఋషులు నాకొసంగిరి. కావున నాదనెను. అపుడు రుద్రుడు ఈ విషయమున మీ తండ్రి చెప్పినటుల చేయుదమనెనను. నాభాగుడు వెళ్ళి తండ్రినడిగెను. 9

శ్లో॥ యజ్ఞవాస్తుగతం సర్వముచ్ఛిష్టమృషయః క్వచిత్ ।
చక్రుర్విభాగం రుద్రాయ స దేవస్సర్వమర్హతి ॥ 10

శ్లో॥ నాభాగస్తం ప్రణమ్యాహ తవేశ కిలవాస్తుగమ్ ।
ఇత్యాహ మే పితా బ్రహ్మన్ శిరసా త్వాం ప్రసాదయే ॥ 11

టీ:- పృష్టస్య మనోర్వాక్యం. యజ్ఞేతి. ఉచ్ఛిష్టమూర్వరితం. క్వచిదితి దక్షాధ్వరే శ్రు. "ఉచ్ఛేషణభాగో వై రుద్రః భాగధేయేనైవ రుద్రం నిరవదయత" ఇతి శ్రుతేశ్చ. కించ స దేవ ఈశ్వరః. సర్వమప్యర్హతి. కిం పునర్యజ్ఞావ శిష్టమిత్యర్థః. (10-11)

అతడు, యజ్ఞభూమిలో మిగిలిన సర్వ ధనము రుద్రునకు చెందునటుల ఋషులు విభజించిరి. కావున ఈ ధనమునకే కాక సమస్తమునకు రుద్రుడే అర్హుడని తెలిపెను. "ఉచ్ఛైషణభాగో వైరుద్రః భాగధేయేనైవ రుద్రం నిరవదయత" అను శ్రుతి వలన; దక్షాధ్వరములో ఋషులు నిర్ణయించిరి. కావున ఈ ధనమునకు రుద్రుడే అర్హుడని తెలిపెను. అది వినిన నాభాగుడు రుద్రుని సమీపించి ఈ యజ్ఞ పరిశిష్ట (మిగిలిన) ధనము నీదేయని నా తండ్రి తెలిపినాడు కావున దానిని నీవే పరిగ్రహించుమని నమస్కరించెను. (10-11)

శ్రీ రుద్ర ఉవాచ

శ్లో॥ యత్తే పితావదద్ధర్మం త్వం చ సత్యం ప్రభాషసే ।
దదామి తే మంత్రదృశో జ్ఞానం బ్రహ్మసనాతనమ్ ॥ 12

శ్లో॥ తస్మాదసత్యం న బ్రూయాత్పరస్యాం చాపది క్వచిత్ ।
సత్యేన పరిసంతుష్టో భవామీష్టస్స మే భవేత్ ॥ 13

రుద్రుడు ఈ విధముగా పలికెను.

ఓ నాభాగా! నీ తండ్రి ధర్మమును వచియించెను. నీవు సత్యమును పలికితివి. అందువలన నీకు మంత్రద్రష్టలగు ఋషులకు కల్గెడి జ్ఞానమును ప్రసాదించుచున్నాను. 12

ఎంతకష్టములోనైనను అసత్యము పలుకకూడదు. నేను నీ సత్య వచనములతో సంతుష్టిచెందితిని. సత్యవంతుడు నాకిష్టుడగును. 13

శ్లో॥ గృహాణ ద్రవిణం దత్తం మత్సత్రపరివేష్టితమ్ ।
ఇత్యుక్త్వాంతర్దధేరుద్రో భగవాన్ సత్యవత్సలః ॥ 14

టీ:- శ్రీరుద్ర ఆహ-యత్త ఇతి. ఇదమాఖ్యానంశ్రుతి ప్రసిద్ధం. తథాహి బహ్వృచబ్రాహ్మణం. శ్రు."నాభాగే దిష్టం వై మానవం బ్రహ్మచర్యం వసంతం భ్రాతరో నిరభజన్సోఽబ్రవీ" దిత్యాది. (12-14)

శ్లో॥ య ఏతత్సంస్మరేత్ప్రాతస్సాయం చ సుసమాహితః ।
కవిర్భవతి మంత్రజ్ఞో గతిం చైవ తథాత్మనః ॥ 15

టీ:- అస్యాఖ్యానస్యస్మరతః ఫలమాహ-య ఏతదితి. ఆత్మనో గతిం చ ప్రాప్నోతీతి శేషః. 15

శ్లో॥ నాభాగాదంబరీషోఽభూన్మహా భాగవతః కృతీ ।
నాస్పృశద్బ్రహ్మశాపోఽపి యమప్రతిహతఃక్వచిత్ ॥ 16

టీ:- నాభాగాదితి. క్వచిదపి. అప్రతిహతో బ్రహ్మశాపోఽపి బ్రాహ్మణేన దుర్వాసనా నిర్మితః. కృత్యానలోఽపి. యం నాస్పృశత్. అతోఽసౌ మహాభాగవతః అత ఏవ. కృతీ పుణ్యవాన్. 16

ఈ యజ్ఞ పరిశిష్ట (మిగిలిన) ద్రవ్యమును నీవు గ్రహించమని చెప్పి అంతర్ధానము చెందెను. 14

"నాభాగేదిష్టం వైమానవం బ్రహ్మచర్యం వసంతం భ్రాతారోనిరభంజన్సోఽబ్రవీ"దిత్యాది శ్రుతిచే సూచించబడిన ఈ ఉపాఖ్యానమును సాయంప్రాతః సమయములలో సమాహిత మనస్కుడై స్మరించునాతడు మంత్రజ్ఞానము కల విద్వాంసుడై ఆత్మగతినొందగలడు. 15

ఆ నాభాగునకు అప్రతిహతమగు బ్రాహ్మణ శాపముగూడా (దుర్వాసనిర్మితమగు అగ్ని (కృత్యానలము) కూడా) స్పృశింపజాలని గొప్ప భాగవతుడు, పుణ్యవంతుడగు అంబరీషుడు పుత్రుడాయెను. 16

విష్ణురాత ఉవాచ

శ్లో॥ భగవన్ శ్రోతుమిచ్ఛామి రాజర్షేస్తస్య ధీమతః ।
న ప్రాభూద్యత్ర నిర్ముక్తో బ్రహ్మదండో దురత్యయః ॥ 17

టీ:- భగవన్నితి. తస్య శ్రోతుమిచ్ఛామి. చరితమితి శేషః. బ్రహ్మ దండః కృత్యానలః న ప్రాభూత్ న సమర్థో బభూవ. 17

అని చెప్పిన శుక మహర్షితో పరీక్షిన్మహారాజు ఇటుల పలికెను. బ్రాహ్మణుడగు దుర్వాసునిచే వదలబడిన దురత్యయమగు కృత్యాగ్ని కూడా ఏమి ఒనర్చజాలనట్టి రాజర్షియగు అంబరీషుని చరితమును వినగోరుచున్నాను. 17

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ అంబరీషమహాభాగస్సప్త ద్వీపవతీం మహీమ్ ।
అవ్యయాం చ శ్రియం లబ్ధ్వావిభవం చాతులం విభుః ॥ 18

టీ:- అంబరీష ఇతి. శ్రియం సంపదం విభవం సరోత్కృష్టత్వం. అతులం నిరుపమం. 18

శ్లో॥ మేనేஉతిదుర్లభం పుంసాం సర్వం తత్స్వప్నవత్ స్తుతమ్ ।
విద్వాన్ విభవనిర్వాణం తమో విశతి యత్పుమాన్ ॥ 19

టీ:- మేన ఇతి. పుంసామతిదుర్లభమపి తత్సర్వం స్వప్నవత్. స్తుతం నిరూపితం. అనుపాదేయం మేనేత్రత్ర హేతుః.- విభవస్య నిర్వాణం నాశం. విద్వాన్. యత్ యేన విభవేన. తన్నాశేన వా పుమాన్ తమో విశతి మోహే నిమజ్జతి. 19

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను

మహాత్ముడగు అంబరీషుడు అసమానమైన వైభవమును అక్షయమగు సంపదను సప్తద్వీపాత్మకమగు భూమండలమును పొంది గూడా ఇవన్నియు సప్న గతములైన వానివలె అనుపాదేయము లుగా తలంచెను. ఏలయన విభవముతోను, విభవ నాశనముతోను పండితుడు మోహములో మునుగును. (18-19)

శ్లో॥ వాసుదేవే భగవతి తద్భక్తేషు చ సాధుషు ।
ప్రాప్తోభావం పరం విశ్వం యేనేదం లోష్టవత్స్మృతమ్ ॥ 20

టీ:- నన్వేవం జానంతోఽపి విభవైషిణో దృశ్యంతే తత్రాహ - వాసుదేవ ఇతి. భావం భక్తిం. ప్రాప్తః. యేన భావేన ఇదం విశ్వం లోష్ఠవత్ అతితుచ్ఛం స్మృతం. 20

ఆ అంబరీషుడు భగవంతుడగు వాసుదేవుని యందు, భగవద్భక్తుల యందు భక్తి కలిగినవాడై ఈ ప్రపంచమునంతటిని మట్టిపెంకుగా (తుచ్ఛమైనదిగా) తలంచెను. 20

శ్లో॥ స వై మనః కృష్ణ పదారవింద
యోర్వచాంసి వైకుంఠగుణాను వర్ణనే ।
కరౌ హరేర్మందిర మార్జనాదిషు
శ్రుతీ చకారాచ్యుతసత్కథోదయే ॥ 21

టీ:- భక్తిమేవసర్వేంద్రియాణాం భగవత్పరత్వ కథనేన ప్రపంచయతి. -త్రిభిః. స ఇతి. శ్రుతీ శ్రోత్రే. అచ్యుతస్య సత్కథానాముదయే శ్రవణే చ కారేత్యస్య సర్వత్రాన్వయః. 21

శ్లో॥ ముకుంద లింగాలయదర్శనే దృశౌ
తద్భృత్యగాత్ర స్పర్శేఽంగ సంగమం ।
ఘ్రాణం చ తత్పాదసరోజ సౌరభే
శ్రీమత్తులస్యారసనాం తదర్పితే ॥ 22

ఆయన మనస్సు విష్ణుపాద స్మరణలో, మాటలు విష్ణుగుణ వర్ణనములో, చేతులు విష్ణుమందిర సంమార్జనములో, కర్ణములు విష్ణు సత్కథా శ్రవణములో, నేత్రములు విష్ణుమందిర దర్శనములో, స్పర్శ విష్ణుదాసుల శరీర స్పర్శలో, ఘ్రాణము విష్ణు పదారవిందములపై అర్పించిన తులసీ సౌరభాఘ్రాణలో, రసన (నాలుక) విష్ణువునకు నివేదించిన పదార్థాస్వాదనలో మునిగియుండెడివి. (21-22)

టీ:- ముకుందేతి. ముకుందస్య లింగానాం. ఆలయాని స్థానాని. తేషాం దర్శనే దృశౌ నేత్రే తద్భృత్యా భాగవతాః. తేషాం గాత్రస్పర్శనం ఆలింగన హస్త స్పర్శనాది. అత్ర ఛందో భంగ ఆర్షః. తస్మిన్ అంగ సంగమం కరచరణాద్యవయవసంబంధం. శ్రీమత్యాః తులస్యాః తత్పాద సరోజే యత్సౌరభం తస్మిన్ తదర్పితే తస్మై నివేదితాన్నాదౌ. 22

శ్లో॥ పాదౌ హరేః క్షేత్రపదానుసర్పణే
శిరో హృషీకేశపదాభివందనే ।
కామంచ దాస్యే న తు కామకామ్యయా
యథోత్తమ శ్లోక జనాశ్రయా రతిః ॥ 23

అతని పాదములు విష్ణు క్షేత్రములకు వెళ్ళుటకు, శిరస్సు విష్ణు పాదాభివందనము గావించుటకు ఉపయోగపడెడివి. అతని కోరిక విష్ణు దాస్యము పైనే కాని, విషయేచ్ఛ యందు కాదు. పుణ్యజనుల యందే ఇష్టము కలిగియుండెను. 23

టీ:- పాదావితి. కామం స్రక్చందనాదిసేవాం. దాస్యే నిమిత్తే. తత్ప్రసాద స్వీకారాయ. న తు కామకామ్యయా విషయేచ్ఛయా కథం చకార. ఉత్తమశ్లోకజనాశ్రయా రతిర్యథా భవేత్తథా. అనేన తద్భక్తేషు చ పరం భావం ప్రాప్త ఇత్యేతత్ స్ఫుటీకృతః. 23

శ్లో॥ ఏవంసదా కర్మకలాపమాత్మనః
పరేఽధియజ్ఞే భగవత్యధోక్షజే ।
సర్వాత్మభావం విదధన్ మహీమిమాం
తన్నిష్ఠవిప్రాభిహితశ్శశాస హ ॥ 24

ఈ విధముగా అంబరీషుడు తాను ఆచరించు సమస్త కర్మలు సర్వాత్మానా భగవదాశ్రితముగా ఆచరించుచు భగవన్నిష్ఠ గల విప్రులచే శిక్షితుడై ఈ భూమండలమును పాలించుచుండెను. 24

టీ:- ఏవమితి. సర్వత్ర ఆత్మభావో భావనా యస్మిన్ తం. ఆత్మనః స్వస్య. కర్మణాం కలాపం సమూహం. భగవతి విదధన్ సమర్పయన్. తన్నిష్ఠైర్భాగవతైర్విప్రైః. అభిహితః శిక్షితస్సన్ మహీం. శశాస పాలయామాస. అనేనాధికృతధర్మో౽పి యథావద్దర్శితః. 24

శ్లో॥ ఈజే౽శ్వమేధైరధియజ్ఞమీశ్వరం
మహావిభూత్యోపచితాంగదక్షిణైః ।
తతైర్వసిష్ఠాసితగౌతమాదిభి
ర్ధన్వన్యభిస్రోతమాసౌ సరస్వతీమ్ ॥ 25

ఆ అంబరీషుడు గొప్ప సంపదలతో సమకూర్చబడిన మంచి దక్షిణలతో యజ్ఞేశ్వరడగు శ్రీహరిని గూర్చి వసిష్ఠ, అసిత, గౌతమాది మునుల సహాయముతో సరస్వతీ నదీ తీరమున అనేక అశ్వమేధ యాగముల నొనరించెను. 25

టీ:- కించ. ఈజ ఇతి. యజ్ఞాధిష్ఠాతారం ఈశ్వరం. అశ్వమేధైరీజే ఆరాధయామాస. మహావిభూత్యా ఉపచితాన్యంగాని దక్షిణాశ్చ యేషు తైః. వసిష్ఠాదిభిర్ఋత్విగ్భూతైః. తతైః విస్తృతైః ధన్వని నిరుదకే దేశే. సరస్వతీమభిస్రోతం తస్యాః ప్రతిలోమమిత్యర్థః. 25

శ్లో॥ యస్య క్రతుషు గీర్వాణైస్సదస్యా ఋత్విజో జనాః ।
తుల్యరూపాశ్చ నిమిషా వ్యదృశ్యంత సువాససః ॥ 26

అతడాచరించిన ఆ యజ్ఞములలో ఋత్విజులు మంచి వస్త్రములు ధరించి దేవతలతో సమానములగు రూపములు కలిగి నిమేశులై (విస్మితులై) కానబడుచుండిరి. 26

టీ:- కించ యస్యేతి. యస్య క్రతుషు సదస్యాదయః గీర్వాణైస్సహ భూషాదిభిస్తుల్యరూపాః. వ్యదృశ్యంత. స ఇత్థమితి చతుర్థేనాన్వయః.

న చ దేవానాం నిమేషాభావాద్వైలక్షణ్యం యతః. అనిమిషాశ్చ వ్యదృశ్యంత. న నిమిషంతీతి తథా. ఆశ్చర్య దర్శనౌత్సుక్యేన. తేషాం నిమేషోపరమాదితి భావః. 26

శ్లో॥ స్వర్గో న ప్రార్థితో యస్య మనుజైరమరప్రియః ।
శృణ్వద్భిరను గాయద్భిరుత్తమశ్లోక చేష్టితమ్ ॥ 27

టీ:- స్వర్గ ఇతి. యస్య యదీయైర్మనుజైరపి. స్వర్గో న ప్రార్థితః తస్య తు కా వార్తా. 27

అతని రాజ్యములో నివసించెడి జనులు అంబరీషుని కీర్తిని వినుచు, గానముచేయుచు స్వర్గమును కూడా కోరకుండిరి. 27

శ్లో॥ న వర్ధయంతి యత్కామాస్స్వారాజ్యపరిభావితాః ।
దుర్లభా అపి సిద్ధానాం ముకుందం హృది పశ్యతః ॥ 28

టీ:- నేతి ఆస్సాం తావత్స్వర్గప్రార్థనాశంకాపి యద్యతః. ముకుందం హృది పశ్యతః. తాన్ జనాన్. కామాః విషయాః న వర్ధయతి న హర్షయంతి. కథం భూతాః. స్వారాజ్యేన స్వరూపసుఖేన. పరిభావితాః అతిశయితాః. అత ఏవ. సిద్ధానామపి దుర్లభాః. యానితి పాఠే. యాన్ మనుజాన్. స్వారాజ్యేత్యత్రాపి ద్వితీయాంతపాఠే మనుజానాం విశేషణం. యమితిపాఠేయం అంబరీషం. పశ్యతామితి పాఠే సిద్ధానాం విశేషణం. 28

అంబరీషుని రాజ్యములోని జనులు కోరికలులేనివారై తమ (అంబరీషుని) రాజ్యములోనే పూర్ణసుఖము ప్రాప్తించుటచే, స్వర్గాదుల పట్ల హర్షమొందక, అణిమాది సిద్ధులు పొందిన వారికి కూడా అప్రాప్యమైన సుఖమును తామనుభవిస్తున్నామని ఆనందములో ఉండిరి. మనస్సులలో విష్ణువును భావించుచున్నవారై ఏ కోరికలను కూడా కోరరైరి. 28

శ్లో॥ స ఇత్థం భక్తియోగేన తపో యుక్తేన పార్థివః ।
సధర్మేణ హరిం ప్రీణన్ సర్వాన్ సంగాన్ శనైర్జహౌ ॥ 29

ఆ అంబరీషుడు భక్తి, తపో, యుక్తమగు భక్తితో హరిని స్మరిస్తూ సర్వసంగములను వదిలివేసెను. 29

శ్లో॥ గృహేషు దారేషు సుతేషు బంధుషు
ద్విపోత్తమస్యందనవాజి పంక్తిషు ।
అక్షయ్య వస్త్రాభరణాయుధాది
ష్వనంతకోశేష్వకరోదసన్మతిమ్ ॥ 30

టీ:- ఏవం భగవదారాధనపరస్య కామాద్యుపేక్షానైవ చిత్రమిత్యుపసంహరతి.- స ఇత్యాదిద్వాభ్యాం. (29-30)

గృహములు, భార్య, సుతులు, బంధువులు, గజములు, ఉత్తమమైన రథతురగాదుల యందు వస్త్రాభరణములందు మనస్సునుంచక శ్రీహరి యందే తన మనస్సును లగ్నము చేసెను. 30

శ్లో॥ తస్మా అదాద్ధరిశ్చక్రం ప్రత్యనీకభయావహమ్ ।
ఏకాంత భక్తియోగేన ప్రీతో భీతాభిరక్షణమ్ ॥ 31

టీ:- నన్వేవం భూతోఽసౌ కథం ప్రతిపక్షాన్ జయేత్తత్రాహ - తస్మా ఇతి. 31

ఈ విధముగా వైరాగ్యవంతుడై నిస్సంగుడై ఏకాంత భక్తితో తనను కొలిచెడి అంబరీషునకు విష్ణువు శత్రుభయపరమగు, భీతులను రక్షించెడి సుదర్శనచక్రమును ఒసగెను. 31

శ్లో॥ ఆరిరాధయిషుర్విష్ణుం మహిష్యా తుల్యశీలయా ।
యుక్తస్సంవత్సరం ధీరో దధార ద్వాదశీవ్రతమ్ ॥ 32

ఆయన వైరాగ్యము మరియు హరిభక్తి బ్రాహ్మణునిచే ఇవ్వబడ్డ దండనను సైతము అతిక్రమించునట్లుగా ఉన్నదని చెప్పుచున్నాడు.

టీ:- తదేవం తస్య వైరాగ్యాదికం హరిభక్తిం చోక్త్వా. బ్రహ్మదండో యత్ర న ప్రాభూదితి. యదుక్తం. తదేవ ద్వాదశీ వ్రతనిష్ఠాం కథయన్నాహ. -ఆరిరాధయిషురిత్యాది యావదధ్యాయపరిసమాప్తి. 32

శ్లో॥ వ్రతాంతే కార్తికేమాసి త్రిరాత్రం సముపోషితః ।
స్నాతః కదాచిత్కాళింద్యాం హరిం మధువనేऽర్చయత్ ॥ 33

శ్లో॥ మహాభిషేక విధినా సర్వోపస్కర సంపదా ।
అభిషిచ్య వరాకల్పైర్గంధమాల్యార్హణాదిభిః ॥ 34

టీ:- వ్రతాంత ఇతి. అర్చయత్. అడగమాభావ ఆర్షః. (33-34)

శ్లో॥ తద్గతాంతర భావేన పూజయామాస కేశవం ।
బ్రాహ్మణాంశ్చ మహాభాగాన్ సిద్ధార్థానపి భక్తితః ॥ 35

టీ:- తదితి. బ్రాహ్మణాంశ్చ పూజయామాస సిద్ధార్థాన్ ఆప్తకామాన్. పూజా నపేక్షానపి. 35

అంబరీషుడు తనకు తగిన శీలవతియగు భార్యతోగూడి విష్ణువు నారాధించదలచినవాడై సంవత్సర కాలము ఆచరించెడి ద్వాదశి వ్రతము నాచరించసాగెను. 32

వ్రత సమాప్తి సమయమున కార్తీక మాసమున మూడురోజులు ఉపవసించి కాళిందీనదిలో స్నానమాచరించి మధువనములో అర్చించెను. 33

గంధమాల్యాది సమస్తోపచారములతో విష్ణుగతమైన మనస్సుతో మహాభిషేకము గావించి విష్ణువును పూజించెను. సమస్తములగు కోరికలు తీరిన బ్రాహ్మణులకు కూడా బంగారు కొమ్ములు, వెండి డెక్కలు, మంచి వస్త్రములతో అలంకరింపబడిన దూడలతో కూడిన అరువది అష్టదములు పాడి ఆవులు ఒసంగి పూజించెను. పంచభక్ష్య పరమాన్నములతో బ్రాహ్మణులను భుజింపజేసెను. (34-37)

శ్లో॥ గవాం రుక్మవిషాణానాం రూప్యాం ఘ్రీణాం సువాససామ్ ।
పయశ్శీల వయోరూపవత్సోపస్కర సంపదామ్ ॥ 36

టీ:- గవామితి. రూప్యాం ఘ్రీణాం రూప్యఖురాణాం పయశ్శీలాది సంపదో యాసాం తాసాం. 36

శ్లో॥ ప్రాహిణోత్సాధు విప్రేభ్యో గృహేషు న్యర్బుదాని షట్ ।
భోజయిత్వా ద్విజానగ్రే స్వాద్వన్నం గుణవత్తమమ్ ॥ 37

టీ:- ప్రాహిణోదితి. న్యర్బుదాని షట్ షష్టికోటీః. 37

శ్లో॥ లబ్ధకామైరనుజ్ఞాతః పారణాయోపచక్రమే ।
తర్హి దిష్ట్యాతిథిస్సాక్షాద్దుర్వాసా భగవానభూత్ ॥ 38

టీ:- లబ్ధేతి. తర్హి తదైవ దుర్వాసాః అతిథిః. సాక్షాత్ ప్రత్యక్షోఽభూత్. 38

వారి నాజ్ఞనొంది పారణ చేయుటకుపక్రమించెను. ఆ సమయమున దుర్వాస మహర్షి అతిథిగా వచ్చెను. 38

శ్లో॥ తమానర్చాతిథిం సమ్యక్ప్రత్యుత్థానాసనార్హణైః ।
యయాచేఽభ్యవహారాయ పాదమూలాముపాగతః ॥ 39

టీ:- తమితి. ఆనర్చఅర్చితవాన్ అభ్యవహారాయ భోజనాయ. 39

ఆ దూర్వాసునకెదురేగి అర్ఘ్య పాద్యాదులతో పూజించి అతని పాదములనంటి (భోజనము చేయుడని) ఆతిథ్యమును స్వీకరింపుడని ప్రార్థించెను. 39

శ్లో॥ ప్రతినంద్యస తద్యాచ్ఞాం కర్తుమావశ్యకం గతః ।
నిమమజ్జ బృహద్ధ్యాయన్ కాళిందీ సలిలే శుచౌ ॥ 40

శ్లో॥ ముహూర్తార్ధావశిష్టాయాం ద్వాదశ్యాం పారణాం ప్రతి ।
చింతయామాస ధర్మజ్ఞో ద్విజే సద్ధర్మ సంకటమ్ ॥ 41

టీ:- ప్రతి నంద్యేతి. ఆవశక్యం నైయమికం. మధ్యాహ్నికం కర్మ కర్తుం గతః. బృహత్ బ్రహ్మ. (40-41)

శ్లో॥ బ్రాహ్మణాతిక్రమే దోషో ద్వాదశ్యామప్యపారణే ।
యత్కృత్వా సాధు మే భూయా దధర్మో వా న మాంస్పృశేత్ ॥ 42

టీ:- ధర్మసంకటమేవాహ-బ్రాహ్మణేతి. యద్యతః బ్రాహ్మణాతిక్రమే దోషః. అధర్మః ద్వాదశ్యామపారణే2పి దోషః వ్రతవైగుణ్యం. యత్కృత్వా యస్మిన్ కృతే. 42

దూర్వాసుడు అతని ప్రార్థనను అంగీకరించి మాధ్యాహ్నిక క్రియల నొనర్చుటకై వెడలి బ్రహ్మను స్మరిస్తూ కాళింది జలములో మునిగెను. 40

దుర్వాసుడు ఎంతసేపటికి రాకపోవడముతో ధర్మజ్ఞుడగు ఆ అంబరీషుడు ద్వాదశి ఘడియలు దాటకుండా పారణ చేయవలసి యున్నందున ద్వాదశి అర్ధముహూర్త సమయము మాత్రమే మిగిలి యుండగా ఏమి చేయవలయునో తోచక బ్రాహ్మణుడగు దుర్వాసుడు రాకుండ భుజించడం దోషము. ద్వాదశి ఘడియలలో పారణ చేయకుండుటయు దోషము. ఈ ధర్మ సంకటమున ఏది ఆచరించిన నాకు శుభము జరుగును. అధర్మము నాకు తాకకుండునటుల ఏమి చేయవలయునో తెలుపుడని బ్రాహ్మణులను అడిగెను. (41-42)

శ్లో॥ అంభసా కేవలేనాథ కరిష్యే వ్రత పారణాం ।
ఆహురబ్భక్షణం విప్రాః అశితానశితం చ యత్ ॥ 43

టీ:- ఏవం ద్విజైస్సహ విచార్య నిశ్చినోతి. అంభసేతి వ్రతస్య పారణాం సమాప్తిం తత్ అశితమాహుః. అశితం నేత్యాహుశ్చ.శ్రు. “అపో2శ్నాతి తన్నేవాశితం నైవాశిత” మిత్యాది. 43

ఆ బ్రాహ్మణులు ‘అపోఽశ్నాతి తన్నేవాశిత నైవ నాశితం’ అను శ్రుతి ననుసరించి నీరు త్రాగి ద్వాదశి పారణ చేసినచో తినినట్లు, తిననట్లు కూడా అగునని తెలిపిరి. వారి మాటననుసరించి కేవలము నీరు త్రాగి మేమీ వ్రతపారణ మొనర్చెదమని తలచి అంబరీషుడు నీరుత్రాగి మనస్సులో విష్ణువును ధ్యానిస్తూ దుర్వాసుని రాకకై ఎదురుచూచు చుండెను. (43-44)

శ్లో॥ ఇత్యపః ప్రాశ్య మరాజర్షిశ్చింతయన్ మనసాచ్యుతం ।
ప్రత్యాచష్ట కురుశ్రేష్ఠ ద్విజాగమన మేవ సః ॥ 44

శ్లో॥ దుర్వాసా యమునాకూలాత్కృత్వావశ్యకమాగతః ।
రాజ్ఞాభినందిత స్తస్య బుబుధే చేష్టితం ధియా ॥ 45

టీ:- ఇతీతి. ప్రత్యాచష్ట ప్రత్యైక్షత. (44-45)

ఆ సమయమున దుర్వాసుడు మాధ్యాహ్నిక కర్మలనాచరించి యముననుండి వచ్చి రాజుచేత ఆహ్వానించబడిన వాడై అంబరీషుడు నీరు త్రాగిన విషయమును గ్రహించెను. 45

శ్లో॥ మన్యునా ప్రచలద్గాత్రో భ్రుకుటికుటీలాననః ।
బుభుక్షితశ్చ సుతరాం కృతాంజలిమభాషత ॥ 46

కోపముతో శరీరము కంపించుచుండ కనుబొమలు ముడిపడిన ముఖముతో మిక్కిలి ఆకలి కలిగినవాడై, అంజలి ఘటించిన అంబరీషు గూర్చి ఇట్లు పలికెను. 46



దుర్వాసా ఉవాచ

శ్లో॥ అహో అస్య నృశంసస్య శ్రియా మత్తస్య పశ్యత ।
ధర్మవ్యతిక్రమం విష్ణోరభక్తస్యేశమానినః ॥ 47

శ్లో॥ యో మామతిథిమాయాంత మాతిథ్యేన నిమంత్ర్య చ ।
అదత్త్వా భుక్తవాం స్తస్య సద్యస్తే దర్శయే ఫలమ్ ॥ 48

దుర్వాసుడు ఈ విధముగా పలికెను.

సంపదచే మదించి దురహంకారియగు ఈ అంబరీషుని గాంచితిరా! వీడు విష్ణుభక్తుడు కాడు. నన్ను భోజనమునకాహ్వానించి నాకుపెట్టక భుజించినాడు. దానికి తగిన ఫలము చూపించెదను. (47-48)

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఏవం బ్రువాణ ఉత్కృత్య జటాం రోషవిదీపితః ।
తయా స నిర్మమే తస్మై కృత్యాం కాలానలోపమామ్ ॥ 49

శ్రీశుకుడు ఈ విధముగా పలికెను.

అనుచు, కోపముతో తన ఒక జటను పెరికి ఆ జటతో దావాగ్ని సమమగు కృత్యను గావించి అంబరీషుని పైకి వదిలెను. 49

శ్లో॥ తామా పతంతీం జ్వలతీమసి హస్తాం పదా భువం ।
వేపయంతీం సముద్వీక్ష్య న చచాల పదాన్నృపః ॥ 50

టీ:- మన్యునేతి. ప్రచలత్. కంపమానం. గాత్రం యస్య. భ్రుకుటిభ్యాం కుటిలమాననం యస్య. (46-50)

పాదములతో భూమిని కంపింపచేస్తూ, చేతిలో ఖడ్గముతో అగ్నివలె మండుచు వచ్చుచున్న ఆ కృత్యను చూచికూడా అంబరీషుడు ఓ అడుగుకూడా కదలడాయెను. 50

శ్లో॥ ప్రదిష్టం భృత్యరక్షాయాం పురుషేణ మహాత్మనా ।
దదాహ కృత్యాం తాం చక్రం క్రుద్ధాహిమివ పావకః ॥ 51

టీ:- ప్రదిష్టమితి. క్రుద్ధమహిం. పావకోదావాగ్నిరివ. 51

విష్ణుమూర్తిచేత తన సేవకులను రక్షించుట కాదేశించబడిన సుదర్శనచక్రము, కోపించిన పామును అగ్ని దహించినటుల ఆ కృత్యను కాల్చివేసెను. 51

శ్లో॥ తదభిద్రవదుద్వీక్ష్య స్వ ప్రయాసం చ నిష్ఫలం ।
దుర్వాసా దుద్రువే భీతో దిక్షు ప్రాణపరిప్సయా ॥ 52

టీ:- తదితి. నిష్ఫలముద్వీక్ష్య. 52

తానుచేసిన ప్రయత్నము విఫలమగుట, సుదర్శనచక్రము తనవైపు రావటమును గాంచిన దుర్వాసుడు భయముతో ప్రాణములను రక్షించుకొనుటకు దిక్కులలో పరుగులెత్తెను. 52

శ్లో॥ తమన్వధావద్భగవద్రథాంగం
దవాగ్ని రుద్భూతశిఖోయథా హిమ్ ।
తథానుషక్తం మునిరీక్షమాణో గుహాం
వివిక్షుః ప్రససార మేరోః ॥ 53

ఆ విధముగా పామును గాల్చెడి అగ్నివలె తననునుసరించి వచ్చెడి ఆ సుదర్శన చక్రమును కాంచుచు మేరుపర్వత గుహలోనికి ప్రవేశించెను. 53

శ్లో॥ దిశో నభః క్ష్మాం వివరాన్ సముద్రాన్
లోకాన్ సపాలాం స్త్రిదివం గతస్సః ।
యతో యతో ధావతి తత్ర తత్ర
సుదర్శనం దుష్ప్రసహం దదర్శ ॥ 54

టీ:- తమితి. అనుషక్తం పృష్ఠతః. సంసక్తం. మేరోర్గుహాం. వివిక్షు రధావత్. (53-54)

ఆ దుర్వాసుడు పది దిక్కులలోకి, ఆకాశములోకి, భూవివరముల లోనికి, సముద్రములోనికి, స్వర్గలోకములోనికి , సమస్త లోకములలోనికి భీతుడై పరిగెత్తుచుండెను. అతడెచ్చటికి వెళ్ళినను అచ్చటచ్చట సుదర్శనము కూడా కనిపించుచుండెను. 54

శ్లో॥ అలబ్ధనాథస్స యదా కుతశ్చి
త్సంత్రస్తచిత్తోఽరణ మేషమాణః ।
దేవం విరించం సమగాద్విధాత
స్త్రాహ్యాత్మయోనేఽజిత తేజసోఽహమ్ ॥ 55

టీ:- అలబ్ధేతి. అరణ మేషమాణః శరణమిచ్ఛన్ అజితతేజసః హరేశ్చక్రాత్. 55

తనను రక్షించునాథుడు లేనివాడై భీతమైన చిత్తముతో తనకు రక్షణ కల్పించు వానిని వెదుకుచు బ్రహ్మలోకమునకు వెడలి సుదర్శన చక్రము నుండి రక్షించుమని బ్రహ్మను వేడెను. 55

బ్రహ్మోవాచ

శ్లో॥ స్థానం మదీయం ద్విజవిశ్వమేత
త్క్రీడావసానే ద్విపరార్ధసంజ్ఞే ।
భ్రూభంగమాత్రేణ చ సందిధక్షోః
కాలాత్మనో యస్య తిరోభవిష్యతి ॥ 56

టీ:- స్థానమితి. ఏతత్సర్వం యస్య భ్రూభంగమాత్రేణ తిరోభవిష్యతి. కదా? క్రీడాయా అవసానే. తదపి కదా? ద్విపరార్ధసంజ్ఞే కాలే. 56

బ్రహ్మ ఈ విధముగా పలికెను.

అపుడు బ్రహ్మ దుర్వాసునితో కాలాత్ముడగు ఏ విష్ణువు యొక్క భ్రూభంగ మాత్రముతోనే ద్వి పరార్ధ సంజ్ఞ కాలమందు నా స్థానము ఈ ప్రపంచమంతయు నాశమొందగలదో నేను, శంకరుడు, దక్షుడు, భృగువు ఇంద్రాది దిక్పతులు, రాజులు మొదలగు సమస్తములు ఏ విష్ణువు యొక్క ఆజ్ఞను శిరసావహించి లోకహితమొనర్చుచున్నవో అట్టి విష్ణు భక్తద్రోహివగు నిన్ను రక్షించు శక్తి నాకు లేదనెను. (56-57)

శ్లో॥ అహం భవో దక్ష భృగుప్రధానా
ప్రజేశ భూతేశ సురేశముఖ్యాః ।
సర్వే వయం యన్నియమం ప్రపన్నా
మూర్ధ్న్యర్పితం లోకహితం వహామః ॥ 57

శ్లో॥ ప్రత్యాఖ్యాతో విరించేన విష్ణుచక్రోపతాపితః ।
దుర్వాసాశ్శరణం యాతశ్శర్వం కైలాసవాసినమ్ ॥ 58

ఈ విధముగా బ్రహ్మచే తిరస్కరించబడి విష్ణుచక్రముచే బాధించ బడుచున్న దుర్వాసుడు కైలాసవాసి యగు శంకరుని దగ్గరకు వెళ్ళి శరణు వేడెను. 58

టీ:- అహమితి. అతో వయం సర్వే. యస్య నియమమాజ్ఞాం ప్రపన్నాః ప్రాప్తాస్సంతో లోకహితం యథా భవత్యేవం తన్నియమం మూర్ధ్న్యర్పితం వహామః ఆత్మసద్భక్తద్రోహిణం త్వాం రక్షితుం న సమర్థో2హమితి శేషః. యత్తదోర్నిత్యసంబంధాత్. (57-58)

శంకర ఉవాచ

శ్లో॥ వయం న తాత ప్రభవామభూమ్ని
యస్మిన్ పరే2న్యేప్యజ జీవకోశాః ।
భవంతి కాలేన భవంతి హీదృశా
స్సహస్రశో యత్ర వయం భ్రమామః ॥ 59

శంకరుడు ఈ విధముగా పలికెను.

ఓ నాయనా! భగవంతుడగు శ్రీహరి నుండియే వేలకొలది బ్రహ్మాండములు ప్రభవించుచున్నవి. లయములగు చున్నవి. నేను (శంకరుడను) బ్రహ్మ మొదలగు వారందరము ఆ బ్రహ్మాండములో భ్రమించుచున్నారము. 59

టీ:- శ్రీరుద్రోఽపి ప్రత్యాచష్టే చతుర్భిః-వయమితి. భూమ్ని మహతి. మహత్త్వమేవాహ.-యస్మిన్ పరే పరమేశ్వరే. అజాః బ్రహ్మాణః. త ఏవ జీవాః. తేషాం కోశాః ఉపాధిభూతా బ్రహ్మాండవిగ్రహాః. ఈదృశాం దృశ్యమానబ్రహ్మాండప్రమాణాః అన్యేఽపి భవంతి జాయంతే న భవంతి నశ్యంతి చ. పరే యత్ర. యేషు బ్రహ్మాండేషు లోకే వాభిమానినో వయం భ్రమామః. 59

శ్లో॥ అహం సనత్కుమారశ్చ నారదో భగవానజః ।
కపిలో వాంతరతమో దేవలో ధర్మ ఆసురిః ॥ 60

టీ:- నను సర్వజ్ఞస్య తవ భ్రమః కుతస్తత్రాహ.-అహమితి. 60

శ్లో॥ మరీచిప్రముఖాశ్చాన్యే సిద్ధేశాః పారదర్శినః ।
విదామ న వయం సర్వే యన్మాయాం మాయయావృతాః ॥61

నేను సనత్కుమారుడు, నారదుడు, బ్రహ్మ, కపిలుడు, దేవలుడు, ధర్మాసుర మరీచాదులు సర్వజ్ఞులగు అందరూ కూడా ఆ విష్ణు మాయచే ఆవరించబడిన వారై ఆ మాయను తెలుసుకొనలేక పోవుచున్నారు. (60-61)

శ్లో॥ తస్య విశ్వేశ్వరస్యేదం శస్త్రం దుర్విషహం హి నః ।
తమేవ శరణం యాహి హరిస్తే శం విధాస్యతి ॥ 62

జగదధీశ్వరుడగు ఆ విష్ణువు ఆయుధమగు ఈ చక్రమును మరలించు శక్తి మాకు లేదు. కావున నీవు ఆ విష్ణువునే శరణు వేడుము. అతడే నీకు మంగళము నొనరించగలడు. 62

శ్లో॥ తతో నిరాశో దుర్వాసాః పదం భగవతో యయౌ ।
వికుంఠాఖ్యం యదధ్యాస్తే శ్రీనివాసశ్శ్రియా సహ ॥ 63

ఆ మాటలతో నిరాశ చెందిన దుర్వాసుడు లక్ష్మీసమేతుడగు విష్ణుమూర్తి నివాసమగు వైకుంఠ పురమునకు వెడలెను. 63

టీ:- మరీచీతి. పారదర్శినః సర్వజ్ఞా అపి. యస్య మాయాంవిద్మః. (61-63)

శ్లో॥ స దహ్యమానోఽజితశస్త్రవహ్నినా
తత్పాదమూలే పతితస్సవేపథుః ।
ఆహాచ్యుతానంతసదీప్సిత ప్రభో
కృతాగసం మామవ విశ్వభావన ॥ 64

ఆ సుదర్శనచక్రాగ్నితో బాధ నొందుచున్న దుర్వాసుడు కంపించుచు విష్ణువు పాదముల నాశ్రయించి అచ్యుతా! అనంతా! సత్పురుషులచే కోరబడు ఓ ప్రభూ! దోషము నాచరించిన నన్ను క్షమించి రక్షించుము. 64

టీ:- స ఇతి. సతామీప్సిత. మాం అవ పాహి. 64

శ్లో॥ అజానతా తే మహిమానుభావం
కృతం మయాఘం భవతః ప్రియాణామ్ ।
విధేహి తస్యాపచితం విధాత
ర్ముచ్యేత యన్నామ్న్యుదితే నారకోఽపి ॥ 65

నీ యొక్క గొప్ప మహిమను తెలిసికొనలేక నేను నీ భక్తుడగు అంబరీషుని విషయమున పాపమొనరించితిని. గొప్ప పాపముల నొనరించి నరకములో నుండు మహా పాపికూడా నీ నామముచ్చరించిన ముక్తి నొందగలడు. అట్టి నీవు నన్ను రక్షించమని కోరెను. 65

శ్రీ భగవానువాచ

శ్లో॥ అహం భక్త పరాధీనోహ్యస్వతంత్ర ఇవ ద్విజ ।
సాధుభిర్గ్రస్తహృదయో భక్తైర్భక్త జనప్రియః ॥ 66

టీ:- అపరాధం నివేదయన్ ప్రార్థయతే-అజానతేతి. అఘం దుఃఖం. అపచితం. మద్భక్తద్రోహే నిష్కృతిం న పశ్యామీతి చేత్. తత్రాహ-యస్య తవ. నామ్ని కీర్తితే. నరక స్థోఽపి ముచ్యేత. తస్య తవ కిమశక్యమితి భావః. (65-66)

శ్రీహరి ఈ విధముగా పలికెను.

ఓ దుర్వాసా! సాధుపురుషులచేత ఆక్రమించబడిన హృదయము గల భక్తజన ప్రియుడనగు నేను భక్తపరాధీనుడనే కానీ స్వతంత్రుడను కాను. 66

శ్లో॥ నాహమాత్మానమాశాసే మద్భక్తైస్సాధుభిర్వినా ।
శ్రియం చాత్యంతికీం బ్రహ్మన్ యేషాం గతిరహం పరా ॥ 67

టీ:- నేతి. నాశాసేన స్పృహయామి. 67

ఓ బ్రాహ్మణుడా దుర్వాసా! నా భక్తులకాశ్రయభూతుడనగు నేను సాధు స్వభావులగు భక్తులను వదిలి, నిన్ను నేను కోరుకోను (అనగా భక్తుల వదిలియుండుట ఇష్టపడను) మరియు నాశరహితయగు లక్ష్మిని గూడా కోరను. 67

శ్లో॥ యే దారాగార పుత్రప్తాన్ ప్రాణాన్ విత్తమిమం పరమ్ ।
హిత్వామాం శరణం యాతాఃకథం తాంస్త్యక్తుముత్స హే ॥68

టీ:- య ఇతి. ఇమం పరం చ లోకం హిత్వా. (68-69)

ఏ భక్తులైన భార్యాపుత్ర గృహాదులను ధన, ప్రాణాదులను వదిలి నన్ను శరణు వేడిరో వారిని నేనెలా వదలగలను. 68

శ్లో॥ మయి నిర్బద్ధ హృదయాస్సాధవస్సమదర్శినః ।
వశీ కుర్వంతి మాం భక్త్యాసత్స్త్రియస్సత్పతిం యథా ॥ 69

సమదృష్టిగల సాధువులు నాయందే ఉంచబడిన హృదయము గలవారై, సాధ్వీమ తల్లులు తమ పతులనెలా వశపరచుకొందురో అటులనే భక్తులు తమ భక్తితో నన్ను వశంచేసుకొందురు. 69

శ్లో॥ మత్సేవయా ప్రతీతం తే సాలోక్యాది చతుష్టయమ్ ।
నేచ్ఛంతి సేవయా పూర్ణాః కుతోఽన్యత్కాల విప్లుతమ్ ॥ 70

నా సేవ నొనర్చి (సాధించిన) సాలోక్య సామీప్య, సాయుజ్య, సారూప్య చతుర్విధమును పొందిన వారుకూడా, నా సేవను గోరుతూ మరి దేనిని కోరరు. అట్టి భక్తులను నేనెటుల వదులగలను. 70

శ్లో॥ సాధవో హృదయంమహ్యం సాధూనాం హృదయం హ్యాహమ్।
మదన్యం తే న జానంతి నాహం తేభ్యో మనాగపి ॥ 71

టీ:- మదితి. ప్రతీతం ప్రాప్తమపి. (70-71)

సాధువుల హృదయమే నా హృదయము. సాధువుల హృదయమే నేను, నా కంటే వేరేదియు వారికి తెలియదు, వారికంటే నాకేదియు తెలియదు. 71

శ్లో॥ అతో హ్యాత్మాభిచారస్తే యతస్తం యాతు వై భవాన్ ।
సాధుషు ప్రహితం తేజః ప్రహర్తుః కురుతేఽశివమ్ ॥ 72

టీ:- అత ఇతి. ఆత్మనః తవైవ అభిచారో హింసా యతోఽభూత్ తమేవ భవాన్ యాతు శరణం గచ్ఛతు. అశివమనర్థం. 72

అందువలన నీవెవరికైతే అపచారమొనరించితివో వారి సమీపమునకే వెడలుము. సాధుజనులకు ఒనరించిన అపచారము కర్తకు అమంగళము గలిగించును. 72

శ్లో॥ తపో విద్యా చ విప్రాణాం నిశ్శ్రేయసకరే ఉభే ।
తే ఏవ దుర్వినీతస్య కల్పే తే కర్తురన్యథా ॥ 73

తపస్సు, విద్య ఈరెండునూ బ్రాహ్మణులకు శ్రేయస్సును చేకూర్చగలవు. ఈ రెండే దుర్వినీతుడైన అతనికి కీడు కల్గజేయును. 73

శ్లో॥ బ్రహ్మంస్త్వం గచ్ఛ భద్రం తే నాభాగ తనయం నృపమ్ ।
క్షమాపయ మహాభాగ తతశ్శాంతిర్భవిష్యతి ॥ 74

నీవు అంబరీషుని దగ్గరకు వెళ్ళి క్షమాపణ గావించుము (వేడుము) అప్పుడే శాంతి కలుగును. అని తెలిపెను. 74

టీ:- తపోవిద్యాసంపన్నస్య మమ కథమనర్థః సమజనీతి విస్మయం మాకార్షీరిత్యాహ - తప ఇతి. (73-74)

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
చతుర్థోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
నాల్గవ అధ్యాయము సమాప్తము.

పంచమోఽధ్యాయః

శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఏవంభగవతాదిష్టో దుర్వాసాశ్చక్రతా పితః ।
అంబరీష ముపాగమ్య తత్పాదౌ దుఃఖితోఽగ్రహీత్ ॥ 1

టీ:- శ్లో. "పంచమే విష్ణు చక్రం తు ప్రసాద్య ప్రాణసంకటాత్, దుర్వాసా రక్షితస్తేన యథా తద్వృత్తమీర్యతే". 1

శ్లో॥ తస్య సోద్యమమావేక్ష్య పాదస్పర్శ విలజ్జితః ।
అస్తౌషీత్తద్ధరేశ్చక్రం కృపయా పీడితో భృశమ్ ॥ 2

టీ:- తస్యేతి. స ఉద్యమమితి ఛేదః. సులోపః పాదపూరణార్థః. 2

అంబరీష ఉవాచ

శ్లో॥ త్వమగ్నిర్భగవాన్ సూర్యస్త్వం సోమో జ్యోతిషాం పతిః ।
త్వమాపస్త్వం క్షితిర్వ్యోమ వాయుర్మాత్రేంద్రియాణి చ ॥ 3

టీ:- త్వమితి. జ్యోతిషాం నక్షత్రాణాం పతిః. సోమస్త్వం మాత్రాణి ఇంద్రియాణి చ. త్వచ్ఛక్త్యైవాగ్న్యాదయః. స్వం స్వం కార్యం కుర్వంతీ త్యర్థః. 3

5 వ అధ్యాయము

ఈ ఐదవ అధ్యాయమున అంబరీషుడు విష్ణుచక్రమును అనునయించి, దుర్వాసుని ప్రాణసంకటము నుండి రక్షించిన వృత్తాంతము అభివర్ణించబడినది.

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

ఈ విధముగా విష్ణుమూర్తిచేత ఆదేశించబడిన దుర్వాసుడు అంబరీషుని చేరి దుఃఖముతో అతని పాదములపై బడెను. 1

ఆ అంబరీషుడు దుర్వాసుని కర్మ చూచి తన పాదములను స్పృశించుటచే, లజ్జితుడై దయగలవాడై సుదర్శనచక్రము నిటుల స్తుతించెను. 2

అంబరీషుడు ఈ విధముగా పలికెను

ఓ చక్రరాజమా! నీవు అగ్నివి, సూర్యుడివి, నక్షత్రాదిపతియగు చంద్రుడివినీవే, నీవే జలమువు, భూమివి, ఆకాశమువు, వాయువు, పంచతన్మాత్రలును నీవే, ఇంద్రియములు కూడా నీవే. 3

శ్లో॥ సుదర్శన నమస్తుభ్యం సహస్రారాచ్యుత ప్రియ ।
సర్వాస్త్రఘాతిన్ విప్రాయ స్వస్తి భూయా ఇడస్పతే ॥ 4

టీ:- సుదర్శనేతి. సహస్రం అరాయస్య. హే సహస్రార. స్వస్తి శరణం భూయాః. ఇడస్పతే పృథివీపతే. 4

శ్లో॥ త్వం ధర్మస్త్వం ధృతిస్సత్యం త్వం యజ్ఞోఽఖిలయజ్ఞ భుక్ ।
త్వం లోకపాలాస్సర్వాత్మా త్వం తేజః పౌరుషం పరమ్ ॥ 5

టీ:- బ్రాహ్మణ రక్షణం తవ యుక్తమేవేత్యాహ-త్వమితి. న చ తవేయం స్తుతిరిత్యాహ-పౌరుషం పురుషస్యైశ్వరస్య పరం తేజః. సామర్థ్యం త్వం. అయం భావః.శ్రు."స ఈక్షతే" త్యాదిశ్రుతి ప్రసిద్ధం. భగవతః శోభనం దర్శనం. తత ఏవ సర్వం జాతం. అతస్త్వమేవ సర్వాత్మేతి. 5

శ్లో॥ నమస్సునాభాఖిల ధర్మసేతవే
హ్యధర్మశీలాసుర ధూమకేతవే ।
త్రైలోక్య గోపాయ విశుద్ధ వర్చసే
మనోజవాయాద్భుత కర్మణే గృణే ॥ 6

సహస్రారశోభితమువై, విష్ణువునకు ప్రియమైనట్టి సర్వాస్త్ర సంహారకుడవు, పృథివి పతివియునైన నీవు ఈ బ్రాహ్మణునకు స్వస్తిని కలుగజేయుము. 4

బ్రాహ్మణ రక్షణము నీకు ఉచితమే అని స్తుతిస్తూ - పరమ పురుషుని తేజస్సుతో సామర్థ్యము నొందిన నీవు, సర్వప్రాణులందు గల శుభంకరుడైన, భగవద్దర్శనము చేయగల, సర్వాత్మత (శ్రుతి గోచరమైన) కలిగిన దానవు కనుక నీవే ధర్మమువు, ధృతివి, సత్యమువు, యజ్ఞమువు, నీవే యజ్ఞ భోక్తవు, నీవే లోకపాలకులవు, సమస్తులకు ఆత్మవు నీవే. పరమ పురుషుని తేజస్సు నీవే. 5

సకల ధర్మసేతువగు నీవు అధర్మశీలురకు ధూమకేతువువు. ముల్లోకములను రక్షించెడి అత్యుజ్వల వర్చస్సువగు మనోజవమగు అద్భుత కర్మల నాచరించెడి నీకు నమస్సులు. 6

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

టీ:- నమ ఇతి. హేసునాభ. అద్భుతకర్మాణం త్వాం. కః స్తోతుం సమర్థః. అతస్తుభ్యం కేవలం నమో గృణేకరోమీత్యన్వయః. అద్భుత కర్మత్వమేవాహ – అఖిలానాం ధర్మాణాం సేతవే మర్యాద రూపాయ. అత ఏవ. అధర్మశీలానామసురాణాం. ధూమకేతవే దాహకాయ త్రైలోక్యం గోపయతీతి తథా విశుద్ధమత్యుజ్జ్వలం వర్చస్తేజో యస్య తస్మై. 6

శ్లో॥ త్వత్తేజసా ధర్మమయేన సంహృతం
తమః ప్రకాశశ్చ దృశో మహాత్మనామ్ ।
దురత్యయస్తే మహిమా గిరాం పతే
త్వద్రూపమేతత్సదసత్పరాత్పరమ్ ॥ 7

ఓ చక్రరాజమా! నీ ధర్మమయమగు తేజస్సుతో అంధకారమును నశింపజేస్తూ సూర్యాది మహాత్ములకు ప్రకాశము కల్గించేడి నీ మహిమ తెలిసికొనుటకు దురత్యయమైనది. ఈ సమస్త కార్యకారణ రూపమగు జగత్తంతయు నీ రూపమే. 7

టీ:- తదేవ ప్రపంచయతి. ద్వాభ్యాం త్వదితి. సూర్యాదీనాం ప్రకాశశ్చ త్వయైవ రూప్యతే ప్రకాశ్యత ఇతి త్వద్రూపం. 7

శ్లో॥ యదా విసృష్టస్త్వమనంజనేన వై బలం
ప్రవిశ్యాజిత దైత్యదానవమ్ ।
బహూదరోర్వంఘ్రి శిరోధరాణి
వృక్ణన్నజస్రం ప్రధనే విరాజసే ॥ 8

విష్ణువుచేత ప్రయోగించబడిన నీవు దానవ బలమును ప్రవేశించి వారి బాహువు, ఉదర, పాద, శిరస్సులను ఖండిస్తూ ప్రకాశించుచున్నావు. 8

టీ:- యదేతి. అజిత. అనంజనేన శ్రీహరిణా. యదా విసృష్టః త్వం. తదా దైత్యదానవానాం బలం. ప్రవిశ్య తేషాం బాహ్వాదీన్. ఛిందన్ విరాజసే. ప్రవిష్టోర్జితేతి పాఠాంతరే ఊర్జితా దైత్యదానవాః యస్మిన్ తద్బలం. ప్రవిష్టస్సన్నిత్యర్థః. పూర్వపదేన సదంధిరార్షః. 8

శ్లో॥ సత్వం జగత్త్రాణఖలప్రహాణయే
నిరూపితస్సర్వసహో గదాభృతా ।
విప్రస్య చాస్మత్కులదైవ హేతవే
విధేహి భద్రం తదనుగ్రహో హి నః ॥ 9

విష్ణువుచేత నీవు దుష్టులను శిక్షించుటకు, శిష్టులను రక్షించుటకై ఆదేశించబడినావు. మా కుల దైవము, మాకు భాగ్యప్రదాతయగు ఈ విప్రునకు (దుర్వాసునకు) శుభము కలుగజేయుము. అదియే నన్ననుగ్రహించుట యగును. 9

టీ:- కించ త్వయా భవన్నియుక్తేన ఖలానామేవ దండః కార్యః. సాధవస్తు రక్షణీయాః. అతో విప్రరక్షణేన. అస్మాననుగృహాణేత్యాహ - సత్వమితి. హే జగత్త్రాణ. స ఏవంభూతః త్వం. ఖలానామేవ. ప్రహాణయే ప్రహరణార్థం. నిరూపితః నియుక్తః. అతోఽస్మత్కులస్య దైవహేతవే భాగ్యలాభాయ. విప్రస్య భద్రం విధేహి. తదేవంనోఽనుగ్రహః. 9

శ్లో॥ యద్యస్తి దత్తమిష్టం వా స్వధర్మో వా స్వనుష్ఠితః ।
కులం నో విప్రదైవం చేద్ద్విజో భవతు విజ్వరః ॥ 10

నేను యాచకులకు కోరినదిచ్చిన వాడనే అయిన, విహితములగు కర్మల నాచరించనవాడనైనచో, బ్రాహ్మణులను దైవముగా భావించెడి వాడనైనచో, ఈ దుర్వాసుని కష్టములు వదిలి సుఖపడుగాక 10

శ్లో॥ యది నో భగవాన్ ప్రీత ఏకస్సర్వ గుణాశ్రయః ।
సర్వభూతాత్మ భావేన ద్విజో భవతు విజ్వరః ॥ 11

సమస్త గుణములకాశ్రయభూతుడైన విష్ణువు నాయెడల ప్రసన్నుడైన యెడల ఈదుర్వాసుని, కష్టములు వదిలి సుఖించుగాక. 11

టీ:- సర్వ సుకృతార్పణేన విప్రరక్షాం ప్రార్థయతే - ద్వాభ్యాం యదీతి. విప్రోదైవం దేవః యస్మిన్ తత్. (10-11)

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఇతి సంస్తువతో రాజ్ఞో విష్ణుచక్రం సుదర్శనం ।
అశామ్యత్సర్వతో విప్రం నాదహద్రాజ యాచ్ఞయా ॥ 12

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

అంబరీషుడు స్తుతించగా ఆ విష్ణుచక్రము శాంతినొంది రాజగు అంబరీషుని కోరిక ననుసరించి ఆ దుర్వాసుని దహించక వదిలి వేసెను. 12

శ్లో॥ స ముక్తోఽగ్నిస్త్రాపాతేన దుర్వాసాస్స్వస్తిమాంస్తతః ।
ప్రశశంస తముర్వీశం యుంజానః పరమాశిషః ॥ 13

సుదర్శనాగ్నితో వదలబడిన ఆ దుర్వాసుడు శాంతినొంది ఆశీస్సుల నొసగుచు అంబరీషుని ఇటుల ప్రశంసించెను. 13

దుర్వాసా ఉవాచ

శ్లో॥ అహో అనంత దాసానాం మాహాత్మ్యం దృష్టమద్య మే ।
కృతాగసోఽపి యద్రాజన్మంగళాని సమీహసే ॥ 14

దుర్వాసుడు ఈ విధముగా పలికెను.

తమకు కష్టము కలుగజేసిన వారికి కూడా మంగళము కలుగజేసెడి విష్ణు భక్తులయొక్క మాహాత్మ్యమును నేనిప్పుడు తెలిసికొన్నాను. 14

శ్లో॥ దుష్కరం కిన్ను సాధూనాం దుస్త్యజం వా మహాత్మనాం ।
యైస్సంగృహీతో భగవాన్ సాత్త్వతామృషభో హరిః ॥ 15

ఏవరిచేత భక్త వత్సలుడగు విష్ణువు యొక్క చరణములు దృఢమగు ప్రేమభావముతో గ్రహించబడినవో అట్టి విష్ణు దాసులగు సాధువులకు దుష్కరమైనది. దుస్త్యజమైనది. ఏదియును నుండదు. 15

శ్లో॥ యన్నామ శ్రుతి మాత్రేణ పుమాన్ భవతి నిర్మలః ।
తస్య తీర్థపదః కిం వా దాసానామవశిష్యతే ॥ 16

ఏ దేవదేవుని యొక్క నామశ్రవణము చేతనే పురుషుడు సమస్త పాప నిర్ముక్తుడగునో అలాంటి విష్ణుదాసులకడ్డ మేమియుండును? 16

శ్లో॥ రాజన్ననుగృహీతోఽహం త్వయాతికరుణాత్మనా ।
మమాఘం పృష్ఠతః కృత్వా ప్రాణాయన్మేఽభిరక్షితాః ॥ 17

ఓ అంబరీష మహారాజా! మిక్కిలి దయావంతుడవగు నీవు నేనాచరించిన తప్పును క్షమించి, నా ప్రాణములను రక్షించితివి. 17

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ రాజా తమకృతాహారః ప్రత్యాగమన కాంక్షయా ।
చరణావుపసంగృహ్య ప్రసాద్యసమభోజయత్ ॥ 18

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

అని పలుకుచున్న దుర్వాసుని, ఇంతవరకు దుర్వాసుని ప్రత్యాగమనమునకై ఎదిరిచూస్తు భుజించకుండా నున్న ఆ యంబరీషుడు దుర్వాసుని పాదములనంటి ప్రార్థించి భుజింపజేసెను. 18

శ్లో॥ సోఽశిత్వాద్రుతమా నీతమాతిథ్యం సార్వకామికమ్ ।
తృప్తాత్మా నృపతిం ప్రాహ భుజ్యతాం భుజ్యతామితి ॥ 19

టీ:- ఇతీతి. రాజ్ఞస్తస్యైవ యాచ్ఞయా. (12-19)

ఆ దుర్వాసుడు అంబరీషుని ప్రార్థనతో భుజించి అతని ఆతిథ్యముతో తృప్తి చెంది అంబరీషుని భుజింపుము, భుజింపుము అని పలికెను. 19



దుర్వాసా ఉవాచ

శ్లో॥ ప్రీతోఽస్మ్యనుగృహీతోఽస్మి తవ భాగవతస్య వై ।
దర్శన స్పర్శనాలాపై రాతిథ్యేనాత్మమేధసా ॥ 20

టీ:- ప్రీత ఇతి. ఆత్మని మేధా యేనాతిథ్యేన. 20

దుర్వాసుడు ఈ విధముగా పలికెను.

పరమ భాగవతోత్తముడవైన నీ దర్శనముతో, స్పర్శతో, మాటలతో, ఆతిథ్యముతో సంతసించితిని. 20

శ్లో॥ కర్మవదాతమేతత్తే స్వర్గాయంతి స్త్రియోముహుః ।
కీర్తిం పరమపుణ్యాం చ కీర్తయిష్యతి భూరియమ్ ॥ 21

పవిత్రమైన నీ చరితమును ఆకాశమున దేవతలు, భూమిపైన మానవులు కీర్తించెదరు. 21

శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఏవం సంకీర్త్య రాజానం దుర్వాసాః పరితోషితః ।
యయౌ విహాయసామంత్ర్య బ్రహ్మలోకమహైతుకమ్ ॥ 22

టీ:- కర్మేతి. భూరియం తత్రస్థో జనః కీర్తయిష్యతి. (21-22)

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

అని పలికి దుర్వాసుడు అంబరీషుని చేత వీడ్కోలునంది బ్రహ్మ లోకమునకు వెడలెను. 22

శ్లో॥ సంవత్సరోఽత్యగాత్తావ ద్యావతానాగతో గతః ।
మునిస్తద్దర్శనాకాంక్షో రాజాబ్భక్షో బభూవ హ ॥ 23

టీ:- తస్యధైర్యాతిశయమాహ - సంవత్సర ఇతి. గతో మునిర్యావతానాగతః తావత్సంవత్సరోఽతిక్రాంత ఇతి. 23

ఈ విధముగా దుర్వాసుడు అంబరీషుని వద్దకు వచ్చి, తిరిగి వెళ్ళు వరకు ఒక సంవత్సర కాలము గడచినది. ఈ సంవత్సరమంతయు అంబరీషుడు నీళ్ళు త్రాగియే యుండెను. 23

శ్లో॥ గతేఽథ దుర్వాససి సోఽంబరీషో
ద్విజోపయోగాతి పవిత్రమాహరత్।
ఋషేర్విమోక్షం వ్యసనం చ బుద్ధ్వా
మే నే స్వవీర్యం చ పరానుభావమ్ ॥ 24

టీ:- గత ఇతి. ద్విజస్యోపయోగేన భోజనేన అతిపవిత్రం ఆహరత్ బుభుజే. స్వవీర్యం చ ధైర్యాదిలక్షణం. పరానుభావం భగవతః ప్రభావం మే నే. 24

దుర్వాసుడు భుజించిన పిదప పవిత్రమైన ఆహారమును భుజించెను. సుదర్శనాగ్ని నుండి దుర్వాసుడు విముక్తుడగుట మున్నగు నదంతయు తన వలన కలుగుటను విష్ణు ప్రభావముగానే భావించెను. 24

శ్లో॥ ఏవంవిధానేక గుణస్స రాజా
పరాత్మని బ్రహ్మణి వాసుదేవే ।
క్రియాకలాపైస్సమువాహ భక్తిం
యయాఽఽవిరించ్యాన్ని రయాంశ్చకార ॥ 25

శ్లో॥ అథాంబరీషస్తనయేషు రాజ్యం సమాన శీలేషు విసృజ్యధీరః ।
వనంవివేశాత్మని వాసుదేవేమనో దధేధ్వస్తగుణప్రవాహః ॥ 26

ఈ విధముగా గుణ సంపన్నుడగు నా రాజు పరబ్రహ్మ స్వరూపుడగు విష్ణువు నందు భక్తిని నిలిపి బ్రహ్మ పదము మొదలగు వాటినన్నింటిని తృణీకరించి వైరాగ్యమునొంది తనతో సమానులగు పుత్రులకు రాజ్య మొసంగి అరణ్యమునకు వెళ్ళి విష్ణువుపై మనస్సును నిలిపెను. (25-26)

శ్లో॥ ఇత్యేతత్పుణ్య మాఖ్యాన మంబరీషస్య భూపతేః ।
సంకీర్తయన్నను ధ్యాయన్ భక్తో భాగవతో భవేత్ ॥ 27

ఇలాంటి పుణ్యవంతుడైన అంబరీష చరిత్రను కీర్తించు మానవుడు భాగవతుడై సుఖమొందును. 27

టీ:- ఏవమితి. ఏవం విధా అనేక గుణా యస్య సః. ఆవిరించ్యాన్ విరించిపదసహితాన్. భోగాన్. నిరయప్రాయానపశ్యదిత్యర్థః. 25-27

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,

పంచమోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు

ఐదవ అధ్యాయము సమాప్తము.

షష్ఠో௨ధ్యాయః

శ్రీశుక ఉవాచ

శ్లో॥ విరూపః కేతుమాన్ శంభురంబరీషసుతాస్త్రయః ।
విరూపాత్పృషదశ్వో௨భూత్తత్పుత్రస్తురథీతరః ॥1

టీ:- శ్లో. "షష్ఠారంభే௨ంబరీషస్య వంశముక్త్వా తతః పరం, షష్ఠాద్యష్ట భిరధ్యాయైరిక్ష్వా కోర్వంశ ఉచ్యతే తత్ర షష్ఠే శశాదాది మాంధాత్రంతో నిరూప్యతే, ప్రసంగాత్సౌభరేరాఖ్యా మాంధాతృ తనయా పతేః." విరూప ఇతి. 1

శ్లో॥ రథీతరస్యా ప్రజస్య భార్యాయాం తంతవే ఋషిః ।
అంగిరా జనయామాస బ్రహ్మవర్చస్వినస్సుతాః ॥ 2

టీ:- రథీతరస్యేతి. తంతవే సంతానార్థం. 2

శ్లో॥ ఏతే క్షేత్ర ప్రసూతా వై పునశ్చాంగిరసాస్మృతాః ।
రథీతరాణాం ప్రవరాః క్షేత్రోపేతా ద్విజాతయః ॥ 3

6 వ అధ్యాయము

ఈ ఆరవ అధ్యాయము మొదట అంబరీషుని వంశమును తెలిపి అటు పిమ్మట ఎనిమిది అధ్యాయములలో ఇక్ష్వాకు వంశము చెప్పబడుచున్నది. ఆరవ అధ్యాయమున శశీదుని నుండి మాంధాత వరకు చెప్పబడుతూ ప్రసంగవశమున సౌభర్యుపాఖ్యానము తెలుపబడుచున్నది.

శుకుడు పలుకుచున్నాడు.

అంబరీషునకు విరూపుడు, కేతుమంతుడు, శంభుడు అను ముగ్గురు పుత్రులు. విరూపునకు పృషదశ్వుడు, పృషదశ్వునకు రథీతరుడు జన్మించెను. 1

నిస్సంతుయగు రథీతరుని భార్య యందు ఆంగిరసుడను ఋషి బ్రహ్మవర్చోవంతులగు పుత్రులను జనింపజేసెను. 2

వీరు రథీతరుని క్షేత్రజాతులగుటచే రథీతరగోత్రులై, ఆంగిరసునిచే జనించుటచే ఆంగీరసులను బ్రాహ్మణులైరి. 3

టీ:- ఏత ఇతి. యే యే అంగిరసా జనితాః. ఏతే రథీతరస్య. క్షేత్రే ప్రసూతత్వేన రథీతరగోత్రాస్సంతః. అంగీరసో వీర్యేణ ప్రసూతత్వా దాంగిరసాశ్చ. పునరపి రథీతరాణాం అన్యేషాం జాతానాం ప్రవరాః ముఖ్యాః స్మృతాః. యతః క్షేత్రో పేతాః బ్రాహ్మణా ఇత్యర్థః. 3

శ్లో॥ క్షువతస్తు మనోర్జజ్ఞ ఇక్ష్వాకుర్ఘ్రాణతస్సుతః ।
తస్య పుత్రశత జ్యేష్ఠా వికుక్షి నిమి దండకాః ॥ 4

మనువొక్కనాడు తుమ్మగా ఆతని ముక్కు రంధ్రముల నుండి ఇక్ష్వాకువు జన్మించెను. ఆ ఇక్ష్వాకునకు నూరుగురు పుత్రులు కలిగిరి. వారిలో వికుక్షి, నిమి, దండకులను వారు పెద్దవారు. 4

టీ:- తదేవం మనోర్దశసు పుత్రేషు వృషధ్రశ్చ కవిశ్చ విరక్తత్వాన్న వంశప్రవర్తకౌ కరూశాదీనాం చ సప్తానాం వంశాస్తారతమ్య క్రమేణోక్తాః ఇదానీమతివిత తమిక్ష్వాకోర్వంశమాహ-క్షువతస్త్విత్యాదినా యావత్సోమ వంశప్రస్తావం క్షువత ఇతి క్షుతం కుర్వతో మనోర్ఘ్రాణతో జజ్ఞే. శ్లో. "శ్రద్ధాయాం జనయామాస దశపుత్రా" నితి పూర్వోక్తం బాహుల్యాభి ప్రాయేణేతి ద్రష్టవ్యం. పుత్రాణాం శతే జేష్ఠాః. 4

శ్లో॥ తేషాం పురుస్తాదభవన్నార్యావర్తే౨భవన్నృప ।
పంచవింశతి పశ్చాచ్చత్రయోమధ్యే౨పరేన్యతః ॥ 5

వారు హిమాలయ, వింధ్యముల మధ్యగల ఆర్యావర్త పుణ్య భూమిని పాలించిరి. మిగిలిన వారిలో ఇరువది ఐదుగురు పశ్చిమ ప్రాంతమును పాలించిరి. మిగతా వారు దక్షిణోత్తర ప్రాంతములను పాలించిరి. 5

టీ:- తేషామితి. ఆర్యావర్తే. శ్లో. "ఆర్యావర్తః పుణ్యభూమిర్మధ్యం వింధ్యహిమగయో" రితి కోశప్రసిద్ధే తస్మిన్ పురస్తాత్సముద్రపర్యంతం మండలవిభాగేన పంచవింశతినృపాశ్చాభవన్. హేనృప. తథైవ పశ్చాచ్చ పంచవిశంతిః. మధ్యేతు జేష్ఠాస్త్రయః. అపరే తు అన్యతః అన్యత్ర దక్షిణోత్తరాదిష్విత్యర్థః. 5

శ్లో॥ స ఏకదాష్టక శ్రాద్ధేత్విక్ష్వాకుస్సుతమాదిశత్ ।
మాంసమానీయతాం మేధ్యం వికుక్షే గచ్ఛమాచిరమ్ ॥ 6

టీ:- వికుక్షిరేవ శశాద ఇతి. విశ్రుత ఇతి. తత్ర హేతుమాహ- చతుర్భిః. స ఇతి. 6

ఇక్ష్వాకుడొకసారి అష్టక శ్రాద్ధమాచరించదలచి అరణ్యమునకు వెడలి ఉచ్ఛిష్టము కానట్టి శుద్ధమగు మాంసమును తెమ్మని తన పుత్రుడగు వికుక్షి నాజ్ఞాపించెను. 6

శ్లో॥ తథేతి స వనం గత్వా మృగాన్ హత్వా క్రియార్హణాన్ ।
శాంతో బుభుక్షితో వీరః శశంచాద దపస్మృతిః ॥ 7

టీ:- తథేతి. క్రియార్హణాన్ శ్రాద్ధార్హాన్. అదత్ అభక్షయత్. 7

ఆ వికుక్షి తండ్రియాజ్ఞను శిరసావహించి వనమునకు వెడలి శ్రాద్ధక్రియకు అర్హమగు మాంసము కొరకు అనేక మృగములను చంపి అలసటనొంది ఆకలితో ఒక కుందేటిని చంపి భుజించెను. 7

శ్లో॥ శేషం నివేదయామాస పిత్రే తేన చ తద్గురుః ।
చోదితః ప్రోక్షణా యాహ దుష్టమేతదకర్మకమ్ ॥ 8

టీ:- శేషమితి. తద్గురుర్వసిష్ఠః ప్రోక్షణాయ శ్రాద్ధోచితసంస్కారాయ. 8

మిగిలిన మాంసమును తెచ్చి తండ్రియగు ఇక్ష్వాకునకొసగెను. ఆ విషయమును గ్రహించిన వసిష్ఠుడు వికుక్షి చేత తేబడిన మాంసము శ్రాద్ధకర్మ కనర్హమైనదిగా తెలిపెను. 8



శ్లో॥ జ్ఞాత్వా పుత్రస్య తత్కర్మగురుణాభిహితం నృప ।
దేశాన్నిస్సారయామాస సుతం త్యక్తవిధిం రుషా ॥ 9

టీ:- జ్ఞాత్వేతి. త్యక్తో విధిః సదాచారో యేన తం సుతం. 9

ఇక్ష్వాకుడు తన పుత్రుడగు వికుక్షి గావించిన దానికి కోపించి సదాచారమును వదిలిన వికుక్షిని దేశమునుండి బహిష్కరించెను. 9

శ్లో॥ స తు విప్రేణ సంవాదం జాపకేన సమాచరన్ ।
త్యక్త్వా కళేబరం యోగీ స తేనావాప యత్పరమ్ ॥ 10

టీ:- స ఇతి. స తు ఇక్ష్వాకుః జాపకేన వసిష్ఠేన. రాజ్యభోగే వీరయోగీ సన్. తేన యోగేన కళేబరం త్యక్త్వా. సయత్పరం తత్త్వం తత్ అవాప. 10

ఇక్ష్వాకువు గురువగు వసిష్ఠుడు చెప్పినటుల నడుచుకొనుచు, రాజ్యభోగియైనను, వీరయోగియై, యోగమార్గముచే శరీరమును వదలి ముక్తినొందెను. 10

శ్లో॥ పితర్యుపరతేఽభ్యేత్య వికుక్షిః పృథివీమిమామ్ ।
శాసన్నీజే హరిం యజ్ఞైః శశాద ఇతి విశ్రుతః ॥ 11

టీ:- పితరీతి. శాసన్ పాలయన్ హరిమీజే. 11

తండ్రియగు ఇక్ష్వాకువు ముక్తినొందిన పిదప వికుక్షి రాజ్యమునకు వచ్చి ఈ పృథివిని పాలిస్తూ విష్ణువును గురించి యజ్ఞముల నొనర్చి శశీదుడని ప్రసిద్ధి చెందెను. 11

శ్లో॥ పురంజయస్తస్య సుత ఇంద్రవాహ ఉదీరితః ।
కకుత్స్థ ఇతి చాప్యుక్తఃశృణు నామాని కర్మభిః ॥ 12

టీ:- పురంజయఇతి.దైవపురస్య జయాత్పురంజయః ఇంద్రో వాహోఽస్యేతీంద్రవాహః కకుది స్థితత్వాత్ కకుత్ స్థ ఇతి చ. 12

శశీదునకు పురంజయుడను పుత్రుడు కలిగెను. ఆ పురంజయుడు తానాచరించిన కర్మలతో ఇంద్రవాహనుడు, కకుస్థుడని పిలవబడెను. 12

శ్లో॥ కృతాంత ఆసీత్సమరో దేవానాం సహ దానవైః ।
పార్ష్ణిగ్రాహో వృతోవీరో దేవైర్దైత్యపరాజితైః ॥ 13

టీ:- శశాద సుతస్య త్రీణి నామాని తత్తత్కర్మనిమిత్తాని తాన్యేవ వ్యాచక్షాణ ఆహ-సప్తభిః. కృతాంత ఇతి. కృతం విశ్వమంతయతీతి తథా పార్ష్ణిగ్రాహః సహాయః. 13

కృతయుగాంతమున దేవతలకు దైత్యులతో యుద్ధము జరిగెను. ఆ యుద్ధమున దైత్యులతో పరాజితులైన దేవతలకు సహకరించదలచిన శశీదుడు దేవతలతో, ఇంద్రుడు తనకు వాహనముగా ఉండినచో, అప్పుడు నేను రాక్షసులను చంపగలననెను. కాని అతనికి వాహనముగా ఉండుట సిగ్గుగా భావించిన ఇంద్రుడు అందుకు అంగీకరించలేదు. దేవాధిదేవుడగు విష్ణుమూర్తి వాక్కుతో ఇంద్రుడు మహా వృషభమై శశీదునకు వాహనమయ్యెను. (13-14)

శ్లో॥ వచనాద్దేవదేవస్య విష్ణోర్విశ్వాత్మనః ప్రభోః ।
వాహనత్వే వృతస్తస్య బభూవేంద్రో మహావృషః ॥ 14

శ్లో॥ స సన్నద్ధో ధనుర్దివ్యమాదాయ విశిఖాన్ శితాన్ ।
స్తూయమానస్తమారుహ్య యుయుత్సుః కకుది స్థితః ॥15

శశీదుడు దివ్యమైన ధనస్సును, తీక్షణములగు బాణములను ధరించి వృషభ రూపుడగు ఇంద్రుని మూపురము పైనుండి దైత్యులతో గొప్ప యుద్ధమొనరించెను. 15

శ్లో॥ తేజసాప్యాయితో విష్ణోః పురుషస్య మహాత్మనః ।
ప్రతీచ్యాం దిశి దైత్యానాం న్యరుణత్త్రిదశైః పురమ్ ॥16

మహా పురుషుడగు విష్ణుతేజము తననావహించగా శశీదుడు దేవతలతో గూడి పడమటి దిక్కు నుండి రాక్షస నగరమును ముట్టడించెను. 16

టీ:- వచనాదితి. ఇంద్రోయది మమ వాహనం స్యాత్. తర్హి దైత్యాన్ హనిష్యామి. తేన వాహనత్వేన వృతస్సన్నింద్రో లజ్జయా తదనంగీకుర్వన్ విష్ణోర్వచనాత్తస్య వాహనత్వాయ మహావృషో బభూవేత్యర్థః.(14-16)

శ్లో॥ తైస్తస్య చాభూత్ప్రధనం తుములం రోమహర్షణం ।
యమాయ భల్లైరనయద్దైత్యాన్ యేఽభియయుర్మృధే ॥17

టీ:- తైరితి. యేఽభిముఖం యయుః తాన్ యమం దర్శయితుం సదేహానేవ భల్లైరనయదిత్యర్థః 17

రాక్షసులతో శశీదునకు దట్టమైన రోమాంచమును గలిగించెడి గొప్ప యుద్ధము కలిగెను. ఆ యుద్ధమున తననెదిరించిన రాక్షసులను శశీదుడు తన బాణములతో యముని చేర్చెను. (చంపెను)17

శ్లో॥ తస్యేషు పాతాభిముఖం యుగాంతాగ్నిమివోల్బణం ।
దృష్ట్వాన్యేదుద్రువుర్దైత్యా హన్యమానాస్స్వమాలయమ్ ॥18

టీ:- తస్యేతి. తచ్చదృష్ట్వా అన్యే దుద్రువుః స్వమాలయం పాతాళం. 18

యుగాంతమందలి అగ్నివలె నున్న అతని బాణములకెదురై ప్రాణములు విడువగా మిగిలిన వారు, భయముతో తమ స్థావరమగు పాతాళమునకు పరుగెత్తిరి. 18

శ్లో॥ జిత్వా పురం ధనం సర్వమయచ్ఛద్వజ్రపాణయే ।
ప్రత్యయచ్ఛత్సరాజర్షిరితి నామభిరాహృతః ॥ 19

శశీదుడు దైత్యులను జయించి ఇంద్రునకు స్వర్గ రాజ్యము నొసగెను. ఈ శశీదుడు నిశాచరుల పురములగూల్చుటచే పురంజయు డని ఇంద్రునిచే మోయబడుటచే ఇంద్రవాహనుడనియు వృషభ మూపురమున నుండుటచే కకుస్థుడని ప్రసిద్ధి చెందెను. 19

శ్లో॥ పురంజయస్య పుత్రోఽభూదనేనా స్తత్సుతః పృథుః ।
విశ్వగంధస్తతశ్చంద్రో యువనాశ్వస్తు తత్సుతః ॥ 20

టీ:- జిత్వేతి. ఇత్యేతైః కర్మభిః పురంజయాదినామభిః ఆహృతః వ్యాహృతః ఆహుత ఇతి పాఠాంతరే, ఆహుత ఇత్యర్థః. (19-20)

ఈ పురంజయునకు అనేనసుడు, అనేనసునకు పృథుడు, పృథునకు విశ్వగంధుడు, విశ్వగంధునకు చంద్రుడు, చంద్రునకు యువనాశ్వుడు అను పుత్రులు కలిగిరి. 20

శ్లో॥ శవస్తత్సుతో యేన శావస్తిర్నిర్మితా పురీ ।
బృహదశ్వస్తు శావ స్తిస్తతః కువలయాశ్వకః ॥ 21

టీ:- శవస్త ఇతి. శావస్తిః. శవస్తస్య పుత్రః కువలయాశ్వక ఏవ దుందుమార ఇతి ఖ్యాతః. 21

యువనాశ్వునకు శవస్తుడు అను పుత్రుడు, ఈ శవస్తుడు శావస్తియను పురమును నిర్మించెను. శవస్తి తనయుడు బృహదశ్వుడు బృహదశ్వుని పుత్రుడు కువలయాశ్వుడు. 21

శ్లో॥ యః ప్రియార్థముదంకస్య దుందునామసురం బలీ ।
సుతానామేకవింశత్యా సహస్రైరహనద్వృతః ॥ 22

కువలయాశ్వునకు ఇరువది ఒక వేలమంది పుత్రులు కలిగిరి. ఈ కువలయాశ్వుడు ఉందకుడను ముని యాజ్ఞతో తన పుత్రులతో కలిసి దుంధువను రాక్షసుని సంహరించెను. 22

శ్లో॥ దుందుమార ఇతిఖ్యాత స్తత్సుతాస్తే ప్రజజ్వలుః ।
దుందోర్ముఖాగ్ని నా సర్వే త్రయ ఏవావశేషితాః ॥ 23

దుంధు రాక్షసుని సంహరించుటచే దుంధుమారుడనే పేరుతో ప్రసిద్ధి చెందెను. దుంధు రాక్షసుని ముఖము నుండి వెలువడిన అగ్నితో కువలయాశ్వుని పుత్రులందరూ కాల్చబడి, ముగ్గురు మాత్రమే మిగిలిరి. 23

శ్లో॥ దృఢాశ్వః కపిలాశ్వశ్చ భద్రాశ్వ ఇతి భారత ।
దృఢాశ్వపుత్రో హర్యశ్వో నికుంభస్తస్యచాత్మజః ॥ 24

టీ:- తత్ర కారణమాహ- య ఇతి. సుతానమేక వింశత్యాసహస్రైర్వృతస్సన్ అహనత్ హతవాన్. (22-24)

దృఢాశ్వుడు, కపిలాశ్వుడు, భద్రాశ్వుడు అను మువ్వురుయే మిగిలిరి. దృఢాశ్వునకు హర్యశ్వుడు, అతనికి నికుంభుడు పుత్రులు, నికుంభునికి బర్హిణాశ్వుడు బర్హిణాశ్వునకు కృతాశ్వుడు కృతాశ్వునకు సేనజిత్తు, సేనజిత్తునకు యువనాశ్వుడు అను పుత్రులు కలిగిరి. 24

శ్లో॥ బర్హిణాశ్వోనికుంభస్య కృతాశ్వోఽథాస్యసేనజిత్ ।
యువనాశ్వో భవత్తస్య సోఽనపత్యో వనం గతః ॥ 25

టీ:- బర్హిణాశ్వ ఇతి. అథ తస్మాన్నికుంభాత్. కృతాశ్వ. 25

యువనాశ్వుడు సంతానహీనుడై తన వందమంది భార్యలతో నిర్విణ్ణుడై అరణ్యమునకు వెడలెను. అచట దయావంతులగు ఋషులు యువనాశ్వునకు సంతానము కలుగుటకై ఇంద్ర దైవత్యమను యజ్ఞము చేయించిరి. (25-26)

శ్లో॥ భార్యాశతేననిర్విణ్ణ ఋషయోఽస్య కృపాలవః ।
ఇష్టిం ప్రవర్తయాం చక్రురైంద్రీం స్మ సుసమాహితాః ॥ 26

టీ:- భార్యేతి. భార్యాణాం శతేన సహ స్వపుత్రార్థమింద్రదైవత్యామిష్టిం ప్రవర్తయామాసుః. స్మేత్యాశ్చర్యే. 26

శ్లో॥ రాజాతద్యజ్ఞసదనం ప్రవిష్టో నిశి తర్షితః ।
దృష్ట్వాశయనాంస్తాన్విప్రాన్ పపౌ మంత్రజలం స్వయమ్ ॥27

టీ:- తదేవాహ-షడ్భిః. రాజేతి. తర్షితస్సన్. జలార్థం ప్రవిష్టః మంత్రాభిమంత్రితం జలం పత్న్యై దేయం స్వయం పపౌ. 27

ఆ యజ్ఞమున బ్రాహ్మణులు యువనాశ్వునకు సంతానము కలుగునటుల జలమును మంత్రించి యజ్ఞసదమున ఒక పాత్రలో నుంచి రాత్రి నిద్రించిరి. ఆ రాత్రి యువనాశ్వుడు దప్పిక గొన్నవాడై యజ్ఞసదమున ప్రవేశించి అక్కడ నిద్రించిన బ్రాహ్మణులను చూచెను. భార్యలకు ఇవ్వవలసిన, మంత్రించబడిన జలమును తానే త్రాగెను. 27

శ్లో॥ ఉత్థితాస్తే నిశామ్యాథ వ్యుదకం కలశం ప్రభో ।
పప్రచ్ఛుః కస్య కర్మేదం పీతం పుంసవనం జలమ్ ॥ 28

మేల్కొనిన బ్రాహ్మణులు నిర్జలమగు పాత్రను గాంచి, పుత్రోత్పత్తి కారణమగు జలము నెవరు తాగినారని అడిగిరి. 28

టీ:- ఉత్థితా ఇతి. వ్యుదకం నిరుదకం కలశం. పుంసవనం పుత్రోత్పత్తికారణం. 28

శ్లో॥ రాజ్ఞా పీతం విదిత్వాథ ఈశ్వర ప్రహితేన తే ।
ఈశ్వరాయ నమశ్చక్రురహో దైవబలం బలమ్ ॥ 29

ఆ జలమును యువనాశ్వరాజు త్రాగినటుల తెలుసుకొని దానిని ఈశ్వరేచ్ఛగా తలంచి దైవబలము ముందు పురుష బలమెందు లకు కొరగాదని తలచి ఈశ్వరునకు నమస్కరించిరి. 29

శ్లో॥ తతః కాల ఉపావృత్తే కుక్షిం నిర్భిద్య దక్షిణం ।
యువనాశ్వస్య తనయశ్చక్రవర్తీ జజాన హ ॥ 30

కొంతకాలము గడచిన పిదప యువనాశ్వుని కుక్షిని (కడుపును) చీల్చికొని చక్రవర్తి లక్షణములుగల ఒక బాలుడు బయట పడెను. 30

టీ:- రాజ్ఞేతి. అహో దైవబలమేవ ముఖ్యం బలం పురుష బలం తు న కించిదితి వదంతః ఈశ్వరాయ నమస్కారం చక్రుః. (29-30)

శ్లో॥ కిం ధాస్యతి కుమారోఽయం స్తన్యేరోరూయతే భృశం ।
మాంధాతావత్సమారో దీరితీంద్రో దేశనీమదాత్ ॥ 31

తల్లిలేని ఆ బాలుడు ఏమి త్రావి జీవించగలడు, మిక్కిలి ఏడ్చు చున్నాడని విప్రులు చింతించుచుండగా ఆ యజ్ఞములో ఆరాధించబడిన ఇంద్రుడు ఈతడు(మాంధాత) మునుముందు తన సామ్రాజ్యలక్ష్మిని రక్షించగలడనుచు తన చూపుడువేలును ఆ బాలకుని నోటికందించెను. 31

టీ:- కిమితి. అయం కిం ధాస్యతి. పాస్యతి. ఇతి దుఃఖితైర్విప్రైరుక్తే సతి. తస్యామిష్ట్యామారాధిత ఇంద్రః మాధాతా పాతా అయం మాం రక్షిష్య

తీత్యర్థః. యద్వా. మాంలక్ష్మీం పాతా రక్షిష్యతి సర్వసామ్రాజ్య భాగ్యభ వితేత్యర్థః హేవత్స మారోదీరితి బ్రువన్ దేశినీం తర్జనీమదాదిత్యర్థః 31

శ్లో॥ న మమార పితా తస్య విప్రదేవ ప్రసాదతః ।
యువనాశ్వోఽపి తత్రైవ తపసా సిద్ధిమన్వగాత్ ॥ 32

టీ:- న మమారేతి. తస్య పితా యువనాశ్వో భిన్నకుక్షిరపి న మమార. కింతు. కాలాంతరే తపసా సిద్ధిమన్వగాత్. 32

యువనాశ్వుడు పొట్ట చీల్చబడిన వాడై కూడా, విప్రానుగ్రహముతో మరణించక, ఆ పిదప కొంతకాలము తపస్సు యొనరించి సిద్ధినొందెను. 32

శ్లో॥ త్రసదస్యురితీంద్రోఽంగ విదధేనామ చాస్యవై ।
యస్మాత్త్రసంతి హ్యుద్విగ్నా దస్యవో రావణాదయః ॥ 33

టీ:- మాంధాతుర్మహిమానమాహ-షడ్భిః త్రసదస్యురితి. అంగహే రాజన్ యస్మాత్ మాంధాతుర్దస్యవః. ఉద్విగ్నాః కంపితాస్సంతః త్రసంతి అతః ఇంద్రోఽస్య త్రసదస్యురితి నామ విదధే. స మాంధాతా అవనిమేకః శశాసేత్యుత్తరేణాన్వయః. 33

రావణాది రాక్షసులు ఈ బాలుని వలన భయము నొందగలరని ఇంద్రుడు ఇతనికి త్రసదస్యుడను నామకరణము చేసెను. 33

శ్లో॥ యౌవనాశ్వోఽథ మాంధాతా చక్రవర్త్యవనిం ప్రభుః ।
సప్తద్వీపవతీ మేకః శశాసాచ్యుత తేజసా ॥ 34

టీ:- యౌవనాశ్వ ఇతి. అచ్యుతస్య తేజసా అప్రచ్యుత తేజసేతి వా. 34

యువనాశ్వుని పుత్రుడగు ఈ మాంధాతృ చక్రవర్తి అచ్యుతునితో సమానమైన తేజస్సుతో, సప్తద్వీపాత్మకమగు భూమండలమునంతటనీ ఒక్కడే పరిపాలించెను. 34



శ్లో॥ ఈజే చ యజ్ఞం క్రతుభిరాత్మవిద్భూరిదక్షిణైః ।
సర్వవేదమయం దేవం సర్వాత్మకమతీంద్రియమ్ ॥ 35

శ్లో॥ ద్రవ్యం మంత్రౌషధిర్యజ్ఞో యజమానస్త్వథర్త్విజః ।
ధర్మోదేశశ్చ కాలశ్చ సర్వమేతద్యదాత్మకమ్ ॥ 36

టీ:- ఈజ ఇతి. ఆత్మవిదపి సః యజ్ఞం విష్ణుం ఈజే తమేవ విశినష్టి- సర్వదేవమయమితి సార్ధేన. (35-36)

శ్లో॥ యావత్సూర్య ఉదేతి స్మ యావచ్చ ప్రతితిష్ఠతి ।
సర్వంతద్యౌవనాశ్వస్య మాంధాతుః క్షేత్రముచ్యతే ॥ 37

టీ:- యావదితి. ప్రతితిష్ఠతి అస్తం గచ్ఛతి. 37

శ్లో॥ శతబిందోర్దుహితరి బిందుమత్యా మజీజనత్ ।
పురుకుత్సాంబరీషౌ చ ముకుందం చ యోగినమ్ ।
తేషాం స్వసారః పంచాశత్సౌభరిం వవ్రిరే పతిమ్ ॥ 38

టీ:- శతబిందోరితి. ప్రసంగాత్సౌభరేశ్చరితమాహ-తేషామిత్యాది యావదధ్యాయపరిసమాప్తి. తేషాం స్వసారః మాంధాతుః కన్యాః. 38

సర్వవేదమయుడు, అతీంద్రియుడు, సర్వాత్ముకుడగు విష్ణువును గురించి, మంచి దక్షిణలతో యజ్ఞముల నాచరించెను. 35

యజ్ఞద్రవ్యము, మంత్రము,ఓషధులు, యజ్ఞము, యజమానులు, ఋత్విజులు, ధర్మము, దేశకాలాదులన్నియు విష్ణ్వాత్మకములయ్యెను. 36

సూర్యుడుదయించు పూర్వదిక్కు నుండి అస్తమించు పశ్చిమ దిక్కు వరకు గల సమస్త భూమిని మాంధాత పరిపాలించెను. 37

ఆ మాంధాత శతబిందు పుత్రికయగు బిందుమతియందు పురుకుత్సుడు, అంబరీషుడు, ముకుందుడు అను పుత్రులను కనెను. వీరికి యాభైమంది చెల్లెండ్లుండిరి. వారు సౌభరియను మునిని పతిగా వరించిరి. 38

శ్లో॥ యమునాంతర్జలే మగ్నస్తప్యమానః పరంతపః ।
నిర్వృతిం మీనరాజస్య వీక్ష్య మైథున ధర్మిణః ॥ 39

టీ:- ననుమహాతాపసస్య. కుతో వివాహప్రసంగః. కథం వా జరాజర్ఝరితం. రాజకన్యా వవ్రిరే. తత్రాహ – యమునేత్యాది షడ్భిః 39

మహాపతస్వియైన సౌభరికి వివాహమెట్లు జరిగెను– ముసలితనముతో శిథిలమైన శరీరముగల ఆతనిని రాజకన్యలెట్లు వరించిరి అనగా చెప్పుచున్నాడు. సౌభరి ఒక రోజున యమునా నదిలో మునిగి తపమాచరించుచుండ ఒక మీనరాజు తన భార్యతో రమించుటను గాంచెను. 39

శ్లో॥ జాతస్పృహో నృపం విప్రః కన్యామేకామయాచత ।
సోఽప్యాహ గృహ్యతాం బ్రహ్మన్ కామం కన్యా స్స్వయంవరే॥40

టీ:- జాతేతి. నృపం మాంధాతారం. సోఽపి మాంధాతా. స్వయం వరే కామం గృహ్యతామిత్యాహ – స ఇతి. 40

అదిచూచి సంసారముపై మోహమందిన సౌభరి మాంధాతను చేరి తనకొక కన్యనిమ్మని కోరెను. మాంధాత సౌభరితో కన్యను స్వయంవరమున పరిగ్రహించుమనెను. 40

శ్లో॥ స విచింత్యాప్రియం స్త్రీణాం జరఠోఽయమసమంతః ।
వళీపలిత ఏజత్క ఇత్యాహం ప్రత్యుదాహృతః ॥ 41

టీ:- స ఇతి. స విప్రః. స్త్రీణామప్రియం మాం విచింత్య. అనేనాహం ప్రత్యుక్తః ఆత్మానం తథా సాధయిష్యామీతి వ్యవసితః నిశ్చితవానిత్యుత్తరేణాన్వయః. అప్రియత్వే హేతుః జరఠో వృద్ధః. వళీభిరిత్యుక్తః. పలితశ్చ ఏజత్కః కంపమాన శిరాః. తాపసత్వాదినా వా. అసమ్మతోఽహమితి కృత్వా. 41

మాంధాత మాటలు వినిన సౌభరి నేను వృద్ధుడను. ముడుతలు పడిన దేహము కలవాడను. తెల్లని (నెరిసిన) వెంట్రుకలు కలవాడను. శిరఃకంపము కలవాడను అని తలచెను. (తరువాతి శ్లోకముతో అన్వయము) 41

మాంధాత ఉవాచ

శ్లో॥ సాధయిష్యేతథాత్మానాం సురస్త్రీణామభీప్సితం ।
కిం పునర్మనుజేంద్రాణామితివ్యవసితః ప్రభుః ॥ 42

టీ:- సాధయిష్య ఇతి, తథేత్యస్య ప్రపంచః. సురస్త్రీణామపీప్సితం. శం పునర్మనుజేంద్రాణాం. యాః స్త్రియః తాసామితి. 42

మాంధాత ఈ విధముగా పలికెను.

మానవ స్త్రీలే కాదు, దేవతా స్త్రీలుకూడా కోరెడి శరీరమును సాధిస్తానని తలచి, తపోబలముతో తన ముసలితనమును వదిలి యౌవనవంతుడగు సుందరాంగుడయ్యెను. 42

శ్లో॥ మునిః ప్రవేశితః క్షత్త్రా కన్యాంతఃపుర మృద్ధిమత్ ।
వృతస్స రాజ కన్యాభిరేకః పంచాశతారవః ॥ 43

మాంధాత ప్రతీహారితో సౌభరిని అంతఃపురమునుకంపగా ఆ యేబదిమంది కన్యలు నేనే అతనికి తగిన దాననంటే నేనే అతనికి తగిన దానిననుచు అతనిని వరించిరి. మాంధాత వారినందరిని సౌభరికిచ్చి వివాహము చేసెను. 43

శ్లో॥ తాసాం కలిరభూద్భూయాం స్తదర్థేఽపోహ్యసౌహృదం ।
మమానురూపో నాయం వ ఇతి తద్గతచేతసామ్ ॥ 44

టీ:- తతః కిం వృత్తం తదాహ - ద్వాభ్యాం, మునిరితి. క్షత్త్రాప్రతి హారేణ పంచాశతాఽపి రాజకన్యాభిః. స ఏక ఏవ - వరో వృతః. 43-44

ఆ సౌభరియందు మనస్సుగల ఆ యేబదిమంది మాంధాత పుత్రికలు సౌభరియందలి అనురాగముతో, పరస్పరము వాత్సల్యమును వదిలి ఈతడు నీకు తగిన వాడు కాదు, నాకే తగిన వాడని కలహించు కొనుచుండిరి. 44

శ్లో॥ స బహ్వృచస్తాభిరవారణీయ తపఃశ్రియానర్ఘపరిచ్ఛదేషు ।
గృహేషు నానోపవనామలాంభస్సరస్సు సౌగంధికాననేషు ॥45

టీ:- తస్య గార్హస్థ్యం వర్ణయతి చతుర్భిః - స ఇతి. బహ్వృచ ఇతి. మంత్రసామర్థ్యముక్తం. తాభిః సహ. రేమ ఇత్యుత్తరేణాన్వయః. క్వ రేమే. అవారణీయం దురంతం. యత్తపః. తస్య శ్రియా సమృద్ధ్యా అనర్ఘాః పరిచ్ఛదా యేషు గృహేషు తథా నానావిధేషు ఉపవనేషు చ. అమలాన్యంభాంసి యేషాం తేషు సరస్సు చ కథంభూతేషు సౌగంధికానాం కల్హారాణాం కాననాని స్తోమో యేషు. 45

శ్లో॥ మహార్హశయ్యాసన వస్త్ర భూషణ
స్నానాను లేపాభ్యవహారమాల్యకైః ।
స్వలంకృత స్త్రీ పురుషేషు నిత్యదా
రేమేఽనుగాయద్ద్విజ భృంగ వందిషు ॥ 46

టీ:- మహార్హేతి. గృహాదిషు స్వలంకృతాః స్త్రియః పురుషాశ్చ యేషు అనుగాయంతో ద్విజాశ్చ పక్షిణః భృంగాశ్చ వందినశ్చ యేషు కథంభూతః మహార్హశయాదిభిరుపలక్షితస్సన్. 46

ఆ సౌభరి తన భార్యలతో అరణ్యమునకు వెడలి తన తపోబలముతో అనర్ఘములగు (వెలకట్టలేనటువంటి) గృహములను అనేక రకములగు ఉద్యాన వనములను, నిర్మలమగు జలములు గల సరస్సులను నిర్మించి, వానిలో చక్కని శయ్య, ఆసన, వస్త్ర, అలంకార, స్నాన, అనులేపన, పుష్పాదులతోను వారిని అలంకరింపబడిన వారిగా నొనరించి పక్షి, భృంగ, గాయకులతో స్తుతించబడుచు వారితో సుఖించుచుండెను. (45-46)

శ్లో॥ యద్గార్హస్థ్యం సుసంవీక్ష్య సప్తద్వీపావనీపతిః ।
విస్మితస్స్తంభమజహాత్సార్వభౌమశ్రియాన్వితః ॥ 47

టీ:- యదితి. స్తంభం గర్వం. 47

కొంతకాలమునకు సప్తద్వీప పృథివి కధిపతి యగు మాంధాతృ చక్రవర్తి అచటకు వెళ్ళి తన పుత్రికల వైభవమును గాంచి ఆశ్చర్యమంది తన గర్వమును వదిలెను. 47

శ్లో॥ ఏవం గృహేష్వభిరతో విషయాన్ వివిధైస్సుఖైః ।
సేవమానో న చాతుష్యదాజ్యస్తోకైరివానలః ॥ 48

టీ:- ఏవమితి. ఆజ్యస్తోకైః ఘృతబిందుభిః. 48

ఈ విధముగా సౌభరి, ఘృత బందువులతో తృప్తి చెందని అగ్నివలె ఆ గృహములలో వారితో అనేక రకములగు సుఖములనను భవించుచూ కూడా సంతృప్తినొందకుండెను. 48

శ్లో॥ స కదాచిదుపాసీన ఆత్మాపహ్నవమాత్మనః ।
దదర్శ బహ్వృచాచార్యో మీనసంగసముత్థితమ్ ॥ 49

టీ:- ఇదానీం తస్యానుతాపపూర్వకం వానప్రస్థాశ్రమమమాహ - సప్తభిః. స కదాచితి. ఆత్మనో మనసోహేతోః ఆత్మనః అపహ్నవం తపోహానిం దదర్శ. 49

ఒకప్పుడు సకల మంత్రవేత్తయగు ఆ సౌభరి, మీనరాజు సాంగత్యముతో కల్గిన తన తపోహానిని తలంచి, ఇటుల తలంచెను. 49

శ్లో॥ అహో ఇమం పశ్యత మే వినాశం
తపస్వినస్సచ్చరితవ్రతస్య ।
అంతర్జలే వారిచర ప్రసంగా
త్సంస్రావితం బ్రహ్మచిరం భృతం యత్ ॥ 50

యమునా జలములో మీన మిథున సాంగత్యముతో చాలా కాలము నుండి సంపాదించిన నా తపము, శీలము, నశించినవి. అయ్యో కాంచండి. 50

టీ:- అహో ఇతి. సంశ్చాసౌ చరితవ్రతశ్చ. యోఽహం. తస్య బ్రహ్మ తపః. 50

శ్లో॥ సంగం త్యజేత మిథున వ్రతినాం ముముక్షు
స్సర్వాత్మనా న విసృజేద్బహిరింద్రియాణి ।
ఏకశ్చరన్ రహసి చిత్తమనంత ఈశే
యుంజీత తద్వృతిషు సాధుషు చేత్ప్రసంగః ॥ 51

టీ:- సంగమితి. మిథునవ్రతినాం దాంపత్య ధర్మవతాం చేత్ ప్రసంగః తర్హి తద్వృతిషు ఈశ్వరార్థ ధర్మపరేష్వేవ. కార్య ఇతి శేషః. 51

శ్లో॥ ఏకస్తపస్వ్యహమథాంభసి మత్స్యసంగాత్పంచా
శతాసముత పంచసహస్ర సర్గః ।
నాంతం వ్రజామ్యుభయకృత్య మనోరథానాం
మాయాగుణైర్హృతమతిర్విషయేఽర్థభావః ॥ 52

టీ:- సంగాజ్జాతం దోషం ప్రపంచయతి - ఏకఇతి. పంచాశతా భార్యాభిః సంబంధాత్.ఆసం అభూవమిత్యర్థః. తతశ్చ సుతైః. పంచసహస్రవర్గ ఆసం. ప్రత్యేకం తాసు పుత్రశతరూపేణోత్పత్తైః.

అందువలన ముముక్షువగు వాడు దాంపత్య ధర్మము నాచరించెడి వారి సాంగత్యమును వదలవలెను. ఏకాంతముగ రహస్య ప్రదేశమున మనస్సును భగవంతునిపై ఉంచవలెను. సాధు పురుషుల సాంగత్యమొనర్చవలెను. 51

సాంగత్యమువలన పుట్టెడి దోషమును చెప్పుచున్నాడు. నేనొక్కణ్ణి యమునా నీటిలో మత్స్య సంగ దోషముతో, ఐదువందల మంది భార్యలతో, ఐదువేల మంది పుత్రులతో సంసారసాగరమున మునిగితిని. మాయా గుణములతో మతిచెడినవారు ఈ విధముగా పతితులగుదురు. ఐహిక, పారమార్థిక కర్మలనొనరించువారు, అట్టి విషయాలను కోరువారు ఇట్టి చరిత్రను విచారించినచో బుద్ధిమంతులగుదురు. 52

ఉభయకృత్యాని ఐహిక పారత్రి కకర్మాణి. తద్విషయాణాం మనోరథానాం అర్థభావః పురుషార్థ బుద్ధిమాన్. 52

శ్లో॥ ఏవంవసన్ గృహేకాలం విరక్తోన్యాసమాస్థితః ।
వనం జగామానుయయుస్తత్పత్న్యః పతిదేవతాః ॥ 53

టీ:- ఏవమితి. న్యాసోఽత్ర సంగత్యాగ ఏవ.వానప్రస్థధర్మ ఇత్యర్థః. (53-54)

శ్లో॥ తత్ర తప్త్వా తపస్తీక్ష్ణమాత్మకర్శనమాత్మవిత్ ।
సహైవాగ్నిభిరాత్మానం యుయోజ పరమాత్మని ॥ 54

శ్లో॥ తాస్స్వపత్యుర్మహారాజ నిరీక్ష్యాధ్యాత్మికీం గతిమ్ ।
అన్వీయుస్తత్ప్రభావేన శాంతమగ్నిమివార్చిషః ॥ 55

టీ:- తా ఇతి. ఆధ్యాత్మికీం గతిం బ్రహ్మణి లయః. 55

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
షష్ఠోఽధ్యాయః

అని తలంచుచు విరక్తి కలిగి సంగత్యాగముచేసి తపస్సుకై అరణ్యమునకు వెడలెను. పతినే దైవముగా భావించెడి ఆ సౌభరి భార్యలు అతనిననుసరించి సమస్త భోగములను వదిలి అరణ్యమునకు వెడలిరి. 53

ఆ సౌభరి అరణ్యమున శరీరము కృశించినటుల గొప్ప తపమొనరించి తన ఆత్మను పరమాత్మలో లీనము గావించెను. 54

అతని భార్యలు తమ భర్త యొక్క ఆధ్యాత్మిక గతిని చూచి అగ్ని ననుసరించు అగ్ని శిఖలవలె అతని ననుసరించి శరీరములను వదిలి ఉత్తమ గతినొందిరి. 55

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
ఆరవ అధ్యాయము సమాప్తము.

నవ్తవెూ౾ధ్యాయః

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ మాంధాతృ పుత్ర ప్రవరో యో౾oబరీషః ప్రకీర్తితః ।
పితామహేన ప్రవృతో యౌవనాశ్వస్తుతత్సుతః ॥ 1

టీ:- శ్లో. "మాంధాతురన్వయః సప్తమే యత్రగీయతే, పురుకుత్సస్య చాఖ్యానం హరిశ్చంద్రస్య చోత్తమమ్." మాంధాతృ పుత్రేతి. పుత్ర ప్రవరః పుత్రశ్రేష్ఠః. స పితామహే స యువనాశ్వేన ప్రవృతః పుత్రత్వేన స్వీకృతః . అతస్తస్యైవ మాంధాతృ ప్రవరత్వం. న పురుకుత్స ముచుకుందయోః తత్సుతః అంబరీషస్య సుతః. 1

శ్లో॥ హారితస్తస్య పుత్రో౾భూన్మాంధాతృ ప్రవరా ఇమే ।
నర్మదా భ్రాతృభిర్దత్తా పురకుత్సా యయౌరగైః ॥ 2

టీ:- హారిత ఇతి. ఇమే యువనాశ్వాబరీష హారితాః మాంధాతృ గ్రోతస్య ప్రవరాః. అవాంతరవిశేషస్య ప్రవర్తకాః. యద్వా ప్రవృత ఇతి యౌవనాశ్వవిశేషణం పితామహేన మాంధాత్ర సహ. ఆర్షేయప్రవరేణ ప్రవృతాః మాంధాతా ప్రవరో యేషాం తే ఇమే అంబరీష యౌవనాశ్వ హారితాః. యథాహాశ్వలాయనః. హారిత పురుకుత్స పింగశంఖ దర్భ హేమవతానా మాంగిరసాంబరీషయౌవనాశ్వేతి మాంధాతారముహైకే

7 వ అధ్యాయము

ఈ ఏడవ అధ్యాయమున మాంధాతృ వంశము పురుకుత్సుని చరిత్ర, హరిశ్చంద్రుని చరిత్ర వర్ణించబడినది.

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

మాంధాత పెద్దకుమారుడగు అంబరీషుని, తాతయగు యువనాశ్వుడు పుత్రునిగా స్వీకరించెను. ఆ అంబరీషునకు యౌవనాశ్వుడు పుత్రుడు. 1

యౌవనాశ్వునకు హారీతుడు అను పుత్రుడు కలిగెను. ఈ అంబరీష యౌవనాశ్వ హారీతులు మాంధాతృ గోత్ర ప్రవర్తకులైరి. మాంధాత రెండవ కుమారుడగు పురుకుత్సునకు నాగ కుమారులు, తమ చెల్లెలగు నర్మదనిచ్చి వివాహమొనరించిరి. 2

బ్రువతే ఆంగీరసమాంధాత్రాంబరీష యౌవనాశ్వేతి పురుకుత్సస్య వంశం కథయిష్యన్నాదౌ తావత్తస్య వివాహం ప్రభావం చాహ- నర్మదేతి. ఉరగైర్భ్రాతృభిర్యా దత్తా నర్మదా. 2

శ్లో॥ తయా రసాతలం నీతో భుజగేంద్ర ప్రయుక్తయా ।
గంధర్వాన్ సోఽవధీత్తత్ర వధ్యాంస్తాన్విష్ణు శక్తి ధృత్ ॥ 3

సర్పాధిపతిచే పంపబడిన ఆ నర్మద పురుకుత్సుని రసాతలమునకు గొనిపోగా పురుకుత్సుడు విష్ణుశక్తి సంపన్నుడై అక్కడ, వధార్హులగు గంధర్వుల సంహరించెను. 3

టీ:- తయేతి. వధ్యాన్ వధార్హాన్. 3

శ్లో॥ నాగాల్లబ్ధవరస్సర్పాదభయం స్మరతామిదమ్ ।
త్రసదస్యుః పౌరకుత్సో యోఽనరణ్యస్య దేహకృత్ ॥ 4

ఈ వృత్తాంతమును స్మరించువారికి నాగభయము లేకుండునట్లుగా వరమునొందెను. ఆ పురుకుత్సునకు త్రసదస్యుడు అతనికి అనరణ్యుడు పుత్రుడు. 4

టీ:- నాగాదితి. స చ పురుకుత్సః. నాగాల్లబ్ధవరోఽభూత్. వరమాహ - ఇదం నర్మదయా రసాతలనయనాదికం స్మరతాం పుంసాం సర్పాదభయమితి దేహకృత్పితా. త్రసదస్యోస్సుతః అనరణ్య ఇత్యర్థః. 4

శ్లో॥ హర్యశ్వస్తత్సుత స్తస్మాదరుణోఽథ త్రిబంధనః ।
తస్య సత్యవ్రతః పుత్రస్త్రిశంకురితి విశ్రుతః ॥ 5

అనరణ్యునకు హర్యశ్వుడు, హర్యశ్వునకు అరణుడు, అతనికి త్రిబంధనుడు, త్రిబంధనునకు సత్యవ్రతుడను వారు జనించిరి. ఈ సత్యవ్రతుడే త్రిశంకువని ప్రసిద్ధి నొందెను. మూడు రకాల దోషాలతో

టీ:- హర్యశ్వ ఇతి. త్రయః శంకవ ఇవ దుఃఖ హేతవో దోషా యస్యా సౌ త్రిశంకుః తదుక్తం హరివంశే. శ్లో॥ పితుశ్చాపరితోషేణ గురోర్దోగ్ధ్రీ వధేన చ, అప్రోక్షితో పయోగాశ్చ త్రివిధస్తే వ్యతిక్రమ" ఇతి. 5

దుర్గతి నొందినవాడు త్రిశంకుడు. ఈ దోషాలు హరివంశములో ఇట్లు చెప్పబడినవి. 1. తండ్రిని సంతోషపెట్టకుండుట. 2. గురువు యొక్క పాలిచ్చెడి ఆవును సంహరించుట. 3. వేదక్తముగా, యజ్ఞకర్మ లందు పశువును వధించకుండుట. 5

శ్లో॥ ప్రాప్తశ్చండాలతాం శాపాద్గురోః కౌశిక తేజసా ।
స శరీరో గతస్స్వర్గమద్యాపి దివి దృశ్యతే ॥ 6

టీ:- ప్రాప్త ఇతి. పరిణీయమాన విప్రకన్యాపహరణాత్ క్రుద్ధస్య గురోః పితుః శాపాత్. కౌశికస్య తేజసా ప్రభావేన. 6

శ్లో॥ పాతితోఽ వాక్ఛిరా దేవైస్తేనైవ స్తంభితో బలాత్ ।
త్రైశంకవో హరిశ్చంద్రో విశ్వామిత్రవసిష్ఠయోః
యన్నిమిత్తమభూద్యుద్ధం పక్షిణోర్బహువార్షికమ్ ॥ 7

టీ:- పాతిత ఇతి. తేనైవ కౌశికేన, పక్షిణోః గృధ్రబకయోః విశ్వామిత్రో రాజసూయదక్షిణాచ్ఛలేన. హరిశ్చంద్రం సర్వస్వమపహృత్య యాతయామాస. తచ్ఛ్రుత్వా కుపితో వసిష్ఠోఽపి విశ్వామిత్రం త్వంభాసో భవేతి శశాప. స చ త్వం బకో భవేతి వసిష్ఠం శశాప. తయోశ్చ

ఈతడు గురువగు వసిష్ఠుని శాపముతో చండాలత్వము పొంది విశ్వామిత్రుని ప్రభావముతో సశరీరముగా స్వర్గమునొంది దేవతలచే తలక్రిందులుగా తోసివేయబడి విశ్వామిత్రునిచే మధ్యనే ఆపబడి స్వర్గభూలోకములకు మధ్యలో నుండి ఇప్పటికిని అచట కన్పించుచుండును. త్రిశంకు పుత్రుడు హరిశ్చంద్రమహారాజు. హరిశ్చంద్రుని రాజసూయయాగములో విశ్వామిత్రుడు దక్షిణమిషతో రాజును వంచించి, సర్వనాశనమొనర్చి కష్టపెట్టడం విని, కోపించిన వసిష్ఠుడు విశ్వామిత్రుని గ్రద్ధగా అగుదువుగాక అని శపించెను. విశ్వామిత్రుడు వసిష్ఠుని కొంగగా కమ్మని శపించెను. ఇలా శపించుకొని వారిద్దరు పెక్కు వర్షములు యుద్ధము చేసిరి. ఈ విషయము శ్రుతి ప్రసిద్ధము. (6-7)

యుద్ధమభూదితి ప్రసిద్ధం. శ్రు. "హరిశ్చంద్రో హ వై స ఇక్ష్వాకోరాజా పుత్ర ఆసే" త్యాది శ్రుతి ప్రసిద్ధం. 7

శ్లో॥ సోఽనపత్యో విషణ్ణాత్మా నారదస్యోప దేశతః ।
వరుణం శరణం యాతః పుత్రో మే జాయతాం ప్రభో ॥ 8

టీ:- హరిశ్చంద్రస్య చరితమాహ -యావదధ్యాయపరిసమాప్తి. స ఇతి. కథం శరణం యాతస్తదాహ -పుత్రో మే జాయతామితి. 8

హరిశ్చంద్రుని చరిత్రను చెప్పుచున్నాడు. అధ్యాయ సమాప్తి వరకు. ఈ హరిశ్చంద్రుడు సంతానము లేనివాడై విచారమునొందగా నారదుడు వరుణుని సేవించుమని ఉపదేశించెను. హరిశ్చంద్రుడు వరుణున్ని తనకు పుత్రుడు కలిగినచో ఆ పుత్రుని యాగపశువుగా చేసి యజ్ఞము కావించెదనని శరణు కోరెను. వరుణుని అనుగ్రహముతో హరిశ్చంద్రునకు రోహితుడను పుత్రుడు జన్మించెను. (8-9)

శ్లో॥ యది వీరో మహారాజ తేనైవ త్వాం యజే ఇతి ।
తథేతి వరుణేనాస్య పుత్రో జాతస్తు రోహితః ॥ 9

టీ:- యదితి. యది వీరః పుత్రో మే జాయేత. తర్హి తేనైవ పురుష పశూనా. త్వాం యజ్ఞేయజాని ఇతి భాషయా తథేత్యుక్తవతా వరుణేన నిమిత్తేనాస్య రోహితో నామ పుత్రో జాతః. 9

శ్లో॥ జాతస్సుతస్త్వనేనాంగ మాం యజస్వేతి సోఽబ్రవీత్ ।
యదా పశుర్నిర్దశస్స్యాదథ మేధ్యో భవేదితి ॥ 10

పుత్రుడు జన్మించిన వెంటనే వరుణుడు వచ్చి ఓ రాజా! నీకు పుత్రుడు కలిగాడు. నీ మాట ప్రకారము యజ్ఞమొనరించుమనెను. హరిశ్చంద్రుడు ఈ శిశువునకు పది దినములు వెడలిన పిదప యజ్ఞమాచరించెదననెను. 10

శ్లో॥ నిర్దశే చ సమాగత్య యజస్వేత్యాహ సోఽబ్రవీత్ ।
దంతాః పశోః ప్రజాయేరన్నథ మేధ్యో భవేదితి ॥ 11

పది దినములున గడచిన పిదప వరణుడు వచ్చి యజ్ఞ మొనరించమనెను. అప్పుడు హరిశ్చంద్రుడు బాలునకు దంతములు వచ్చిన పిదప యజ్ఞమాచరించగలననెను. 11

శ్లో॥ జాతా దంతా యజస్వేతి సప్రత్యాహాథ సోఽబ్రవీత్ ।
యదాపతంత్యస్య దంతా హ్యథ మేధ్యో భవేదితి ॥ 12

వరుణుడు బాలునకు దంతములు వచ్చిన పిదప తిరిగి వచ్చి యజ్ఞమును కావింపుమనగా ఈ బాలుని పాలపండ్లు రాలిపోయిన తర్వాత నాచరించెదననెను. 12

శ్లో॥ పశోర్మే పతితా దంతా యజస్వేత్యాహ సోఽబ్రవీత్ ।
యదా పశోః పునర్దంతా జాయంతేఽథ పశుశ్శుచిః ॥ 13

పాలపండ్లు పోయిన తర్వాత వరణుడొచ్చి అడుగగా మళ్ళీ దంతములు వచ్చిన పిదప యాగమాచరించెదననెను. 13

టీ:- జాత ఇతి. సవరుణః జాతస్సుతః మామనేన యజేత్యబ్రవీత్ యదాపశుర్నిర్దశః నిర్గతదశదినస్స్యాదితి స రాజాబ్రవీదిత్యనుషంగః. (10-13)

శ్లో॥ పునర్జాతా యజస్వేతి సప్రత్యాహాథ సోఽబ్రవీత్ ।
సాన్నాహికో యదా రాజన్ రాజన్యోఽథ శుచిః పశుః ॥ 14

టీ:- పునరతి. రాజన్ హే వరుణ. రాజన్యః పశుః యదా సాన్నాహికః కవచ బంధనార్హః సంగ్రామ సమర్థః అథ తదా శుచిః. 14

పునర్దంతములు కల్గిన పిదప వరణుడు రాగా హరిశ్చంద్రుడు ఈ బాలుడు క్షత్రియ కుమారుడు కావున ఎప్పుడైతే కవచ బంధనాదులతో యుద్ధార్హత చెందునో అప్పుడు శుచియైన పశువువలె, హవిస్సుకు యోగ్యమవుతాడు కావున అప్పుడు యజ్ఞము కావించెదననెను. 14

శ్లో॥ ఇతి పుత్రానురాగేణ స్నేహయంత్రిత చేతసా ।
కాలం వంచయతా తం తముక్తో దేవ స్తమైక్షత ॥ 15

టీ:- ఇతీతి. ఇత్యేవం తం తం కాలం వంచయతా రాజ్ఞా ఉక్తం ప్రార్థితో దేవో వరుణః తం తం కాలం ప్రత్యైక్షతేత్యర్థః. 15

హరిశ్చంద్రుడు ఈ విధముగా తన పుత్రునిపై అనురాగముతో ఆయా కాలములను, హద్దులుగా పెడుతు కాలము గడుపుచుండగా వరణుడు ఆయా సమయములను ప్రతీక్షిస్తూ వచ్చెను. 15

శ్లో॥ రోహితస్తదభిజ్ఞాయ పితుః కర్మ చికీర్షితమ్ ।
ప్రాణప్రేప్సుర్ధనుష్పాణిరరణ్యం ప్రత్యపద్యత ॥ 16

టీ:- రోహిత ఇతి. చికీర్షితం ఆత్మనా పశునా వరుణయజనం. 16

రోహితుడు తండ్రి చేయదలచిన కార్యమును (తనను పశువునుగా చేసి, చేసెడు యజ్ఞమును) తెలిసికొనెను. ప్రాణరక్షణ కోరికతో ధనుర్బాణములను ధరించి అరణ్యమునకు వెడలెను. 16

శ్లో॥ పితరం వరుణగ్రస్తం శ్రుత్వా జాతమహోదరం ।
రోహితో గ్రామమీయాయ తమింద్రః ప్రత్యషేధత ॥ 17

టీ:- పితరమితి. తతశ్చ కుపితేన వరుణేన గ్రస్తం అత ఏవ. జాతం మహోదరాఖ్యరుగ్యస్య తం, పితరం శ్రుత్వా. 17

అంత వరణుడు కుపితుడై హరిశ్చంద్రుని జలోదర వ్యాధిగ్రస్తునిగా చేసెను. తన తండ్రి జలోదరుడగుట నెరింగిన రోహితుడు తన పురమునకు వచ్చుచుండగ ముదుసలి బ్రాహ్మణ రూపంలో ఇంద్రుడు రోహితుని అడ్డగించెను. 17

శ్లో॥ భూమేః పర్యటనం పుణ్యం తీర్థక్షేత్ర నిషేవణైః ।
రోహితాయాదిశచ్ఛక్రస్సోఽప్యరణ్యేఽవసత్సమాం ॥ 18

టీ:- భూమేరితి. సమాం వర్షం. 18

ఇంద్రుడు రోహితుని పుణ్యభూములకు వెడలుము, పుణ్యతీర్థ స్నానమాచరించుమని ఆదేశించెను. రోహితుడు ఒక సంవత్సరము అటులనే అరణ్యమున నివసించెను. 18

శ్లో॥ ఏవం ద్వితీయేతార్తీయే చతుర్థే పంచమే తథా ।
అభ్యేత్యాభ్యేత్యస్థవిరో విప్రో భూత్వాథ వృత్రహా 19

సంవత్సరము పిదప తన పురమునకు తిరిగి వెళ్ళబోగ ఆ ముదుసలి బ్రాహ్మణ రూపమున ఇంద్రుడు ప్రతిషేధించెను. ఈ విధముగా రెండవ, మూడవ, నాల్గవ, ఐదవ సంవత్సరములలోను ఇంద్రుడు ప్రతిఘటించుచుండెను. 19

శ్లో॥ షష్ఠం సంవత్సరం తత్ర చరిత్వా రోహితః పురీం ।
ఉప వ్రజన్నజీగర్తాదక్రీణాన్మధ్యమం సుతం ॥ 20

ఆరవ సంవత్సరము గడచిన పిదప రోహితుడు తన పురమునకు వెళుతూ అజగర్తుని ముగ్గురి పుత్రులలో మధ్యవాడగు శునశ్శేషుని యాగపశువగుటకై కొనెను. 20

శ్లో॥ శునశ్శేఫం పశుం పిత్రే ప్రదాయ సమవందత ।
తతః పురుషమేధేన హరిశ్చంద్రో మహాయశాః ॥ 21

టీ:- ఏవమితి. ద్వితీయే తృతీయాదౌ చ. వర్షేవృత్రహా అభ్యేత్యాభ్యేత్య. తథైవ. తం ప్రత్యషేధత కించిత్కించిదుక్త్వా ప్రత్యషేధతేత్యర్థః. (19-21)

శ్లో॥ ముక్తోదరో౽యజ ద్దేవాన్వరుణాదీన్మహత్కథః ॥ 22

టీ:- ముక్తేతి. వరుణేన ముక్తం ఉదరం పూర్వోక్తమహోదరవ్యాధిః యస్య మహత్సు కథా యస్య సః. 22

తండ్రియగు హరిశ్చంద్రుని చేరి శునశ్శేషుని అతనికప్పగించెను హరిశ్చంద్రుడు జలోదర విముక్తుడై ఆ శునశ్శేషుని యాగపశువుగా చేసి పురుషమేధముతో వరుణాది దేవతలను గూర్చి యాగమాచరించెను. (21-22)

శ్లో॥ విశ్వామిత్రోఽభవత్తస్మిన్ హోతాధ్వర్యురథాత్మవాన్ ।
జమదగ్నిర్వసిష్ఠోఽభూద్బ్రహ్మాయాస్యస్తు సామగః ॥ 23

టీ:- విశ్వామిత్ర ఇతి. ఆత్మవాన్ జమదగ్ని రధ్వర్యురభూత్ ఆయాస్యో మునిః సామగః ఉద్గతా అభూదిత్యర్థః. 23

ఆ యజ్ఞమున విశ్వామిత్రుడు హోత, ఆత్మవంతుడగు జమదగ్ని అధ్వర్యుడు, వసిష్ఠుడు బ్రహ్మ, సామగానము చేయు అయాశ్వుడు ఉద్గాతగ నుండిరి. 23

శ్లో॥ తస్మై తుష్టో దదావింద్రశ్శాతకుంభమయం రథం ।
శునశ్శేఫస్య మాహాత్మ్యముపరిష్టాత్ప్రవక్ష్యతే ॥ 24

టీ:- తస్మా ఇతి. ఉపరిష్టాద్విశ్వామిత్ర సుతాఖ్యాన ప్రసంగే. 24

ఆ యజ్ఞము వలన సంతసించిన ఇంద్రుడు హరిశ్చంద్రునకు బంగారు రథమునొసంగెను. ఈ శునశ్శేఫుని మాహాత్మ్యమును విశ్వామిత్ర పుత్రాఖ్యాన సందర్భమున తెలుపబడెను. 24

శ్లో॥ సత్యసారాం ధృతిం దృష్ట్వా స భార్యస్య చ భూపతేః ।
విశ్వామిత్రో భృశం ప్రీతో దదావ విహతాం గతిమ్ ॥ 25

టీ:- సత్యేతి. అవిహతాం గతిం జ్ఞానం. 25

హరిశ్చంద్రుని సత్య సంధతను గాంచి విశ్వామిత్రుడు సంతసించి అతనికి, అతని పట్టమహిషికిని అవిహతమగు జ్ఞానము నిచ్చెను. 25

శ్లో॥ మనః పృథివ్యాంతామద్భి స్తేజసాపోనిలేన తత్ ।
ఖే వాయుం ధారయం స్తంశ్చ భూతాదౌ తం మహాత్మని ॥ 26

టీ:- తామేవ గతిమాహ - సార్ధద్వాభ్యాం. మన ఇతి. మనః పృథివ్యాం ధారయన్ జ్ఞానకలాం ధ్యాత్వా తయా అజ్ఞానం వినిర్దహన్ తాం చ హిత్వా ముక్తబంధన స్తస్థావిత్యన్వయః. శ్రు. "మనో మూలోహి సంసారో మనశ్చాన్నమయం హి సోమ్య మన" ఇతి. శ్రుతేః. అతోఽన్న

ఆ జ్ఞానముతో హరిశ్చంద్రుడు "మనోమూలోహ సంసారో మనశ్చాన్న మయంహి సోమ్య మన" అను శ్రుతిననుసరించి మనస్సు అన్నమయమని తెలుసుకొని పృథివియు అన్నరూపమని యెరిగి మనస్సును పృథివిలో, పృథివిని జలములో, జలమును తేజస్సులో, తేజస్సును వాయువులో, వాయువును ఆకాశములో, ఆకాశమును అహంకారములో, అహంకారమును మహత్తత్వములో లీనముచేసి

శబ్దవాచ్యాయాం పృథివ్యాం మనో ధారయన్ ఏకీకుర్వన్ తాం పృథివీమద్భి రేకీకుర్వన్. అపస్తేజసా తత్తేజోఽనిలేన తం చ ఖే తచ్చ భూతాదావహంకారే. పంచభూతాదిమహంకారం మహాత్మని మహత్తత్త్వే. 26

శ్లో॥ తస్మిన్ జ్ఞానకలాం ధ్యాత్వా తయా జ్ఞానం వినిర్దహన్ ।
పీత్వా తాం స్వేన భావేన నిర్వాణసుఖసం విదా ॥ 27

టీ:- తస్మిన్నితి. తస్మిన్ విషయకారం వ్యావృత్య జ్ఞానకలాం జ్ఞానాంశమాత్మత్వేన ధ్యాత్వా తయా ధ్యానవృత్తిరూపయా ఆత్మా వారకమజ్ఞానం వినిర్దహన్ నిర్వాణసుఖసంవిదా తాం చ హిత్వా ముక్త బంధనస్సన్. 27

శ్లో॥ అనిర్దేశ్యాప్రతర్క్యేణ తస్థౌ విధ్వస్తబంధనః ॥28

టీ:- అనిర్దేశ్యేతి. అనిర్దేశ్యేన అప్రతర్క్యేణ స్వేన భావేన స్వస్వరూపేణ తస్థౌ. 28

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,

సప్తమోఽధ్యాయః

(లయమొనర్చి)ఆ మహత్తత్త్వములో జ్ఞానాంశమును ఆత్మగా ధ్యానించి ఆ ధ్యానములో అజ్ఞానాన్ని హింసించుచు (విషయాకారములను) అనగా విషయవర్జితుడై పరతత్త్వమునెరిగి, పరతత్త్వ జ్ఞానముతో సంసార హేతువగు ప్రకృతిని దగ్ధమొనరించి నిర్వాణ సుఖ సంపదను కూడా పరిహరించి ముక్తబంధనుడై అవాఙ్మానసగోచరమగు స్వ స్వరూపములతో (నిజరూపముతో) వెలుగొందెను. (26-28)

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు

ఏడవ అధ్యాయము సమాప్తము.

అష్టమోఽధ్యాయః

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ హరితో రోహితసుతశ్చంపస్తస్మాద్వి నిర్మితా ।
చంపాపురీ సుదేవోఽతో విజయో యస్య చాత్మజః ॥ 1

టీ:- శ్లో. "అష్టమే రోహితస్యోక్తో వంశో యత్రాభవన్నృపః, సగరః కపిలాక్షేపాన్నిర్దగ్ధా యస్య సూనవః." హరిత ఇతి. చంపస్తస్మాదభూద్యేన చంపాపురీ వినిర్మితా అతశ్చంపాత్ సుదేవః. 1

శ్లో॥ రురుకస్తత్సుతస్తస్మాద్వృక స్తస్మాచ్చబాహుకః ।
సోఽరిభిర్హృతభూ రాజా సభార్యో వనమావిశత్ ॥ 2

టీ:- రురుక ఇతి. హృతా భూర్యస్య. 2

శ్లో॥ వృద్ధం తం పంచతాం ప్రాప్తం మహిష్యనుమరిష్యతి ।
ఔర్వేణ జానతాత్మానం ప్రజావంతం నివారితా ॥ 3

టీ:- వృద్ధమితి. ఔర్వేణ ఋషిణా ఆత్మానం దేహం ప్రజావంతం సగర్భం. 3

8 వ అధ్యాయము

ఈ ఎనిమిదవ అధ్యాయమున రోహితుని వంశములో జన్మించిన సగరుని చరితము, సగర పుత్రులు కపిల మహర్షి నాక్షేపించి నిర్దగ్ధులగుట (భస్మము) చెప్పబడుచున్నది.

శ్రీశుకుడు ఈ విధముగా పలికెను.

హరిశ్చంద్ర పుత్రుడగు రోహితునకు హరితుడు, హరితునకు చంప అనువాడు జన్మించిరి. ఇతడు చిత్య పేరుతో చంపాపురిని నిర్మించెను. అతనికి సుదేవుడు, సుదేవునకు విజయుడు పుత్రులైరి. 1

విజయునకు రురుకుడు, రురుకునకు వృకుడు, వృకునకు బాహుకుడు, జన్మించెను. ఈ బాహుకుడు రాజ్యమును శత్రువులా క్రమించగా భార్యా సహితుడై అరణ్యమునకు వెడలెను. 2

అరణ్యములో వార్ధక్యము నొంది బాహుకుడు మరణించగా అతని భార్య సహగమనము చేయుటకు సిద్ధపడెను. అప్పుడు ఔర్వుడను మహాముని ఆమె గర్భవతియై యుండుట నెరిగి ఆమెను సహగమనము నుండి నివారించెను. 3

శ్లో॥ అజ్ఞాయాస్యై సపత్నీభిర్గరో దత్తోఽంభసా సహ ।
సహ తేనైవ సంజాతస్సగరాఖ్యో మహాయశాః ॥ 4

ఆమెకు ఆమె సవతులు నీటిలో గరళము (విషము) కలిపి త్రావించిరి, గరళముతో సహా సగరుడను బాలుడు జన్మించెను. 4

శ్లో॥ సగరశ్చక్రవర్త్యాసీత్సాగరో యత్సుతైః కృతః ।
యస్తాళ జంఘాన్ యవనాన్ శకాన్ హైహయబర్బరాన్ ॥ 5

టీ:- అజ్ఞాయేతి. గరో విషం తేన గరేణ స హైవ జాతః. (4-5)

శ్లో॥ నావధీద్గురువాక్యేన చక్రే వికృతవేషిణః ।
ముండాన్ శ్మశ్రుధరాన్ కాంశ్చిన్ముక్తకేశార్ధ ముండితాన్ ॥ 6

శ్లో॥ అనంతర్వాససః కాంశ్చిదబహిర్వాససో పరాన్ ।
సోఽశ్వమేధైరయజత సర్వదేవం సురోత్తమమ్ ॥ 7

టీ:- నేతి. గురువాక్యేన ఔరవచనేన కాంశ్చిదహత్వైవ వికృతవేషిణశ్చక్రే. తదేవాహ - ముండానితి. ముక్తకేశానర్ధ ముండితాంశ్చ. (6-7)

శ్లో॥ ఔర్వోపదిష్ట యోగేన హరిమాత్మానమీశ్వరం ।
తస్యోత్సృష్ట పశుం యజ్ఞే జహారాశ్వం పురందరః ॥ 8

టీ:- ఔర్వేతి. ఔర్వేణోపదిష్టో యోగః ఉపాయస్తేన. 8

అతడు సగరుడుగా ప్రఖ్యాతినొంది చక్రవర్తి అయ్యెను. అతని పుత్రులచే సాగరము నిర్మించబడెను. ఆ సగర చక్రవర్తి తన తండ్రి రాజ్యమునాక్రమించిన, తాళ, జంఘ, యవనశక, హైహయ, బర్బరాదుల పైకి యుద్ధమునకు వెడలి గురువగు ఔర్వసుని ఆజ్ఞతో వారిని చంపనొల్లక కొందరికి తలలు గొరిగించి కొందరి నర్ధముండతులను (సగము తల గొరిగి) చేసి, కొందరిని అంతర్వస్త్రములు కలవారిని ( లంగోటి మాత్రమే ధరించిన వారినిగా) కొందరిని బహిర్వస్త్రములు గలవారినిగా అనగా పైన కప్పుకొన్న వస్త్రములు మాత్రమే కలవారినిగా చేసి అవమానపరచి, శత్రురాజులను తన బాహు బలముతో గెలిచెను. ఆ సగరుడు ఔర్వుని ఉపదేశముతో దేవతాశ్రేష్ఠుడు, సర్వేశ్వరుడనగు విష్ణువు గురించి అనేకాశ్వమేధయాగములనొనరించెను. ఒకసారి అశ్వమేధ యాగమున ఆ సగరునిచే వదలబడిన యాగాశ్వమును ఇంద్రుడు అపహరించెను. (5-8)

శ్లో॥ సుమత్యాస్తనయా దృప్తాః పితురాదేశకారిణః ।
హయమన్వేషమాణాస్తే సమంతాదఖనన్మహీం ॥ 9

టీ:- తస్య ద్వే భార్యే సుమతిః కేశినీ చ తత్ర. సమత్యాః పుత్రాణాం ప్రభావం మృత్యుం చాహ-సుమత్యా ఇత్యాదినా షడ్భిః. (9-10)

ఆ సగరునకు సుమతీ, కేశినీ, అను ఇద్దరు భార్యలుండిరి. అందు సుమతి పుత్రులు అరువది వేలమంది తండ్రియగు సగరుని ఆదేశముతో యాగాశ్వమును వెదుకుచు సప్తద్వీపాత్మకమగు భూమినంతటను వెదికి అశ్వమును కానక భూమిని తవ్విరి. 9

శ్లో॥ ప్రాగుదీచ్యాం దిశి హయం దదృశుః కపిలాంతికే ।
ఏష వాజిహరశ్చోర ఆస్తే మీలితలోచనః ॥ 10

పాతాళమునకు చేరి, అచట ఈశాన్యపు దిక్కున కపిల మహర్షి తపమాచరించుచోట యాగాశ్వమును చూచిరి. ఈ కపిలుడే యాగాశ్వమును అపహరించి కన్నులు మూసుకొని తపస్సు చేయుచున్న వానివలె నున్నాడు అనిరి. 10

శ్లో॥ హన్యతాం హన్యతాం పాప ఇతి షష్టిసహస్రిణః ।
ఉదాయుధా అభియయురున్మి మేష తదా మునిః ॥ 11

ఈతని కొట్టుడు, చంపుడు అనుచు ఆయుధములనెక్కుపెట్టి ఆ అరువది వేలమంది కపిలుని చుట్టుముట్టిరి. అప్పుడు కపిల మహర్షి కన్నులు తెరిచెను. 11

శ్లో॥ స్వశరీరాగ్నినా తావన్మహేంద్రహృతచేతసః ।
మహద్వ్యతిక్రమ హతా భస్మసాదభవన్ క్షణాత్ ॥ 12

టీ:- హన్యతామితి. ఏష వాజిహరః ఇతి బ్రువంతః అభియయుః షష్టిసహస్రాణి పరిచ్ఛేదక తయా సంతి యేషాం. ఉన్మిమేష లోచనోన్మీలనం చకార. (11-12)

ఆ సగర పుత్రులు ఇంద్రునిచే హరించబడిన మనస్సులు కలవారై గొప్పవారి నతిక్రమించిన దోషముతో తమ శరీరాగ్నిచే హతులై క్షణకాలములో భస్మపు కుప్పలుగా మారిరి. 12

శ్లో॥ న సాధువాదో మునికోపభర్జితా
నృపేంద్ర పుత్రా ఇతి సత్త్వధామని ।
కథం తమో రోషమయం విభావ్యతే
జగత్పవిత్రాత్మని ఖే రజో భువః ॥ 13

టీ:- కేచిత్ కపిలస్య కోపాగ్నినా దగ్ధా ఇతి వర్ణయంతి - తన్నిరాకరోతి. నేతి. కుత ఇత్యత ఆహ-సత్త్వధామని శుద్ధసత్త్వమూర్తౌ. జగతః పవిత్ర విశుద్ధికర ఆత్మా యస్య తస్మిన్. కథం విభావ్యతే. అసంభావ్యత ఇత్యర్థః. అసంభావనాయాం దృష్టాంతః. భువో రజః ఖే కథం సంభావ్యత ఇతి. 13

సగర పుత్రులు కపిల మహర్షి కోపాగ్నిలో భస్మమైరి అని కొందరందురు కాని అది సత్యము కాదు. శుద్ధసత్త్వమూర్తి, జగత్తును పవిత్రీకరించు ఆత్మవంతుడగు కపిలుని యందు ఆకాశములో భూరజమును భావించు నటుల తయో జనితమగు కోపమును ఎటుల భావించగలము. 13

శ్లో॥ యస్యేరితా సాంఖ్యమయీ దృఢే
హనౌర్యయా ముముక్షుస్తరతే దురత్యయం ।
భవార్ణవం మృత్యుభయం విపశ్చితః
పరాత్మభూతస్య కథం పృథఙ్మతిః ॥ 14

టీ:- కించ యస్యేతి. యస్య యేన ఈరితా ప్రవర్తితా. తస్య విపశ్చితః సర్వజ్ఞస్య. కథం పృథఙ్మతిః అరిమిత్రాది భేదదృష్టిః. 14

ఏ సాంఖ్య యోగముతో పండితులు, దాటుటకు శక్యము కానట్టి మృత్యువు వలె భయంకరమగు సంసారమును దాటుదురో అట్టి సాంఖ్య యోగ బోధకుడు, సర్వజ్ఞుడగు కపిల మహర్షికి (శత్రు, మిత్ర) స్వపర భేదములు ఎటుల ఉండగలవు. 14

శ్లో॥ యోఽసమంజస ఇత్యుక్తస్సు కేశిన్యా నృపాత్మజః ।
తస్య పుత్రోఽంశుమా న్నామ పితామహ హితే రతః ॥ 15

టీ:- తదేవం సుమత్యాః పుత్రేషు మృతేషు కేశిన్యాః పౌత్రేణ. అశ్వః సమానీతః పితృవ్యోద్ధరణ ప్రయత్నశ్చ కృతః ఇతి దర్శయితుమాహ - య ఇతి. ఉక్తః కేవలమజ్ఞైః. వస్తుతస్తు సమంజస ఏవ. న తు కేశిన్యాః సుతః క్షేత్రజత్వమివ ప్రతీతిం వారయతి- తస్యైవ నృపస్యాత్మనో దేహాజ్జాతః. 15

సగరుని మరియొక భార్య కేశిని, ఆమె పుత్రుడు అసంమజసుడు ఆ అసమంజసుని పుత్రుడు అంశుమంతుడు, అతడు తన తాతయగు సగరునకు హితమొనరించ (యాగాశ్వమును తెచ్చుటకు) బూనినాడు. కేశిని పౌత్రునిచేత యాగాశ్వము తీసికొనిరావడము, తండ్రి తోబుట్టువులను ఉద్ధరించే ప్రయత్నము చేయబడటము చెప్పుచున్నాడు. సవతి తల్లి కొడుకులని అజ్ఞానులు మాత్రమే అందురు. వారు తన తండ్రి తోబుట్టువులనడమే సమంజసము. ఇచట క్షేత్రముప్రాధాన్యము కాదు. బీజమేప్రాధాన్యము. వారు రాజు శరీరము నుండి పుట్టిన వారే. 15

శ్లో॥ అసమంజస ఆత్మానం దర్శయన్న సమంజసం ।
జాతిస్మరః పురాసంగాద్యోగీ యోగాద్విచాలితః ॥ 16

టీ:- తస్య కథామాహ - చతుర్భిః. అసమంజస ఇవ పురా పూర్వజన్మని యోగీసన్ సంగాద్ధేతోః యోగాద్విచాలితః అతః ఇదానీం జాతిస్మరస్సన్. 16

శ్లో॥ ఆచరన్ గర్హితో లోకేజ్ఞాతీనాం కర్మ విప్రియం ।
సరయ్వాం క్రీడతో బాలాన్ ప్రాస్యదుద్వేజయన్ జనం ॥ 17

ఆ అసమంజసుడు పుర్వజన్మమున మహా యోగియై సంగ దోషముతో యోగ భ్రష్టుడై సగర పుత్రునిగా జన్మించి సంగమును వదులుటకై (తనను) జనులకు అసమంజసునిగా కనిపిస్తు జనులను ద్వేగపరుచుచూ జ్ఞాతులకు ప్రియకర్మలనాచరిస్తూ లోకము చేత నిందించబడు కర్మలనాచరిస్తూ, సరయూ నదీ ప్రాంతమున క్రీడించు బాలకులను సరయులో పడవేయు చుండెను. ఇలాంటి పనులతో తండ్రిచేత వదలబడి, తన యోగ బలముతో తనచే సరయులో వేయబడిన బాలకులనందరిని తిరిగి తీసుకొనివచ్చి చూపించి అరణ్యమునకు వెడలెను. (16-18)

టీ:- ఆచరన్నితి. సంగపరిహారాయ జనం ఉద్వేజయన్. లోకేగర్హితం జ్ఞాతీనాం చ విప్రియం కర్మాచరన్. క్రీడతో బాలాన్ సరయ్వాం ప్రాస్యత్ ప్రాక్షిపదితి ద్వయోరన్వయః. 17

శ్లో॥ ఏవం వృత్తః పరిత్యక్తః పిత్రాస్నేహమపోహ్య వై ।
యోగైశ్వర్యేణ బాలాం స్తాన్ దర్శయిత్వా తతో యయౌ ॥ 18

శ్లో॥ అయోధ్యావాసినస్సర్వే బాలకాన్ పునరాగతాన్ ।
దృష్ట్వా విసిస్మిరే రాజన్ రాజా చాథాన్వతప్యత ॥ 19

అయోధ్యా వాసులు తమ బాలకులు తిరిగి రావడము గాంచి మిక్కిలి ఆశ్చర్యము నొందిరి. సగర మహారాజును అసమంజసుని విషయమున పశ్చాతాపమొందెను. 19

టీ:- ఏవమితి. ఏవం విధం వృత్తం కర్మ యస్య సః. (18-19)

శ్లో॥ అంశుమాంశ్చోదితో రాజా తురగాన్వేషణే యయౌ ।
పితృవ్య ఖాతా సుపథం భస్మాంతే దదృశే హయమ్ ॥ 20

అట్టి అసమంజసుని పుత్రుడు అంశుమంతుడు. సగరునిచేత యాగాశ్వమును వెదకి తెచ్చుటకు పంపబడి తన పిన తండ్రులచేత తవ్వబడిన మార్గమున పాతాళమునకు వెడలి భస్మరాసుల ప్రక్కన యాగాశ్వమును గాంచెను. 20

శ్లో॥ తత్రాసీనం మునిం వీక్ష్య కపిలాఖ్యమధోక్షజం ।
అస్తౌత్సమాహిత మనాః ప్రాంజలిః ప్రణతో మహాన్ ॥ 21

అచటనున్న కపిల మహర్షిని గాంచి సమాహిత మనస్కుడై అంజలి ఘటించి నమస్కరిస్తు ఇటుల స్తుతించెను. 21

టీ:- అంశుమానితి. పితృవ్యైః ఖాతమను. యః పంథాః తం యయౌ. భస్మాంతే భస్మసమీపే. శ్లో. అజానంతోఽవజానన్తోఽప్యనుకంప్యా వయంత్వితి. తుష్టావ షడ్భిరీశానమంశుమానేవమాశయః. శ్రీధరీయోఽయం శ్లోకః. (20-21)

శ్లో॥ న పశ్యతి త్వాం పరమాత్మనో జనో న
బుధ్యతేఽద్యాపి సమాధి యుక్తిభిః ।
కుతో పరే యస్య మనశ్శరీరధీ
విసర్గసృష్టావయమప్రకాశాః ॥ 22

టీ:- నేతి. అజనః అజః బ్రహ్మాపి త్వా మద్యాపి న పశ్యతి న బుధ్యతే. కథంభూతం ఆత్మనః స్వస్మాత్పరం పరమేశ్వరం కైర్హేతుభిః సమాధియుక్తిభిః సమాధినాప్యపరోక్షం న పశ్యతి. యుక్తిభిః పరోక్షమపి ఇత్యర్థః. అపరే అర్వాచీనాస్తు కుతస్త్వాం పశ్యేయుః అర్వాచీనత్వే హేతుః . తస్య బ్రహ్మణః మనశ్చ శరీరం చ ధీశ్చ సత్త్వతమోరజఃకార్యాణి తాభిః యే వివిధాః దేవతిర్యఙ్నరాణాం సర్గాః - తేషు సృష్టాః తత్రాపి వయం అప్రకాశాః అజ్ఞాః కుతః పశ్యేమేత్యర్థః. 22

పరమాత్ముడవగు నిన్ను బ్రహ్మ, సమాధి యుక్తులచే ఇప్పటికీ తెలిసికొనలేక పోయెను. బ్రహ్మ యొక్క మనశ్శరీర బుద్ధులచే సత్వ, రజ, స్తమోగుణములతో దేవతిర్యఙ్మానవ యోనుల యందు సృష్టించబడిన అజ్ఞులమగు మేము ఎలా తెలుసుకొనగలము. 22

శ్లో॥ యే దేహభాజస్త్రిగుణ ప్రధానా
గుణాన్వి పశ్యంత్యుత వా తమశ్చ ।
యన్మాయయా మోహితచేతసస్తే
విదుస్స్వసంస్థం న బహిః ప్రకాశాః ॥ 23

టీ:- అపరే తర్హి కిం పశ్యంతి తదాహ - య ఇతి. యే దేహభాజస్తే స్వస్మిన్ సమ్యక్ స్థితమపి త్వాం న విదుః కింతు గుణానేవ విపశ్యంతి అథవా న గుణానపి అపితు తమ ఏవ పశ్యంతి యతస్త్రిగుణాః బుద్ధిరేవ ప్రధానం యేషాం అతో బహిరేవ ప్రకాశో జ్ఞానం యేషాం బుద్ధిపరతంత్ర తయా జాగ్రత్స్వప్నయోర్విషయాన్ పశ్యంతి సుషుప్తౌ తు తమ ఏవ కేవలం న తు నిర్గుణం త్వాం సర్వత్ర హేతుః యత్ యతః యస్య తవ మాయయేతి వా మోహితం చేతో యేషాం తే. 23

సత్వరజస్తమోగుణ ప్రధానులగు మానవులు నిన్ను గాక ఇతరమునే ఎందుకు చూస్తారో చెప్పుచున్నాడు. వారు దేహములోనే ఉన్నటువంటి నిన్ను తెలిసికొనలేరు. కాని గుణాలనే చూచెదరు. లేదా అజ్ఞానమునే చూచెదరు. ఈ త్రిగుణాలకు బుద్ధియే ప్రధానము. బుద్ధికి లోబడిన జ్ఞానము జాగ్రత్స్వప్న సుషుప్తులలోని విషయాలను మాత్రమే చూస్తుంది. (మానవులు) సుషుప్తిలో తమస్సును (అజ్ఞానమును) మాత్రమే గాంచెదరు. నిర్గుణుడవైన నిన్ను గాంచలేరు. ఇదంతయు నీ మాయ చేత మోహితులవడమే. 23

శ్లో॥ తం త్వామహం జ్ఞానఘనం స్వభావ
ప్రధ్వస్తమాయాగుణ భేదమోహైః ।
స నందనాద్యైర్మునిభిర్విభావ్యం
కథం విమూఢః పరిభావయామి ॥ 24

టీ:- తథాప్యహం విచారేణ జ్ఞాస్యామీతి చేత్ తత్రాహ - తమితి. తం త్వామహం విమూఢః కథం పరిభావయామి విచారయామి

మూర్తీభూత, త్రిగుణరహిత, స్వయముగా వెలుగు స్వభావము గల నిన్ను, మాయా నిమిత్తములగు భేద మోహములు లేని, సనందనాది మునులచే భావించబడెడి పరిశుద్ధ జ్ఞాన సంపన్నుడవగు నిన్ను, మాయా గుణముచే మూఢుడనగు నేను ఎటుల తెలిసి కొందును. 24

కథంభూతం జ్ఞానఘనం శుద్ధజ్ఞానమూర్తిం స్వభావత ఏవ ప్రధ్వస్తౌ మాయాగుణనిమిత్తౌ భేదమోహౌ యేషాం తైః. విభావ్యం విచింత్యం అయం భావః. జ్ఞానఘనత్వాన్న తావత్ జ్ఞానవిషయత్వం. విచారవిషయ త్వేఽపి. మాయాగుణైరభిభూతోఽహం న విచారే సమర్థ ఇతి. 24

శ్లో॥ ప్రశాంత మాయా గుణకర్మలింగమ
నామరూపం సదసద్విముక్తం ।
జ్ఞానోపదేశాయ గృహీత దేహం
నమామహే త్వాం పురుషం పురాణమ్ ॥ 25

టీ:- ప్రశాంతేతి. తస్మాత్ హే ప్రశాంత త్వాం పురాణం పురుషం కేవలం నమామహ,ఇత్యన్వయః.పురాణపురుషత్వే హేతుః. మాయాయా గుణాః కర్మాణి చ. విశ్వసృష్ట్యాదీని లింగాని. బ్రహ్మాదిరూపాణి యస్య తం ప్రశాంతత్వే హేతుః. సదసద్భ్యాం కార్యకారణాభ్యాం పుణ్య పాపాభ్యాం వా విముక్తం. అతః అనామరూపం తత్కృతనామ రూపశూన్యం కింతు జ్ఞానోపదేశాయ గృహీతః ప్రకటితః దేహః శుద్ధసత్త్వ మూర్తిః. యేన తం. హే ప్రశాంతమాయేతి. హే అగుణేతి చ సంబోధనం కర్మభిః సృష్ట్యాదికార్యైర్లింగాని యస్యేతి యోజ్యం. యద్వా ప్రశాంతా మాయాగుణాదయో యస్మిన్. ఇత్యేక మేవ పదం. 25

పుణ్య పాపాది కర్మలచే విముక్తుడవగుటచే నామరూపములు లేనట్టియు, జ్ఞానము ఉపదేశించుటకై దేహమును స్వీకరించిన పురాణ పురుషుడవగు నీకు నమస్కారము. 25

శ్లో॥ త్వన్మాయారచితే లోకే వస్తుబుద్ధ్యా గృహాదిషు ।
భ్రమంతి కామలోభేర్ష్యామోహ విభ్రాంత చేతసః ॥ 26

టీ:- స్వభాగ్యం శ్లాఘతే ద్వాభ్యాం. త్వ-దితి. కామాదిభిర్విభ్రాంతాని చేతాంసి యేషాం తే ఇమే సర్వే గృహాదిషు భ్రమంతి. 26

శాంతించిన మాయాగుణ కర్మపములు గల నీ యొక్క మాయచే సృష్టించబడిన ఈ లోకమున కామ, లోభ, ఈర్ష్యా, మోహాదులచే భ్రాంతి చెందిన మనస్సు కలవారై గృహాదులయందు వస్తుబుద్ధితో మానవులు భ్రమనొందుచున్నారు. 26

శ్లో॥ అద్య నస్సర్వభూతాత్మన్ కామకర్మేంద్రియాశయః ।
మోహపాశ దృఢశ్ఛిన్నో భగవంస్తవ దర్శనాత్ ॥ 27

ఓ సర్వభూతాత్మకుడా! నాకు నీ కృపతోనే కలిగిన నీ దర్శనముతో ఇపుడు కామ, కర్మేంద్రియములకు ఆశ్రయమగు, దృఢమైన మోహ పాశము తొలగి కృతార్థుడనైనాను. 27

శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఇత్థం గీతానుభావస్తం భగవాన్ కపిలో మునిః ।
అంశుమంతమువాచేద మనుగృహ్య ధియా నృప ॥ 28

టీ:- అద్యేతి. హే సర్వభూతాత్మన్ నః అస్మాకం త్వత్కృపయైవ ఘటితాత్ త్వద్దర్శనాత్ అద్య దృఢోఽపి మోహమయః పాశః. ఛిన్నః కథంభూతః కామాదీనామాశయః ఆశ్రయః త్వత్ప్రసాదేన కృతార్థోఽస్మీత్యర్థః. (27-28)

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

ఈ విధముగా అంశుమంతుని చేత స్తుతించబడిన భగవంతుడగు కపిల మహర్షి ఆ అంశుమంతుని అనుగ్రహించి ఇటుల పలికెను. 28

శ్రీ భగవాను ఉవాచ

శ్లో॥ అశ్వోఽయం నీయతాం వత్స పితామహపశుస్తవ ।
ఇమేచ పితరో దగ్ధా గంగాంభోఽర్హంతి నేతరత్ ॥ 29

భగవానుడు పలికెను

ఓ అంశుమంతా! మీ తాత సగరుని యజ్ఞాశ్వమగు ఈ అశ్వమును తీసుకువెళ్ళుము. భస్మము కుప్పలుగా మారిన నీ పితరులను గంగాజలమే తరింపచేయగలదు. వేరే ఏదియు తరింప చేయజాలదు అని చెప్పెను. 29

శ్రీశుక ఉవాచ

శ్లో॥ తం పరిక్రమ్య శిరసా ప్రసాద్య హయమానయత్ ।
సగరస్తేన పశునా క్రతుశేషం సమాపయత్ ॥ 30

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

అంశుమంతుడు కపిల మహర్షికి నమస్కరించి గుఱ్ఱమును తెచ్చి సగరునకీయగా సగరుడు ఆ యాగాశ్వముతో అశ్వమేధ యాగమును పూర్తిగావించెను. 30

శ్లో॥ రాజ్యమంశుమతి న్యస్య నిస్పృహో ముక్తబంధనః ।
ఔర్వోపదిష్ట మార్గేణ లేభే గతిమనుత్తమామ్ ॥ 31

రాజ్యము నంశుమంతున కప్పగించి ఔర్వముని ఉపదేశించిన మార్గమున ముక్తసంగుడై ఉత్తమగతినొందెను. 31

టీ:- అశ్వ ఇతి. అశ్వం లబ్ధ్వాపి సా కాంక్షం ప్రత్యాహ - ఇమే చేతి. (29-31)

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
అష్టమోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.

నవమోఽధ్యాయః

శ్రీశుక ఉవాచ

శ్లో॥ అంశుమాంశ్చ తపస్తేపే గంగానయన కామ్యయా ।
కాలం మహాంతం నాశక్నోత్తతః కాలేన సంస్థితః ॥ 1

టీ:- శ్లో. "నవమేఽంశుమతో వంశః ఖట్వాంగావధి వర్ణ్యతే, గంగాం భూతాలమానిన్యే యస్య పౌత్రో భగీరథః" అంశుమానితి. యథా సగరః పౌత్రాయ రాజ్యం దత్వా తపస్తేపే. తథా అంశుమాంశ్చ. స్వపుత్రాయ రాజ్యం దత్వా. మహాంతం కాలం తపస్తేప ఇతి చకారస్యార్థః నాశక్నోద్గంగామానేతుమితి శేషః. సంస్థితః మృతః. 1

శ్లో॥ దిలీపస్తత్సుతస్తద్వదశక్తః కాలమేయివాన్ ।
భగీరథస్తస్య సుతస్తేపే స సుమహత్తపః ॥ 2

టీ:- దిలీప ఇతి. కాలం మృత్యుం ఏయివాన్ ప్రాప్తః. 2

శ్లో॥ దర్శయామాస తం దేవీ ప్రసన్నా వరదాస్మి తే ।
ఇత్యుక్తస్స్వమభిప్రాయం శశంసావనతో నృపః ॥ 3

9 వ అధ్యాయము

ఈ తొమ్మిదవ అధ్యాయమున ఖట్వాంగుని వరకు అంశుమంతుని వంశము వర్ణించబడినది. అంశుమంతుని మనుమడగు భగీరథుడు గంగను భూమికి తెచ్చిన విషయమభివర్ణించబడినది.

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

అంశుమంతుడు తన పితురులకు ఉత్తమగతికై గంగను తెచ్చుటకు చాలా కాలము తపమొనరించెను. ఆ కోరిక తీరకుండగనే అతడు మరణించెను. 1

అతని సుతుడగు దిలీపుడు గంగకై చాలాకాలము తపమాచరించి తన కోరిక తీరకుండానే మృతినొందెను. ఆ దిలీపుని పుత్రుడు భగీరథుడు గంగనవతరింప జేయుటకై చాలా కాలము గొప్ప తపమాచరించెను. 2

భగీరథుని తపస్సునకు గంగ ప్రసన్నురాలై ప్రత్యక్షమై వరము కోరుమనెను. అపుడు భగీరథుడు తన పూర్వులనుద్ధరించుటకై భువికి అవతరించుమని తన అభిప్రాయమును తెలిపెను. 3

టీ:- దర్శయామాసేతి. తం ప్రత్యాత్మానం దర్శయామాస. తే వరదాస్మీతి గంగయోక్తస్సన్ స్వమభిప్రాయం పూర్వజోద్ధరణం శశంస కథయా మాస. 3

గంగోవాచ

శ్లో॥ కోఽపి ధారయితావేగం పతంత్యా మే మహీతలే ।
న చేద్భూమితలం భిత్వా నృప యాస్యే రసాతలం ॥ 4

గంగ పలికెను

అపుడు గంగ నేను ఆకాశము నుండి భువికి అవతరించు నపుడు నా వేగమును భరించి, ధరించు వ్యక్తి ఎవరు? నన్ను భరించు వారు లేనిచో నేను భూమిని ఛేదించి రసాతలమునకు వెడలెదను. 4

టీ:- క ఇతి. కోఽపి గగనాత్పతంత్యా మే వేగం ధారయితా ధారయిష్యతి. 4

శ్లో॥ కిం చాహం న భువం యాస్యే నరామయ్యామృజంత్యఘం ।
మృజామి తదఘం క్వాహం రాజం స్తత్ర విచింత్యతాం ॥ 5

మరియు నేను భువి నవతరించిన, మానవులు తమ పాపములను నా జలముతో ప్రక్షాళనము చేసుకొని, పాపములను నా జలములో విడిచెదరు. ఆ పాపములను నేనెట్లు, తొలగించుకోవలెనో (శుద్ధి చేసుకొనవలెనో) ఆలోచింపుమనెను. 5

టీ:- కిం చేతి. కించ. ఆమృజంతి క్షాళయిష్యంతి. తత్రోపాయో విచింత్యతాం. 5

రాజోవాచ

శ్లో॥ సాధవో న్యాసినశ్శాంతా ధర్మిష్ఠా లోకపావనాః ।
హరంత్యఘం తేఽంగసంగాత్తేష్వాస్తేహ్యఘభిద్ధరిః ॥ 6

భగీరథుండు ఈ విధముగా పలికెను.

లోకపావనులు, ధర్మిష్ఠులు, శాంతులునగు సాధువులు వారి స్పర్శతో నీ పాపమును తొలగించెదరు. ఏలనన ఆ సాధువులలో

టీ:- సాధవ ఇతి. హారంతి హరిష్యంతి. అఘం భినత్తీత్యఘభిత్. 6

పాపహర్తయగు శ్రీహరినుండుగదా! 6

శ్లో॥ ధారయిష్యతి తే వేగం రుద్రస్త్వాత్మా శరీరిణామ్ ।
యస్మిన్నోతమిదం ప్రోతం విశ్వం శాటీవ తంతుషు ॥ 7

వస్త్రములో ఓత, ప్రోతమైన దారములు ఉండునటుల, ఈ ప్రపంచమంతయు, శరీరులకు, ఆత్మభూతుడగు ఏ శంకరుని యందున్నదో ఆ శంకరుడు నీ వేగమును ధరించును. (భరించగలడు)7

శ్లో॥ ఇతి తస్య వచశ్శ్రుత్వా గంగా తం పునరబ్రవీత్ ।
ప్రసాదయ మహేశానం ధారణార్థం మదంభసామ్ ॥ 8

అని పలికిన భగీరథుని మాటలు వినిన గంగ ఓ భగీరథరాజా! వేగముగా అవతరించెడి నన్ను భరించుటకై పరమేశ్వరుని ప్రార్థించు మనెను. 8

శ్లో॥ తచ్ఛ్రుత్వా స నృపో దేవం తపసారాధయచ్ఛివం ।
కాలేనాల్పీయసా రాజంస్తస్యేశానస్త్వతుష్యత ॥ 9

భగీరథుడు శంకరుణ్ణి గూర్చి చాలా కాలము గొప్ప తప మొనరించగా శంకరుడు సంతసించెను. 9

టీ:- ధారయిష్యతీతి. ఆత్మా కథంభూతః యస్మిన్ ఇదం విశ్వమోతం గ్రథితం ఊర్ధ్వతంతుషు శాటీపట ఇవ ప్రోతం చ తిర్యక్తంతుషు పట ఇవ అసౌ సర్వాధారస్తద్వేగం ధారయిష్యతీత్యర్థః. (7-9)

శ్లో॥ తథేతి రాజ్ఞాభిహిత స్సర్వలోక హిత శ్శివః ।
దధారావహితో గంగాం పాదపూత జలాం హరేః ॥ 10

భగీరథుని ప్రార్థన అంగీకరించి సర్వలోక హిత కరుడగు శంకరుడు హరి పాదములచే పవిత్రీకరించబడిన జలములు గల గంగను సావధానుడై ధరించెను. 10

శ్లో॥ భగీరథోఽథ రాజర్షిర్నిన్యే భువనపావనీం ।
యత్ర స్వపితౄణాం దేహా భస్మీభూతాశ్చ శేరతే ॥ 11

శ్లో॥ రథేన వాయువేగేన ప్రయాంతమనుధావతీ ।
దేహాన్ పునంతీ నిర్దగ్ధానసించత్సగరాత్మజాన్ ॥ 12

టీ:- తథేతి. రాజ్ఞాభిహితం తథేత్యంగీకృత్యహరేః పాదేన పూతం జలం యస్యాస్తాం. (10-12)

శ్లో॥ యజ్జలస్పర్శమాత్రేణ బ్రహ్మదండ హతా అపి ।
సగరాత్మజా దివం జగ్ముః కేవలం దేహ భస్మభిః ॥ 13

టీ:- ప్రసంగాత్ గంగామాహాత్మ్యమాహ - చతుర్భిః. యదితి. యస్యాః జల స్పర్శ మాత్రేణ. తచ్చ కేవలం దేహభస్మభిరేవ న సాక్షాత్. బ్రహ్మణి స్వకృతేన దండేన హతా అపి. తాం శ్రద్ధయా యే సేవంత ఇతి శేషః ఏతాషాం ఫలం కిం వక్తవ్యమితి భావః. తదేవ ప్రపంచయతి - భస్మీభూతేతి. భస్మీభూతేనాంగేన యస్సంగః తేన. (13-15)

శ్లో॥ భస్మీభూతాంగసంగేన స్వర్యాతాస్సగరాత్మజాః ।
కిం పునః శ్రద్ధయా దేవీం యే సేవంతే ధృత వ్రతాః ॥ 14

అపుడు భగీరథుడు భువన పావనియగు గంగను తన పితరుల భస్మపు రాసులున్న ప్రాంతమునకు కొనిపోయెను. 11

వాయువేగము గల రథము నధిరోహించి భగీరథుడు ముందు వెడలుచుండ అతనిని అనుసరిస్తూ గంగ వెడలి భస్మపు రాసుల రూపములో నున్న సగర పుత్రుల శరీరములను పవిత్రీకరిస్తూ తన జలములతో తడిపెను. 12

ప్రసక్తానుప్రసక్తముగ గంగా మాహాత్మ్యమును నాలుగు శ్లోకములతో తెలుపుచున్నాడు. బ్రాహ్మణునికి అపకారమొనర్చి స్వయం కృతాపరాధముతో మృతి నొందిన సగర పుత్రులు తమ భస్మములకు గంగాజల స్పర్శ కలిగినంతనే స్వర్గమునొందిరి. 13

భస్మీభూతమగు శరీరములుగల సగర పుత్రులు ఏ గంగాజల స్పర్శ చేతనే స్వర్గము నొందిరో అట్టి గంగను శ్రద్ధతో ఎవరు

అర్చించెదరో వారికి కలిగెడి ఫలమునేమని చెప్పగలము. (ఉత్కృష్ట ఫలమని భావము) 14

శ్లో॥ న హ్యేతత్పరమాశ్చర్యం స్వర్ధున్యాయదిహోదితమ్ ।
అనంతచరణాంభోజప్రసూతాయా భవచ్ఛిదః ॥ 15

శ్లో॥ సన్నివేశ్యమనో యస్మిన్ శ్రద్ధయా మునయోఽమలాః ।
త్రైగుణ్యం దుస్త్యజం హిత్వా సద్యో యాతాస్తదాత్మతామ్ ॥ 16

ఏ విష్ణుమూర్తి యందు శ్రద్ధతో మనస్సు నిలిపి, త్రిగుణాత్మకమును త్యజించుటకు శక్యము కానట్టి దేహబంధమును వదిలి, వెంటనే తాదాత్మ్యమును (విష్ణుత్వమును) పొందుదురో అట్టి విష్ణు పాదము నుండి ఉద్భవించిన గంగకు ఇట్టి మాహాత్మ్యముండుటలో ఆశ్చర్యమేమి లేదు (15-16)

శ్లో॥ శ్రుతో భగీరథాజ్జజ్ఞే తస్య నాభావరోఽభవత్ ।
సింధుద్వీపస్సుతస్తస్మాదయుతాయుస్తతోఽభవత్ ॥ 17

టీ:- సన్నివేశ్యేతి. యస్మిన్ అనంతే త్రైగుణ్యం దేహబంధనం. 16-17

ఈ భగీరథుని పుత్రుడు శ్రుతుడు, అతనికి నాభావరుడు, నాభావరునకు సింధుద్వీపుడు, సింధుద్వీపునకు అయుతాయువు అనువారు జన్మించిరి. 17

శ్లో॥ ఋతుపర్ణో నళసఖో యోఽశ్వవిద్యామధాన్నలాత్ ।
దత్వాక్షహృదయం తస్మై సర్వకామస్తు తత్సుతః ॥ 18

టీ:- ఋతుపర్ణ ఇతి. నలస్య సఖా. అధాత్ప్రాప్తః. తత్సుతః ఋతుపర్ణస్య సుతః. 18

అయుతాయువుకు ఋతుపర్ణుడను పుత్రుడు కలిగెను. ఆ ఋతుపర్ణుడు నళునితో స్నేహము చేసి అతనికి అక్షహృదయమను విద్య నొసగి నళునినుండి అశ్వ విద్యను గ్రహించెను. ఆ ఋతుపర్ణునకు సర్వకాముడను పుత్రుడు. 18

శ్లో॥ తతస్సుదాసస్తత్పుత్రో మదయంతీపతిర్నృప ।
ఆహుర్మిత్రసహం యం వై కల్మాషాంఘ్రిః కృతః క్వచిత్ ।
వసిష్ఠశాపాద్రక్షోఽభూ దనపత్య స్స్వకర్మణా ॥ 19

టీ:- తత ఇతి. తత్పుత్రః సౌదాసః. 19

సర్వకామునకు సుదాసుడు పుత్రుడు. ఈతడు మదయంతి అనునావిడను వివాహమాడెను. ఈయనకి మిత్రసహుడు, కల్మష పాదుడని నామాంతరములు. ఈతడు వసిష్ఠుని శాపముతో రాక్షసుడై తన కర్మతో సంతానహీనుడయ్యెను. 19

విష్ణురాత ఉవాచ

శ్లో॥ యన్నిమిత్తో గురోశ్శాపస్సౌదాసస్య మహాత్మనః ।
ఏతద్వేదితుమిచ్ఛామి కథ్యతాం న రహో యది ॥ 20

టీ:- యదితి. న రహః. న రహస్యం. 20

పరీక్షిద్రాజు ఈ విధముగా పలికెను.

ఆ మాటలు వినిన పరీక్షిత్తు ఓ శుక మహర్షీ! ఈ సుదాసునకు వసిష్ఠుని శాపమేకారణమున కలిగెను, రహస్యము కానిచో తెలుపుమనెను. 20

శ్రీశుక ఉవాచ

శ్లో॥ సౌదాసో మృగయాం కించిచ్చరన్ రక్షో జఘాన హ ।
శుశోచ భ్రాతరం భ్రాతా గతః ప్రతి చికీర్షయా ॥ 21

టీ:- సౌదాస ఇతి. మృగయాం చరన్ కించిత్ రక్ష. కించిద్రాక్షసం జఘాన. తస్య భ్రాతరం శుశోచ సభ్రాతా పలాయ్యాగతః. 21

శ్లో॥ స చింతయన్నఘం రాజ్ఞస్సూదరూపధరో గృహే ।
గురవే భోక్తుకామాయ పక్త్వా నిన్యే నరామిషమ్ ॥ 22

శుకుడు ఈ విధముగ పలికెను.

ఈ సుదాసుడు ఒకసారి వేటకు వెడలి ఒక రాక్షసుని సంహరించెను. ఆ రాక్షసుని సోదరుడు తన సోదరుని చంపిన సుదాసునిపై కక్షతో కపటవేశముతో సుదాసుని ఇంట వంటవానిగా చేరెను. ఒకప్పుడు సుదాసుడు తన గురువగు వసిష్ఠునకు ఆహారము సిద్ధము చేయుమనగ వంటవాడుగా నున్న ఆ రాక్షసుడు నరమాంసము ను వండి వడ్డించెను. (21-22)

టీ:- స ఇతి. అఘం అనిష్టం సూదః పాచకః తద్రూపధరస్సన్ రాజ్ఞోగృహే వర్తమానః. 22

శ్లో॥ పరివేష్యమాణం భగవాన్విలోక్యా భక్ష్యమంజసా ।
రాజనమశపత్క్రుద్ధో రక్షో హ్యేవం భవిష్యసి ।
రక్షఃకృతం తద్విదిత్వా చక్రే ద్వాదశవార్షికమ్ ॥ 23

టీ:- పరివేష్యమాణమితి. అభక్ష్య మంజసా విలోక్య ఏవం నరమాంసాభ్యవహారేణ. వసిష్ఠ ఏవ. తం శాపం ద్వాదశ వార్షికం చక్రే. 23

వసిష్ఠుడు తనకు వడ్డించినది నర మాంసమని, దివ్యదృష్టితో గ్రహించి కోపముతో సుదాసుని రాక్షసుడవు కమ్మని శపించెను. పిదప ఆ పని రాక్షసుడొనరించినదిగా తెలుసుకొని తన శాపమును పన్నెండు వత్సరములకే పరిమితము గావించెను. 23

శ్లో॥ సోఽప్యపోఽంజలి నాదాయ గురుం శప్తుం సముద్యతః ।
వారితో మదయంత్యాపో రుశతీః పాదయోర్జహౌ ॥ 24

టీ:- స ఇతి. రుశతీస్తీక్ష్ణాః అపః స్వపాదయోః జహౌ. నాన్యత్ర. 24

శ్లో॥ దిశః ఖమవనీం సర్వాం పశ్యన్ జీవమయం నృపః ।
రాక్షసంభావమాపన్నఃపాదే కల్మాషతాం గతః ॥ 25

టీ:- తత్రహేతుః. దిశ ఇతి. ఏవమనేన మిత్రసహత్వమపి దర్శితం మిత్రస్య కలత్రస్య వాచస్సహనాత్. 25

అపుడు సుదాసుడు అకారణముగ తనను శపించినందులకు గురువగు వసిష్ఠుడిని శపించుటకై దోసిలిలో నీరు తీసుకొనెను. భార్యయగు మదయంతిచే నివారింపబడి భూమ్యాకాశములను దిక్కులను అన్నింటి చూచి, అని అన్నియు జీవమయములుగ తలచి ఈ జలమెక్కడ వదిలినను జీవులకు బాధ కలుగునని తన పాదముల యందే వదలెను. దీనితో అతడు కల్మషపాదు (నల్లని పాదములు కలవాడు) డాయెను. ఈ విధముగా తన భార్యమాట నాదరించుటచే మిత్రసహుడనబడెను. గురు శాపముతో రాక్షస కాయమునొంది అడవులలో తిరుగుచుండెను. (24-25)

శ్లో॥ వ్యవాయకాలే దదృశే వనౌ కోదంపతీ ద్విజౌ ।
క్షుధార్తో జగృహే విప్రం తత్పత్న్యాహ కృతార్థవత్ ॥ 26

టీ:- తదేవ రాక్షసత్వే. కల్మాషాంఘ్రిత్వే చ. కారణముక్త్వా స్వకర్మణా చ సత్య ఇతి యదుక్తం తత్ప్రపంచయతి - వ్యవాయకాల ఇత్యారభ్య. కర్మణా ప్రజాః ఇత్యంతేన. వ్యవాయేతి. వనమోకో నివాసో యయౌస్తౌ. వనౌకసౌ తౌ చ దంపతీ చ వనౌకా దంపతీ ఇతి పృథక్పదపాఠే అదంతత్వమార్షం. అకృతార్థవత్ దీనవత్. (26-27)

అతడొక్కప్పుడు ఆకలితో బాధపడుచు అడవిలో బ్రాహ్మణ దంపతులను గాంచిచంపి భక్షించి ఆకలి తీర్చుకొనుటకై ఆ దంపతులలో బ్రాహ్మణున్ని గ్రహించెను. అపుడు అతని భార్య దీనురాలైఇటుల పలికెను. 26

శ్లో॥ న భవాన్ రాక్షసస్సాక్షాదిక్ష్వాకూణాం మహారథః ।
మదయంత్యాః పతిర్వీర నాధర్మం కర్తుమర్హసి ॥ 27

ఓ రాజా! నీవు స్వతహాగా రాక్షసుడవు కావు. ఇక్ష్వాకు వంశములో జన్మించిన నీవు మహారథుడవు, మదయంతి పతివి. వీరుడవు. అట్టి నీకు అధర్మమునాచరించుట తగదు. 27

శ్లో॥ దేహి మేఽపత్యకామాయా అకృతార్థరతిం ద్విజమ్ ।
దేహోఽయం మానుషో రాజన్ పురుషస్యాఖిలార్థదః ॥ 28

ఓ రాజా! సంతానవతిని కావలెనను కోరికగల నాకు, కోరిక తీరనందున ఈ విప్రుని నొసగుము. మనుష్య దేహము సమస్తార్థముల నొసగునట్టిది. 28

శ్లో॥ తస్మాదస్య వధో వీరసర్వార్థ వధ ఉచ్యతే ।
ఏష హి బ్రాహ్మణో విద్వాన్ తపశ్శీలగుణాన్వితః ॥ 29

ఈతనిని వధించిన సర్వార్థహాని జరుగును, బ్రాహ్మణుడు, విద్వాంసుడు, తపశ్శీలుడు, మంచి గుణములు కలవాడు, సర్వభూతము



టీ:- దేహీతి. అకృతార్థం తం అసమాప్త రతిం. (28-29)

శ్లో॥ ఆరిరాధయిషుర్బ్రహ్మ మహాపురుష సంజ్ఞితమ్ ।
సర్వభూతాత్మభావేన భూతేష్వంతర్హితం గుణైః ॥ 30

టీ:- ఆరిరాధయిషురితి. సర్వభూతానామాత్మేతి భావనయా ఆరాధయితుమిచ్ఛుః. యద్వా సర్వభూతానామాత్మభావేన భూతేషు స్థితమపి, గుణైరంతర్హితం బ్రహ్మేతి సంబంధః. పాఠాంతరే అంతర్హితః సోఽయమిత్యుత్తరేణాన్వయః. 30

శ్లో॥ సోఽయం బ్రహ్మర్షివర్యస్తే రాజర్షిప్రవరాద్విభోః ।
కథమర్హతి ధర్మజ్ఞవధం పితురివాత్మజః ॥ 31

టీ:- స ఇతి. సోఽయం త్వదధీనో బ్రహ్మర్షి వర్యః. రాజర్షిశ్రేష్ఠాత్త్వత్తో వధం నార్హతి. యథా పితా. పుత్రకర్తృకం వధమివ. 31

శ్లో॥ తస్య సాధోరపాపస్య భ్రూణస్య బ్రహ్మవాదినః ।
కథం వధం యథా బభ్రోర్మన్యతే సన్మతో భవాన్ ॥ 32

టీ:- తస్యేతి.భ్రూణస్య శ్రోత్రియస్య. గర్భస్య సత ఇతి వా. బభ్రోః గోః. సతాం మతో భవాన్. వధం కథం సాధు మన్యత ఇత్యర్థః. 32

లను ఆత్మభావముతో ఆరాధించగోరుచున్నవాడు, సర్వభూతముల యందు ఆత్మ భావముతోనుండి త్రిగుణములతో ఆవరించబడినట్టి పురుషసంజ్ఞతోనున్న బ్రహ్మ, బ్రహ్మర్షియగు ఈతనిని, ధర్మజ్ఞుడవు రాజర్షివినగు నీకు, పుత్రుడు తండ్రిని వధించిన విధముగ ఈతనిని వధించుట తగునా? (29-31)

పాపరహితుడు, సాధువు, శ్రోత్రియుడు, బ్రహ్మవాదియునగు ఈతనిని, గోవును వధించునటుల వధించుటకు నీకు ఎటుల సమ్మతి కలిగినది. 32

శ్లో॥ యద్యయం క్రియతే భక్షస్తర్హి మాం ఖాద పూర్వతః ।
న జీవిష్యే వినా యేన క్షణం చ మృతకం యథా ॥ 33

ఏ వ్యక్తిలేక నేను క్షణకాలముకూడా జీవించజాలనో అట్టి ఈతనిని భక్షించదలచినచో మృతప్రాయురాలినగు నన్ను మొదట భక్షించి పిదప ఈతనిని భక్షింపుము. 33

శ్లో॥ ఏవం కరుణ భాషిణ్యా విలపంత్యా అనాథవత్ ।
వ్యాఘ్రః పశుమివాఖాదత్సౌదాసశ్శాపమోహితః ॥ 34

టీ:- యదీతి.క్షణమపి యేన వినా న జీవిష్యామి సోఽయం యది భక్షః క్రియతే తర్హి మృతకం యథా మృతప్రాయాం మాం పూర్వం భక్షయః. (33-34)

అని పలుకుచు అనాథవలె దుఃఖించుచున్న ఆమెను లెక్కచేయక శాపమోహితుడగు ఆ సుదాసుడు వ్యాఘ్రము పశువును భక్షించినటుల ఆ విప్రుని భక్షించెను. 34

శ్లో॥ బ్రాహ్మణీ వీక్ష్య దిధిషుం పురుషాదేన భక్షితం ।
శోచంత్యాత్మానమూర్వీశమ శపత్కుపితా సతీ ॥ 35

టీ:- బ్రాహ్మణీతి. దిధిషుం గర్భాధాన కర్తారం. 35

శ్లో॥ యస్మాన్మే భక్షితో పాపః కామార్తాయాః పతిస్త్వయా ।
తవాపి మృత్యురాధానాదకృత ప్రజ్ఞదర్శితః ॥ 36

శ్లో॥ ఏవం మిత్రసహం శప్త్వా పతిలోకపరాయణా ।
తదస్థిని సమిద్ధాగ్నౌ ప్రాప్య భర్తృగతిం గతా ॥ 37

ఆ సతి తన భర్త ఈ విధముగా చంపబడి భక్షించబడుటను గాంచి దుఃఖిస్తూ కోపముతో రాక్షసుణ్ణి, కుమార్థురాలినగు నా భర్తను నీవు భక్షించితివి. కావున నీవు కామార్థుడవై స్త్రీ చెంతకు చేరినచో మరణము నొందగలవని శపించి తన భర్త అస్థికలతో సహా అగ్నిలో ప్రవేశించి ఉత్తమ గతినొందెను. (35-37)

శ్లో॥ విశాపో ద్వాదశాబ్దాంతే మైథునాయ సముద్యతః ।
విజ్ఞాప్య బ్రాహ్మణీ శాపం మహిష్యా స నివారితః ॥ 38

టీ:- యస్మాదితి. ఆధానాత్ మైథునాత్. హే అకృతప్రజ్ఞ. మృత్యుర్మయా దర్శితః. (36-38)

శ్లో॥ తత ఊర్ధ్వం స తత్యాజ స్త్రీ సుఖం కర్మణా ప్రజాః ।
వసిష్ఠస్తదనుజ్ఞాతో మదయంత్యాం ప్రజామధాత్ ॥ 39

టీ:- తత ఇతి. తదేవం కర్మణా అప్రజాః. 39

శ్లో॥ సా వై సప్తసమా గర్భమబిభ్రన్న వ్యజాయత ।
జఘ్నేఽశ్మనోదరం తస్యాస్సోఽశ్మకస్తేన కథ్యతే ॥ 40

టీ:- సేతి. అబిభ్రత్ దధారేత్యర్థః. న వ్యజాయత న ప్రాసూయత. అతో వసిష్ఠ ఏవ తస్యా ఉదరమశ్మ నా జఘాన. స ఉత్పన్నః సుతోఽశ్మకః 40

శ్లో॥ అశ్మకాన్మూలకో జజ్ఞేయ స్త్రీభిః పరిరక్షితః ।
నారీ కవచ ఇత్యుక్తో నిఃక్షత్రే మూలకోఽభవత్ ॥ 41

పన్నెండు సంవత్సరములు గడచిన పిదప సుదాసుడు శాప విముక్తుడై, పూర్వరూపమును పొంది, కామముతో భార్యయగు మదయంతిని సమీపించగా ఆమె బ్రాహ్మణ శాపమును గుర్తుచేసి నివారించెను. అప్పటి నుండి సుదాసుడు స్త్రీలకు దూరముగా నుండుటచే సంతానహీనుడాయెను. వసిష్ఠుని అనుగ్రహముతో సుదాసుని భార్య మదయంతి గర్భము దాల్చెను. ఆ మదయంతి ఆ గర్భమును ఏడు సంవత్సరములు మోసియు ప్రసవించలేదు. వసిష్ఠుడు ఆమె గర్భమును తీక్ష్ణమగు (అశ్మము) రాతితో ఛేదించెను. బాలుడు బయటపడెను. అతడే అశ్మకుడు అని అనబడెను. (38 - 40)

ఈ అశ్మకునకు మూలకుడనువాడు పుత్రుడు, ఈ మూలకుడు పరశురాముని నుండి స్త్రీలచేత (పరశురాముడు క్షత్రియ వధలో

శ్లో॥ రాజా విశ్వసహో యస్య ఖట్వాంగశ్చక్రవర్త్యభూత్ ।
యో దేవైరర్థితో దైత్యానవధీద్యుధి దుర్జయః ॥ 42

టీ:- అశ్మకాదితి. స్త్రీభిః సంపేష్ట్య పరశురామాత్పరిరక్షితః అతో నారీ కవచ ఇత్యుక్తః. నిక్షత్రే జగతి సతి క్షత్రవంశస్య మూలమభవత్. అతో మూలక ఇతి చోక్తః.. (41-42)

శ్లో॥ ముహూర్తమాయుర్జ్ఞాత్వైత్య స్వపురం సందధే మనః ॥ 43

టీ:- ముహూర్తేతి. ప్రసన్నైర్దేవైర్వరం వృణీష్వేత్యుక్తే ఖట్వాంగేనోక్తం. ప్రథమంతావన్మమాయుః కథ్యతామితి దేవైశ్చోక్తం. ముహూర్తమాత్ర మితి. తత్ జ్ఞాత్వా. దేవైర్దత్తేన విమానేన శీఘ్రం స్వపురమేత్య మనః పరమేశ్వరే సందధే. 43

భాగముగ ఈతనిని వధించుటకు రాగ స్త్రీలు చుట్టుముట్టి కాపాడిరి) రక్షించబడుటచే నారీకవచుడనబడెను. భార్గవరాముడు పృథివిని క్షత్రియ రహిత మొనర్చినపుడు ఈ నారీకవచుడే మిగిలిన క్షత్రియ వంశమునకు మూలమగుటచే మూలకుడనబడెను. 41

ఈతని కుమారుడు విశ్వసహుడు, విశ్వసహుని కుమారుడు ఖట్వాంగుడు, ఖట్వాంగుడు చక్రవర్తియై దేవతల ప్రార్థనతో రాక్షసులను చంపి దేవతలకు సంతృప్తి కలుగజేసెను. 42

ప్రసన్నులైన దేవతలు వరము కోరుకొనుమనగా, ఖగ్వాంగుడు మొదట మీరు నా ఆయుష్షు ఎంతనో తెలుపండి అనెను. దేవతలు ఒక ముహూర్త కాలమే అనిరి. అది తెలిసికొని దేవతలచే ఇవ్వబడిన విమానములో శీఘ్రముగా తన పట్టణముచేరి మనస్సును పరమేశ్వరుని యందు నిలిపెను. 43

శ్లో॥ న మే బ్రహ్మకులాత్ప్రాణాః కులదైవాన్న చాత్మజాః ।
నశ్రియో న మహీ రాజ్యం న దారాశ్చాతివల్లభాః ॥ 44

టీ:- ఏతదేవ స్వసాధువృత్తానుస్మరణపూర్వకం తత్కృతేన నిశ్చయేన దర్శయతి - సప్తభిః. నేతి. కులదైవాత్ బ్రహ్మకులాత్సకాశాత్. మే ప్రాణాదయో నాతివల్లభాః నాతిప్రియాః. 44

నాకు కులదైవములగు బ్రాహ్మణుల కంటే ప్రాణములు, పుత్రులు, సంపద, భూమి, రాజ్యము, భార్య ఇవేవియు ప్రియములు కావు. బాల్యములోకుడా నా బుద్ధి అధర్మమును కోరదు. ఉత్తమ శ్లోకుడగు శ్రీహరిని తప్ప వేరేదేనిని కాంచదు. (44-45)

శ్లో॥ న బాల్యేఽపి మతిర్మహ్యమధర్మే రమతే క్వచిత్ ।
నాపశ్యముత్తమశ్లోకాదన్యత్కించన వస్త్వహమ్ ॥ 45

టీ:- నేతి. మహ్యం మమ. 45

శ్లో॥ దేవైః కామవరో దత్తో మహ్యం త్రిభువనేశ్వరైః ।
న వృణేత మాహం కామం భూతభావనః ॥ 46

టీ:- దేవైరితి. భూతభావనో హరిః. తస్మిన్నేవ భావనా యస్య సోఽహం. తం కామం న వృణే. 46

శ్లో॥ యే విక్షిప్తేంద్రియధియో దేవాస్తే స్వహృది స్థితమ్ ।
న విందమతి ప్రియం శశ్వదాత్మానం కిముతాపరే ॥ 47

టీ:- తత్ర హేతుః య ఇతి. విక్షిప్తానీంద్రియాణి ధీశ్చ. యేషాం తే దేవా అపి. 47

త్రిలోకాధిపతులగు దేవతలచేత నొసగబడిన వరములు అవసరము లేదని తన హృదయ స్థితుడగు ఆత్మారామునికంటే ఇంద్రియ బుద్ధులగు దేవతలు కూడా తనకు ప్రియము కలుగజేయరని తలంచి మాయా కల్పితమగు గంధర్వపురము వలె గుణాదులన్నియు మాయా కల్పితములని తలచి అజ్ఞానమును వదిలి బుద్ధిలో నారాయణున్ని తలచుచు నారాయణునిలో లీనమయ్యెను. (46-49)

శ్లో॥ అథేశ మాయా రచితేషు సంగం గుణేషు గంధర్వపురోపమేషు।
రూఢం ప్రకృత్యాత్మని విశ్వభర్తుర్భావేన హిత్వా తమహంప్రపద్యే ॥48

టీ:- అథేతి. అథ తస్మాత్. ప్రకృత్యాస్వభావేన. ఆత్మనిరూఢం. గుణేషు సంగం. విశ్వకర్తుర్భావేన. హిత్వా తమేవాహం ప్రపద్యే. 48

శ్లో॥ ఇతి వ్యవసితో బుద్ధ్యానారాయణ గృహీతయా ।
హిత్వాన్య భావమజ్ఞానం తతస్స్వం బావమాశ్రితః ॥ 49

టీ:- ఇతీతి. అన్య భావం దేహాద్యభిమానరూపం అజ్ఞానం హిత్వా. 49

శ్లో॥ యత్తద్బ్రహ్మ పరం సూక్ష్మమశూన్యం శూన్యకల్పితమ్ ।
భగవాన్ వాసుదేవేతి యం గృణంతి హి సాత్త్వతాః ॥ 50

టీ:- స్వం భావమేవాహ - యత్తదితి. శూన్యవత్కల్పితం వాగాద్య విషయత్వాత్. వాసుదేవ ఇతి యం గృణంతి. బ్రహ్మణ ఏవ భక్తానుగ్రహార్థమావిష్కృతశక్తేః వాసుదేవత్వాత్. 50

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
నవమోऽధ్యాయః

ఎవరైతే శూన్యములో కల్పించబడిన ఆ శూన్యమగు, పరమ సూక్ష్మమగు పరబ్రహ్మను భగవంతుడగు వాసుదేవునిగా తలతురో వారు వాసుదేవునిలో లీనమగుదురు. 50

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.



దశమోఽధ్యాయః

శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఖట్వాంగాద్దీర్ఘబాహుశ్చ రఘుస్తస్మాత్పృథుశ్రవాః ।
అజస్తతో మహారాజ తస్మాద్దశరథోఽభవత్ ॥ 1

టీ:- శ్లో. దశమే ప్రాహఖట్వాంగవంశే శ్రీరామ సంభవం, తచ్చరిత్రం చలం కేశం హత్వాఽయోధ్యాగమావధి. యద్వా - దశమే రామ చరితమావిర్భావపురస్సరమ్, శుశేన వర్ణ్యతే పుణ్యమభి షేకోత్సవావధి." ఖట్వాంగాదితి. ఖట్వాంగాద్దీర్ఘబాహుః. (1-2)

శ్లో॥ తస్యాపి భగవానేష సాక్షాద్బ్రహ్మమయో హరిః ।
అంశాంశేన చతుర్భాగాత్పుత్రత్వం ప్రార్థితస్సురైః ॥ 2

శ్లో॥ రామ లక్ష్మణశత్రుఘ్న భరతా ఇతి సంజ్ఞయా ।
తస్యానుచరితం రాజన్నృషిభిస్తత్త్వదర్శిభిః ।
శ్రుతం హి వర్ణితం భూరి త్వయా సీతాపతేర్ముహుః ॥ 3

టీ:- రామేతి. ఋషిభిః వాల్మీకిముఖ్యైః భూరి వర్ణితం. త్వయా ముహుః శ్రుతం. తథాపి సంక్షేపతః కథ్యమానం శృణ్వితి శేషః. 3

10 వ అధ్యాయము

ఈ పదవ అధ్యాయమున ఖట్వాంగుని వంశమున శ్రీరామ జననము, శ్రీరామ చరిత్రమున శ్రీరాముడు లంకాధిపతి రావణుని సంహరించి అయోధ్యకు చేరుట వరకు అభివర్ణించబడియున్నది.

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

ఖట్వాంగునకు దీర్ఘబాహువు, అతనికి రఘువు, రఘువునకు పృథుశ్రవుడు జన్మించిరి. పృథుశ్రవుని పుత్రుడు అజుడు, అజుని పుత్రుడు దశరథుడు. 1

సాక్షాద్బ్రహ్మమయుడగు విష్ణువు దేవతలచే ప్రార్థించబడగా, విష్ణువు తన అంశలను నాలుగుగా విభజించి రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను పేర్లతో ఆ దశరథ మహారాజు యొక్క కుమారులుగా జన్మించెను. 2

"గ్రంథకోటిభిరాకీర్ణం అద్భుతం రామవిక్రమం అధ్యాయతో వక్షన్నేక శ్లోకీనమస్యతీ"శ్రీధరస్వామి శ్లోకము - కోట్ల కొలది గ్రంథములలో అద్భుతమగు శ్రీరాముని పరాక్రమము అభివర్ణించబడినది. అయినను రెండు అధ్యాయములలో సంక్షిప్తముగా చెప్పుతూ, ఒక శ్లోకముతో నమస్కరించుచున్నాడు. ఓ పరీక్షిద్రాజా! సీతాపతియగు శ్రీరాముని చరిత్ర వాల్మీకి మున్నగు ఋషుల వలన చక్కగా వర్ణించబడి నీచేత వినబడినది. అయినను సంక్షేపముగ వచించెదను వినుము. 3



శ్లో॥ గుర్వర్థే త్యక్తరాజ్యో వ్యచరదనువనం
పద్మపద్భ్యాం ప్రియాయాః పాణిస్పర్శాక్షమాభ్యాం
మృజితపథరుజో యో హరీంద్రానుజాభ్యాం ।
వైరూప్యాచ్ఛూర్పణాఖ్యాః ప్రియవిరహ రుషా
రోపిత భ్రూవిజృంభత్రస్తాబ్ధిర్బద్ధ సేతుః
ఖలదవదహనః కోసలేంద్రోఽవతాన్నః ॥ 4

టీ:- శ్లో. గ్రంథకోటిభిరాకీర్ణమద్భుతం రామవిక్రమం, అధ్యాయ ద్వయతో వక్ష్యన్నేకశ్లోకే నమస్యతి. శ్రీధరీయోఽయం శ్లోకః. గుర్వర్థ ఇతి. కోసలేంద్రః శ్రీరామః నః అస్మాన్ అవతాత్ పాతు కథం భూతః ? యో గుర్వర్థే పితుః సత్యస్య పాలనార్థం త్యక్తరాజ్యస్సన్ పద్మవదతి సుకుమారాభ్యాం పద్భ్యాం తదేవాహ - ప్రియాయాః పాణినాపి స్పర్శే నాస్తి క్షమా యయోః తాభ్యాం ప్రతివనం వ్యచరత్ హరీంద్రో హనుమాన్ సుగ్రీవో వా అనుజో లక్ష్మణః తాభ్యాం మృజితా అపనీతా పథరుజామార్గశ్రమో యస్య శూర్పణఖ్యాః వైరూప్యాత్ కర్ణనాసికా చ్ఛేదాద్ధేతోః తయా ప్రలోభితేన రావణేనాపహారాత్ ప్రియేణ కళత్రేణ విరహః తేన రుట్ తయా ఆరోపితయోః భ్రువోః విజృమ్భేనైవ త్రస్తాబ్ధిః యస్మాత్ తతస్తద్విజ్ఞాపనేన బద్ధః సేతుః యేన తతః ఖలా రావణాదయః త ఏవ దవో వనం తస్య దహనః. 4

తండ్రియగు దశరథ మహారాజు యొక్క సత్యవాక్పరిపాలనకై రాజ్యమును వదిలి, ప్రియురాలి హస్త స్పర్శను కూడా సహించజాలని పద్మముల లాంటి సుకుమారములగు పాదములతో అరణ్యములలో తిరిగిన శ్రమను, హనుమ లక్ష్మణులు తొలగించగా, శూర్పణఖను వికారరూపిణిగా చేయుటచే శూర్పణఖ అన్నయగు రావణునిచే సీత అపహరింపబడగా కలిగిన కోపముతో భ్రూభంగమాత్రముననే భీతిల్లిన సముద్రముపై సేతువును నిర్మించి రావణాది రాక్షసులను హత మొనరించిన శ్రీరాముడు మనను రక్షించుగాక. 4

శ్లో॥ విశ్వామిత్రాధ్వరే యేన మారీచాద్యా నిశాచరాః ।
పశ్యతో లక్ష్మణస్యైవహతాః నైరృతపుంగవాః ॥ 5

టీ:- సంక్షేపతో వర్ణితం రామచరితం ఆదిత ఆరభ్య విస్తరేణాహ - విశ్వామిత్రాధ్వర ఇత్యారభ్య యావదుత్తరాధ్యాయపరిసమాప్తి. విశ్వామిత్రేతి. పశ్యత ఏవ లక్ష్మణస్య తమస్యనపేక్ష్యైవ హతా ఇత్యర్థః యచ్ఛబ్దానాం కోసలేంద్రోఽవతాదితి. పూర్వేణైవాన్వయః. 5

సంక్షిప్తముగా పైశ్లోకమున వర్ణించబడిన రామచరిత విశ్వామిత్ర అను శ్లోకము మొదలుకొని తరువాతి అధ్యాయ పరిసమాప్తి వరకు తెలుపబడుచున్నది. శ్రీరాముడు బాల్యముననే విశ్వామిత్రుని యాగ రక్షణార్థము వెళ్ళి, లక్ష్మణుడు చూచుచుండగనే, ఒక్కడే తాటక, సుబాహువు మొదలగు రాక్షసులను చంపెను. 5

శ్లో॥ యో లోకవీరసమితౌ ధనురైశముగ్రం
సీతా స్వయంవర గృహే త్రిశతోపనీతమ్ ।
ఆదాయ బాలగజలీల ఇవేక్షు యష్టిం
సజ్జీకృతం నృపవికృష్యబభంజ మధ్యే ॥ 6

టీ:- యఇతి. లోకేయే వీరా స్తేషాం సమితౌ సమాజే ఐశం త్రైయంబకం ధనుః ఇక్షుయష్టిమివ లీలయైవాదాయ సజ్జీకృతమారోపితం వికృష్య మధ్యేయో బభంజ. హే నృప ఉగ్రం కఠినం గరిష్ఠం వా తదాహ వహతాం త్రిభిశ్శతైరుపనీతం. బాలగజస్య లీలేవ లీలా యస్య సః. 6

సీతా స్వయంవర మంటపములో వీరుల సమూహము నందు మిక్కిలి బలిష్ఠమై మూడువందల మందితో మోసి తేబడిన శివదనస్సును గజము చెరుకుగడనుగ్రహించినటుల లేవనెత్తి, ఎక్కుపెట్టివిరిచెను. 6

శ్లో॥ జిత్వానురూపగుణశీలవయోఽఙ్గరూపాం
సీతాభిధాం శ్రియమురస్యభిలబ్ధమానామ్ ।
మార్గే వ్రజన్ భృగుపతేర్వ్యనయత్ప్రరూఢం
దర్పం మహీమకృత యస్త్రిరరాజ బీజామ్ ॥ 7

టీ:- జిత్వేతి. అనురూపాణి స్వయోగ్యాని గుణశీలాదీని. యస్యాస్తాం. సీతాసంజ్ఞాం. పూర్వం ఉరసి అభిలబ్ధో మానోమయా తాం శ్రియం జిత్వా, ధనుర్భంగ మహానాద శ్రవణ కుపితస్య భృగుపతేః పరశురామస్య దర్పం వ్యనయత్. అపనీతవాన్. కథంభూతస్య. త్రిః. త్రిస్సప్తకృత్వః. రాజబీజశూన్యాం మహీం. యోఽకరోత్. తస్య. 7

పూర్వము విష్ణురూపములోనున్న సమయము తన వక్షః స్థలముననున్నట్టి, తనకు గుణ, శీల వయో రూపములో తగినట్టి సీతాదేవి అను లక్ష్మిని, ఆ స్వయంవరములో గ్రహించి వెంటనిడుకొని అయోధ్యా మార్గములో వెళ్ళుచు, ఇరువది ఒక్కమార్లు భూమిని క్షత్రియ బీజ రహితము గావించిన భార్గవరాముడెదురించగా, అతని దర్పము నణచెను. 7

శ్లో॥ యస్సత్యపాశపరివీతపితుర్ని దేశం
స్త్రైణస్యచాపి జగృహే శిరసా స భార్యః ।
రాజ్యశ్రియం ప్రణయినస్సుహృదో నివాసం
త్యక్త్వా యయౌ వనమసూనివ ముక్తసంగః ॥ 8

టీ:- ఇదానీం గుర్వర్థ ఇతి శ్లోకం వివృణ్వన్నాహ - య ఇతి. కదాచిత్ కైకేయ్యా తుష్టేన రాజ్ఞా త్వదపేక్షితం దాస్యామీతి ప్రతిశ్రుతం తతః శ్రీరామస్య యౌవరాజ్యాభిషేకసమయే. తయా భరతస్య రాజ్యం రామస్య చ వనే వాసః ప్రార్థితః. తదా సత్యపాశేన పరివీతస్య పితుర్నిదేశ

ఒకప్పుడు కైకేయి చేసిన ఉపకారముతో సంతోషించిన దశరథ మహారాజు, నీవు కోరుకున్నది ఇచ్చెదనని పలికియుండెను. రామ పట్టాభిషేక సమయములో ఆ వరాలను జ్ఞప్తికి తెచ్చిన కైకేయి , రాజ్యము భరతునకు ఇవ్వవలెను, రాముడు వనవాసము చేయవలెనని ప్రార్థించినది. శ్రీరాముడు, కైకకిచ్చిన వరములనెడు సత్యపాశబద్ధుడైన తండ్రి ఆజ్ఞను శిరసావహించి భార్యతోగూడి రాజ్యలక్ష్మిని, ప్రియస్నేహితులను, గృహమును, ముక్తసంగుడగు యోగి ప్రాణములను వదిలినట్లు, వదిలి అరణ్యమునకు వెడలెను. 8

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

మాజ్ఞాం శిరసా జగృహే. తతో రాజ్యాదికం త్యక్త్వా స భార్యో వనం యయౌదుస్త్యజస్యాపి సహర్షం త్యాగే దృష్టాంతః. ముక్తసంగో యోగీ అసూన్ ప్రాణానివేతి. 8

శ్లో॥ రక్షస్స్వసుర్వ్యకృత రూపమశుద్ధ బుద్ధే
స్తస్యాః ఖర త్రిశర దూషణ ముఖ్య బంధూన్ ।
జఘ్నే చతుర్దశసహస్రమవారణీయం
కోదండపాణి రటమాన ఉవాస కృచ్ఛ్రమ్ ॥ 9

టీ:- రక్ష ఇతి. రక్షసో రావణస్య స్వసుః. శూర్పణఖ్యాః అశుద్ధబుద్ధేః సీతాం జిఘృక్షోః కామాతురాయా ఇతి వా. రూపం. వ్యకృత వికారమనయత్. తస్యాః ఖరత్రిశిరదూషణముఖ్యాః అదంతత్వమార్షం. బాంధవా యేషు తాన్ చతుర్దశసహస్రం అవారణీయం అలంఘ్యం జఘాన కోదండం పాణౌ యస్య. 9

శ్లో॥ సీతా కథా శ్రవణ దీపిత హృచ్ఛయేన
సృష్టం విలోక్య నృపతే దశకంధరేణ ।
జఘ్నేద్భుతైణ వపుషా శ్రమతోఽపకృష్టో
మారీచ మాశు విశిఖేన యథా కముగ్రః ॥ 10

ఆ అరణ్యమున రాక్షసాధిపతి రావణాసురుని చెల్లెలు, కామాతుర చేత దుర్బుద్ధి గల, శూర్పనఖ రాముని వద్దకు రాగా ఆమెను వికృతరూపిగా చేసి, ఆ శూర్పణఖ బంధువులగు ఖర, త్రిశర, దూషణాది పదు నాలుగు వేల రాక్షసులను చంపి భీకరారణ్యమున కోదండధారియై నివసించెను. 9

సీతాదేవి సౌందర్యమును గూర్చి వినిన రావణుడు, ఆమెను అపహరించదలచి, రామునికి భయపడి, ఆతనిని ఆశ్రమమును నుండి దూరముగా తీసికొని పోవుమని, మాయా వేషము ధరించుటలో ఆరితేరిన మారీచుణ్ణి ఆదేశించినాడు. మారీచుడు అద్భుత సౌందర్యము

టీ:- సీతేతి.సీతాయాః కథా శ్రవణేన దీపితో హృచ్ఛయో యస్య తేన సీతాం హరిష్యతా స్వస్మాద్భీతేన స్వస్యాశ్రమాదపకర్షణార్థే సృష్టం విసృష్టం మారీచం విలోక్య జఘాన. కథంభూతం అద్భుతైణ వపుషా స్వర్ణహరిణ దేహేనోపలక్షితం. అత ఏవ ప్రలోభనేన ఆశ్రమతః తేనాకృష్టస్సన్ కం దక్షప్రజాపతిం. యథా. ఉగ్రః శ్రీరుద్రః. 10

గల బంగారు లేడి రూపమును ధరించి రాముణ్ణి దూరముగా తీసికొని పోగా, ఉగ్రుడైన రుద్రుడు దక్షప్రజాపతిని సంహరించినట్లు, రాముడు మారీచుణ్ణి సంహరించెను. 10

శ్లో॥ రక్షోధమేన వృకవద్విపినే సమక్షం
వైదేహ రాజదుహితర్య పయాపితాయాం ।
భ్రాత్రావనే కృపణవత్ప్రియయా వియుక్తః
స్త్రీసంగినాం గతిమితి ప్రథయంశ్చచార ॥ 11

టీ:- రక్షోధమేనేతి. తతశ్చ రక్షోధమేన రావణేన అసమక్ష మప నీతాయాం ప్రియాయాం తయా వియుక్తః. భ్రాత్రా లక్ష్మణేన సహ. కృపణవద్వనే చచార. కిమభిప్రాయస్సన్? ఇతి అనేన ప్రకారేణ స్త్రీసంగినాం దుఃఖోదర్కాం గతిం. ప్రఖ్యాపయన్. 11

రాక్షాసాధముడగు రావణుడు తన పరోక్షములో, ఒంటరిగా ఉన్న తన ప్రియమైన సీతాదేవిని అపహరించుకొని వెళ్ళగా, తమ్ముడగు లక్ష్మణునితో కలిసి దీనుడై అడవిలో తిరిగెను. ఏ అభిప్రాయముతో అటుల తిరుగెననగా స్త్రీ సంగులకు కలిగే దుఃఖగతిని తెలుపు రీతిలో అరణ్యములో తిరిగెను. 11

శ్లో॥ దగ్ధ్వాత్మకృత్యహతకృత్యమహన్ కబంధం సఖ్యం
విధాయ కపిభిర్దయితాగతిం తైః ।
బుధ్వాఽథ వాలి నిహతేప్లవగేంద్ర సైన్యై
ర్వేలామగాత్స మనుజోఽజభవార్చితాంఘ్రిః ॥ 12

తన కార్యమునకై (సీతను రక్షించుటకై) మరణించిన జటాయువు నకు ఔర్ధ్వదైహిక కర్మలను ఒనరించి, కబంధుని చంపి, సుగ్రీవాది వానరులతో స్నేహం చేసి, వాలిని సంహరించి, బ్రహ్మ శంకరాది దేవతలతో అర్చించబడే పాదపద్మములుగల శ్రీరాముడు, తమ్ముడు, కపి సైన్యముతో కలిసి సముద్ర తీరమును చేరెను. 12

టీ:- దగ్ధ్వేతి. ఆత్మార్థేన కృత్యేన కర్మణా. రావణేన సహ యుద్ధేన హతస్య.కృత్యం శాస్త్రీయం దహనాదికం యస్య తం జటాయుషం పుత్ర వద్దగ్ధ్వా. కబంధం స్వగ్రహణాయ ప్రసారితబాహుం రాక్షసం అహన్ అథ వాలి నిహతే తైః కపిభిః దయితాగతిం బుధ్వా అజభవాభ్యా మర్చితావంఘ్రీ యస్య సమనుజః వేలాం సముద్రతీరం అగాత్. 12

శ్లో॥ యద్రోష విభ్రమ వివృత్త కటాక్ష పాత
సంభ్రాంత నక్ర మకరో భయగీర్ణఘోషః ।
సింధుశ్శిరస్యర్హణం పరిగృహ్యా రూపీ
పాదారవిందముపగమ్య బభాష ఏతత్ ॥ 13

టీ:- యదితి. తత్ర త్రిరాత్రముపవాసేన ప్రతీక్షితోఽపి సింధుః. యదా నోపస్థితః తదా యస్య రోషవిభ్రమేణ క్రోధలీలయా వివృత్తో యః కటాక్షః తస్య పాతేన సంభ్రాంతా నక్రాః మకరాశ్చ యస్మిన్. భయేన గీర్ణః గ్రస్తః స్తంభితో ఘోషో యేన నః సింధుః, ఏతద్వక్ష్యమాణం బభాషే. అర్హణమర్ఘ్యాదికం. అత్ర ఛందోభంగ ఆర్షః. రూపీ మూర్తిమాన్. 13

ఆ సముద్ర తీరమున శ్రీరాముడు మూడు రాత్రులుపవసించి ప్రతీక్షించినను సముద్రుడు కనిపించక పోవడముతో (మానవ రూపధారియై) క్రోధదృష్టితో చూడగా, సంభ్రమునొందిన మకరములు గల సముద్రుడు భీతిల్లి తరంగ ఘోషనాపి మనుష్య రూపియై శిరస్సున అంజలి ఘటించి శ్రీరాముని పాదారవిందములనంటి ఇటుల పలికెను. 13

శ్లో॥ తం త్వాం విభో జడధియో న విదామభూమన్
కూటస్థమాదిపురుషం జగతామధీశమ్ ।
యత్సత్త్వతస్సురగణా రజసః ప్రజేశా
మన్యోశ్చ భూతపతయస్స భవాన్ గుణేశః ॥ 14

టీ:- భాషణమాహ-ద్వాభ్యాం. తమితి. ఏతావత్పర్యంతం సునిశ్చితం త్వాం న విదామ. న జానీమః ఇత్యర్థః ఇదానీం తు జాతోఽసీత్యాహ - యది పృథక్పదం యస్యేత్యర్థః. యద్వ శేభ్యః సత్త్వాదిభ్యః సురగణాదయో భవంతి స భవానితి. 14

ఓ శ్రీరామచంద్రుడా నీవు త్రిగుణములకతీతుడవై, నీ సాత్వికాంశముతో దేవతలను, రాజసాంశముతో ప్రజాపతిని, తామసాంశముతో భూతపతిని సృష్టించితివి. జగదీశ్వరుడవు, ఆదిపురుషుడవు. అట్టి నిన్ను మంద బుద్ధిగల నేను గుర్తించలేక పోయితిని. 14

శ్లో॥ కామం ప్రయాహి జహి విశ్రవసోఽవమేహం
త్రైలోక్యరావణమవాప్ను హి వీరపత్నీమ్ ।
బధ్నీహి సేతుమిహ తే యశసో వితత్యై
గాస్యంతి దిగ్విజయినో యముపేత్య భూపాః ॥ 15

టీ:- కామమితి.కామం యథేచ్ఛం జలమాక్రమ్యాఽపి ప్రయాహి. అవమేహం పురీషం.త్రైలోక్యం రావయతి ఆక్రందయతీతి తథా తం జహి హే వీర యద్యపి తవ జలం ప్రబంధకం నభవతి. తథాపీహ సేతుం బధ్నీహి. తర్హి కిమర్థం? తే యశసో విస్తారాయ. తదేవాహ - యం సేతుముపేత్యదుష్కరం కర్మావేక్ష్య త్వద్యశో గాస్యంతి భూపాస్తం. 15

నీవు యథేచ్ఛగా వెళ్ళి ముల్లోకములను ఏడిపించెడి నీచుడైన రావణుని జయించుము. వీరపత్నియగు సీతను చేకొనుము. వీరుడైన నీకు ఈ జలములు ప్రతిబంధకములు కావు. ఐనప్పటికి నాపై సేతువును నిర్మించుము, దిక్కులను జయించిన రాజులు సైతము ఆ సేతువును చేరి నీ కీర్తిని గానము చేయుదురు. 15

శ్లో॥ బధ్వోదధౌ రఘుపతిర్వివిధాద్రి కూటై
స్సేతుం కపీంద్ర కర కంపిత భూరుహాంగైః ।
సుగ్రీవ నీల హనుమత్ప్రముఖైరనీకై
ర్లంకాం విభీషణ దృశా విశదగ్రదగ్ధాం ॥ 16

టీ:- తద్వాక్యమభినంద్య యత్కృతం తదాహ - బధ్వేతి. వివిధై రద్రిణాం కూటైఃశృంగైః సేతుం బధ్వా అగ్రే సీతాన్వేషణే హనుమతైవ దగ్ధాం లంకామావిశత్. కథంభూతైః శృంగైః కపీంద్రాణాం కరైః కంపితాని భూరుహాణామంగాని శాఖాదీని యేషు తైః విభీషణస్య దృశా బుద్ధ్యాకై స్సహావిశత్? సుగ్రీవాదయః ప్రముఖా యేషాం తైరనీకైః. 16

వానర వీరుల కరములలో కదల్చబడిన వృక్షములు కల అనేకములగు పర్వతశిఖరములతో సముద్రముపై వారధిని కట్టి పూర్వము సీతాన్వేషణ సమయమున హనుమంతునిచే కాల్చబడిన లంకను విభీషణుని బుద్ధి సహకరించగా సుగ్రీవ, నీల, హనుమదాది ప్రముఖ వీరులు గల కపి సైన్యముతో ప్రవేశించెను. 16

శ్లో॥ సా వానరేంద్ర బలరుద్ధవిహార కోష్ఠ
శ్రీద్వార గోపుర సదో వలభీ విటంకా ।
నిర్భజ్య మానాధిషణ ధ్వజ హేమకుంభ
శృంగాటకాగ జరుతైర్హ్రదినీవ ఘూర్ణా ॥ 17

టీ:- సేతి. తతశ్చ సా లంకా ఘూర్ణా ప్రచలితా బభూవ కథంభూతా? వానరేంద్రాణాం బలైః రుద్ధాః విహారాదయో యస్యాం నిర్భజ్య మానాః ధిషణాదయో యస్యాం సా.తత్ర విహారః క్రీడాస్థానం. కోష్ఠం ధాన్యా

ఆ కపివీరుల బలముతో అరికట్టబడి భిన్నములుగా నొనర్చబడిన క్రీడాస్థానములు, ధాన్యాగారములు, భాండాగారములు, గృహ ద్వారములు, పురద్వారములు, సభాభవనములు, వలభులు (మేడల ముందు భాగములు), కపోత పాలికలు, ధ్వజములు, బంగారు కలశములు, చతుష్పథములు, కలిగిన ఆ లంక ఏనుగుల ఘీంకారముతో సరస్సు కంపించునటుల (అల్లకల్లోలమైనటుల) కంపించెను. 17

గారాది. శ్రీః కోశః. ద్వారం గృహాదీనాం. గోపురం పురద్వారం. సదః సభా. వలభీ ప్రాసాదాదిపురోభాగాచ్ఛాదినీ. విటంకః కపోత పాలికా ధిషణం వేదికాది. శృంగాటకం చతుష్పథమ్. 17

శ్లో॥ రక్షఃపతి స్తదవలోక్య నికుంభకుంభ
ధూమ్రాక్ష దుర్ముఖ సురాం తనరాంతకాదీన్ ।
పుత్రం ప్రహస్తమతి కాయమకంపనాదీన్
సర్వానుగాన్ సమహినోదథ కుంభకర్ణం ॥ 18

టీ:- రక్షసాం పతిః రావణః పుత్రమింద్రజితం. ప్రహస్తాదీంశ్చ. సమహినోత్ ప్రాయుజ్త్క. 18

రాక్షసాధిపతియగు రావణుడు ఆ కపీరుల విజృంభణను చూచి లంకను రక్షించుటకై తన పుత్రుడగు ఇంద్రజిత్తును, నికుంభుడు, కుంభుడు, ధూమ్రాక్షుడు, దుర్ముఖుడు, సురాంతకుడు, నరాంతకుడు, అతికాయుడు, అకంపనుడు, కుంభకర్ణుడు మొదలగు వారిని నియోగించెను. 18

శ్లో॥ తాం యాతుధాన పృతనామసి
శూలచాప ప్రాసర్ష్టి శక్తిశరతో మరఖడ్గదుర్గాం ।
సుగ్రీవ లక్ష్మణమరుత్సుత గంధమాద
నీలాంగదర్క్ష పనసాదిభిరన్వితో౽యాత్ ॥ 19

టీ:- తామితి. అసిశూలాదిభిర్దుర్గమాం తాం యాతుధానపృతనాం. సుగ్రీవాదిభిరన్వితః శ్రీరామః అయాత్. మరుత్సుతో హనుమాన్ ఋక్షో జాంబవాన్. 19

శూల, చాప, శక్తి, భాణ. తోమర, ఖడ్గాది ఆయుధములతో దుర్గమమగు రాక్షససేనను, సుగ్రీవ, లక్ష్మణ, హనుమ, గంధమాదన, నీల, జాంబవంతాదులతో కూడి శ్రీరాముడెదిరించెను. 19

శ్లో॥ తేఽనీకపారఘుపతే రభిపత్య సర్వే
ద్వంద్వం వరూథమిభపత్తిరథాశ్వయోధైః ।
జఘ్నుర్ద్రుశం గిరిగదేషు భిరంగదాద్యా
స్సీతాభిమర్శ హతమంగళ రావణేశాన్ ॥ 20

టీ:- త ఇతి. తేరఘుపతేరనీకపాః అంగదాద్యాః సర్వే రావణస్య ఇభాదిభిః యద్వరూథం సైన్యం తత్ ద్వంద్వం యథా భవతి తథా అభిపత్య సంగమ్యద్రుమాదిభిర్జఘ్నుః. కాన్? సీతాయా అభిమర్శేన హతం మంగళం యస్య స రావణః ఈశో యేషాం తాన్. 20

సీతాదేవిని నిర్బంధించుటచే క్షీణించిన శ్రేయస్సుగల, రావణుడు అధిపతిగాగల గజ, తురగ, రథ, పదాది, చతుర్విధ సేనాయోధులుగల రాక్షస సైన్యమును, శ్రీరామచంద్రుని సైనిక యోధులగు అంగదాదులు, పర్వతములు, గదలు, బాణములతో ఎదిరించి ద్వంద్వ యుద్ధము చేసి చంపివేసిరి. 20

శ్లో॥ రక్షఃపతిస్స్వబలనష్టి మవేక్ష్య రుష్ట
ఆరుహ్య యానకమథాభిససార రామమ్ ।
స్వస్స్యందనే ద్యుమతిమాతలినో పనీతే
విభ్రాజమానమహనన్ని శితైః క్షురప్రైః ॥ 21

టీ:- రక్షః పతిరితి. స్వబలస్య నష్టిం నాశమవేక్ష్య రుష్టః క్రుద్ధస్సన్ యానకం పుష్పకవిమానం రథం వా ఆరుహ్య శ్రీరామమభిససార అథతం స్వస్స్యందనే స్వర్గస్థే ఇంద్రస్య రథే మాతలినా ఇంద్ర సారథి నోపనీతే ద్యుమతి దీప్తియుక్తే విభ్రాజమానమహనత్ అహన్. 21

లంకాధిపతి రావణుడు, తన సైన్యము నష్టమగుట నెరిగి కోపించి పుష్పక విమానమును అధిరోహించి శ్రీరామునిపైకి యుద్ధమునకు వచ్చెను. శ్రీరాముడును స్వర్గలోకము నుండి ఇంద్రునిచే పంపబడి, మాతలిచే తేబడిన ప్రకాశించెడి రథమును అధిరోహించి తీక్షణములగు బాణములతో రావణుని ఎదిరించెను. 21

శ్లో॥ రామస్తమాహ పురుషాదపురీషయన్నః
కాంతాసమక్షమ సతాపహృతాశ్వవత్తే ।
త్యక్త త్రపస్య ఫలమద్య జుగుప్సితస్య
యచ్ఛామి కాల ఇవ కర్తురలంఘ్యవీర్యః ॥ 22

టీ:- రామ ఇతి. హేపురుషాద పురీష రాక్షసపురీషప్రాయ యద్యస్మాదపహృతా శ్వవత్ శ్వా యథా అసమక్షం గృహం ప్రవిశ్య కిమపి హరతి తద్వత్ తస్మాజ్జుగుప్సితస్య కర్మణః కర్తుః తే అద్య కాల ఇవ అలంఘ్యవీర్యోఽహం ఫలం యచ్ఛామి. అధర్మకర్తుః పుంసః కాలో యథా యచ్ఛతీతి వా. 22

రాక్షస పురీష ప్రాయుడగు ఓ రావణా! నీవు కుక్కవలె నేను లేనప్పుడు సీతనపహరించితివి. అటువంటి అసహ్య కర్మ నొనరించిన లజ్జాహీనుడవగు నీకు, నేను యముని వలె తగిన ఫలమును ఒసంగెదను. 22

శ్లో॥ ఏవం క్షిపద్ధనుషి సంధితముత్ససర్జ
బాణం సవజ్రమివ తద్ధృదయం బిభేద ।
సోఽసృగ్వమన్ దశముఖైర్న్యపతద్విమానా
దా హేతి వాదిని జనే సుకృతీవ రిక్తః ॥ 23

టీ:- ఏవమితి. రిక్తః క్షీణపుణ్యః సుకృతీవిమానాదివ విమానాత్పుష్పకాత్ న్యపతదితి వా. రాక్షస స్త్రీణాం విలాపమాహ - పంచభిః. 23

అనుచు శ్రీరాముడు ధనుస్సున బాణమును సంధించి వదిలెను. ఆ బాణము వజ్రాయుధము వలె రావణుని హృదయమును ఛేదించెను. రావణుడు పది తలల నుండి రక్తమోడుచు, పుష్పకము నుండి (క్షీణ పుణ్యుడు పడినటుల) జనులు హాహాకారములొనర్చుచుండగా పడిపోయెను. రాక్షస స్త్రీల విలాపములను ఐదు శ్లోకములతో చెప్పుచున్నాడు. 23

శ్లో॥ తతో నిష్క్రమ్య లంకాయా యాతుధాన్యస్సహస్రశః ।
మందోదర్యా సమంతస్మిన్ ప్రరుదంత్య ఉపాద్రవన్ ॥ 24

అపుడు అనేకమంది రాక్షస స్త్రీలు మందోదరితో కూడి లంక నుండి బయలు వెడలి దుఃఖిస్తూ సమరాంగణమునకు వచ్చి, లక్ష్మణుని

శ్లో॥ తాంస్తాన్ బంధూన్పరిష్వజ్య లక్ష్మణేషుభిరర్దితాన్ ।
రురుదుస్సుస్వరం దీనాః ఘ్నంత్య ఆత్మానమాత్మనా ॥ 25

బాణములతో మృతి నొందిన ఆయా బంధువులను కౌగిలించుకుంటూ తమను తామే కొట్టుకొనుచు, రాగాలుదీస్తూ దుఃఖించిరి. (24-25)

టీ:- తత ఇతి. మందం స్వల్పముదరం యస్యాః తయా రావణ భార్యయా సహ. (24-25)

శ్లో॥ హా హతాస్స్మ వయం నాథ లోక రావణ రావణ ।
కం యాయాచ్ఛరణం లంకా త్వద్విహీనా పరార్దితా ॥ 26

ఓ ప్రభూ రావణా! నీవు పరలోకగతుడవు కాగా శత్రువులతో బాధింపబడు ఈ లంక ఎవరిని శరణు పొందవలెను. 26

టీ:- హేతి. పరైరర్దితా. (26-27)

శ్లో॥ న వై వేద మహాభాగ భవాన్ కామవశం గతః ।
తేజోఽనుభావం సీతాయా యేన నీతో దశామిమామ్ ॥ 27

అయ్యో మేమును హతులమైనాము. ఓ ప్రభూ నీవు కామాసక్తుడవై, నిన్ను ఈ స్థితికి తెచ్చిన సీతాదేవి మాహాత్మ్యమును తెలుసుకొనలేకపోతివి గదా! 27

శ్లో॥ కృతైషా విధవా లంకా వయం చ కులనందన ।
దేహః కృతోఽన్నంగృధ్రాణామాత్మా నరక హేతవే ॥ 28

ఓ రావణప్రభూ! ఈ లంకను, మమ్ములను అనాథలుగా చేసితివి. నీ శరీరమును గద్దలకు ఆహారముగను, ఆత్మను నరకభోగిగా చేసితివి. 28

టీ:- కృతేతి. గృధ్రాణామన్నం భక్ష్యః నరకహేతవే నరకభోగాయ. 28





ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్రీశుక ఉవాచ

శ్లో॥ స్వానాం విభీషణశ్చక్రే కోసలేంద్రాను మోదితః ।
పితృమేధ విధానేన యదుక్తం సాంపరాయికమ్ ॥ 29

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

అని రాక్షస స్త్రీలు దుఃఖించుచుండగ శ్రీరామచంద్రునిచే ఆజ్ఞాపించబడి విభీషణులు వారందరికి పితృమేధోక్త ప్రకారముగ ఔర్ధ్వ దైహిక కర్మలను ఆచరించెను. 29

శ్లో॥ తతో దదర్శ భగవానశోకవని కాలయే ।
క్షామాం స్వవిరహ వ్యాధిం శిశుపామూలమాశ్రితామ్ ॥ 30

టీ:- స్వానామితి. సాంపరాయికం ఔర్ధ్వదైహికం. (29-30)

శ్లో॥ రామః ప్రియతమాం భార్యాం దీనాం వీక్ష్యాన్వకంపత ।
ఆత్మ సందర్శనాహ్లాద వికసన్ముఖ పంకజామ్ ॥ 31

టీ:- రామ ఇతి. ఆత్మనః స్వస్య సందర్శనేన ఆహ్లాదః తేన వికసత్ ముఖపంకజం యస్యాస్తాం. 31

ఆ పిమ్మట శ్రీరామచంద్రుడు తన ఎడబాటుతో కృశించి అశోక వనములో శింశుపా వృక్షము క్రిందనున్నట్టి, తనను గాంచిన ఆనందములో వికసించిన ముఖము గల తన భార్యయగు సీతను గాంచి దయార్ద్ర హృదయుడాయెను. (30-31)

శ్లో॥ ఆరోప్యారురుహే యానం భ్రాతృభ్యాం హనుమద్యుతః ।
విభీషణాయ భగవాన్ దత్వా రక్షో గణేశతామ్ ॥ 32

టీ:- ఆరోప్యేతి. యానం పుష్పకం భ్రాతృభ్యాం లక్ష్మణ సుగ్రీవాభ్యాం. 32

లంకారాజ్యమును విభీషణున కిచ్చి లక్ష్మణ, సుగ్రీవ, హనుమంతులతో గూడి సీతాదేవిని పుష్పకము నెక్కించి తాను అధిరోహించెను. 32

శ్లో॥ లంకామాయుశ్చ కల్పాంతం యయౌ తీర్ణవ్రతః పురీం ।
అవకీర్యమాణః కుసుమైర్లోక పాలార్పితైః పథి ॥ 33

టీ:- లంకామితి. ఆయుశ్చ దత్వా తేనాపి సహైవ యయౌ. 33

శ్లో॥ ఉపగీయమాన చరితశ్శతధృత్యాదిభిర్ముదా ।
గోమూత్ర యావకం శ్రుత్వా భ్రాతరం వల్కలాంబరమ్ ॥ 34

శ్లో॥ మహాకారుణికోஉతప్యజ్జటిలం స్థండిలేశయమ్ ।
భరతఃప్రాప్తమాకర్ణ్య పౌరామాత్య పురోహితైః ॥ 35

టీ:- ఉపగీయమానేతి. గోమూత్ర యావకం గోమూత్రపక్వయవాన్న భోజనం భ్రాతరం భరతం. (34-35)

శ్లో॥ పాదుకే శిరసి న్యస్య రామం ప్రత్యుద్గతోஉగ్రజం ।
నందిగ్రామాత్స్వశిబిరాద్గీతవాదిత్రనిస్స్వనైః ॥ 36

టీ:- పాదుకే ఇతి. స్వశిబిరాత్ రామం వినా అయోధ్యామప్రవిశన్ స్వస్య వాసం యత్ర నిర్మితవాన్ తస్మాత్సకాశాద్గీతాదిభిర్యుక్తో రామం ప్రత్యుద్గతః అభిముఖం యయౌ. 36

ఈ విధముగా పదునాలుగు సంవత్సర అరణ్యవాస కాలమును పూర్తిచేసిన శ్రీరాముని పుష్పకము పయనించు మార్గములో లోక పాలకులు పుష్పములు చల్లుచుండగ అయోధ్యా నగరము వైపు పయనించెను. 33

శతధృత్యాదులు తన యశస్సును గానము చేయుచుండగా శ్రీరాముడు తన సోదరుడగు భరతుడు గోమూత్రములో పచనము చేయబడిన యవాన్నమును భుజిస్తూ, నారవస్త్రములను ధరించి భూ శయనుడై ఉన్నాడని తెలిసికొని గొప్ప దయతో నిండిన హృదయము కలవాడాయెను. పురజనులు, అమాత్యులు, పురోహితులతో కూడిన భరతుడు తన శిబిరమగు నంది గ్రామము నుండి వివిధ వాయిద్యము లతో బ్రాహ్మణులు స్వస్తివాచకములు పఠించుచుండ స్వర్ణ పతాకము లతో కూడిన బంగారు రథములు, అశ్వములు గల సేనలు వెంబడించి రాగా అనేక మంది వందిమాగధులు భృత్యులు సంవృద్ధములగు కానుకలు తీసుకొని రాగా రాజర్హములగు ఛత్ర, చామరాదులతో అలంకరించబడిన పాదులకలను శిరస్సున నిడుకొని శ్రీరామునకు ఎదురేగి మిక్కిలి అనురాగము గల హృదయముతో, రాముని గాంచి అంజలి ఘటించి, ఆనందాశ్రువులతో నిండిన నేత్రములతో పాదుక లను శ్రీరాముని ముందుంచి అతని పాదములబడెను. శ్రీరాముడు ఆ

శ్లో॥ బ్రహ్మఘోషేణ చ ముహుః పఠద్భిర్బ్రహ్మవాదిభిః ।
స్వర్ణకక్ష్యా పతాకాభిర్హైమైశ్చిత్ర ధ్వజై రథైః ॥ 37

శ్లో॥ సదశ్వైరుక్మ సన్నాహైర్భటైః పురటవర్మిభిః ।
శ్రేణీభిర్వారముఖ్యాభిర్భృత్యైశ్చై పాయనోద్వహైః ॥ 38

టీ:- బ్రహ్మఘోషేణేతి. బ్రహ్మఘోషేణ బృహతా ఘోషేణ పఠద్భిః స్వస్తివాచనికాదికం వదద్భిః స్వర్ణరసాక్తాః కక్ష్యాః ప్రాంతాః యాసాం తాభిః పతాకాభిః హైమైరిత్యాదిచత్వారి రథవిశేషణాని. (37-38)

శ్లో॥ పారమేష్ఠ్యాన్యుపాదాయ పణ్యాన్యుచ్చావచాని చ ।
పాదయోరపతేత్ప్రేమ్ణా ప్రక్లిన్నహృదయేక్షణః ॥ 39

టీ:- పారమేష్ఠ్యానీతి. పామేష్ఠ్యాని రాజార్హాణి ఛత్ర చామరాదీని. ప్రేమ్ణాప్రక్లిన్నం హృదయం ఈక్షణే చ నేత్రే యస్య. 39

శ్లో॥ పాదుకే న్యస్య పురతః ప్రాంజలిర్బాష్పలోచనః ।
తమాశ్లిష్య దృఢం దోర్భ్యాం స్నపయన్నేత్రజైర్జలైః ॥ 40

భరతుణ్ణి గొప్ప ప్రేమతో గూడిన ఆనంద బాష్పములతో తడపుచు గాఢముగ కౌగలించుకొనెను. (34-40)



శ్లో॥ రామో లక్ష్మణ సీతాభ్యాం విప్రేభ్యోఽర్హత్తమాశ్చయే ।
తేభ్యస్స్వయం నమశ్చక్రే ప్రజాభిశ్చ నమస్కృతః ॥ 41

శ్రీరాముడు, లక్ష్మణుడు, సీతయును బ్రాహ్మణులకు, పెద్దవారికి నమస్కరించిరి. ప్రజలందరు శ్రీరామునికి నమస్కరించిరి. 41

శ్లో॥ ధున్వంత ఉత్తరాసంగం పతిం వీక్ష్య చిరాగతమ్ ।
ఉత్తరాః కోసలామాత్యైః కిరంతో నన్నృతుర్ముదా ॥ 42

చాలాకాలము పిదప సీతారాములను గాంచి జనులు, అమాత్యులును సంతోషముతో నాట్యమొనరించిరి. 42

టీ:- పాదుకేఇతి. నేత్రజైః జలైః తం భరతం స్నపయన్నాశ్లిష్య. 40-42

శ్లో॥ పాదుకే భరతోఽగృహ్ణచ్చామరం వ్యజనోత్తమే ।
విభీషణశ్చ సుగ్రీవశ్శ్వేతచ్ఛత్రం మరుత్సుతః ॥ 43

టీ:- అయోధ్యాప్రవేశప్రకారమాహ - పాదుకే ఇత్యాదిసార్ధైస్త్రిభిః. 43

శ్లో॥ ధనుర్నిషంగాన్ శత్రుఘ్నస్సీతా తీర్థ కమడలుం ।
అబిభ్రదం గదః ఖడ్గం హేమం చర్మర్క్షరాణ్ణృప ॥ 44

శ్లో॥ పుష్పకస్థో వృతః స్త్రీభిః స్తూయమానశ్చ వందిభిః ।
విరేజే భగవాన్ రాజన్ గ్రహైశ్చంద్ర ఇవోదితః ॥ 45

టీ:- ధనురితి. ధనుశ్చ నిషంగౌ చ. ఋక్షరాట్ జాంబవాన్. 44-45

వారు అయోధ్యానగరములోనికి ప్రవేశించిన విధానమును చెప్పుచున్నాడు, అపుడు భరతుడు పాదుకలను, విభీషణుడు చామరమును, సుగ్రీవుడు వ్యజనమును, హనుమంతుడు శ్వేత ఛత్రమును, శత్రుఘ్నుడు ధనుర్బాణములను, సీతాదేవి జలకుంభమును, అంగదుడు ఖడ్గమును, జాంబవంతుడు బంగారు డాలును ధరించి వెంటరాగా, వందిమాగదులు స్తోత్రములు చేయుచుండగా, సోదరులు ఆనందించుచుండ, నక్షత్రములతో గూడి ఉదయించిన చంద్రునివలె ప్రకాశిస్తూ శ్రీరామచంద్రుడు అయోధ్యానగరమున ప్రవేశించెను. రాజభవనమునకు చేరి తల్లులకు నమస్కరించెను. గురువులకు ప్రణమిల్లెను. స్నేహితులనాదరించెను. (43-47)

శ్లో॥ భ్రాతృభిర్నందితస్సోఽథ సోత్సవాం ప్రావిశత్పురీమ్ ।
ప్రవిశ్య రాజభవనం గురుపత్నీస్స్వమాతరం ॥ 46

టీ:- భ్రాతృభిరితి. గురుపత్నీ. కైకేయ్యాద్యాః. 46

శ్లో॥ గురూన్ వయస్యానుచరాన్ పూజితః ప్రత్యపూజయత్ ।
వైదేహీ లక్ష్మణశ్చాథ యథావత్సముపేయతుః ॥ 47

టీ:- గురూనితి. వయస్యాన్ అనుచరాంశ్చ. 47

శ్లో॥ ప్రాప్యాత్మజాన్ మాతరస్స్వాన్ ప్రాణాం స్తన్వ ఇవోత్థితాః ।
ఆరోప్యాంకేఽభిషించంత్యోబాష్పౌఘైర్విజహుశ్శుచః ॥ 48

కౌసల్యా, సుమిత్ర, కైకలు రామ, లక్ష్మణ, సీతలను చూచి తమ ప్రాణములు లేచివచ్చినటుల భావించిరి. ఆనందాశ్రువులతో వారి నభిషించిస్తూ తమ ఉత్సంగములలో చేర్చుకొనిరి. 48

శ్లో॥ జటా నిర్ముచ్య విధివత్కులవృద్ధై స్సమం గురుః ।
అభిషించద్యథైవేంద్రం చతుస్సింధుజలాదిభిః ॥ 49

కులగురువగు వసిష్ఠుడు, కుల వృద్ధులతో కూడి రాముని జటలను చిక్కు తీయించి నాలుగు సముద్రముల జలముతో అభిషేకము గావించెను. 49



శ్లో॥ ఏవం కృతశిరస్స్నానస్సువాసాస్సు ష్వలంకృతః ।
స్వలంకృతైస్సువాసోభిర్భ్రాతృభిర్భార్యయా బభౌ ॥ 50

ఈ విధముగా అభ్యంజన స్నాన మొనరించిన శ్రీరాముడు తన తమ్ములతో, సీతాదేవితో సహా చక్కని వస్త్రములను, ఆభరణములను ధరించి ప్రకాశించుచుండెను. 50

శ్లో॥ అగ్రహీదాసనం భ్రాత్రా ప్రణిపత్య ప్రసాదితః ।
ప్రజాస్స్వధర్మనిరతా వర్ణాశ్రమగుణాన్వితాః ॥ 51

భరతుడు నమస్కరించి రాజ్యమును పరిగ్రహింపుమని ప్రార్థించగా శ్రీరాముడు సింహాసనమధిష్ఠించి రాజ్యమేలెను. శ్రీరాముడు రాజ్యపాలన జేయుచుండగా ప్రజలు స్వధర్మపరులై వర్ణాశ్రమ ధర్మములను, మంచి గుణములను పాటించిరి. 51

శ్లో॥ జుగోప పితృవద్రామో మేనిరే పితరం చ తం ।
త్రేతాయాం వర్తమానాయాం కాలః కృతసమోఽభవత్ ॥ 52

శ్రీరాముడు ప్రజలను కన్నబిడ్డలవలె పాలించెను. ప్రజలు శ్రీరాముని తండ్రిగా భావించిరి. (శ్రీరాముడు రాజ్యమేలుచుండగా) త్రేతాయుగ కాలము కృతయుగ సమమయ్యెను. 52

శ్లో॥ రామే రాజని ధర్మజ్ఞే సర్వభూత సుఖావహే ।
వనాని నద్యో గిరయో వర్షాణి ద్వీప సింధవః ॥ 53

శ్లో॥ సర్వే కామదుఘా ఆసన్ ప్రజానాం భరతర్షభ ।
నాధి వ్యాధిజరాక్షుత్తృడ్దుఃఖ శోక భయక్లమాః ॥ 54

శ్రీరాముడు రాజ్యమేలుచుండగా అరణ్యములు, నదులు, పర్వతములు, వర్షములు, ద్వీపములు, సముద్రములు మున్నగునవన్నియు ప్రజల కోరిక నీడేర్చుచుండెను. రామరాజ్యమున ప్రజలకు ఆదివ్యాధులు, ముసలితనము, ఆకలిదప్పికలు, దుఃఖశోకములు, భయశ్రమలు, మృత్యువుల భయము లేకుండెను. (53-54)

శ్లో॥ మృత్యుశ్చానిచ్ఛతామాసీద్రామే రాజన్యధోక్షజే ।
ఏకపత్నీ వ్రతధరో రాజర్షి చరితశ్శుచిః ॥ 55

శ్లో॥ స్వధర్మాన్ గృహమేధీయాన్ శిక్షయన్ వ్రతమాచరత్ ।
ప్రేమానువృత్త్యా శీలేన ప్రశ్రయావనతా సతీ ।
భియా హ్రియా చ భావజ్ఞా భర్తుస్సీతాహరన్మనః ॥ 56

టీ:- ప్రాప్యేతి. బాష్పౌఘైరభిషించంత్యః శుచః శోకాన్ విజహుః. శేషం స్పష్టం. (48-56)

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,

దశమోఽధ్యాయః

శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడై సచ్చరితతో గృహస్థులకు స్వధర్మములు నేర్పుతూ, తాను ఆచరించుచుండెను. సీతాదేవి శీలముతో, ప్రేమతో శ్రీరాముని మనస్సు నాకట్టుకొనెను. (55-56)

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు

పదవ అధ్యాయము సమాప్తము.

ఏకాదశోఽ ధ్యాయః

శ్రీశుక ఉవాచ

శ్లో॥ భగవానాత్మనాత్మానం రామ ఉత్తమ కల్పకైః ।
సర్వ దేవమయం దేవమీజ ఆచార్యవాన్ మఖైః ॥ 1

టీ:- శ్లో."తతశ్చైకాదశేఽ యోధ్యామావసన్ననుజైస్సహ,యజ్ఞాది యచ్చ కారేశో రామస్తదనువర్ణ్యతే. యద్వా. రామ ఏకాదశే యజ్ఞైరీజే రాష్ట్రే ష్వవాసయత్, కుశాదీన్ వృత్తిరుదితా ప్రజానాం రాఘవస్య చ." 1-2

శ్లో॥ హోత్రే దదౌ దిశం ప్రాచీం బ్రహ్మణే దక్షిణాం ప్రభుః ।
అధ్వర్యవే ప్రతీచీం వా ఉదీచీం సామగాయినే ॥ 2

శ్లో॥ ఆచార్యాయ దదౌ శేషాం యావతీ భూస్తదంతరా ।
మన్యమాన ఇదం కృత్స్నం బ్రాహ్మణోఽ ర్హతి నిస్పృహః ॥ 3

టీ:- ఆచార్యాయేతి. తదంతరా తాసాం దిశాం మధ్యే యావతీ భూః తాం బ్రాహ్మణ ఏవార్హతీతి మన్యమానః. 3

11 వ అధ్యాయము

ఈ పదకొండవ అధ్యాయమున శ్రీరాముడు అయోధ్యనుచేరి తమ్ములగూడి యజ్ఞాదులొనరించిన విషయము వర్ణించబడినది.

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

సర్వదేవమయుడు, భగవంతుడునుఅగు శ్రీరాముడు ఆచార్యుని సహాయముతో ఉత్తమములగు యజ్ఞములను, తనను గురించి తాను ఒనర్చెను. 1

ప్రభువగు శ్రీరామచంద్రుడు ఆ యజ్ఞములలో హోతకు తూర్పు దిశలోని భూములను, బ్రహ్మకు దక్షిణదిగ్భూములను, అధ్వర్యునకు పశ్చిమపు భూములను, ఉద్గాతకు ఉత్తరపు భూములను ఒసంగెను. 2

ఈ నాలుగు దిక్కుల మధ్యనున్న భూమిని అంతటికిని, కోరికలు లేని బ్రాహ్మణుడే తగిన వాడని తలచి ఆ నాలుగు దిక్కుల మధ్య భూమిని ఆచార్యునకొసగెను. 3





శ్లో॥ ఇత్యయం సదలంకారవాసోభ్యామవశేషతః ।
తదా రాజ్ఞ్యపి వైదేహీ సౌమంగళ్యావ శేషితా ॥ 4

శ్రీరాముడు కేవలము తాను ధరించిన వస్త్రములు మాత్రమే మిగులునటుల సర్వాభరణములను బ్రాహ్మణులకొసగెను. రాణియగు సీతాదేవికి కేవలము మంగళసూత్రము మాత్రమే మిగిల్చి మిగిలిన ఆభరణములన్నింటిని బ్రాహ్మణులకొసగెను. 4

శ్లో॥ తత్ర బ్రాహ్మణ దేవస్య వాత్సల్యం వీక్ష్య సజ్జనాః ।
ప్రీతాః క్లిన్నధియస్తస్మై ప్రత్యర్ప్యేదం బభాషిరే ॥ 5

టీ:- ఇతీతి. అయం రామః. తత్తదాసౌ మాంగళ్యమాభరణాదికం తావన్మాత్ర మవశేషితం యస్యాః తద్వ్యతిరిక్తం హిరణ్యాదిసర్వం దదావిత్యర్థః (4-5)

బ్రాహ్మణులనే దేవునిగా భావించెడి శ్రీరామచంద్రుని యొక్క ప్రేమతత్వమును (బ్రాహ్మణులపైన వాత్సల్యమును) గాంచిన, శ్రీరాముడి నుండి కానుకలను గ్రహించిన సత్పురుషులు ప్రీతులై శ్రీరాముడు తమకు ఒసంగిన భూ, ఆభరణాదులను గ్రహించి నందులకు బాధ చెందిన బుద్ధితో తమకు శ్రీరాముడిచ్చిన కానుకలను శ్రీరామునకె సమర్పించి ఇట్లు పలికెను. 5

శ్లో॥ అప్రత్తం నస్త్వయా కిన్ను భగవన్ భువనేశ్వర ।
యన్నోఽన్తర్హృదయం విశ్వతమో హంసి స్వరోచిషా ॥ 6

టీ:- అప్రత్తమితి. అప్రత్తం కిం అదత్తం సర్వం దత్తమిత్యర్థః. విశ్య ప్రవిశ్య. 6

చతుర్దశ భువనాధీశ్వరుడవగు ఓ భగవంతుడా! నీవు మాకు సమస్తము నొసంగితివి. ఇవ్వనిదేది లేదు. ఏలనన నీవు మా హృదయములలో ప్రవేశించి నీ కాంతితో (జ్ఞానజ్యోతితో) తమస్సను అజ్ఞానాంధకారమును నశింపజేయుచున్నావు. 6

శ్లో॥ నమో బ్రహ్మణ్య దేవాయ రామాయకుంఠ మేధసే ।
ఉత్తమశ్లోకధుర్యాయ న్యస్తదండార్పితాంఘ్రయే ॥ 7

మునులు మనస్సులతో చింతిచెడి పాదములు గల, పుణ్య పురుషులలో శ్రేష్ఠుడగు, బుద్ధి బలశాలియగు, పరబ్రహ్మ తత్త్వమైన శ్రీరామచంద్రునకు నమస్సులు. 7

శ్లో॥ కదాచిల్లోక జిజ్ఞాసుర్గూఢో రాత్ర్యామలక్షితః ।
చరన్ వచోఽశృణో ద్రామో భార్యాముద్దిశ్య కస్య చిత్ ॥ 8

టీ:- నమ ఇతి. న్యస్తదండైర్మునిభిః అర్పితౌ చిత్తేన్యస్తావంఘ్రీ యస్య తస్మై తేష్వర్పితాంఘ్రయ ఇతి వా. (7-8)

ఒకసారి శ్రీరాముడు ప్రజల భావములను తెలిసికొనుటకై రాత్రి వేళలో రహస్యముగ తిరుగుచుండగా శ్రీరాముని రాకను కాంచని ఒక వ్యక్తి తన భార్యను గురించి పలికిన పలుకులను శ్రీరాముడు వినెను. 8

శ్లో॥ నాహం బిభర్మిత్వాం దుష్టామసతీం పరవేశ్మగామ్ ।
స్త్రైణో హి బిభృయాత్సీతాం రామో నాహం భజే పునః ॥ 9

టీ:- నేతి. స్త్రైణః స్త్రీపరతంత్రః. 9

సాధ్వివికానట్టి, దుష్టురాలవైనట్టి, ఇతర ఇంటిలోకి వెళ్ళిన నిన్ను నేను భరించను. లంకలో ఉండి వచ్చిన సీతను స్త్రీ పరతంత్రుడగు రాముడు భరించినటుల భరించుటకు నేను రాముడను కాను. తిరిగి నిన్ను భరించను. అని పలికిన పలుకులను శ్రీరాముడు వినెను. 9

శ్లో॥ ఇతి లోకాద్బహుముఖాద్దురారాధ్యాదసంవిదః ।
పత్యా భీతేన సాత్యక్తా ప్రాప్తా ప్రాచేతసాశ్రమమ్ ॥ 10

టీ:- ఇతీతి. అసంవిదః అజ్ఞాత్. ప్రాచేతసో వాల్మీకిః తస్యాశ్రమం. సా సీతా. ప్రాప. 10

ఈ విధములైన లోకుల అనాజ్ఞానోక్తులను తన గూఢచారుల ముఖాన కూడా విని శ్రీరాముడు లోకాపవాదమునకు భీతిల్లి సీతను అరణ్యములో విడువగా, ఆ సీతాదేవి వాల్మీకి ఆశ్రమమునుచేరెను. 10

శ్లో॥ అంతర్వత్న్యాగతే కాలే యమౌ సాసుషువే సుతౌ ।
కుశో లవ ఇతి ఖ్యాతౌ తయోశ్చక్రే క్రియా మునిః ॥ 11

ఆ సీతాదేవి వాల్మీకి ఆశ్రమము చేరువరకే గర్భవతియై యుండెను. కొంతకాలము పిదప ఆ వాల్మీకాశ్రమముననే ఇద్దరు పుత్రులను కనెను. వారు కుశ లవులను పేర్లతో ఖ్యాతి చెందిరి. ఆ కుశలవులకు వాల్మీకి జాతకర్మాదిక్రియల నొనరించెను. 11





శ్లో॥ అంగదశ్చంద్రకేతుశ్చ లక్ష్మణస్యాత్మజావుభౌ ।
తక్షః పుష్కల ఇత్యాస్తాం భరతస్య మహీపతేః ॥ 12

లక్ష్మణునకు అంగదుడు, చంద్రకేతువు అను ఇద్దరు పుత్రులు కలిగిరి. యువరాజగు భరతునకు తక్షుడు, పుష్కలకుడు అను పుత్రులు కలిగిరి. 12

శ్లో॥ సుబాహుశ్శ్రుతసేనశ్చ శత్రుఘ్నస్య బభూవతుః ।
గంధర్వాన్ కోటిశో జఘ్నే భరతో విజయేదిశామ్ ॥ 13

శత్రుఘ్నునకు సుబాహువు, శ్రుతసేనుడు అను ఇద్దరు పుత్రులు కలిగిరి. భరతుడు దిగ్విజయ యాత్రలో కోట్లకొలది మంది గంధర్వులను సంహరించెను. 13

శ్లో॥ తదీయం ధనమానీయ సర్వం రాజ్ఞేన్యవేదయత్ ।
శత్రుఘ్నశ్చ మధోః పుత్రం లవణం నామ రాక్షసమ్ ॥ 14

ఆ గంధర్వుల సమస్త ధనమును తెచ్చి రాజగు శ్రీరామచంద్రునకర్పించెను. శత్రుఘ్నుడు మధువను రాక్షసుని పుత్రుడగు లవణుని (ఉత్తర శ్లోకములో అన్వయము). 14

శ్లో॥ హత్వా మధువనే చక్రే మధురాం నామ వై పురీం ।
మునౌ నిక్షిప్య తనయౌ సీతా భర్త్రా వివాసితా ॥ 15

టీ:- అంతర్వత్నీతి. అంతర్వత్నీ గర్భిణీ సతీ ప్రాచేతసాశ్రమం ప్రాపేతి పూర్వేణాన్వయః. క్రియాః జాతకర్మాద్యాః. (11-16)

మధు పుత్రుడగు లవణుని (పూర్వ శ్లోకాన్వయం) చంపి మధువనములో మధుర అను పేరుగల పట్టణమును నిర్మించెను. భర్తచేత అరణ్యములో వదలబడిన తన పుత్రులను వాల్మీకి వద్ద ఉంచి (ఉత్తర శ్లోకములో అన్వయము). 15

శ్లో॥ ధ్యాయంతీ రామ చరణౌ వివరం ప్రవివేశ హ ।
తచ్ఛ్రుత్వా భగవాన్ రామో రుంధన్నపి ధియా శుచః ॥ 16

శ్రీరామచంరదుని పాదపద్మములను ధ్యానిస్తు పాతాళమున ప్రవేశించెను. ( తన తల్లియగు భూదేవి ఒడిని చేరెను) ఆ విషయమును వినిన భగవంతుడగు శ్రీరాముడు తన బుద్ధితో దుఃఖమును అరికట్టుచుగూడా (ఉత్తర శ్లోకములో అన్వయము). 16

శ్లో॥ స్మరం స్తస్యాగుణాం స్తాంస్తాన్నాశక్నోద్రోద్ధుమీశ్వరః ।
స్త్రీపుంప్రసంగ ఏతావాన్ సర్వత్ర త్రాసమావహః ॥ 17

టీ:- స్మరన్నితి. ఈశ్వరోఽపి శుచోరోద్ధుం నాశక్నోత్ న చాతి చిత్రమేత దిత్యాహ - స్త్రీ పుంసోః ప్రసంగః ఆసక్తిః త్రాసమావహతీతి తథా. విభక్తేరలుగార్షః. భయావహ ఇతి పాఠాంతరే సుగమం. 17

ఆ సీతాదేవి యొక్క ఆయా గుణములను స్మరిస్తూ ఈశ్వరుడై ఉండి గూడా ఆ సీతతో వియోగమును సహించలేకుండెను. స్త్రీ పురుషులయొక్క ఆసక్తి అంతటను ఇంతటి భయావహమగును. (త్రాసమాహవః అనుచోట త్రాసం అని విభక్తి లోపము ఆర్షము). 17

శ్లో॥ అపీశ్వరాణాం కిముత గ్రామ్యస్య గృహచేతసః ।
తత ఊర్ధ్వం బ్రహ్మచర్యం ధారయన్న జుహోత్ప్రభుః ॥ 18

టీ:- అపీతికిముతేతి. ప్రాసంగికోక్తిః అగ్నిహోత్ర మజుహోత్ జుహార. 18

జగదీశ్వరులైన వారికే ప్రియావిరహము ఇటుల బాధ కలిగించగ గృహిణి చేతస్కులగు సామాన్య మానవుల గురించి ఏమి చెప్ప వలయును. అప్పటి నుండి శ్రీరామచంద్రుడు బ్రహ్మచర్యమును అవలంబించి పదమూడువేల సంవత్సరముల వరకు అవిచ్ఛిన్నముగ అగ్నిహోత్రములను వేల్చుచుండెను. 18

శ్లో॥ త్రయోదశాబ్ద సాహస్రమగ్నిహోత్ర మఖండితం ।
స్మరతాం హృది విన్యస్య విద్ధం దండ కకంటకైః ।
స్వపాద పల్లవం రామ ఆత్మజ్యోతిరగాత్తతః ॥ 19

టీ:- త్రయోదశేతి.ఆత్మజ్యోర్నిజం ధామ. 19

దండకారణ్యములలోని కంటకములచేత గుచ్చ బడినట్టియు చిగురాకులలాంటి తన పాదములను, ధ్యానించెడు భక్తుల హృదయాలలో ఉంచి, జ్యోతి స్వరూపమగు ఆత్మ పదమందెను. (ఆత్మ ధామమును చేరెను). 19

శ్లో॥ నేదం యశో రఘుపతేస్సురయాచ్ఞయాత్త
లీలాతనో రధికసామ్య విముక్త ధామ్నః ।
రక్షోవధో జలధి బంధన మస్త్ర పూగైః
కిం తస్య శత్రుహననే కవయస్సహాయాః ॥ 20

టీ:- నేతి. జలధి బంధనం అస్త్రపూగైశ్చ రక్షసాం వధ ఇతి ఇదం కవిభిరాశ్చర్యమివ వర్ణితమపి యశః స్తుతిర్నభవతి. తత్ర హేతుః అధికసామ్యాభ్యాం విముక్తం ధామ ప్రభావో యస్య తస్య కిం కపయః సహాయాః. అతః సుగ్రీవాద్యాశ్రయణం యథా లీలామాత్రం. తథైవేదమపి యుక్తం చేత్తదిత్యాహ సురాణాం యాచ్ఞాయాం ఆత్తా స్వీకృతా లీలార్థా. తనుర్యేన తస్య. 20

దేవతల కోరిక తీర్చుటకై, విలాసమునకై ధరించిన దేహము గల్గినట్టి హెచ్చు తగ్గులు వదిలిన (ద్వంద్వ రహితుడు) శ్రీరామ చంద్రునకు, శత్రు విజయమున సుగ్రీవాది కపుల సహాయము ఏ విధముగా లీలామాత్రమో అటులనే ఆ శ్రీరామచంద్రుని విషయమున సేతు బంధనము, అస్త్రములతో రాక్షస వధాదికములు విలాసముగా ఆచరించినవే (లీలా మాత్రములే). ఈ విలాసములన్నియు కవులచేత వర్ణించబడటము కీర్తియేగాని, స్తుతి కాదు, ఆశ్చర్యమేమీకాదు. 20

శ్లో॥ యస్యామలం నృపసదస్సు యశోఽధునాపి
గాయంత్యఘఘ్నమృషయో దిగిభేంద్రపట్టమ్ ।
తన్నా కపాల వసుపాల కిరీటజుష్టం
పాదాంబుజం రఘుపతే శ్శరణం ప్రపద్యే ॥ 21

టీ:- ఏవం విధలీలాప్రయోజనం దర్శయన్. ప్రణమతి – యస్యేతి. యస్య యశః నృపాణాం యుధిష్ఠిరాదీనాం సదస్సు ఋషయో మార్కండేయాదయో గాయంతి. దిగిభేంద్రాణాం పట్టవదావరణ రూపం

దిగ్గజముల ఆవరణ పర్యంతము (దిగంతముల వరకు) వ్యాపించిన శ్రీరామచంద్రుని కీర్తి యుధిష్ఠిరాది రాజ సభలలో గానము చేయబడును. మార్కండేయాది ఋషులు గానము చేయుదురు. స్వర్గ పాలకుడగు ఇంద్రుడు, భూ పాలకులు తమ కిరీటములచే శ్రీరామ చంద్రుని పాదపద్మములను స్పృశించుదురు. అట్టి శ్రీరామచంద్రుని శరణు పొందుచున్నాను. 21

తత్పర్యంతం వ్యాప్తమిత్యర్థః. నాకపాలా దేవాః వసుపాలాశ్చ వసుధా పాలాశ్చ తేషాం కిరీటైః జుష్టం పాదాంబుజం యస్య తం రఘుపతిం పాఠాంతరే తత్తస్య రఘుపతేర్జుష్టం పాదాంబుజం ప్రపద్య ఇత్యర్థః21

శ్లో॥ సయైస్స్పృష్టోఽభిదృష్టో వా సంవిష్టోఽనుగతోఽపి వా ।
కోసలాస్తే యయుస్స్థానం యత్ర గచ్ఛంతి యోగినః ॥ 22

టీ:- స ఇతి. స రామః సంవిష్టః ఉపవిష్టః. అనుగతో వా యైః తే కోశలదేశవాసినః సర్వేఽపి యత్ర యోగినో గచ్ఛంతి తత్ స్థానం యయుః 22

ఆ రాముడు ఏ కోసల దేశ వాసులచే స్పృశించబడినాడో, చూడబడినాడో, కలిసి కూర్చుండబడినాడో, అనుసరించబడినాడో ఆ కోసల దేశ వాసులు (శ్రీరామున్ని స్పృశించిన, చూచిన, కలసి కూర్చుండిన, అనుసరించిన, కోసల జనులు) యోగులు వెళ్ళెడి స్థానమునకు వెడలిరి. (ముక్తినొందిరి) 22

శ్లో॥ పురుషో రామచరితం శ్రవణైరుపధారయన్ ।
ఆనృశ్యంస్యపరో రాజన్ కర్మబంధైర్విముచ్యతే ॥ 23

టీ:- పురుష ఇతి. అనృశంస్య పరః ఉపశమనిష్ఠస్సన్ విముచ్యతే. 23

ఓ పరీక్షిద్రాజా! శ్రీరామచంద్రుని చరిత్రను వినిన పురుషుడు ఉపశమనిష్ఠుడై (శాంతిని పొంది) కర్మ బంధముల నుండి విముక్తి నొందును. 23

పరీక్షిదువాచ

శ్లో॥ కథం స భగవాన్రామో భ్రాతౄన్ స్వాన్ స్వయమాత్మనః ।
తస్మిన్ వాతేఽన్వవర్తంత ప్రజాః పౌరాస్తథేశ్వరే ॥ 24

పరీక్షిద్రాజు ఈ విధముగా పలికెను.

శ్రీరాముడు స్వయముగా ఎటులుండెను. తన అంశభూతులగు తమ్ముల విషయమున ఎటుల వర్తించెను. ఈశ్వరుడగు శ్రీరాముని

టీ:- కథమితి. స రామః స్వయం కథమవర్తత భ్రాతౄన్ ప్రతి వా కథమవర్తత. కథంభూతాన్ ఆత్మనః ఆత్మాంశభూతాన్ తస్మిన్ వా ఈశ్వరే తే భ్రాత్రాదయః. అను అనంతరం కథమపర్తంతేతి ప్రశ్న త్రయం. 24

విషయమున సోదరులు, పురప్రజలు, ఎటుల వర్తించిరి. (శ్రీరాముని స్థితి ఎట్టిది?, సోదరులస్థితి ఎట్టిది?, ప్రజలస్థితి ఎట్టిది?) అని మూడు ప్రశ్నలను పరీక్షిద్రాజు ప్రశ్నించెను. 24

శ్రీశుక ఉవాచ

శ్లో॥ అథా దిశద్దిగ్విజయే భ్రాతౄంస్త్రిభువనేశ్వరః ।
ఆత్మానం దర్శయన్ స్వానాం పురీమైక్షత సానుగః ॥ 25

టీ:- తతః శ్రీరామస్య భ్రాత్రాదిషు వృత్తిప్రకారమాహ - అథేతి. అనేనైవ భ్రాతౄణామపి తదాజ్ఞానుసారితయా వృత్తిరుక్తా అథ సింహాసన స్వీకారానంతరం. 25

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

పరీక్షిత్తు అడిగిన మూడు ప్రశ్నలకు, ఈ శాసనము నుండి అధ్యాయం చివరి వరకు ఉత్తరములు తెలుపబడుచున్నవి. అనుజుల విషయమై శ్రీరాముని ప్రవృత్తిని తెలుపుచున్నాడు. శ్రీరాముడు సింహాసనమునధిష్ఠించిన పిదప అనుజులను దిగ్విజయమునకై ఆదేశించెను. దీనితో అనుజుల యొక్క శ్రీరాముని ఆజ్ఞాకారిత్వము సూచించబడినది. తనవారికి తన దర్శనము కల్పిస్తూ తన అనుయాయులలో గూడి అయోధ్యా పట్టణమును గాంచెను. (రక్షించెను). 25

శ్లో॥ ఆసిక్తమార్గాం గంధోదైః కరిణాం మదశీకరైః ।
స్వామినం ప్రాప్త మాలోక్యమత్తాం వా సుతరామివ ॥ 26

ఇచట నుండి మూడు శ్లోకములలో అయోధ్యాపురము వర్ణించబడుచున్నది. తమ ప్రభువగు శ్రీరామచంద్రుని రాకను గాంచి, మిక్కిలి మదించిన ఏనుగుల మదబిందువుల చేత, గంధోదకముల చేత తడపబడిన మార్గములు గల పట్టణమును గాంచెను 26

శ్లో॥ ప్రాసాద గోపుర సభా చైత్య దేవగృహాదిషు ।
విన్యస్త హేమ కలశైః పతాకాభిశ్చ మండితామ్ ॥ 27

మేడలు, గోపురములు, సభామండపములు, చైత్యములు, దేవతా గృహములలో ఉంచబడిన బంగారు కలశములు, హేమ పతాకముల తో, అలంకరింపబడిన పట్టణమును కాంచెను. 27

శ్లో॥ పూగైస్సవృంతైరంభాభిః పట్టికాభిస్సువాసనామ్ ।
ఆదర్శైరంశుకైస్స్రగ్భిః కృతకౌతుకతోరణామ్ ॥ 28

ఆదర్శములగు క్రముక మోచాకదళీస్తంభములతో పుష్పమాల లతో, మంగళ తోరణములతో అలంకరింపబడిన( పట్టణము కాంచెను అని ఇరవై అయిదవ శ్లోకములో అన్వయము). 28

టీ:- పురీం వర్ణయతి త్రిభిః –ఆసిక్తేతి.గంధోదైః మదబిందుభిశ్చ. ఆసిక్తాః మార్గాః యస్యాం. సుతరాం మత్తామివ మదసమృద్ధామివ. వేతి వితర్కే. గామితి పాఠాంతరే సుతరాం కామోన్మత్తాంగామివేత్యర్థః (26-28)

శ్లో॥ తముపేయుస్తత్ర తత్ర పౌరా అర్హణ పాణయః ।
ఆశిషో యుయుజుర్దేవ పాహి మాం ప్రాక్త్వయోద్ధృతామ్ ॥29

టీ:- పౌరాణాం తస్మిన్ వృత్తిమాహ - తమితి. వరాహరూపేణ త్వయా ఉద్ధృతామిమాం పృథివీం పాహీతి. 29

ఇచటినుండి రెండు శ్లోకములలో ప్రజలవృత్తి తెలుపబడు చున్నది. ఆ అయోధ్యా పట్టణమున పురజనులు తగిన కానుకలు ధరించిన హస్తములు కలవారై శ్రీరాముని చేరిరి. ఓ ప్రభూ! పూర్వము వరాహ రూపమున నీచేత ఉద్ధరింపబడిన భూమిని రక్షించుము (పాలించుము) అని ఆశీస్సులనొసగిరి. 29

శ్లో॥ తతః ప్రజా వీక్ష్య పతిం చిరాగతం
దిదృక్షయోత్సృజ్య గృహాంస్త్రియో వరాః ।
ఆరుహ్య హర్మ్యాణ్యరవిందలోచనం
హ్యతృప్త నేత్రాః కుసుమైరవాకిరన్ ॥ 30

టీ:- ప్రజానాం తస్మిన్ వృత్తిమాహ - తత ఇతి. 30

పురజనులు ఆ పిమ్మట, చాలా కాలము పిదప వచ్చిన తమ ప్రభువును గురించి తెలిసికొని అరవింద లోచనుడగు శ్రీరామచంద్రుని చూడవలెనని కోరికగల స్త్రీలు, పురుషులు గృహములను వదిలి (బయలు వెడలి) మేడలనధిరోహించి చూచి తనివి చెందక (ఎంత సమయము చూచినను తృప్తిచెందక) శ్రీరామునిపై పుష్పములు వెదజల్లిరి. 30

శ్లో॥ అథ ప్రవిష్టస్స్వగృహం జుష్టం స్వైః పూర్వరాజభిః ।
అనంతాఖిలకోశాఢ్యమనర్ఘ్యోరుపరిచ్ఛదమ్ ॥ 31

టీ:- స్వయం కథమవర్తతేత్యస్యోత్తరమాహ - యావదధ్యాయ పరిసమాప్తి. అథేతి. స్వగృహం ప్రవిష్టస్సన్ తస్మిన్ రేమ ఇతి పంచమేనాన్వయః. గృహం వర్ణయతి - సార్ధైస్త్రిభిః. అనంతాయే అఖిలరత్నాదీనాం కోశాః తైరాఢ్యం అనర్ఘ్యా ఉరవశ్చ పరిచ్ఛదాః యస్మిన్. 31

స్వయం కథమవర్తత అను ప్రశ్నకు జవాబు ఈ అధ్యాయ పరిసమాప్తి వరకు చెప్పబడినది. ఆ పిమ్మట శ్రీరామచంద్రుడు తన పూర్వ రాజులచే నివసించబడిన గృహములోనికి ప్రవేశించెను. ("తస్మిన్‌రేమే" అని ఇచటినుండి ఐదవ శ్లోకములో అన్వయము) ఇచటినుండి మూడున్నర శ్లోకములలో రాజగృహము వర్ణించబడుచున్నది. అనంతమైన, అఖిలములైన రత్నాది కోశములతో శ్రేష్ఠమైన, అమూల్యములగు గొప్ప పరిచ్ఛదములతో (వస్తువులతో) గూడిన (రాజభవనమును ప్రవేశించెను) 31

శ్లో॥ విద్రుమోదుంబరద్వారై ర్వైడూర్య స్తంభ పంక్తిభిః ।
స్థలైర్మరకత స్వచ్ఛైర్భ్రాంత స్ఫాటిక భిత్తిభిః ॥ 32

టీ:- విద్రుమేతి. విద్రుమమయా ఉదుంబరా గేహళ్యో యేషు తైర్ద్వారైః మరకత స్వచ్ఛైః.స్థలైః. తృతీయాంతానాం మండితమితి తృతీయే నాన్వయః. 32

పగడపు ద్వారబంధములు గల, వైడూర్య స్తంభముల వరుసలు గల, స్వచ్ఛములగు మరకతమణులు పొదగబడిన స్థలములుగల స్పటికమయమగు గోడలతో అలంకరింపబడిన (రాజభవనమున ప్రవేశించెను). 32

శ్లో॥ చిత్ర స్రగ్భిః పతాకాభిర్వాసో మణిగణాంశుభిః ।
ముక్తాఫలైశ్చిదుల్లాసైః కాంత కామోపపత్తిభిః ॥ 33

టీ:- చిత్రేతి. వాససాం మణిగణానాం చాంశుభిః దీప్తిభిః. చిత్ చైతన్యం. తద్వదుల్లాసైః ఉజ్జ్వలైః. యద్వా. చిదితి క్వచిత్. వైడూర్యస్తంబాదిషు యథా శోభముజ్జ్వలైః ముక్తాఫలైర్మండితమిత్యర్థః. కాంతాః కమనీయాః కామోపపత్తయో భోగసాధనాని తాభిః. 33

చిత్రవిచిత్రములగు పుష్పమాలలతో, పతాకములతో, వస్త్రముల యొక్క, మణుల సమూహము యొక్క, కాంతులతో వైడూర్య స్తంభాదుల యందు ప్రకాశించెడి ముత్యములతో కమనీయములగు భోగ సాధనములతో ప్రకాశించెడి (గృహమును ప్రవేశించెను). 33

శ్లో॥ ధూపైర్దీపైస్సురభిభిర్మండితం పుష్పమండనైః ।
స్త్రీపుంభిస్సురసం కాశైర్జుష్టం భూషణ భూషణైః ॥ 34

సువాసనలుగల ధూప దీపములతో అలంకరింపబడినట్టి, అలంకారములకే అలంకారప్రాయులైనట్టి, దేవ సమానులైనట్టి, పుష్పాదులచే అలంకరింపబడిన స్త్రీ పురుషులతో కూడియున్న (రాజగృహమును ప్రవేశించెను). 34

శ్లో॥ తస్మిన్ స భగవాన్రామ స్నిగ్ధయా ప్రియ చేష్టయా ।
రేమేఽభిరామో ధీరాణామృషభస్సీతయా కిల ॥ 35

అలాంటి రాజభవనమున దేవదేవుడు, పురుషర్షభుడునగు శ్రీరాముడు ప్రియమైన చేష్టలతో, స్నిగ్ధరాలగు సీతతో సుఖించెను. 35

టీ:- ధూపైరితి. భూషణానాం భూషణభూతైః. (34-35)

శ్లో॥ బుభుజే చ యథా కాలం కామాన్ ధర్మమపీడయన్ ।
వర్షపూగాన్ బహూన్నౄణా మభిధ్యాతాంఘ్రి పల్లవః ॥ 36

మానవులచేత ధ్యానించబడు చిగురుటాకులలాంటి పాదములు గల శ్రీరాముడు ధర్మబద్ధముగా అనేక సంవత్సరములు విషయ భోగములననుభవించెను. 36

టీ:- బుభుజ ఇతి. నృణాం మధ్యే యద్వా. నృభిరభిధ్యాతమంఘ్రి పల్లవం యస్యేతి. 36

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
ఏకాదశోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
పదకొండవ అధ్యాయము సమాప్తము.

ద్వాదశోఽధ్యాయః

శ్రీశుక ఉవాచ

శ్లో॥ కుశస్య చాతిథిస్తస్మాన్నిషధ స్తత్సుతో నభః ।
పుండరీకోఽథ తత్పుత్రః క్షేమధన్వా భవత్తతః ॥ 1

టీ:- శ్లో. "ద్వాదశే రామపుత్రస్య కుశస్యాన్వయ ఉచ్యతే, ఏవమిక్ష్వాకు పుత్రస్య శశాదస్యేరితోఽన్వయః. ఆరభ్యోక్త్వా కుశం భూపానైక్ష్వాకాన్ ద్వాదశే గతాన్, భవిష్యతస్సుమిత్రాంతాన్ బృహద్రణముఖాన్వదత్" కుశస్యేతి. కుశస్య శ్రీరామపుత్రస్య అతిథిః సుతోఽభవత్. 1

శ్లో॥ దేవానీకస్తతో హీనః పారియాత్రోఽథ తత్సుత్రః ।
తతో బలశ్చలస్తస్మాద్వజ్రనాభోఽర్క సంభవః ॥ 2

టీ:- దేవానీక ఇతి. అర్కసంభవః అర్కస్యాంశాత్సంభూతః. 2

శ్లో॥ శంఖణస్తత్సుత స్తస్మాద్విధృతిశ్చాభవత్సుతః ।
తతో హిరణ్యనాభోఽభూద్యోగాచార్యస్తు జైమినేః ॥ 3

టీ:- శంఖణ ఇతి. జైమినేః శిష్యో యోగాచార్యః. 3

12 వ అధ్యాయము

ఈ పన్నెండవ అధ్యాయమున శ్రీరామచంద్రుని పుత్రుడగు కుశునియొక్క వంశము తెలుపుచు, ఇక్ష్వాకు పుత్రుడగు శశీదుని యొక్క వంశము ఈ ప్రకారముగా చెప్పబడినదను విషయము వర్ణించబడినది.

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

శ్రీరామచంద్రుని పుత్రుడు కుశుడు. కుశునకు అతిథి అను పుత్రుడు కలిగెను. అతిథికి నిషధుడు, నిషధునకు నభుడు, నభునకు పుండరీకుడు అతనికి క్షేమధన్వుడు అను వారలు జన్మించిరి. 1

క్షేమధన్వునకు దేవానీకుడు, దేవానీకునకు అహీనుడు, అహీనునకు పారియాత్రుడు, పారియాత్రునకు బలుడు, బలునకు చలుడు, అతనికి సూర్యాంశసంభూతుడగు వజ్రనాభుడు జన్మించిరి. 2

వజ్రనాభునకు శంఖనుడు, అతనికి విధృతి, విధృతికి హిరణ్యనాభుడు అనువారు పుత్రులైరి. ఈ హిరణ్యనాభుడు జైమినికి శిష్యుడై యోగాచార్యుడయ్యెను. 3

శ్లో॥ శిష్యః కౌసల్య ఆధ్యాత్మం యాజ్ఞవల్క్యోఽధ్యగాద్యతః ।
యోగం మహోదయమృషిర్హృదయ గ్రంథిభేదనమ్ ॥ 4

ఈ హిరణ్యనాభుని నుండి యాజ్ఞవల్క మహర్షి గొప్ప సిద్ధులు కల్గినట్టి హృదయగ్రంథిని ఛేదించేడి (హృదయ కలుశములను నశింప చేసెడి) ఆధ్యాత్మ యోగమును పొందెను. 4

శ్లో॥ పుష్యో హిరణ్యనాభస్య ధ్రువసంధిస్తతోఽభవత్ ।
సుదర్శనోఽథాగ్ని వర్ణశ్శీఘ్రస్తస్య మరుస్సుతః ॥ 5

హిరణ్యనాభునకు పుష్యుడు, పుష్యునకు ధృవసంధి, ధృవసంధికి సుదర్శనుడు, సుదర్శనునకు అగ్నివర్ణుడు, అతనికి శీఘ్రుడు, శీఘ్రునకు మరువు అనువారలు పుత్రులైరి. 5

టీ:- తదాహ - హిరణ్యనాభస్య యోగాచార్యత్వం. శిష్య ఇతి. యత స్సకాశాత్కౌశల్యో యాజ్ఞవల్క్య ఋషిః ఆధ్యాత్మం యోగమధ్యగాత్. మహాంత ఉదయాః సిద్ధయో యస్మిన్ తం. హృదయగ్రంథేః భేదనం చ. (4-5)

శ్లో॥ యోఽసావాస్తే యోగసిద్ధః కలాప గ్రామమాశ్రితః ।
కలేరంతే సూర్యవంశం నష్టం భావయితా పునః ॥ 6

ఈ మరువు యోగసిద్ధిని పొంది కాలాప గ్రామము నాశ్రయించి యుండి కలియుగాంతమున నష్టమగు సూర్యవంశమును మళ్ళీ జన్మింపచేయగలడు. 6

శ్లో॥ తస్మాత్ప్రశుశ్రుకస్తస్య సంధిస్తస్యాప్యమర్షణః ।
మహస్వాంస్తత్సుత స్తస్మాద్విశ్వసాహ్వోఽన్వజాయత ॥ 7

ఆ మరువుకు ప్రశుశ్రుకుడు అతనికి సంధి, ఆ సంధికి అమర్షణుడు, అమర్షణనకు మహస్వంతుడు ఆయనకు విశ్వసాహ్వుడు పుత్రులుగా జన్మించిరి. 7

టీ:- మరుం విశినష్టి-యోఽసావితి. పునర్భావయితా భావయిష్యతి. (6-7)

శ్లో॥ తతో బృహద్బలో యస్తు పిత్రా తే సమరే హతః ।
ఏతే హీక్ష్వాకు భూపాలా అతీతాశ్శృణ్వనా గతాన్ ॥ 8

విశ్వసాహ్యనకు బృహద్బలుడు జన్మించెను. ఈ బృహద్బలుడు భారత యుద్ధమున మీ తండ్రియగు అభిమన్యునితో చంపబడెను. వీరలు (ఇక్ష్వాకువునుంచి బృహద్బలుని వరకు గలవారు) గతించి పోయిరి. రాబోయే వారిగురించి (పుట్టబోయే) వినుము. 8

శ్లో॥ బృహద్బలస్య భవితా పుత్రోనామ్నా బృహద్రణః ।
ఉరుక్షత స్తత స్తస్య వత్సప్రీతో భవిష్యతి ॥9

ఈ బృహద్బలునకు బృహద్రణుడు అను పేరుగల సుతుడు జన్మించగలడు. బృహద్రతునకు ఉరుక్షతుడు అతనికి వత్సప్రీతి జన్మించ గలడు. 9

శ్లో॥ ప్రతివ్యోమస్తతో భాను ర్దివౌకా వాహినీపతిః ।
సహదేవస్తతో వీరో బృహదశ్వోఽథ భానుమాన్ ॥ 10

వత్సప్రీతికి ప్రతివ్యోముడు, ప్రతివ్యోమునకు భానుడు జన్మించును. భానునకు సైనాధిపతి యగు దివాకుడు ఈతని వీరుడగు సహదేవుడు, సహదేవునకు బృహదశ్వుడు, బృహదశ్వునకు భానుమంతుడు జన్మించును. 10

శ్లో॥ ప్రతీకాశ్వో భానుమతస్సు ప్రతీకస్తు తత్సుతః ।
భవితా మేరుదేవోఽథ హతక్షత్రోఽథ ఋక్షకః ॥ 11

భానుమంతునకు ప్రతీకాశ్వుడు, ప్రతీకాశ్వునకు సుప్రతీకుడు సుప్రతీకునకు మేరుదేవుడు, మేరుదేవునకు హతక్షత్రుడు అతనికి ఋక్షకుడు, జన్మించును. 11

టీ:- తత ఇతి. తే పిత్రా అభిమన్యునా.(8-11)

శ్లో॥ తస్యాంతరిక్ష స్తత్పుత్రస్సుతపాస్తదమిత్రజిత్ ।
బృహద్వాజిస్తు తస్యాపి బర్హి స్తస్మాద్ధనంజయః ॥ 12

ఋక్షకునకు అంతరిక్షుడు, అంతరిక్షునకు సుతీపుడు, సుతీపునకు అమిత్రజిత్తు అతనికి బృహద్వాజ, బృహద్వాజికి బర్హి, బర్హికి ధనుంజయుడు జన్మించగలడు. 12

శ్లో॥ రణంజయ స్తస్య సుతస్సృంజయో భవితా తతః ।
తస్మా చ్ఛాక్యోఽథ శుద్ధాదో లాంగల స్తత్సుతస్స్మృతః ॥ 13

ధనంజయునకు రణంజయుడు, రణంజయునకు సృంజయుడు పుత్రుడు కాగలడు. సృంజయునకు శాక్యుడు, శాక్యునకు శుద్ధాదుడు, శుద్ధాదునకు లాంగలుడు సుతుడు కాగలడు. 13

శ్లో॥ తతః ప్రసేనజిత్తస్మాత్ క్షుద్రకో భవితా తతః ।
ఋణకో భవితా తస్మాత్సురథ స్తనయ స్తతః ॥14

ఈ లాంగలునకు ప్రసేనజిత్తు, ప్రసేనజిత్తునకు క్షుద్రకుడు కలుగును. క్షుద్రకునకు ఋణకుడు, ఋణకునకు సురథుడు, పుత్రుడగును. 14

టీ:- తస్యేతి. తత్తస్మాద మిత్రజిత్. (12-14)

శ్లో॥ సుమిత్రోనామనిష్ఠాం తస్త్వేతే బార్హద్బలా నృపాః ।
ఇక్ష్వాకూణామయం వంశస్సుమిత్రాంతో భవిష్యతి ॥ 15

సురథునకు సుమిత్రుడు జన్మించును. ఈ సుమిత్రుడు సూర్యవంశమునకు చివరివాడు. పైన చెప్పబడిన వీరులు బృహద్బలుని నుండి క్రమముగా జన్మించెడి ఈ రాజులు ఈ ఇక్ష్వాకు వంశము సుమిత్రుని పిదప నశించగలదు. 15






శ్లో॥ యతస్తం ప్రాప్య రాజానం సంస్థాం ప్రాప్స్యతి వై కలౌ ॥ 16

టీ:- సుమిత్ర ఇతి. నిష్ఠా వంశస్య స్థితిః. తస్యాః అంతః తదేవాహ - ఇక్ష్వాకూణామితి. (15-16)

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,

ద్వాదశోఽధ్యాయః

ఈ సుమిత్రుని రాజుగా పొంది కలియుగమున, రాజ్యము సుస్థిరమగును. 16

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు

పన్నెండవ అధ్యాయము సమాప్తము.



త్రయోదశోఽధ్యాయః

శ్రీశుక ఉవాచ

శ్లో॥ నిమిరిక్ష్వాకు తనయో వసిష్ఠమవృతర్త్విజమ్ ।
ఆరభ్య సత్రం సోఽప్యాహ శక్రేణ ప్రాగ్వృతోఽస్మి భో ॥ 1

టీ:– "శ్లో. ఇక్ష్వాకోరేవ పుత్రస్య నిమేర్వంశస్త్రయోదశే, వర్ణ్యతే జజ్ఞిరే యత్ర బ్రహ్మజ్ఞా జనకాదయః. యద్వా – త్రయోదశేఽరిషడ్వర్గ జయీ రాజాన్వవాయకృత్, ఐక్ష్వాకస్య నిమేర్దేహాన్మథితాజ్జనకోఽభవత్." నిమేరౌరసః పుత్రో నాభూదితి దర్శయన్ కథామాహైకాదశభిః నిమిరితి. సత్రమారభ్య వసిష్ఠం ఋత్విజం అవృత వవ్రే. 1

శ్లో॥ తం నిర్వర్త్యాగమిష్యామి తావన్మాం ప్రతిపాలయ ।
తూష్ణీమాసీద్గృహపతి స్సోఽపీంద్రస్యా కరోన్మఖమ్ ॥ 2

టీ:– తమితి తం శక్రస్య సత్రం. నిర్వర్త్య. ప్రతిపాలయ ప్రతీక్షస్వేతి. గృహపతిర్నిమిః. 2

13 వ అధ్యాయము

ఈ పదమూడవ అధ్యాయమున బ్రహ్మజ్ఞాన సంపన్నులగు జనకాది రాజులు జన్మించిన, ఇక్ష్వాకు పుత్రుడగు నిమి వంశము వర్ణించబడుచున్నది. మరియు జనకుడు, నిమి ఔరస పుత్రుడు కాదను విషయము తెలుపుటకై నిమి ఆదిగా గల మొదటి శ్లోకము నుండి పదకొండు శ్లోకములలో ఆ విషయము చెప్పబడుచున్నది.

శ్రీశుకుడు ఈ విధముగా పలికెను.

ఇక్ష్వాకు పుత్రుడగు నిమి యజ్ఞమునారంభించి వసిష్ఠుని ఋత్విజునిగా ఉండుమని కోరెను. ఆ వసిష్ఠుడు ఇటుల పలికెను. ఓ మహారాజా! నేను ఇంద్రుని చేత మొదట ఋత్విజునిగా వరించబడితిని. 1

ఆ ఇంద్రుని యజ్ఞము పూర్తిచేసి నేను వచ్చే వరకు నా రాకను నిరీక్షించుమని వసిష్ఠుడు పలికెను. ఆ మాటలకు నిమి తూష్ణీం భావము (మౌనం) వహించెను. వసిష్ఠుడు ఇంద్రుని యజ్ఞము పూర్తి చేసెను. (యజ్ఞము చేయించుటకై వెడలెను). 2

శ్లో॥ నిమిశ్చల మిదం విద్వాన్ సత్రమారభతాత్మవాన్ ।
ఋత్విగ్భిరపరైస్తావన్నాగమద్యావతా గురుః ॥ 3

టీ:- నిమిరితి. ఇదం జీవితం చలం అస్థిరం విద్వాన్. 3

నిమి జీవితం అస్థిరం (శరీరమనిత్యము) అని తలచి గురువగు వసిష్ఠుడు రాకమునుపే వేరే ఋత్విక్కులతో యజ్ఞమునారంభించెను. 3

శ్లో॥ శిష్యవ్యతిక్రమం వీక్ష్య నిర్వర్త్య గురురాగతః ।
అశపత్పతతాం దేహో నిమేః పండితమానినః ॥ 4

టీ:- శిష్యేతి. ఇంద్రస్య మఖం నిర్వర్త్యాగతో గురుః శిష్యస్య వ్యతిక్రమ మన్యాయం వీక్ష్య నిమేర్దేహః పతత్వత్యశపత్. (4-5)

గురువగు వసిష్ఠుడు ఇంద్రుని యజ్ఞము పూర్తిచేయించి తిరిగి వచ్చి శిష్యుడగు నిమి చేసిన పనిని (తను రాకుండగనే యజ్ఞము నారంభించుట అను అన్యాయమును) కాంచి పండితులనవమాన పరిచెడు ఈ నిమి దేహము పడిపోవుగాక అని శపించెను. 4

శ్లో॥ నిమిః ప్రతి దదౌ శాపం గురవే ధర్మవర్తినే ।
తవాపి పతతాం దేహో లోభాద్ధర్మమజానతః ॥ 5

ధర్మపరుడు, గురువగు వసిష్ఠునకు, నిమి లోభముతో, ధర్మము నెరుంగని నీ దేహముకూడా పడిపోవుగాకయని ప్రతిశాపముఇచ్చెను. 5

శ్లో॥ ఇత్యుత్ససర్జ సర్వం దేహం నిమిరధ్యాత్మకోవిదః ।
మిత్రావరుణ యోర్జజ్ఞే హ్యుర్వశ్యాం ప్రపితామహః ॥ 6

టీ:- ఇతీతి. ఊర్వశీ దర్శనాత్. స్కన్నం రేతస్తాభ్యాం కుంభే నిషిక్తం. తస్మాత్ప్రపితామహో వసిష్ఠః జజ్ఞే తదాహ - మిత్రావరుణయోరితి. తథా చ శ్రుతిః. కుంభే రేతస్సిషిచతుస్సమానమితి. (6-7)

అధ్యాత్మ విదులలో కోవిదుడగు (విద్వాంసుడు) నిమి ఈ విధముగా ప్రతిశాపమొసగి తన దేహమును వదలెను. ఊర్వశీ దర్శనముతో మిత్రావరుణులకు రేతస్ఖలనముకాగ దానిని కుండలో నుంచగా ఆ కుండలో నుండి వసిష్ఠుడు జన్మించెను. అను విషయము "కుంభేరేతః సిషిచతుస్సమాన" అను శ్రుతిచే సూచించబడిన దానిని మిత్రావరుణయోః అని తెలుపుచున్నాడు. ప్రపితామహుడగు వసిష్ఠుడు ఊర్వశి యందు మిత్రావరుణులకు జన్మించెను. 6

శ్లో॥ గంధ వస్తుషు తద్దేహం నిధాయ మునిసత్తమాః ।
సమాప్తే సత్రయాగేఽథ దేవానూచుస్సమాగతాన్ ॥ 7

మునిశ్రేష్ఠులు పడిపోయిన నిమి దేహమును సుగంధ వస్తువులలో నుంచి సత్రయాగమును పూర్తి చేసిరి. ఆ యాగమునకు వచ్చిన దేవతలతో ఇటుల పలికిరి. 7

శ్లో॥ రాజ్ఞో జీవతు దేహోఽయం ప్రపన్నాః ప్రభవో యది ।
తథేత్యుక్తే నిమిః ప్రాహ మాభూన్మే దేహబంధనమ్ ॥ 8

టీ:- రాజ్ఞా ఇతి. యది ప్రసన్నాః ప్రభవః సమర్థాశ్చ తర్హి జీవత్వి త్యూచుః. 8

ఓ దేవతలారా! ఈ యజ్ఞముతో మీరు ప్రసన్నులైన యెడల, సమర్థులైన యెడల ఈ నిమి రాజుయొక్క దేహము జీవమునొందుగాక. అనిన మునుల పలుకులు వినిన దేవతలు అటులనే అగుగాక అని పలుకగా నిమి జీవితుడై నాకు దేహబంధనము కలుగకుండును గాక అని పలికెను. 8

శ్లో॥ యస్య యోగం న వాంఛంతి వియోగభయకాతరాః ।
భజంతి చరణాంభోజం మునయో హరిమేధసః ॥ 9

ఏ దేహము యొక్క వియోగ భయముతో, దేహ యోగమును (దేహబంధనమును) హరిచరణాంభోజమును భజించు మునులు కోరరో, ఆ దేహమును నేను స్వీకరించను. (కేవలము మోక్షసాధనకై భజించెద అని పదవ శ్లోకముతో అన్వయము.) 9

శ్లో॥ దేహం న వారురుక్షేఽహం దుఃఖ మోహ భయాశ్రయమ్ ।
సర్వత్రాస్య యతో మృత్యుర్మత్స్యానాముదకే యథా ॥ 10

టీ:- యస్యేతి. యస్య దేహస్య యోగం న వాంఛంతి. అపి తు మోక్షాయైవ భజంతి. (9-10)

శోక మోహ భయములకు ఆశ్రయమైనట్టి, నీటిలోని చేపలకు వలె అంతట మృత్యుభయము కల్గునట్టి దేహమును నేను ధరించను. అని నిమి పలికెను. 10

దేవా ఊచు

శ్లో॥ విదేహ ఉష్యతాం కామం లోచనేషు శరీరిణామ్ ।
ఉన్మేషణ నిమేషాభ్యాం లక్షితోఽధ్యాత్మ సంస్థితః ॥ 11

టీ:- విదేహఇతి. నిమిర్విదేహ ఏవ సన్ ఉష్యతాం వసతు. కామం యథేచ్ఛం. ఏవం సతి యుష్మాభిః ప్రార్థితం జీవితమస్యభవిష్యతి. న చ దేహ సంబంధ ఇతి భావః. స చ అధ్యాత్మం సంస్థితః లోచనయోః స్థితస్సన్ ఉన్మేషణ నిమేషాభ్యాం తత్ప్రవర్తకత్వేన లక్షితో వర్తత ఇతి శేషః. 11

దేవతలు ఈ విధముగా పలికెను.

ఈ నిమి తన ఇష్ట ప్రకారముగ దేహము లేనివాడై ఉండును గాక (జీవించుగాక) మీరు ప్రార్థించినటుల ఇతడు జీవించగలడు కాని దేహ సంబంధముండదని భావము. ఆ నిమి ప్రాణుల నేత్రములలోఉండి ఉన్మీలన నిమీలనముల (మూయడం, తెరవడం) ప్రవర్తకుడై ఉండును. (అని అధ్యాహారము) 11

శ్లో॥ అరాజకభయం నృణాం మన్యమానా మహర్షయః ।
దేహం మమంథుస్స్మ నిమేః కుమారస్సమజాయత ॥ 12

టీ:- తదేవం మృతాదపి నిమిర్దేహాత్ వంశ ప్రవృత్తిం దర్శయతి - అరాజకేతి. 12

ఈ విధముగా చనిపోయిన (దేహమును పరిత్యజించిన) నిమి దేహమునుండి వంశప్రవృత్తిని "అరాజకభయం" అను శ్లోకముతో తెలుపుచున్నాడు. రాజులేనిచో మానవులకు భయమని తలచి మహర్షులు నిమి దేహమును మథించిరి. దాని నుండి పుత్రుడు జన్మించెను. 12

శ్లో॥ జన్మనా జనకస్సోఽభూద్వైదేహస్తు విదేహజః ।
మిథిలో మథనాజ్జాతో మిథిలా యేన నిర్మితా ॥ 13

ఆ నిమి దేహము నుండి కల్గిన కుమారునకు మూడు అన్వర్థములగు (పొసగిన) నామములు ఈ శ్లోకమున తెలుపబడుచున్నవి. ఆ కుమారుని అసాధారణమగు జన్మ చేత జనకుడు

టీ:- తస్యాన్వర్థాని త్రీణి నామాన్యాహ - జన్మనేతి. జన్మనా అసాధారణేన జన ఏవ జనకః. యద్వా స్వదేహద్వారా జనకత్వాత్స నిమిర్జనకోఽభూదిత్యన్వయః. మిథిలా యేన నిర్మితేత్యనేన ఉత్పత్త్య నంతరం సామర్థ్యాద్యుక్తం. (13-14)

అని, దేహము లేని వాని నుండి జన్మించుటచే వైదేహుడని, మథనము చేత జన్మించుట చేత మిథిలుడు అని ప్రజలచేత పిలవబడెను. అతడు మిథిలా నగరమును నిర్మించెను. (దీనితో జన్మించిన ఆ కుమారుని సామర్థ్యము తెలుపబడినది) 13

శ్లో॥ తస్మాదుదావసుస్తస్య పుత్రోఽభూన్నందివర్ధనః ।
తతస్సుకేతుస్తస్యాపి దేవరాతో మహీపతేః ॥ 14

ఓ పరీక్షిద్రాజా! ఆ జనకుని నుండి ఉదావసువు జన్మించెను. అతనికి నందివర్ధనుడు, నందివర్ధనునకు సుకేతువు, సుకేతువునకు దేవరాతుడును జన్మించెను. 14

శ్లో॥ తస్మాద్బృహద్రథస్తస్య మహావీర్యస్సుధృత్పితా ।
సుధృతేర్ధృష్టకేతుర్వై హర్యశ్వోఽథ మరుస్తతః ॥ 15

దేవరాతునకు బృహద్రథుడు అతనికి మహావీర్యుడు, మహావీర్యునకు సుధృతి, సుధృతికి ధృష్టకేతుడు, ధృష్టకేతునకు హర్యశ్వుడు, హర్యశ్వునకు మరువు జన్మించిరి. 15

శ్లో॥ మరోః ప్రతింధకస్తస్మాజ్జాతః కృతరథో యతః ।
దేవమీఢస్తస్య పుత్రో విధృతోఽథ మహాధృతిః ॥ 16

మరునకు ప్రతింధకుడు, ప్రతింధకునకు కృతరయుడు, కృతరయునకు దేవమీఢుడు, దేవమీఢునకు విధృతి, విధృతికి మహాధృతి అను వారలు జన్మించిరి. 16

శ్లో॥ కీర్తిరాతస్తత స్తస్మాన్మహారోమాథ తత్సుతః ।
స్వర్ణరోమాసుతస్తస్య హ్రస్వరోమా వ్యజాయత ॥ 17

మహాధృతికి కీర్తిరాతుడు, కీర్తిరాతునకు మహారోముడు జన్మించిరి. మహారోముని పుత్రుడు స్వర్ణరోముడు, స్వర్ణరోముని పుత్రుడు హ్రస్వరోముడు. 17

శ్లో॥ తతస్సీరధ్వజో యజ్ఞే యజ్ఞార్థం కర్షతో మహీమ్ ।
సీతాసీరాగ్రతోజాతా తస్మాత్సీరధ్వజః స్మృతః ॥ 18

హ్రస్వరోమునకు సీరధ్వజుడు జన్మించెను. అతడు యజ్ఞమునకై భూమిని దున్నుచుండగా నాగటికొన నుండి (సీరాగ్రమునుండి) సీతాదేవి జన్మించినది. అందువలన అతడు సీరధ్వజుడు అనబడెను. 18

శ్లో॥ కుశధ్వజస్తస్య పుత్రస్తతో ధర్మధ్వజో నృపః ।
ధర్మధ్వజస్య ద్వౌపుత్రౌ కృతధ్వజమితధ్వజౌ ॥ 19

ఆ సీరధ్వజునకు కుశధ్వజుడు పుత్రుడు. అతని నుండి ధర్మధ్వజుడు జన్మించెను. ధర్మధ్వజునకు కృతధ్వజుడు, వితధ్వజుడు అను ఇద్దరు పుత్రులు. 19

శ్లో॥ కృతధ్వజాత్కేశిధ్వజః ఖాండిక్యస్తు మిత్రధ్వజాత్ ।
కృతధ్వజసుతో రాజన్నాత్మవిద్యా విశారదః ॥ 20

టీ:- తస్మాదితి. సుధృత్ సుధృతిః తస్య పితా. (15-20)

కృతధ్వజునకు కేశీధ్వజుడు, మితధ్వజునకు ఖాండిన్యుడు అనువారు జన్మించిరి. కృతధ్వజుని పుత్రుడగు కేశీధ్వజుడు ఆత్మ విద్యలో పండితుడు. 20

శ్లో॥ ఖాండిక్యః కర్మతంత్రజ్ఞో భీతః కేశిధ్వజాద్గతః ।
భానుమాం స్తస్యపుత్రోఽభూచ్ఛతద్యుమ్నస్తు తత్సుతః ॥ 21

మిత్రధ్వజుని పుత్రుడు ఖాండిన్యుడు కర్మ తంత్రముల జ్ఞానము కలవాడు. కేశిధ్వజునకు భయపడి అరణ్యమునకు వెడలెను. కేశీధ్వజునకు భానుమంతుడు పుత్రుడు, అతని పుత్రుడు శతద్యుమ్నుడు. 21

శ్లో॥ శుచిస్తత్తనయ స్తస్మాత్సనద్వాజస్తతోఽభవత్ ।
ఊర్ధ్వకేతుస్సనద్వాజాదజోఽథ కురుజిత్సుతః ॥ 22

శతద్యుమ్నుని పుత్రుడు శుచి, శుచికి సనద్వాజుడను పుత్రుడు కలిగెను. సనద్వాజునకు ఊర్ధ్వకేతువు, ఊర్ధ్వకేతువునకు అజుడు, అజునకు కురుజిత్తు పుత్రుడు. 22

శ్లో॥ అరిష్టనేమిస్తస్యాపి శ్రుతాయుస్తస్యపార్శ్వకః ।
తతశ్చిత్రరథస్తస్య క్షేమాపిర్మిథిలాధిపః ॥ 23

కురుజిత్తునకు అరిష్టనేమి, ఆ అరిష్టనేమికి శ్రుతాయువు, శ్రుతాయువునకు పార్శ్వకుడు, పార్శ్వకునకు చిత్రరథుడు, చిత్రరథునకు క్షేమాపి జన్మించెను. ఈ క్షేమాపి మిథిలాపతి. 23

టీ:- ఖాండిక్య ఇతి. తస్య కేశిధ్వజస్య భానుమాన్. (21-23)

శ్లో॥ తస్మాద్ధేమరథస్తస్య సుతస్సత్యరథ స్తతః ।
ఆసీదుపగురుస్తస్మాదుపగుర్వోఽగ్ని సంభవః ॥ 24

క్షేమాపికి హేమరథుడు, హేమరథునకు సత్యరథుడు, సత్యరథునకు ఉపగురువు, ఉపగురువునకు, అగ్ని అంశతో ఉపగుప్తుడు జన్మించెను. 24

టీ:- తస్మాదితి. అగ్నిసంభవః అగ్నేరంశాత్సంభూతః. 24

శ్లో॥ సావనోఽథ తతః పుత్రస్సువర్చా యత్సుభూషణః ।
శ్రుతస్తతో జయస్తస్మాద్విజయోఽస్మాద్ధృతస్సుతః ॥ 25

ఉపగుప్తునకు సావనుడు, సావనునకు సుభూషణుడని ప్రసిద్ధి చెందిన సువర్ణుడు జన్మించెను. ఈ సుభూషణునకు జయుడు, జయునకు విజయుడు, విజయునకు ధృతుడు అను వారులు పుత్రులైరి. 25

శ్లో॥ అనఘస్తత్సుతో జజ్ఞే వీతిహవ్యో ధృతి స్తతః ।
బహులాశ్వో ధృతేస్తస్య కృతిస్తస్మాన్మహావశీ ॥ 26

ధృతునకు అనఘుడు, అనఘునకు వీతిహవ్యుడు, వీతిహవ్యునకు ధృతి ధృతికి బహులాశ్వుడు, బహులాశ్వునకు కృతి, కృతికి మహావశీ అను వారలు జన్మించిరి. 26

టీ:- సావన ఇతి. యద్యస్మాత్సుభూషణః. (25-26)

శ్లో॥ ఏతే వై మైథిలా రాజన్నాత్మ విద్యావిశారదాః ।
యోగేశ్వర ప్రసాదేన ద్వంద్వైర్ముక్తా గృహేష్వపి ॥ 27

టీ:- ఏత ఇతి. యోగేశ్వరాః యాజ్ఞవల్క్యాదయః తేషాం ప్రసాదేన అనుగ్రహేణ. 27

ఓ పరీక్షిద్రాజా! పైన చెప్పబడిన వారు మిథిలా రాజులు. ఆత్మ విద్యా విశారదులై యాజ్ఞవల్క్యాది యోగేశ్వరుల అనుగ్రహముతో గృహస్థులై ఉంటూ కూడా సుఖదుఃఖాది ద్వంద్వముల నుండి ముక్తులై ఉండిరి. 27

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
త్రయోదశోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
పదమూడవ అధ్యాయము సమాప్తము.

చతుర్దశోఽధ్యాయః

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ అథాత శ్రూయతాం రాజన్ వంశస్సోమస్య పావనః ।
యస్మిన్నైలాదయో భూపాః కీర్త్యంతే పుణ్యకీర్తయః ॥ 1

టీ:- శ్లో. "చతుర్దశే గురోః పత్న్యాం తారాయాం సోమజాద్బుధాత్, జాతశ్శైలష్షడూర్వశ్యామాయుర్ముఖ్యానజీజనత్. యద్వా-చతుర్దశేఽత్రి జాత్సోమాద్గురోః పత్న్యాం బుధోఽజని, స ఉపాస్త్రోర్వశీం తజ్జస్స సంకేతం పురూరవాః." (1-2)

శ్లో॥ సహస్ర శిరసః పుంసోనాభిహ్రదసరోరుహాత్ ।
జాతస్యాసీత్సుతో ధాతురత్రిః పితృసమో గుణైః ॥ 2

శ్లో॥ తస్మాద్ద్రుగ్భ్యోఽభవత్పుత్రస్సోమోఽమృతమయః కిల ।
విప్రౌషధ్యుడువర్గాణాం బ్రహ్మణా కల్పితః పతిః ॥ 3

టీ:- తస్మాదితి. దృగ్భ్యః ఆనందాశ్రుభ్యః అత ఏవామృతమయః

14 వ అధ్యాయము

ఇంతవరకు సూర్యవంశమును గురించి తెలిపి ఇపుడు చంద్ర వంశ వృత్తాంతము తెలియజేయబడుచున్నది. ఈ పద్నాల్గవ అధ్యాయ మున బృహస్పతి భార్యయగు తార యందు చంద్రుని వలన జన్మించిన బుధునకు ఇల యందు కల్గిన పురూరవుడు, ఊర్వశి యందు ఆరుగురు పుత్రులను కను వృత్తాంతము వర్ణించబడినది.

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

ఓ పరీక్షిద్రాజా! ఏ చంద్రవంశములో పుణ్యశ్లోకవంతులగు వేలాది రాజులు కీర్తించ బడుదురో అట్టి పావనమగు చంద్రవంశమును గూర్చి వినుము. 1

వేయి శిరములు గల పురుష శ్రేష్ఠుడగు నారాయణుని నాభి కమలము నుండి బ్రహ్మ జన్మించెను. ఆ బ్రహ్మకు గుణములలో, తనతో సమానుడగు అత్రి జన్మించెను. 2

ఆ అత్రి ఆనందాశ్రువుల నుండి అమృతమయుడగు చంద్రుడు కలిగెను. ఆనందాశ్రువుల నుండి జన్మించుట వలన అమృతమయు డాయెను. (ఇచట కిలఅనునది ఆశ్చర్యార్థకము) తరువాతి శ్లోకములలో చెప్పబోవు దర్పమునకు కారణము విప్ర ఆదిగాగల శ్లోకార్థములో

కిలేత్యాశ్చర్యే. పాఠాంతరే దృశః నేత్రాత్ వక్ష్యమాణదర్పస్య కారణమాహ – విప్రేతి. 3

చెప్పబడుచున్నది. అత్రి నుండి జన్మించిన చంద్రుణ్ణి బ్రహ్మ బ్రాహ్మణులకు, ఓషధులకు, నక్షత్రములకు అధిపతినిగా చేసెను. 3

శ్లో॥ సోఽయజద్రాజసూయేన విజిత్య భువన త్రయమ్ ।
పత్నీం బృహస్పతేర్దర్పాత్తారాం నామాహరద్బలాత్ ॥ 4

టీ:– స ఇతి. సోమస్య పుత్రో బుధ ఇతి కథాద్వారేణాహ పత్నీమితి సార్ధైర్నవభిః. 4

ఆ చంద్రుడు (సోముడు) ముల్లోకములను జయించి రాజసూయ యాగమునొనరించెను. దర్పముతో బృహస్పతి భార్యయగు తారను బలవంతముగాహరించెను. 4

శ్లో॥ స యదా దేవగురుణా యాచితోఽభీక్ష్ణశో మదాత్ ।
నాత్యజత్తత్కృతే జజ్ఞే సుర దానవ విగ్రహః ॥ 5

టీ:– స ఇతి. తత్కృతే తన్ని మిత్తం. 5

దేవగురువగు బృహస్పతి తన భార్యయగు తారను తన కొసుగుమని యాచించినను, మదోన్మత్తుడై చంద్రుడు తారను వదలక పోయెను. ఆ కారణముచేత దేవదానవులకు యుద్ధము సంభవించెను. 5

శ్లో॥ శుక్రో బృహస్పతేర్ద్వేషాదగ్రహీత్సాసురోడుపం ।
హరో గురుసుతం స్నేహాత్సర్వభూతగణైర్వృతః ॥ 6

టీ:– సురాణాం దానవానాం చ విగ్రహే కారణమాహ – శుక్ర ఇతి. అసురైస్సహితః ఉడుపమగ్రహీదిత్యర్థః. సంధిరార్షః. గురోః. సుతం బృహస్పతిమగ్రహీత్. అంగిరసస్సకాశాత్ప్రాప్తవిద్యో హర ఇతి. ప్రసిద్ధిః .6

దేవదానవ యుద్ధమునకు కారణము తెలుపుచున్నాడు.

దానవ గురువగు శుక్రుడు బృహస్పతిపై నుండెడి ద్వేషముతో దానవులతో గూడి చంద్రుని (గ్రహించెను) పక్షమవలంబించెను. సాసురోడుపం అనుచోట సంధి ఆర్షము. శంకరుడు భూతగణములతో గూడి తన గురు పుత్రుడగు బృహస్పతి పక్షమవలంబించెను. శంకరుడు అంగీరసుని నుండి విద్యలనేర్చుకొనెను అని ప్రసిద్ధము. (అందువలననే గురుసుతం అని తెలుపబడినది). 6

శ్లో॥ సర్వదేవగణో పేతో మహేంద్రో గురుమన్వగాత్ ।
సురాసురవినాశోఽభూత్సమరస్తారకామయః ॥ 7

టీ:- సర్వేతి. తారైవతారకాతస్యాః హేతోఃప్రవృత్తః తారకామయః. 7

సమస్త దేవగణములతో గూడి ఇంద్రుడు బృహస్పతిని అనుసరించెను. తార కొరకు ప్రవృత్తమగు యుద్ధము (తారనే తారక) దేవరాక్షస వినాశకారకమాయెను. 7

శ్లో॥ నివేదితోఽథాంగిరసా సోమం నిర్భర్త్స్య విశ్వసృట్ ।
తారాం స్వభర్త్రే ప్రాయచ్ఛదంతర్వత్నీ మవైత్పతిః ॥ 8

టీ:- నివేదిత ఇతి. నివేదితో విజ్ఞాపితః. విశ్వసృట్ బ్రహ్మ అవైత్ అబుధ్యత. 8

బృహస్పతి తండ్రియగు అంగీరసునిచే విజ్ఞాపించబడిన బ్రహ్మ చంద్రుని భయపెట్టి తారను బృహస్పతికిప్పించెను. బృహస్పతి తార గర్భవతియై యుండుట నెరింగి ఇటుల పలికెను. 8

శ్లో॥ త్యజ త్యజాశు దుష్ప్రజ్ఞేమత్ క్షేత్రే త్వాహితం పరైః ।
నాహం త్వాం భస్మసాత్కుర్యాం స్త్రియం సాంతానికో సతీ ॥ 9

దుర్బుద్ధిగల ఓ తారా! నా క్షేత్రములో ఇతరులచే నుంచబడిన గర్భమును వదులుము. నేను సంతానార్థినై యున్నందున, దుష్టురాల వగు నిన్ను భస్మము చేయకున్నాను. 9

శ్లో॥ తత్యాజ వ్రీడతా తారా కుమారం కనక ప్రభం ।
స్పృహామాంగీరసశ్చక్రే కుమారే సోమ ఏవ చ ॥ 10

లజ్జితురాలగు తార బంగరు కాంతిగల పుత్రుని వదిలెను. (ప్రసవించెను) ఆ పుత్రునిపై బృహస్పతి , చంద్రుడు ఇద్దరును కోరికను (ఇష్టమును) చూపిరి. 10

శ్లో॥ మమాయం న తవేత్యుచ్చైస్తస్మిన్ వివదమానయోః ।
పప్రచ్ఛు ఋషయో దేవా నైవోచే వ్రీడితా తు సా ॥ 11

టీ:- బృహస్పతి రాహ - త్యజ త్యజేతి. పరైరాహితం గర్భం గర్భే త్యక్తే భస్మీకరిష్యతీతి బిభ్యతీం ప్రత్యాహ - నాహమితి. సాంతానికః సంతానార్థీ. సాంతానికే ఇతి పాఠే హే సత్పుత్రేత్యర్థః. (9-12)

చంద్ర బృహస్పతులిద్దరు ఈ పుత్రుడు నావాడే నీవాడు కాదు (నాకు జన్మించిన వాడే నీ వలన పుట్టిన వాడు కాదు) అని వివాద పడుచుండగా ఋషులు, దేవతలు వీడెవరి పుత్రుడని తారనడిగిరి. తార లజ్జతో ఏమియు చెప్పలేక పోయెను. 11

శ్లో॥ కుమారోమాతరం ప్రాహ కుపితోఽలీక లజ్జయా ।
కిం నావోచస్త్వసద్వృత్తే హ్యాత్మావద్యంవదాశు మే ॥ 12

అపుడు తారకు జన్మించిన ఆ పుత్రుడు సిగ్గుతో కోపించిన వాడై తల్లియగు తారతో ఇట్లు పలికెను. ఓ అసాధురాలా! నేనెవరి పుత్రుడను? నీవు ఎందుకు చెప్పడంలేవు? తొందరగా తెలుపుము. 12

శ్లో॥ బ్రహ్మా తాం రహ ఆహూయ సమప్రాక్షీత్తు సాంత్వయన్ ।
సోమస్యేత్యాహ శనకైస్సోమస్తం సుతమగ్రహీత్ ॥ 13

ఆ సమయమున బ్రహ్మ ఆ తారను రహస్య ప్రదేశమునకు పిలచి అనునయిస్తూ ఈ పుత్రుడు ఎవరి వాడని అడిగెను. అపుడు తార చిన్నగా చంద్రుని వాడే (చంద్రుని వలన జన్మించిన వాడే) అని తెలిపెను. చంద్రుడు ఆ పుత్రుని గ్రహించెను. 13

శ్లో॥ తస్యాత్మ యోనిరకృత బుధ ఇత్యభిధాం నృప ।
బుద్ధ్యా గంభీరయా యేన పుత్రేణపోడురాణ్ముదమ్ ॥ 14

టీ:- బ్రహ్మేతి. రహః. ఏకాంతే. (13-14)

ఓ రాజా! ఆ పుత్రునకు బ్రహ్మ బుధుడు అని నామకరణము కావించెను. గొప్ప బుద్ధిమంతుడగు బుధుడు తనకు పుత్రుడైనందున చంద్రుడు చాలా సంతసించెను. (బుద్ధిమంతుడగు పుత్రునితో సంతోషమందెను). 14

శ్లో॥ తతః పురూరవా జజ్ఞ ఇలాయాం య ఉదాహృతః ।
తస్య రూపగుణౌదార్య శీల ద్రవిణ విక్రమాన్ ॥ 15

టీ:- తత ఇతి. పురూరవసః ఊర్వశ్యా. ఆయుఃప్రముఖాష్షట్ పుత్రా జాతా ఇతి వక్తుం కథామాహ - తస్యేత్యాదినా యావత్సమాప్తి. (15-16)

ఆ బుధునకు ఇల అను స్త్రీ వలన పురూరవుడు జన్మించెను. ఆ పురూరవునకు ఊర్వశి వలన ఆయువు మొదలగు ఆరుగురు పుత్రులు కల్గిరని తెలుపుటకు ఈ కథ తెలుపబడుచున్నది. తస్య అను ఆదిగా గల ఈ శ్లోక ఉత్తరార్ధము నుండి సమాప్తము వరకు ఆ పురూరవుని ఆకారము (అందము), గుణము, ఉదారత్వము, శీలము, ధనము, పరాక్రమములను (ఊర్వశి విని) అని ఉత్తరశ్లోక అన్వయము. 15

శ్లో॥ శ్రుత్వోర్వశీంద్ర భవనే గీయమానాన్ సురర్షిణా ।
తదంతికముపేయాయ దేవీస్మరశరార్దితా ॥ 16

ఇంద్రభవనమున దేవర్షియగు నారదునిచే గానము చేయబడుచున్న ఆ పురూరవుని గుణాదులను ఊర్వశి విని కామబాణ పీడితయై ఆ పురూరవుని చేరెను. 16

శ్లో॥ మిత్రావరుణయో శ్శాపాదాపన్నా నరలోకతామ్ ।
నిశామ్య పురుషశ్రేష్ఠ కందర్పమివ రూపిణమ్ ॥ 17

మిత్రావరుణుని శాపముతో మనుష్య భావమొందిన ఊర్వశి ఆకారముతో మన్మథుని వలె నున్న పురుష శ్రేష్ఠుడగు ఆ పురూరవుని గురించి విని. 17

శ్లో॥ ధృతిం విష్టభ్య లలనా హ్యుపతస్థే తదంతికమ్ ।
సతాం విలోక్య నృపతిర్హర్షేణోత్ఫుల్లలోచనః ।
ఉవాచ శ్లక్ష్ణయా వాచా దేవీం హృష్టతనూరుహః ॥ 18

ఆ ఊర్వశి ధైర్యం వహించి పురూరవుని సమీపమున కేగెను. అతడు ఆ ఊర్వశిని గాంచి సంతోషముతో వికసిత లోచనుడై (తర్వాతి శ్లోకములో అన్వయము). 18

పురూరవా ఉవాచ

శ్లో॥ స్వాగతం తే వరారోహే హ్యాస్యతాం కరవామకిమ్ ॥ 19

టీ:- ననుదేవీ కుతో మనుష్యస్యాంతికం ఉపగచ్ఛేత్తత్రాహ - మిత్రేతి. మిత్రావరుణయోశ్శాపాత్. నరలోకతాం మనుష్యభావమాపన్నా సతీ. (17-19)

పురూరవుడు ఈ విధముగా పలికెను.

సంతసించి శరీరముపై గగుర్పాటు కలుగగా ఆ ఊర్వశిని గురించి మధురమైన వాక్యములు పలికెను. ఓ ఊర్వశి! నీకు స్వాగతము. ఇచట నుండుము. నీ గురించి నేనేమి చేయవలెను. 19

శ్లో॥ సంరమస్వ మయాసాకం రతిర్నౌ శాశ్వతీస్సమాః ॥ 20

టీ:- సంరమస్వేతి. నౌ ఆవయోః రతిరస్త్వితి. 20

నీవు నాతో (రమించుము) సంతోషముననుభవించుము. నీ అనురాగము శాశ్వతమైనదై అనేక సంవత్సరములుండుగాక. 20

ఊర్వశ్యువాచ

శ్లో॥ కస్యాస్త్వయి న సజ్జేత మనోదృష్టిశ్చ సుందర ।
యదంగాంతరమాసాద్య చ్యవతే హారిరంసయా ॥ 21

టీ:- కస్యాఇతి. యస్య తవ అంగాంతరం వక్షః ఆసాద్య రిరంసయా రంతుమిచ్ఛయాహా. స్ఫుటం. న చ్యవతే నాపయాతి యద్యస్మాదితివా. 21

ఊర్వశి ఈ విధముగా పలికెను.

ఓ సుందరుడా! ఏ నీ యొక్క వక్షఃస్థలమును పొంది రమించు కోరికతో, వదలడానికి ఇష్టము కలుగదో అట్టి నీ యందు ఏ స్త్రీ యొక్క మనస్సు, దృష్టి ఆకట్టుకోక ఉండగలదు. 21

శ్లో॥ ఏతావురణకౌ రాజన్న్యాసౌ రక్షస్వ మానద ।
రంస్యేఽహం భవతా సాకం శ్లాఘ్య స్త్రీణాం పరస్మృతః॥22

టీ:- శాపావసానే-భాషాభంగమిషేణ జిగమిషోస్తస్యా భాషాబంధ మాహ - ద్వాభ్యాం. ఏతావితి. ఉరణకౌ మేషౌ. న్యాసౌ నిక్షిప్తౌ నిక్షేపరూపాం రక్ష. యః శ్లాఘ్యః స ఏవస్త్రీణాం వరః స్మృతః. అతో విజాతీయత్వం న దోష ఇతి భావః. 22

శ్లో॥ ఘృతం మే వీర భక్ష్యం స్యాన్నే క్షేత్వాన్యత్ర మైథునాత్ ।
వివాససం తత్తథేతి ప్రతిపేదే మహామనాః ॥ 23

టీ:- ఘృతమితి. హే వీర ఘృతం మే భక్ష్యం స్యాత్.శ్రు. "అమృతం వా ఆజ్య" మిత్యాదిశ్రుతేః దేవానాం చామృతాశిత్వాత్ మైథునాదన్యత్ర వివాససం త్వాం భక్షిష్యే ఇతి ప్రతిపేదే అంగీకృతవాన్. 23

శ్లో॥ అహో రూపమహో భావో నరలోక విమోహనమ్ ।
కో న సేవేత మనుజో దేవీం త్వాం స్వయమాగతామ్ ॥ 24

శాపావసానముకాగా నియమభంగమను నెపముతో వెడలగోరు ఆ ఊర్వశి ఒక నియమమును విధించుచున్నది. ఆ విషయము రెండు శ్లోకములలో చెప్పబడుచున్నది. ఈ రెండు మేకలను నీ దగ్గర న్యాసముగ ఉంచుచున్నాను. ఈ రెంటిని ఎల్ల వేళల రక్షించుము. నేను నీతో రమించెదను. స్త్రీ లకు శ్లాఘ్యుడగు పురుషుడే వరుడుగా స్మరించబడును. దీనితో నీవు మానవుడవు, నేను దేవస్త్రీని అను విజాతీయత దోషము కాదను భావము స్ఫురింపచేసినది. 22

ఓ వీరుడా! నాకు ఘృతమే ఆహారమగును. "ఘృతం వా ఆజ్యం" అను మొదలుగాగల శ్రుతితో దేవతలు అమృతాశినులుకాన ఘృతమే అమృతము గావించబడి, ఘృతమే ఆహారమని చెప్పబడినది. మైథున సమయమున తప్ప నాకు నీవు వివస్త్రుడవై (దిగంబరుడవై) కనిపించగూడదు. అటులైన నేను నీతో రమించెదను. ఆ నియమములను పురూరవుడంగీకరించి ఆమెను పొందెను. 23

మానవ లోకమును మోహింపజేసెడి రూపము, భావము గల నీవు కోరివచ్చిన ఏ మానవుడు నిన్ను సేవించడు? 24

శ్లో॥ తయా స పురుషవ్యాఘ్రోరమయంత్యా యథార్హతః ।
రేమేऽమరవిహారేషు కామం చైత్రరథాదిషు ॥ 25

టీ:- తదేవాహ - అహో ఇతి. (24-25)

పురుష శ్రేష్ఠుడగు పురూరవుడు, తగిన విధముగా భోగింపజేసెడి ఆ ఊర్వశితో కలసి చైత్రరథం (కుబేరుని ఉద్యానవనము) మొదలగు దేవోద్యాన వనములలో రమించుచుండెను. 25

శ్లో॥ రమమాణస్తయా నిత్యం పద్మ కింజల్క గంధయా ।
తన్ముఖామోదముషితో ముముదేऽబ్ద గణాన్ బహూన్ ॥ 26

టీ:- రమమాణ ఇతి. పద్మకింజల్కస్య గంధ ఇవ గంధో యస్యాః తస్యాః ముఖామోదేన ముషితః ప్రలోభితస్సన్. 26

తామర కింజల్కముల (కేసరముల) వంటి సువాసన గల ఆ ఊర్వశి ముఖ గంధ ప్రలోభితుడై పురూరవుడు అనేక సంవత్సర సమూహములు ఆమెతో సర్వదా రమిస్తూ సంతోషించుచుండెను. 26

శ్లో॥ ఆనేతుమూర్వశీమింద్రో గంధర్వాన్ సమచోదయత్ ।
ఊర్వశీ రహితం మహ్యమాస్థానం నాతిశోభతే ॥ 27

టీ:- ఆనేతుమితి. మహ్యం మమ. 27

ఊర్వశిలేని నా సభ శోభాయమానముగ లేదని తలచిన ఇంద్రుడు ఆ ఊర్వశిని (తన సభకు) తెచ్చుటకు గంధర్వులను పంపెను. 27

శ్లో॥ త ఉపేత్య మహారాత్రే తమసి ప్రత్యుపస్థితే ।
ఊర్వశ్యురణకౌ జహ్రుర్న్యస్తౌ రాజని మాయయా ॥ 28

దేవేంద్రునిచే పంపబడిన గంధర్వులు గొప్ప చీకటితో కూడిన మధ్యరాత్రి వేళలో మహా నిషా ద్వే ఘటికే రాత్రౌ మధ్యమ యామయోః అని స్మృతిచే రాత్రివేళ నడిమి ఝాముల మధ్యన రెండు ఘటికల

టీ:- త ఇతి. మహారాత్రే మధ్యరాత్రే. శ్లో. "మహా నిశా ద్వే ఘటికే రాత్రౌ మధ్యమయామయో"రితిస్మృతేః. 28

శ్లో॥ నిశమ్యాక్రందితం దేవీ పుత్రయోర్నీయమానయోః ।
హతాస్మ్యహం కునాథేన న పుంసా వీరమానినా ॥ 29

టీ:- నిశమ్యేతి. జిగమిషోః తస్యాః. పరుషోక్తి మాహ - హతాస్మీతి సార్ధేన. నపుంసా న పుంసకేన. 29

శ్లో॥ యద్విస్రంభాదహం నష్టా హృతా పత్యా చ దస్యుభిః ।
యశ్శేతే నిశి సంత్రస్తో యథా నారీ తథా పుమాన్ ॥ 30

శ్లో॥ ముంచ ముంచాశ్వపసర బాహూ మద్గాత్రచేష్టితౌ ।
అతీవకాతరోహోత్వం మాయయా యోఽతిలంపటః ॥ 31

కాలము మహానిశా అని చెప్పబడినది. రాజగు పురూరవుని వద్ద న్యాసముగ నుంచబడిన ఊర్వశి మేకలను మాయతో హరించిరి. 28

గంధర్వులచేత తీసుకొని వెళ్ళబడుచున్న పుత్ర సమానముగ భావించబడిన ఆ మేకల ఆక్రందనమును విని, ఊర్వశి (దేవలోకము వెళ్ళగోరిన ఊర్వశి పరుషోక్తుల తెలుపుచున్నాడు) వీరుడనని తలచెడి నపుంసకుడు, నీచుడగు భర్తచే హతురాలినైతిని అని పలికెను. 29

రాత్రివేళలో భయముతో నిద్రించెడి స్త్రీవలె నిద్రించుచున్న నీ వలన (నీవు నా పుత్రసములగు మేకలను రక్షించగలవను విశ్వాసముతో) చోరులచే నా పుత్రలు (మేకలు) దొంగలించబడగా నష్టము నొందితిని. 30

నా శరీరమును చుట్టిన నీ బాహువులను శైథిల్యపరచి నన్ను వదులుము. మాయచే మోహితుడవై, స్త్రీలంపటుడవగు నీవు మిక్కిలి భయ స్వభావుడవు. 31

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఇతి వాక్సాయకైర్విద్ధః ప్రతోదైరివ కుంజరః ।
నిశి నిస్త్రింశమాదాయ వివస్త్రోఽభ్యద్రవద్రుషా ॥ 32

టీ:- యదితి. యథా నారీతథా సంత్రస్తః శేతే. (30-32)

శ్రీశుకుడు ఈవిధంగా పలికెను.

అంకుశపు పోట్లకు విజృంభించు గజము వలె, ఆ ఊర్వశి యొక్క వాగ్బాణములతో కొట్టబడిన ఆ పురూరవుడు నిద్రమేల్కొని ఆ రాత్రి వేళలో ఖడ్గమును తీసుకొని కోపముతో ఆ గంధర్వులను తరుము తొందరలో వివస్త్రుడాయెను. 32

శ్లో॥ తే విసృజ్యో రణౌ తత్ర వ్యద్యోతంత స్మ విద్యుతః ।
ఆదాయ మేషావాయాంతం నగ్నమైక్షత సా పతిమ్ ॥ 33

టీ:- త ఇతి. విద్యుతః విశిష్టద్యుతిమంతః. వ్యద్యోతంత దీప్తి మకుర్వత. యద్వా తదైవ తటితః. ప్రకాశంత ఇత్యర్థః. నగ్నమైక్షత. అతో భాషాభంగాత్ నిర్జగామేతి జ్ఞేయం. (33-34)

ఆ గంధర్వులు ఖడ్గపాణియగు పురూరవుని గాంచి విశిష్ఠమగు కాంతితో ప్రకాశించిరి.(లేక మెరుపులు మెరిపించిరి) వారి నుండి మేకలను తీసికొనివచ్చు పురూరవుని, ఆ ఊర్వశి దిగంబరునిగా గాంచెను. (నియమ భంగముతో వెడలి పోయెనని తెలియవలెను). 33

శ్లో॥ ఐలోఽపి శయనే జాయామపశ్యన్ విమనా ఇవ ।
తచ్చిత్తో విక్లబశ్శోచన్ బభ్రామోన్మత్తవన్మహీమ్ ॥ 34

ఇలా పుత్రుడగు పురూరవుడు పాన్పుపై భార్యయగు ఊర్వశిని కాంచక విమనస్కుడై ఆమెపై మనస్సుతో దుఃఖిస్తూ పిచ్చివాని వలె భూమండలమున తిరుగుచుండెను. 34

శ్లో॥ సతాం వీక్ష్య కురుక్షేత్రే రహస్యన్యాశ్చ తత్సఖీః ।
పంచప్రహృష్టవదనః ప్రాహ సూక్తం పురూరవాః ॥ 35

టీ:- స ఇతి. తస్యాస్సఖీశ్చ పంచ. వీక్ష్య సూక్తం శోభనం వచనం అహో జాయే త్యాది. 35

కొంతకాలము పిదప కురుక్షేత్రమున ఐదుగురు సఖులతో నున్న ఊర్వశిని గాంచి సంతోషముతో వికసిత వదనుడైన పురూరవుడు శోభనమగు వచనములను (ముందు అహోజ్జాయేత్యాది శ్లోకములతో చెప్పబోవు మాటలను) పలికెను. 35


ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ అహో జాయే తిష్ఠతిష్ఠ ఘోరే న త్యక్తుమర్హసి ।
మంత్రమద్యాప్య నిర్వర్త్య వచాంసి గృణవావహై ॥ 36

టీ:- తదేవార్థత ఆహ - ద్వాభ్యాం. అహో ఇతి. మంత్రం అనిర్వ ర్త్యమంత్ర కృతాం నిర్వృతిమప్రాప్య మామితి పాఠాంతరే మాం నిర్వృతి మగమయిత్వా మంత్రాననుక్త్వేతి వా. వచాంసి గృణవావహై గోష్ఠిం కరవావహే. 36

అయ్యో ఓ ప్రియురాలా! నిలువుము, నిలువుము నన్ను నీవు సుఖింపజేయక వదులుట తగదు. నా మాటలను ఆలకింపుము. (మాటలాడుదము) 36

శ్లో॥ సుదేహోఽయం పతత్యద్య దేవి దూరం హృతస్త్వయా ।
ఖాదంత్యేనం వృకా గృధ్రా స్త్వత్ప్రసాదస్య నాస్పదమ్ ॥ 37

టీ:- సుదేహః అతికమనీయోఽయం మమ దేహః. 37

ఓ దేవీ! ఊర్వశి నీ చేత దూరముగా వదలబడిన, నీ అనుగ్రహమునకు ఆస్పదము కాని ఈ నా సుకుమారమగు దేహము పడిపోగలదు. ఈ దేహమును తోడేళ్ళు, గద్దలు భుజించగలవు. 37

ఊర్వశ్యు ఉవాచ

శ్లో॥ మా మృథాః పురుషోఽసి త్వం మాస్మ త్వాద్యుర్వృకా ఇమే ।
క్వాపి సఖ్యం న వై స్త్రీణాం వృకాణాం హృదయం యథా ॥38

టీ:- పురూరవో మామృథా ఇత్యాది తస్యాస్సూక్తం, తదప్యర్థత ఆహ -చతుర్భిః.మేతి.మా మృథాః మాఽమ్రియస్వపురుషోఽసి త్వం అథో ధైర్య మావహేతి భావః.ఇమే వృకాః ప్రసిద్ధాః ఇంద్రియాణి వా. త్వా త్వాం. మాస్మ అద్యుః న భక్షయేయుః ఇంద్రియవశోమాభవేత్యర్థః.38

ఊర్వశి ఈ విధముగా పలికెను.

ఓ పురూరవుడా! నీవు పురుషుడవు, ధైర్యమవలంభించుము. చావకుము. ఈ వృకములు (ఇంద్రియములు) నిన్ను భక్షించకుండు గాక (ఇంద్రియ లోలుడవు కాకుము) స్త్రీలు, తోడేళ్ళ వలె స్వభావముతో క్రూరులు వారితో స్నేహమెప్పుడును తగదు. 38

శ్లో॥ స్త్రియోహ్యకరుణాః క్రూరాః దుర్మర్షాః ప్రియసాహసాః ।
ఘ్నంత్యల్పార్థేఽపి విస్రబ్ధం పతింభ్రాతరమప్యుత ॥ 39

స్త్రీలు దయలేనివారు. కౄరులు దుర్మార్గమగు ప్రవృత్తి కలవారు. ప్రియమైన విషయమున (తమకిష్టమైన) సాహసము నాచరించువారు చిన్న ప్రయోజనము కొరకైనను విశ్వసించిన భర్తనుగాని, సోదరునిగాని సంహరించెదరు. 39

శ్లో॥ విధాయాలీకవిస్రంభమజ్ఞేషు త్యక్తసౌహృదాః ।
నవం నవమభీప్సంత్యః పుంశ్చల్యస్స్వైరవృత్తయః ॥ 40

టీ:- స్త్రియ ఇతి. ప్రియే నిమిత్తే సాహసం యాసాం తాః. (39-40)

అజ్ఞులగు పురుషులకు అసత్యమైన విశ్వాసమును కల్గించి సుహృద్భావమును వదిలి విచ్చలవిడియగు ప్రవృత్తి కలిగి చంచల స్వభావులై కొత్తకొత్తవారిని కోరుచుందురు. 40

శ్లో॥ సంవత్సరాంతే హి భవానేకరాత్రం మయేశ్వర ।
వత్స్యత్యపత్యాని చ తే భవిష్యంత్యపరాణి భో ॥ 41

టీ:- తం సాంత్వయతి.-సంవత్సరాంత ఇతి. 41

పురూరవుని అనునయిస్తున్నది. ఓ హృదయేశ్వరా! నీవు ఒక సంవత్సరం పిదప ఒక రాత్రి నాతో నివసించెదవు. నీకు వేరే పుత్రులు కలుగుదురు. 41

శ్లో॥ అంతర్వత్నీముపాలక్ష్య దేవీం సప్రయయౌ పురీం ।
పునస్తత్రాగతోఽబ్దాంతే హ్యూర్వశీం వీరమాతరమ్ ॥ 42

అపరాణి అపత్యాని భవిష్యంతి అను వచనములతో ఆ ఊర్వశిని గర్భవతిగ ఎరింగి పురూరవుడు తన నగరమునకు వెడలెను. తిరిగి సంవత్సరాంతమున ఆ కురుక్షేత్రమునకు వచ్చి వీరమాతయగు ఊర్వశిని కాంచి (అని ఉత్తర శ్లోకముతో అన్వయము) .42

శ్లో॥ ఉపలక్ష్య తయా యుక్తస్సమువాస ముదా నిశామ్ ।
అథైనమూర్వశీ ప్రాహ కృపణం విరహాతురమ్ ॥ 43

టీ:- అంతర్వత్నీమితి. అపరాణీతి వచనాదంతర్వత్నీ ముపాలక్ష్య జ్ఞాత్వా. (42-43)

ఊర్వశిని ఆ కురుక్షేత్రమున గాంచి ఆవిడతో గూడి సంతోషముతో ఒక రాత్రి వసించెను. ఆ పిమ్మట దీనుడు, విరహ బాధితుడునగు ఆ పురూరవుని గూర్చి ఊర్వశి ఇటుల పలికెను. 43

శ్లో॥ గంధర్వానుపధావేమాం స్తుభ్యం దాస్యంతి మామితి ।
తస్య సంస్తువతస్తుష్టా అగ్నిస్థాలీం దదుర్నృప ॥ 44

టీ:- గంధర్వానితి. అనేనాగ్నినా కర్మ కృత్వా తద్వశాదూర్వశీం ప్రాప్స్యతీత్యభిప్రాయేణ అగ్నిస్థాలీం దదుః. 44

ఈ గంధర్వులను వేడుకొనుము. వారలు నన్ను నీకొసగుదురు. ఆ మాటలు విని పురూరవుడు గంధర్వులను స్తుతించగా వారు సంతుష్టులై పురూరవునకు అగ్నిస్థాలిని (ఈ అగ్నిస్థాలితో కర్మనాచరించి ఆ కర్మతో ఊర్వశిని పొందగలడను అభిప్రాయముతో) ఒసగిరి. 44

శ్లో॥ ఊర్వశీం మన్యమానస్తాం సోఽబుధ్యత చరన్ వనే ।
స్థాలీం న్యస్య వనే గత్వా గృహాంస్తాం ధ్యాయతో నిశి ॥ 45

టీ:- ఊర్వశీమితి. స తు తాం స్థాలీమేవోర్వశీం మన్యమానః. తయా సహితో వనే విచరన్నే యయూర్వశీ. కిం త్వగ్నిస్థాలీత్యబుధ్యత. తతశ్చ తాం స్థాలీం వనే స్థాపయిత్వా గృహాన్ గత్వా నిశి నిత్యం తామేవ ధ్యాయతః. 45

పురూరవుడు అగ్నిస్థాలినే ఊర్వశిగా తలంచి ఆ అగ్నిస్థాలితో గూడా వనములలో తిరుగుతు ఇది ఊర్వశి కాదు, అగ్నిస్థాలి అని తెలుసుకొనెను. అరణ్యములో అగ్నిస్థాలిని ఉంచి తన ఇంటికి వెడలి సర్వదా ఊర్వశినే ధ్యానించుచుండెను. 45

శ్లో॥ త్రేతాయాం సంప్రవృత్తాయాం మనసి త్రయ్య వర్తత ।
స్థాలీ స్థానగతోఽశ్వత్థం శమీగర్భం విలక్ష్య సః ॥ 46

టీ:- త్రేతాయామితి. తస్య మనసి త్రేతాయాం త్రయీ అవర్తత కర్మబోదకం వేదత్రయం ప్రాదురభూత్. తతః స్థాలీస్థానం గతస్సన్. తత్ర శమ్యా గర్భే జాతమశ్వత్థం విలక్ష అస్మిన్నశ్వత్థే అసావగ్నిరస్తీతి విశేషేణ లక్షయిత్వా. 46

ఆ ఊర్వశి ధ్యానముతో చాలాకాలము గడచి త్రేతాయుగము రాగా ఆ పురూరవుని మనస్సున కర్మబోధకములగు వేదత్రయము ఆవిర్భవించెను. తిరిగి పురూరవుడు అగ్నిస్థాలిని ఉంచిన ప్రాంతమునకు వెళ్ళి శమీ గర్భములో జనించిన అశ్వత్థమును చూచి ఈ అశ్వత్థములో అగ్ని గలదని తెలిసికొని ఆ అశ్వత్థముతో రెండు అరణులను చేసి ఊర్వశి లోకమును చేరవలెనను కోరికతో (అగ్నిని మథించెను) అని అధ్యాహారము. "శమీ గర్భాదగ్నిం మథంతీ" అని శ్రుతి. (46-47)

శ్లో॥ తేన ద్వే అరణీకృత్వా హ్యూర్వశీలోకకామ్యయా ॥ 47

టీ:- తేనేతి. తేనాశ్వత్థేన ద్వే అరణీ కృత్వా అగ్నిం మమంథేతిశేషః . శ్రు. "శమీగర్భాదగ్నిం మంథతీ"తి శ్రుతేః. 47

శ్లో॥ ఊర్వశీం మంత్రతో ధ్యాయన్నధరారణిముత్తరామ్ ।
ఆత్మానముభయోర్మధ్యే యత్తత్ప్రజననం విదుః ॥ 48

టీ:- మథన ప్రకార మాహ - ఊర్వశీమితి. అధరారణిమూర్వశీం ధ్యాయన్నుత్తరారణిమాత్మానం ధ్యాయన్. ఉభయోరరణ్యోర్మధ్యే యత్కాష్ఠం తత్ప్రజననం పుత్రం ధ్యాయన్. తథా చ మంత్రః. శ్రు. "ఊర్వశ్వాయురసి పురూరవా" ఇతి. 48

ఈ శ్లోకమున అగ్ని మథనవిధము వర్ణించబడుచున్నది. అధరారణిని ఊర్వశిగా, ఉత్తరారణిని తననుగా(పురూరవునిగా) ఈ అరణుల రెంటి మధ్యలోని కాష్ఠమును పుత్రునిగా ధ్యానిస్తూ అరణి మథనముచేసెను. "ఊర్వస్యాయురసిపురూరవాః"అనిశ్రుతివాక్యము. 48



శ్లో॥ తస్య నిర్మథనాజ్జాతో జాతవేదా విభావసుః ।
త్రయ్యా స విద్యయా రాజ్ఞా పుత్రత్వే కల్పితస్త్రివృత్ ॥ 49

టీ:- తస్యేతి. తస్య తేన కృతాన్నిర్మథనాద్విభావసురగ్నిర్జాతః. కథంభూతః జాతం వేదో ధనం భోగ్యం యస్మాత్ స చ త్రయ్యా విద్యయా విహితేనాధానసంస్కారేణ త్రివృత్ ఆహవనీయాది రూపస్సన్ రాజ్ఞా పురూరవసా పుత్రత్వే కల్పితః పుణ్యలోకప్రాపకత్వాత్. 49

ఆ పురూరవుని మథనముతో భోగభాగ్యములనొసగెడి అగ్ని జనించెను. ఆ అగ్నిని త్రయీ విద్యతో విహితమగు ఆదాన సంస్కారముతో ఆహవనీయ గార్హపత్య దక్షిణాగ్ని రూపములను ధరింపచేసి, ఆ అగ్ని పుణ్యలోక ప్రాపకుడగుట వలన (ఆ అగ్నిని) పురూరవుడు పుత్రునిగా భావించెను. 49

శ్లో॥ తేనాయజత యజ్ఞేశం భగవంతమధోక్షజమ్ ।
ఊర్వశీలోకమన్విచ్ఛన్ సర్వదేవమయం హరిమ్ ॥ 50

టీ:- తదాహ - తేనేతి. 50

ఆ పురూరవుడు ఊర్వశీ లోకమును చేరగోరినవాడై ఆ అగ్నితో సర్వదేవమయుడు, భగవంతుడు, అధోక్షజుడు అగు హరిని గూర్చి యజ్ఞము చేసెను. 50

శ్లో॥ ఏక ఏవ పురా వేదః ప్రణవస్సర్వవాఙ్మయః ।
దేవో నారాయణో నాన్య ఏకోఽగ్నిర్వర్ణ ఏవ చ ॥ 51

టీ:- నన్వనాది వేద త్రయ బోధితో బ్రాహ్మణాదీనామింద్రాద్యనేక దేవతా యజనేన స్వర్గప్రాప్తిహేతుః కర్మ మార్గః కథంస్యాదితి వర్ణ్యతే? తత్రాహ - ద్వాభ్యాం. ఏక ఇతి. పురా కృతయుగే సర్వవాఙ్మయః

అనాది నుండి వేద త్రయము చేత బోధించబడిన బ్రాహ్మణాదులకు, ఇంద్రుడు మొదలగు అనేక దేవతల యజనముతో స్వర్గప్రాప్తికి కారణమగు కర్మమార్గము ఎట్లు కలిగినదను విషయము తెలుపబడుచున్నది రెండు శ్లోకములతో. పూర్వము కృతయుగమున సమస్త వాక్కులకు బీజభూతమగు ప్రణవము ఒక్కటే వేదము. నారాయణుడొక్కడే దేవుడు, లౌకికాగ్ని ఒక్కటే అగ్ని, హంసః అను వర్ణమొక్కటే యుండెను. 51

సర్వాసాం వాచాం బీజభూతః ప్రణవః ఏక ఏవ వేదః దేవశ్చ నారాయణః ఏక ఏవ అగ్నిశ్చైక ఏవ లౌకికః వర్ణశ్చైక ఏవ హంసో నామ. 51

శ్లో॥ పురూరవస ఏవాసీత్త్రయీ త్రేతాముఖే నృప ।
అగ్నినా ప్రజయా రాజా లోకం గాంధర్వమేయివాన్ ॥ 52

టీ:- పురూరవస ఇతి. వేద త్రయీ తు పురూరవసః సకాశాదాసీత్ ఏయివాన్ ప్రాప. అయం భావః-కృతయుగే సత్త్వప్రధానాః ప్రాయశః సర్వేపి ధ్యాననిష్ఠాః రజః ప్రధానే తు త్రేతాయుగే వేదాది విభాగేన కర్మ మార్గః ప్రకటో బభూవేతి. 52

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,

చతుర్దశోఽధ్యాయః

త్రేతాయుగమున పురూరవుని నుండే వేద త్రయి ఆవిర్భవించినది. ఆ పురూరవుడు అగ్ని పుత్రునితో గాంధర్వ లోకమునకు వెడలెను. కృత యుగమున అందరు సత్వ గుణ ప్రధానులై ధ్యాననిష్ఠులై ఉండిరి. రజోగుణ ప్రధానమగు త్రేతా యుగమున వేదాది విభాగముతో కర్మమార్గము ప్రాకట్యమొందినదని భావము. 52

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు

పద్నాల్గవ అధ్యాయము సమాప్తము.



పంచదశోఽధ్యాయః

శ్లో॥ ఐళస్య చోర్వశీగర్భాత్ షడాసన్నాత్మజా నృప ।
ఆయుశ్శ్రుతాయుస్సత్యాయూరయోఽథ విజయో జయః ॥ 1

టీ:- శ్లో. తతః పంచదశే గాధిరైళపుత్రాన్వయేఽజని, యద్దౌహిత్ర సుతో రామః కార్తవీర్య మహాన్ రుషా. యద్వా. ఉక్తాః పంచదశే వంశాశ్శ్రుతాయః ప్రముఖోద్ధితాః, అర్జునం గాధిజా పౌత్రోరామో హంతేతి చేదితం. 1

శ్లో॥ శ్రుతాయోర్వసుమాన్ పుత్రస్సత్యాయోస్తు శ్రుతంజయః ।
రయస్య సుత ఏకశ్చ జయస్య తనయో మితః ॥ 2

శ్లో॥ భీమస్తు విజయస్యాథ కాంచనో హోత్రకస్తతః ।
తస్య జహ్నుస్సుతో గంగాం గండూషీ కృత్యయోఽపిబత్ ॥ 3

టీ:- సుగ్రహత్వాయైళాదిక్రమేణ శ్రుతాయుఃప్రభృతీనాం షణ్ణా వంశానాహ-శ్రుతాయోరితి.ఏకః ఏకసంజ్ఞః అమితః తత్సంజ్ఞః. (2-3)

15 వ అధ్యాయము

ఈ పదిహేనవ అధ్యాయమున ఇళా పుత్రుడగు పురూరవుని వంశములో గాధి జన్మించుట అతని దౌహిత్ర పుత్రుడగు పరశురాముడు కార్తవీర్యార్జునుని సంహరించిన చరితము వర్ణించబడుచున్నది.

ఇళా పుత్రుడగు పురూరవునకు ఊర్వశీ గర్భమునుండి ఆయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుడు, విజయుడు, జయుడు అను ఆరుగురు పుత్రులు జన్మించిరి. 1

శ్రుతాయు ప్రభృతులగు ఆరుగురి వంశములను తెలుపుచున్నాడు. ఈ ఆరుగురిలో శ్రుతాయువునకు వసుమంతుడు, సత్యాయువునకు శ్రుతంజయుడు, రయునకు ఏకుడు అను పేరుగలవాడు, జయునకు అమితుడను పుత్రులు జన్మించిరి. 2

విజయునకు భీముడు, భీమునకు కాంచనుడు, కాంచనునకు హోత్రుడు, హోత్రునకు జహ్నువు అనువారలు పుత్రులైరి. ఈ జహ్నువు గంగానదిని పుక్కటితో తాగివేసెను. 3

శ్లో॥ జహ్నోస్తు పూరుస్తత్పుత్రో బాలకశ్చాజకో యతః ।
తతః కుశః కుశస్యాపి కుశాంబో ధూర్తయో వసుః ॥ 4

టీ:- జహ్నోరితి. జహ్నోః పూరుః. తస్య బాలకః. తస్య అజకః. 4

జహ్నునకు పూరువు, పూరునకు బాలకుడు, బాలకునకు అజకుడు ఆతనికి కుశుడు, కుశునకు కుశాంబి, ధూర్తుడు, వసువు, కుశనాభుడు అను నల్గురు పుత్రులు కలిగిరి. (ఉత్తర శ్లోకముతో అన్వయము). 4

శ్లో॥ కుశనాభశ్చ చత్వారో గాధిరాసీత్కుశాంబతః ।
తస్య సత్యవతీం కన్యాం ఋచీకోఽయాచత ద్విజః ।
వరం విసదృశం దృష్ట్వా గాధిర్భార్గవమబ్రవీత్ ॥ 5

టీ:- గాధేః పుత్రో విశ్వామిత్రో బ్రహ్మర్షిభూదిత్యుత్తరాధ్యాయాంతే వక్ష్యతి. గాధేరభూన్మహాతేజా ఇత్యాదినా. తత్ర తావదుపోద్ఘాతత్వేన భృగువంశ సంభవస్య ఋచీకస్య చరిత్రం ప్రసక్తానుప్రస్తకం పరశు రామావతారచరితాదికం చాహ.-తస్యేతి. విసదృశం అననురూపం. భార్గవమృచీకం. 5

కుశనాభుడు అను నల్గురు పుత్రులు కలిగిరి. కుశాంబికి గాధి జన్మించెను. ఈ గాధి పుత్రుడు విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అయ్యెను. అని తరువాతి అధ్యాయము చివర "గాధిరభూన్మహతేజా" అని మొదలుగా గల శ్లోకముతో చెప్పబడును. దానికి ఉపోద్ఘాతముగా భృగు వంశములో జన్మించిన ఋచీకుని యొక్క చరిత్రను, ప్రసక్తాను ప్రసక్తముగా పరశురామ చరిత్ర కూడా చెప్పబడుచున్నది. గాధికి సత్యవతి అను కన్యక జన్మించెను. ఆ సత్యవతిని బ్రాహ్మణుడగు ఋచీకుడు యాచించెను. అపుడు గాధి తన కన్యకయగు సత్యవతికి, భార్గవ వంశజుడగు ఋచీకుడు అనురూపుడగు వరుడు కాడని తలచి ఋచీకునితో ఇటుల పలికెను. 5

శ్లో॥ ఏకతశ్శ్యామకర్ణానాం హయానాం చంద్రవర్చసామ్ ।
సహస్రం దీయతాం శుల్కం కన్యాయాః కౌశికా వయమ్ ॥ 6

ఎడమ, కుడి చెవులు రెండును నలుపు వర్ణముగల, శరీరమంతయు తెలుపువర్ణముగల వెయ్యిగుఱ్ఱములను కన్యాశుల్కముగా ఇవ్వుము. ఐనను ఈ గుఱ్ఱములు కన్యాశుల్కమునకు సరిపడవు. ఏలనన మేము కుశిక వంశములో జన్మించిన వారము. 6



శ్లో॥ ఇత్యుక్తస్తన్మతం జ్ఞాత్వాగతస్స వరుణాంతికమ్ ।
ఆనీయ దత్వా తానశ్వానుపయేమే వరాననమ్ ॥ 7

టీ:- ఏకత ఇతి. దక్షిణవామయోరేకతః శ్యామః వర్ణో యేషాం సర్వస్మిన్ అంగే చంద్రస్యేవ వర్చో యేషాం న చేదమపి పర్యాప్తమస్మత్కన్యాయాః యతః కౌశికాః కుశికాన్వయాః వయం. (6-7)

అతడు (గాధి) తన అభిప్రాయమును చెప్పగా, ఆ ఋచీకుడు గాధి కోరికను గ్రహించి వరుణదేవుని వద్దకు వెడలి అట్టి అశ్వములను తెచ్చి గాధి కొసంగి అందగత్తెయగు ఆ సత్యవతిని వివాహమాడెను. 7

శ్లో॥ స ఋషిః ప్రార్థితః పత్న్యాశ్వశ్ర్వా చాపత్యకామ్యయా ।
శ్రపయిత్వోభయైర్మంత్రైశ్చరుం స్నాతుం గతో మునిః ॥ 8

టీ:- స ఇతి. ఉభయైః పత్న్యై బ్రాహ్మైర్మంత్రైః శ్వశ్ర్వైతు క్షాత్రైర్మంత్రైరిత్యర్థ. 8

ఋచీకుని భార్యయగు సత్యవతి, ఆవిడ తల్లి ఇద్దరును సంతాన కాంక్షతో ఋచీకుని ప్రార్థించగా (ఉభయ మంత్రములతో) భార్య కొరకు బ్రాహ్మీ మంత్రములతో, శ్వశ్రువు (అత్త) కొరకు క్షాత్ర మంత్రములతో చరువునభిమంత్రించి స్నానముచేయుటకై వెడలెను. 8

శ్లో॥ తావత్సత్యవతీ మాత్రా స్వచరుం యాచితా సతీ ।
శ్రేష్ఠం మన్వానయాఽయచ్ఛన్మాత్రే మాతురదత్స్వయమ్ ॥ 9

టీ:- తావదితి. యావత్ స్నాత్వా మునిర్నాగతః. తావత్. భార్యాయాం భర్తృస్నేహాధిక్యాత్. పుత్ర్యాస్సత్యవత్యాశ్చ శ్రేష్ఠం మన్వానయా మాత్రా. సత్యవతీ యాచితాసతీ బ్రాహ్మమంత్రాభిమంత్రితం స్వచరుం మాత్రే అయచ్ఛత్ ప్రాదాత్. మాతుస్తు చరుం క్షాత్రమంత్రాభి మంత్రితం స్వయమదత్ ఆదత్. 9

ముని స్నానము చేసి వచ్చేంతలో సత్యవతి తల్లి, భార్య యందు భర్తకు స్నేహాధిక్యమునూహించి భార్యయగు సత్యవతికై బ్రాహ్మ మంత్రములతో అభిమంత్రించిన చరువును శ్రేష్ఠమైనదిగా తలచి తనకిమ్మని పుత్రికను కోరెను. అపుడు సత్యవతి తన చరువును తల్లికిచ్చి తల్లి కోరికతో క్షాత్ర మంత్రములతో అభిమంత్రించిన చెరువును తాను భుజించెను. 9

శ్లో॥ తద్విజ్ఞాయ మునిః ప్రాహ పత్నీం కష్టమకారుషీః ।
పుత్రో ఘోరో దండధరో భ్రాతా తే బ్రహ్మవిత్తమః ॥ 10

టీ:- తదితి. కష్టం జుగుప్సితం. తదేవాహ - తే పుత్రో ఘోరోభవిష్యతి. భ్రాతా తు బ్రహ్మవిత్తమో భవిష్యతీతి. 10

స్నానమాచరించి వచ్చిన ఋచీకముని ఆ చరువ్యత్యయమును గ్రహించి భార్యయగు సత్యవతితో జుగుప్సితమగు పనిచేసితివి. దీనితో నీ పుత్రుడు ఆయుధమును ధరించు ఘోరుడు కాగలడు. నీ సోదరుడు బ్రహ్మజ్ఞాన సంపన్నుడు కాగలడని పలికెను. 10

శ్లో॥ ప్రసాదితస్సత్యవత్యా మైవం భూదితి భార్గవః ।
అథ తర్హి భవత్పౌత్రోజమదగ్ని స్తతోఽభవత్ ॥ 11

టీ:- ప్రసాదిత ఇతి. ఏవం మాభూదితి ప్రసాదితో భార్గవ ఆహ-అథ తర్హి పౌత్రో ఘోరో భవేదితి. తతో జమదగ్నిః పుత్రోఽభవదిత్యర్థః. 11

ఈ విధముగా జరగకూడదని సత్యవతితో ప్రార్థించబడిన ఋచీకుడు నీ పౌత్రుడు (మనుమడు) ఘోరుడగును అని తెలిపెను. ఆ ఋచీకునకు జమదగ్ని జన్మించెను. 11

శ్లో॥ సా చాభూత్సు మహాపుణ్యా కౌశికీ లోకపావనీ ।
రేణోస్సుతాం రేణుకాఖ్యాం జమదగ్ని రువాహ యామ్ ॥ 12

టీ:- సేతి. సా చ సత్యవతీ కౌశికీ నద్యభూత్. 12

ఆ సత్యవతి లోకమును పావనమొనర్చెడి గొప్ప పుణ్యవతియగు కౌశికీ నది ఆయెను. జమదగ్ని రేణువు పుత్రికయగు రేణుకా అను నావిడను వివాహమాడెను. 12

శ్లో॥ తస్యాం వై భార్గవ ఋషేః సుతా వసుమనాదయః ।
యవీయాన్ జజ్ఞ ఏతేషాం రామ ఇత్యభివిశ్రుతః ॥ 13

భృగువంశీకుడగు ఆ జమదగ్నికి ఆ రేణుకయందు వసుమనాది పుత్రులు కలిగిరి. వారిలో చిన్నవాడు రాముడని (భార్గవరాముడని) కీర్తినొందెను. 13

శ్లో॥ యమాహుర్వాసుదేవాంశం హైహయానాం కులాంతకమ్ ।
త్రిస్సప్తకృత్వోయ ఇమాం చక్రే నిః క్షత్రియాం మహీమ్ ॥ 14

ఆ రాముడు శ్రీమన్నారాయణాంశ సంభూతుడై హైహయ వంశాంతకుడై ఇరువదిఒక్క సార్లు ఈ భూమిని నిఃక్షత్రియము గావించెను. 14

టీ:- తస్యామితి. భార్గవ ఋషేః జమదగ్నేః సుతాః. (13-14)

శ్లో॥ దృప్తం క్షత్రం భువో భారమబ్రహ్మణ్యమనీనశత్ ।
రజస్తమోవృత్త మహాన్ ఫల్గున్యపి కృతేఽంహసి ॥ 15

రజస్తమోవృత్తులు కలవారై క్షత్రియులు మహాపాపముల నొనరించగా, దర్పయుక్తమగు క్షత్రియ వంశమును ఆ రాముడు నశింపజేసి భూ భారమును నశింపచేసెను. (హరించెను). 15

పరీక్షిదువాచ

పరీక్షిత్తు ఇటుల ప్రశ్నించెను.

శ్లో॥ కిం తదంహో భగవతో రాజన్యైరజితాత్మభిః ।
కృతం యేన కులం నష్టం క్షత్రియాణామభీక్ష్ణశః ॥ 16

భగవదవతారుడగు ఆ రామునకు రాజితాత్ములగు రాజులు ఏమి పాపమాచరించిరి. రాజన్యుల ఏ పాపము చేత క్షత్రియ కులము భార్గవ రామునితో నాశమొందించబడినది. 16

టీ:- దృప్తమితి. అనీనశత్. నాశయామాస. (15-16)

శ్రీ శుక ఉవాచ

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

శ్లో॥ హైహయానామధిపతిరర్జునః క్షత్రియర్షభః ।
దత్తం నారాయణాంశాంశమారాధ్య పరికర్మభిః ॥ 17

కార్తవీర్యార్జుని చేత చేయబడిన అపరాధమును తెలియజేయుటకై ఆ కార్తవీర్యార్జునుని దర్పమునకు కారణమును ఆరు శ్లోకములలో తెలుపుచున్నాడు. హైహయాన్వయాదిపతి క్షత్రియ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

టీ:- కార్తవీర్యార్జునేన కృతమపరాధం వక్తుం తస్య దర్పహేతు మైశ్వర్యాదికమాహ-షడ్భిః. హైహయానామితి. పరికర్మభిః పరిచర్యాదిభిః దత్తం దత్తాత్రేయం ఆరాధ్య. 17

శ్రీకృష్ణుడునగు అర్జునుడు (కార్తవీర్యార్జునుడు) శ్రీమన్నారాయణ అంశజుడగు దత్తాత్రేయుని పూజాది కర్మలచే ఆరాధించి తరువాతి శ్లోకముతో అన్వయము. 17

శ్లో॥ బాహూన్ దశశతం లేభే దుర్ధర్షత్వమరాతిషు ।
అవ్యాహతేంద్రియౌజశ్శ్రీతేజో వీర్యయశో బలమ్ ॥ 18

టీ:- బాహూనితి. అవ్యాహతమింద్రియాదికం చ లేభే. 18

వేయిచేతులను, శత్రువిషయమున దర్ధర్షత్వమును(జయింపబడకుండుటను) అవ్యహతములగు (కొట్టుబడినట్టి) ఇంద్రియములను ఓజస్సును, సంపదను, పరాక్రమమును, కీర్తిని, బలమును పొందెను. 18

శ్లో॥ యోగేశ్వరత్వమైశ్వర్యం గుణా యత్రాణిమాదయః ।
చచారావ్యాహతగతిర్లోకేషు పవనో యథా ॥ 19

టీ:- యోగేతి. యత్ర యస్మిన్నైశ్వర్యే అణిమాదయో గుణాః. 19

యోగీశ్వరత్వమును, సంపదను, అణిమాది అష్టసిద్ధులను పొంది వాయువువలె అడ్డులేని గమనము కలవాడై లోకములో తిరుగుచుండెను. 19

శ్లో॥ స్త్రీరత్నైరన్వితః క్రీడన్ రేవాంభసి మదోత్కటః ।
వేజయంతీ స్రజం బిభ్రద్రురోధ సరితం భుజైః ॥ 20

టీ:- స్త్రీరత్నైరితి. రేవాం భస్మినర్మదాజలే. సరితం నర్మదాం. 20

మదోన్మత్తుడై నర్మదా నదీ జలములలో ఉత్తమురాండ్రగు స్త్రీలతో జలకములాడుచు, వైజయంతీ మాలను ధరించి తన సహస్ర భుజములతో నర్మదా జలముల నరికట్టెను. 20

శ్లో॥ విప్లావితం స్వశిబిరం ప్రతిస్రోతస్సరిజ్జలైః ।
నామృష్యత్తస్య తద్వీర్యం వీరమానీ దశాననః ॥ 21

టీ:- విప్లావితమితి. రావణో దిగ్విజయే మాహిష్మత్యాస్సమీపే నర్మదాయాం శివపూజాం కుర్వన్. తేన ప్రవాహస్యావరోధాత్. ప్రతి స్రోతసస్సత్యాస్తస్యాస్సరితో జలైః విప్లావితం స్వశిబిరమాలక్ష్య. తస్యత ద్వీర్యం న సేహే. 21

వీరుడు, దశాననుడు నగు రావణుడు మాహిష్మతీ పుర సమీపమున నర్మదా నదిలో శివ పూజ చేస్తూ కార్తవీర్యార్జుని చేత జల ప్రవాహము రోధము గావించబడి ఎదురెక్కిన నీటిలో తన శిబిరము మునుగగా ఆ కార్తవీర్యార్జుని పరాక్రమమును సహించలేక పోయెను. 21

శ్లో॥ గృహీతోలీలయా స్త్రీణాం సమక్షం కృత కిల్బిషః ।
మాహిష్మత్యాం సంనిరుద్ధో ముక్తో యేన కపిర్యథా ॥ 22

టీ:- గృహీత ఇతి. తతశ్చ కృతకిల్బిషః క్రీడంతమభిభవితుం ప్రవృత్తస్సన్ గృహీతః మాహిష్మత్యాం స్వపుర్యాం. కపిరివ సన్నిరుద్ధశ్చ పునశ్చావజ్ఞయా యేన ముక్తః. 22

స్త్రీలతో కలిసి జలక్రీడ సల్పుచూ, తనకు కీడుచేసిన ఆ కార్తవీర్యార్జునున్ని రావణుడు ఎదురించగా, కార్తవీర్యార్జునుడు రావణున్ని నిగ్రహించి, మాహిష్మతి పురములో బంధించెను. అటు తరువాత అతనిని బంధించడం కోతి బంధించినట్లుగా భావించి, తిరస్కార భావముతో విడిచిపెట్టెను. 22

శ్లో॥ స ఏకదా తు మృగాయాం విచరన్ విజనే వనే ।
యదృచ్ఛయాఽఽ శ్రమపదం జమదగ్నే రుపావిశత్ ॥ 23

టీ:- ఇదానీం తత్కృత మపరాధం దర్శయన్నాహ - స ఏకదేత్యాదినా. 23

కార్తవీర్యార్జునడొనరించిన అపరాధమునుగురించి తెలుపుచున్నాడు. కార్తవీర్యార్జునుడొకసారి నిర్జనమగు అరణ్యమున వేటకై తిరుగుచూ అనుకోకుండా జమదగ్ని మహర్షి ఆశ్రమమున ప్రవేశించెను. 23



శ్లో॥ తస్మై స నరదేవాయ మునిరర్హణమాచరత్ ।
స సైన్యామాత్యవాహాయ హవిష్మత్యా తపోధనః ॥ 24

టీ:- తస్మా ఇతి. అర్హణం ఆతిథ్యాది. హవిష్మత్యా కామధేన్వా. 24

తపోధనుడగు జమదగ్ని ముని తన వద్దనున్న కామధేనువు ప్రభావముతో ఆ నరదేవుడగు (రాజు) కార్తవీర్యార్జునకు, అతని సేనకు, అమాత్యులకు, వారి పోషణములకు ఆథిధ్యమొసగెను. 24

శ్లో॥ సవీర స్తత్ర తం దృష్ట్వాహ్యాత్మైశ్వర్యాతిశాయినమ్ ।
తన్నాద్రియేతాగ్ని హోత్ర్యాం సాభిలాషస్సహైహయః ॥ 25

టీ:- స ఇతి. తదర్హణం నాద్రి యేత తస్మిన్నాతుష్యత్. యతోఽగ్ని హోత్ర్యాం హోమధేన్వాం. సాభిలాషః. సహైహయః హైవయైస్సహ వర్తమానః. 25

కార్తవీర్యార్జునుడు జమదగ్ని ఆశ్రమమున తన ఐశ్వర్యమును అతిశయించునట్టి ఆ కామధేనువును గాంచి ఆ కామధేనువుపై అభిలాష కలిగినవాడై జమదగ్ని ఒసగిన ఆథిధ్యముతో తృప్తినొందక హైహయులతో కూడి - 25

శ్లో॥ హవిర్ధానీమృషేర్దర్పాన్నరాన్ హర్తుమచోదయత్ ।
తే తాం మాహిష్మతీం నిన్యుస్సవత్సాం క్రందతీం బలాత్ ॥26

కార్తవీర్యార్జునుడు దర్పముతో జమదగ్ని వద్దనున్న ఆ కామధేనువును హరించి తెచ్చుటకు సైనికులను పంపెను. వారు దూడతో గూడిన ఆ ధేనువును అరచుచుండగా బలవంతముగా మాహిష్మతీ పట్టణమునకు తీసుకొని వెడలిరి. 26

శ్లో॥ అథ రాజాని నిర్యాతే రామస్స్వాశ్రమమాగతః ।
శ్రుత్వాత త్తస్య దౌరాత్మ్యం చుక్రోధాఽహిరివాహతః ॥ 27

టీ:- హవిర్ధానీమితి. దర్పాద్ధేతోః ఋషేర్హవిర్ధానీమగ్నిహోత్ర ధేనుం. హర్తుం నరానచోదయత్. (26-27)

కార్తవీర్యార్జున రాజు జమదగ్ని ఆశ్రమము నుండి వెడలిన పిదప భార్గవరాముడు తన ఆశ్రమమునకొచ్చెను. కార్తవీర్యార్జునుడు చేసిన దుర్మార్గపు పనిని గురించి విని కొట్టబడిన సర్పము వలె కోపించెను. 27

శ్లో॥ ఘోరమాదాయ పరశుం సతూణాం వర్మకార్ముకం ।
అన్వధావత దుర్ధర్షో మృగేంద్ర ఇవ యూథపమ్ ॥ 28

టీ:- ఘోరమితి. సతూణం కార్ముకం వర్మ చాదాయ. 28

భార్గవరాముడు ఘోరమగు గండ్రగొడ్డలిని, తూణీరముతో కూడిన ధనుస్సును, చర్మమును తీసుకొని దుర్ధర్షుడై (ఎదురించరాని పరాక్రమములు కలవాడై) గజమును వెంబడించెడి సింహము వలె కార్తవీర్యార్జునుని వెంబడించి వెడలెను. 28

శ్లో॥ తమాపతంతం భృగువర్యమోజసా
ధనుర్ధరం బాణపరశ్వధాయుధం ।
ఐణేయచర్మాంబర మర్క ధామభిర్యుతం
జటాభిర్దదృశే పురీం విశన్ ॥ 29

టీ:- తమితి. ఐణేయచర్మ కృష్ణాజినం అంబరం యస్య. 29

కార్తవీర్యార్జునుడు తన పురమును ప్రవేశిస్తూ తన వెంటబడి వచ్చుచున్న ధనుస్సును ధరించి బాణాద్యాయుధములు కల్గి ఓజస్సుతో గూడి, సూర్యునిలాంటి తేజస్సుతో కూడియున్నట్టి కృష్ణాజిన ధారియగు జటలతో గూడిన భార్గరాముని గాంచెను. 29

శ్లో॥ అచోదయద్ధస్తి రథాశ్వ పత్తిభి
ర్గదాసి బాణార్ష్టి శతఘ్నిశక్తిభిః ।
అక్షౌహిణీ స్సప్తదశాతి భీషణా
స్తా రామ ఏకో భగవానసూదయత్॥ 30

టీ:- అచోదయదితి. హస్తిరథాదిభిః అతిభీషణాః. 30

ఆ సమయమున కార్తవీర్యార్జునుడు గద, ఖడ్గ, బాణ, చక్ర, శతఘ్ని, శక్త్యాది ఆయుధములుగల గజ, అశ్వ, రథ, పదాతి, దళములు గల మిక్కిలి భయంకరమగు పదిహేడు అక్షౌహిణీల సైన్యమును భార్గవరాముని పైకి పంపెను. ఆ పదిహేడు అక్షౌహిణీల సైన్యమును భగవదంశ సంభూతుడగు పరశురాముడొక్కడే నాశమొనరించెను. 30

శ్లో॥ యతో యతోఽసౌ ప్రహరత్పరశ్వథో
మనోఽనిలౌజాః పరచక్రసూదనః ।
తతస్తతశ్ఛిన్న భుజోరుకంధరా
నిపేతురుర్వ్యాం హతసూతవాహనః ॥ 31

టీ:- యత ఇతి. ప్రహరన్ పరశ్వథో యస్య. మనశ్చ అనిలశ్చ తయోరివ ఓజో వీర్యం యస్య పరేషాం చక్రం సైన్యం సూదయతీతి తథా. ఛిన్నాః. భుజాః ఊరవః కంధరాశ్చ యేషాం తే హతాః సూతాః వాహనాని చ యేషాం తే. వీరా నిపేతుః. 31

మనో వాయువులతో సమానమగు బలము కల్గినట్టి శత్రు సైన్యమును నాశనమొందించెడి పరశురాముడు తన గొడ్డలిని ఎక్కడెక్కడ ప్రయోగించెనో అచటనచట కార్తవీర్యార్జునుని యోధులు తెగిన భుజములు,తొడలు, మెడలు కలిగి చంపబడిన సారథులు, వాహనములు కలవారై భూమిపై పడిపోయిరి. 31

శ్లో॥ దృష్ట్వా స్వసైన్యం రుధిరౌఘకర్దమే
రణాజిరే రామకుఠారసాయకైః ।
వివృక్ణవర్మధ్వజచాపవిగ్రహం
నిపాతితం హైహయ ఆపతద్రుషా ॥ 32

టీ:- దృష్ట్వేతి. వివృక్ణాః. వర్మాదయో యస్య. 32

ఆ యుద్ధభూమిలో భార్గవరాముని గొడ్డలి, బాణములతో ఛేదించబడి వర్మములు, ధ్వజములు, ధనుస్సులు, కల్గి రక్తప్రవాహప బురుదలో పడియున్న తన సైన్యమును కార్తవీర్యార్జునుడు చూచి కోపముతో తానే స్వయముగా యుద్ధమునకు వచ్చెను. 32

శ్లో॥ అథార్జునః పంచశతేషు బాహుభి
ర్ధనుస్సుబాణాన్ యుగపత్స సందధే ।
రామాయ రామోఽస్త్రభృతాం సమగ్రణీ
స్తాన్యే కధన్వేషు భిరచ్ఛినత్సమమ్ ॥ 33

టీ:- అథేతి. పంచశతేషు ధనుస్సు సోఽర్జునః. రామాయ సందధే ఏక మేవ ధనుర్యస్య సః. పాఠాంతరే ఏక ఏవ బంధః సంధానం యేషాం తైరిషుభిః తాని ధనూంషి. సమం సహ తత్క్షణమేవాచ్ఛినత్. 33

కార్తవీర్యార్జునుడు ఐదువందల భుజములతో, ఐదువందల ధనుస్సుల యందు ఒకేసారి బాణములను భార్గవరామునిపైకి సంధించెను. వీరాగ్రేసరుడగు పరశురాముడు ఒకే ధనస్సునందలి బాణములతో ఆ ఐదువందల బాణములను, ధనుస్సులను ఖండించెను. 33

శ్లో॥ పునస్స్వహస్తైరచలాన్మృధేఽంఘ్రిపా
నుత్క్షిప్య వేగాదభిధావతోయుధి ।
భుజాన్ కుఠారేణ కఠోరనేమినా
చిచ్ఛేద రామః ప్రసభం ఫణానివ ॥ 34

ఆ యుద్ధమున కార్తవీర్యార్జునుడు తన వేయి చేతులతో పర్వతపు రాళ్ళను, వృక్షములను ఎత్తి వేగముగా పరిగెత్తుచు తనపైకి రాగా పరశురాముడు మిక్కిలి తీక్షణమగు తన గొడ్డలితో అతని సహస్ర భుజములను సర్పము యొక్క పడగలను ఛేదించినటుల ఛేదించెను. 34

శ్లో॥ కృత్తబాహోశ్శిరస్తస్య గిరేశ్శృంగమివాహరత్ ।
హతే పితరి తత్పుత్రా అయుతం దుద్రువుర్భయాత్ ॥ 35

బాహువులు ఛేదించబడిన ఆ అర్జునుని శిరస్సును పర్వత శిఖరమును కూల్చునటుల ఛేదించెను. అర్జునుడు ఆ విధముగా చంపబడగా అతని పుత్రులు పదివేల మంది భయముతో పారిపోయిరి. 35

టీ:- పునరితి. మృథే సాధనభూతానచలానంఘ్రిపాంశ్చ. ఉత్క్షిప్య అభిధావతస్తస్య భుజాన్ యుధి చిచ్ఛేద అహేః ఫణానివ. (34-35)

శ్లో॥ అగ్నిహోత్రీముపావృత్య సవత్సాం పరవీరహా ।
సముపేత్యాశ్రమం పిత్రే పరిక్లిష్టాం సమర్పయత్ ॥ 36

శత్రువీరుల నాశనమొందించిన ఆ రాముడు బాధనొందిచబడిన దూడతో గూడిన ఆ హోమధేనువును వెంట తీసుకొని ఆశ్రమము చేరి తన తండ్రియగు జమదగ్నికి దానిని సమర్పించెను. 36

శ్లో॥ స్వకృతం తత్కృతం రామః పిత్రే భ్రాతృభ్య ఏవ చ ।
వర్ణయామాస తచ్ఛ్రుత్వా జమదగ్ని రభాషత ॥ 37

భార్గవరాముడు శత్రువులొనరించిన కార్యమును, తాను చేసిన పనిని (శత్రువులనెదురించి దునుమాడి కార్తవీర్యార్జునుని చంపిన విధమును) తండ్రియగు జమదగ్నికి, సోదరులకు వర్ణించి చెప్పెను. అది విని జమదగ్ని ఇటుల పలికెను. 37

శ్లో॥ రామరామ మహాబాహో భవన్పాపమకారుషీత్ ।
అవధీన్నరదేవం యత్సర్వదేవమయం రుషా ॥ 38

టీ:- అగ్నిహోత్రీమితి. పిత్రే పరిక్లిష్టాం అగ్నిహోత్రీం సమర్పయత్ సమర్పితవాన్. (36-38)

భుజ బల శాలివగు ఓ రామా! సర్వదేవమయుడు, నరదేవుడు నగు ఆ అర్జునుని కోపముతో చంపి నీవు పాపమొనరించితివి. 38

శ్లో॥ వయం హి బ్రాహ్మణాస్తాత క్షమయాஉర్హణతాం గతాః ।
యయాలోకగురుర్దేవః పారమేష్ఠ్యమయాత్పదమ్ ॥ 39

టీ:- వయమితి. అర్హణతాం పూజ్యతాం అయాత్. అగాత్. 39

ఓ వత్సా రామా! బ్రాహ్మణులము మనము క్షమతో (ఓర్పుతో) పూజనీయతనొందిన వారము. క్షమతోనే బ్రాహ్మణుడు పరమపదము నొందును. 39

శ్లో॥ క్షమయా రోచతే లక్ష్మీః బ్రాహ్మీ సౌరీ ప్రభా యథా ।
క్షమిణామాశు భగవాంస్తుష్యతే హరిరీశ్వరః ॥ 40

టీ:- క్షమయేతి. సౌరీ సూర్యస్య ప్రభవే. 40

బ్రాహ్మీమయమగు లక్ష్మి క్షమతో, సూర్యుని కాంతి వలె ప్రకాశించును. క్షమావంతుల విషయమున భగవంతుడు జగదీశ్వరుడును అగు హరి తొందరగా సంతసించును. 40

శ్లో॥ రాజ్ఞో మూర్ధావసిక్తస్య వధో బ్రహ్మవధాద్గురుః ।
తీర్థస్సంసేవయా చాంహో జహ్యంగాచ్యుత చేతనః ॥ 41

టీ:- రాజ్ఞ ఇతి. తీర్థసంసేవయా. చకరాద్యమ నియమైశ్చ. అచ్యుతే చేతనా చిత్తం యస్య సః. 41

రాజ్యాభిషేకము నొందిన రాజుయొక్క వధ బ్రాహ్మణ వధకంటే బలవత్తరమైనది. (ఎక్కువ దోషము కల్గించునది) అందువలన నీవు భగవంతునియందు చిత్తమునుంచి తీర్థయాత్రాసేవతో యమ నియమాదులతో పాపమును జయించుము. (రాజవధ పాపనివృత్తికై తీర్థసేవనము గావించుము. 41

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
పంచదశోఽ ధ్యాయః

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
పదిహేనవ అధ్యాయము సమాప్తము.

–

షోడశోఽధ్యాయః

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ పిత్రోపశిక్షితో రామస్తథేతి కురునందన ।
సంవత్సరం తీర్థయాత్రాం చరిత్వాశ్రమమావ్రజత్ ॥ 1

టీ:- శ్లో. "షోడశే చార్జునసుతైర్జమదగ్నౌ హతే ముహుః, రామాత్ క్షత్ర వధః ప్రోక్తః విశ్వామిత్రస్య చాన్వయః. యద్వా. తీర్థాన్యటన్ ప్రసూభ్రాతౄన్ రామోఽహన్ షోడశేనృపాన్, గాధేః పుత్రోఽభవద్విప్రః తద్వంశోఽభూదనేకశః". (1-2)

శ్లో॥ కదాచిద్రేణుకా యాతా గంగాయాం పద్మమాలినం ।
గంధర్వరాజం క్రీడంతమప్సరోభిరవైక్షత ॥ 2

శ్లో॥ విలోకయంతీ క్రీడంతముదకాయ నదీం గతా ।
హోమవేలాం న సస్మార కించిచ్చిత్రరథస్పృహా ॥ 3

టీ:- విలోకయంతీతి. కించిదీషచ్చిత్రరథే గంధర్వరాజే స్పృహా యస్యాస్సా కించిన్న సస్మారేతి వా. 3

16 వ అధ్యాయము

ఈ పదహారవ అధ్యాయమున కార్తవీర్యార్జునుని పుత్రులచే జమదగ్ని చంపబడగా ఈ పరశురాముడు క్షత్రియ వధ ఒనరించిన విషయము విశ్వామిత్రుని వంశము వర్ణించబడుచున్నది.

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

ఓ పరీక్షిద్రాజా! తండ్రి ఆజ్ఞతో పరశురాముడు ఒక సంవత్సర పర్యంతము తీర్థయాత్రలు సేవించి తన ఆశ్రమమును చేరెను. 1

ఒకానొకప్పుడు జమదగ్ని భార్యయగు రేణుకాదేవి నీటిని తెచ్చుటకై గంగానదికి వెడలినది. గంగలో అప్సరసలతో కూడి జలక్రీడ నొనరించుచున్న గంధర్వ రాజగు చిత్రరథుని గాంచెను. 2

నీటికై నదికి వెడలిన రేణుక జలక్రీడలాడుచున్న చిత్రరథుని చూస్తు చిత్రరథునిపై కొంచెము స్పృహ కల్గినదై హోమవేళను మరచెను. 3

శ్లో॥ కాలాత్యయం తం విలోక్యమునేశ్శాపవిశంకితా ।
ఆగత్య కలశం తస్థౌ పురోధాయ కృతాంజలిః ॥ 4

టీ:- కాలేతి. కలశం పురోధాయ అగ్రే నిధాయ. 4

వేళాతిక్రమమును చూచి (తెలుసుకొని) జమదగ్ని శపిస్తాడేమో నని శంకించి ఆశ్రమమున కరుదెంచి జలకలశమును జమదగ్ని యందుంచి చేతిని జోడించి నిలుచుండెను. 4

శ్లో॥ వ్యభిచారం మునిర్జ్ఞాత్వాపత్న్యాః ప్రకుపితోఽబ్రవీత్ ।
ఘ్నతైనాం పుత్రకాః పాపామిత్యుక్తాస్తేన చక్రిరే ॥ 5

టీ:- వ్యభిచారమితి. వ్యభిచారం మానసం జ్ఞాత్వా. 5

జమదగ్ని ముని తన భార్యయగు రేణుక యొక్క మానసిక వ్యభిచారమును (చిత్రరథునిపై కల్గిన స్పృహను ) తెలుసుకొని కుపితుడై ఓ పుత్రులారా పాపవంతురాలగు ఈ రేణుకను సంహరించండి. అని పలికెను. ఆ పుత్రులు అటుల చేయరైరి. (చంపకపోయిరి). 5

శ్లో॥ రామస్సంచోదితః పిత్రా భ్రాతౄన్మాత్రాసహావధీత్ ।
ప్రభావజ్ఞో మునేస్సమ్యక్సమాధితపసోశ్చ సః ॥ 6

టీ:- రామ ఇతి. ఆజ్ఞాతిలంఘినాం భ్రాతౄణాం మాతుశ్చ వధే సంచోదితస్సన్ మునేర్యస్సమాధిస్తపశ్చ తయోః ప్రభావజ్ఞః. యది న హన్యాం.తర్హి మామపి శప్తుం సమర్థః. యది తు హన్యాం తర్హి, మయి సంతుష్టస్సన్ తానపి జీవయితుం సమర్థఇతి. జానన్నిత్యర్థః. (6-7)

అపుడు జమదగ్ని పరశురాముణ్ణి, తల్లిని, తన ఆజ్ఞను తిరస్కరించిన సోదరులను సంహరించమని ఆజ్ఞాపించెను. జమదగ్ని యొక్క సమాధి తపస్సుల యొక్క ప్రభావము, నేను చంపకపోయినచో నన్ను కూడా శపించ సమర్థుడు అని, అతని ఆజ్ఞతో తల్లిని, సోదరులను చంపినచో నాపై సంతోషమునొంది వారిని తిరిగి బ్రతికింప సమర్థుడను విషయము తెలిసిన పరశురాముడు తల్లిని, సోదరులను సంహరించెను. **6**

శ్లో॥ వరేణ ఛందయామాస ప్రీతస్సత్యవతీసుతః ।
వవ్రే హతానాం రామోఽపి జీవితం చాస్మృతిం వధే ॥ 7

అపుడు జమదగ్ని సంతసించి వరము కోరుకోమనగా పరశురాముడు తన చేత చంపబడిన వారి ప్రాణములను, (జీవితమును) చంపిన స్మృతి లేకుండుటను కోరెను. 7

శ్లో॥ ఉత్తస్థుస్తే కుశలినో నిద్రాపాయ ఇవాంజసా ।
పితుర్విద్వాం స్తపో వీర్యం రామశ్చక్రే సుహృద్వధం ॥ 8

టీ:- ఉత్తస్థురితి. నను నిందితం తత్కథం కృతవాన్ తత్రాహ - పితుర్విద్వానితి. పూర్వోక్త ఏవాభిప్రాయః. 8

నింద్యమగు, తన వారి సంహారమును రాముడు ఎట్లు గావించి నాడని సందేహించి ఇటుల తెలుపుచున్నాడు. వారలు పరశురాముని సోదరులు, తల్లియు నిద్ర నుండి మేల్కొని నటుల లేచిరి. పరశురాముడు తన తండ్రి యొక్క తపస్సును, పరాక్రమమును తెలుసుకొని తన వారిని సంహరించెను. తాను సంహరించినను తిరిగి వారిని జీవింపచేయు సామర్థ్యము తన తండ్రికి గలదని గ్రహించెనని తాత్పర్యము. 8

శ్లో॥ యేఽర్జునస్య సుతా రాజన్ స్మరంతస్స్వపితుర్వధం ।
రామవీర్య పరాభూతా లేభిరే శర్మ న క్వచిత్ ॥ 9

టీ:- సర్వక్షత్రియవధే కారణం వక్తుమాహ - యేఽర్జునస్య సుతా ఇత్యాదినా. (9-10)

పరశురాముడు సర్వ క్షత్రియ వధ చేయుటకు కారణము తెలుపుటకే యేర్జున ఇత్యాది శ్లోకముతో చెప్పుచున్నాడు. కార్తవీర్యార్జునుని పదివేల మంది పుత్రులు పరశురాముని పరాక్రమముతో పరాభూతులై తమ తండ్రి వధను తలంచుచు ఒకప్పుడు కూడా స్వస్థతను చెందకుండిరి. (సుఖము నొందక దుఃఖిస్తునుండిరి). 9

శ్లో॥ ఏకదా శ్రమతో రామే స భ్రాతరి వనం గతే ।
వైరం సిసాధయిషవో లబ్ధిచ్ఛిద్రా ఉపాగమన్ ॥ 10

ఒకసారి సోదరులతో గూడి పరశురాముడు అరణ్యమునకు వెడలగా ఆ కార్తవీర్యార్జునుని పుత్రులు అవకాశము దొరికినవారై తమ విరోధమును సాధించుటకై జమదగ్ని ఆశ్రమమునకు వచ్చిరి. 10

శ్లో॥ దృష్ట్వా గ్న్యగార ఆసీమావేశిత ధియం మునిమ్ ।
భగవత్యుత్తమశ్లోకే జఘ్నుస్తే పాపనిశ్చయాః ॥ 11

పాపకార్యమొనరించుటకు నిశ్చయించుకొన్న ఆ అర్జునుని పుత్రులు అగ్నిహోత్రశాలలో కూర్చొని, ఉత్తమ శ్లోకుడగు భగవంతుని యందు ఉంచిన బుద్ధి కలిగి సమాధి స్థితిలో ఉన్న జమదగ్నిని సంహరించిరి. 11

శ్లో॥ యాచ్యమానాః కృపణయా రామమాత్రాతిదారుణాః ।
ప్రసహ్యా శిర ఉత్కృత్య జగ్మస్తే క్షత్రబంధవః ॥ 12

కృపణురాలగు పరశురాముని తల్లి రేణుక జమదగ్నిని సంహరించ వద్దని యాచిస్తున్నప్పటికి కఠినులగు వారు జమదగ్ని శిరస్సును బలవంతముగ ఛేదించి తీసుకొని వెడలిరి. 12

శ్లో॥ రేణుకా దుఃఖశోకార్తా నిఘ్నంత్యాత్మానమాత్మనా ।
రామ రామైహి తాతాశు విచుక్రోశోచ్ఛకైస్సతీ ॥ 13

రేణుక దుఃఖిస్తు తనను తానే కొట్టుకొనుచు నాయనా రామా రామా తొందరగా రమ్మని బిగ్గరగా అరచుచు దుఃఖించెను. 13

శ్లో॥ తదుపశ్రుత్య దూరస్థా హా రామేత్యార్తవత్స్వరమ్ ।
త్వరయాశ్రమమాసాద్య దదృశుః పితరం హతమ్ ॥ 14

ఆశ్రమమునకు దూరములో ఉన్న ఆ పరశురాముడు, సోదరులు ఆ ఆర్త స్వరమును విని తొందరగా ఆశ్రమమునకు వచ్చి చంపబడియున్న తండ్రిని గాంచెను. 14

టీ:- దృష్ట్వేతి. భగవత్యా వేశితా ధీర్యేన తం. (11-14)

శ్లో॥ తే దుఃఖరోషామర్షాతి శోక వేగ విమోహితాః ।
హా తాతసాధో ధర్మిష్ఠత్యక్త్వాస్మాన్ స్వర్గతో భవాన్ ॥ 15

టీ:- త ఇతి. దుఃఖాదీనాం వేగేన విమోహితాః. (15-16)

వారు దుఃఖము, కోపము, అతిశోకముల యొక్క వేగముతో మోహమునొందినవారై ఓ తండ్రీ ధర్మతత్పరా! సాధుపురుషా! అయ్యో! మమ్ములను వదిలి నీవు స్వర్గమునకు వెడలితివి. 15

శ్లో॥ విలప్యైవం పితుర్దేహం నిధాయ భ్రాతృషు స్వయం ।
ప్రగృహ్య రామః పరశుం క్షత్రాంతాయ మనోదధే ॥ 16

ఈ విధముగా దుఃఖిస్తు రాముడు తండ్రి దేహమును సోదరులకు అప్పగించి తన గొడ్డలిని తీసుకొని క్షత్రియులను అంతమొనరించ సంకల్పించెను. (మనస్సునుంచెను) 16

శ్లో॥ గత్వా మాహిష్మతీం రామో బ్రహ్మఘ్నవిహతశ్రియమ్ ।
తేషాం సశీర్షభీ రాజన్ మధ్యే చక్రే మహాగిరిం ॥ 17

టీ:- గత్వేతి. బ్రహ్మఘ్నైర్విహతా శ్రీర్యస్యాస్తాం హే రాజన్ స రామస్తేషాం శీర్షభిర్మాహిష్మత్యాః మధ్యే మహాంతం గిరిం చక్రే. 17

బ్రహ్మజ్ఞులగు వారిచే నాశనమొందిచబడిన సంపదగల మాహిష్మతీ నగరమునకు పరశురాముడు వెళ్ళి ఆ నగర మధ్యమున ఆ అర్జున పుత్రులగు పదివేల మంది శిరస్సులతో గొప్ప పర్వతమును గావించెను. (పదివేల మందిని సంహరించి వారి తలలను ఆ పట్టణపు మధ్యన కుప్పగా వేసెను). 17

శ్లో॥ తద్రక్తేన నదీం ఘోరా మబ్రహ్మణ్య భయావహామ్ ।
హేతుం కృత్వా పితృవధం క్షత్రేఽమంగలకారిణి ॥ 18

టీ:- తదితి. తేషాం రక్తేన. అబ్రహ్మణ్యానాం భయావహాం ఘోరాం నదీం చక్ర ఇత్యనుషంగః. తథాపి. సర్వక్షత్ర వధే కింకారణం? తదాహ -హేతుం కృత్వేతి సార్ధేన. అమంగళకారిణి అన్యాయవర్తిని సతి. 18

ఆ పదివేల మంది రక్తముతో, బ్రాహ్మణ భక్తి లేనివారికి భయమును కల్పించెడి ఘోరమగు నదిని పారించెను. అయినను సర్వ క్షత్రియ వధకు కారణమేమి అను దానికి హేతుంకృత్వా అను అర్ధ శ్లోకముతో కారణము తెలుపుచున్నాడు. అన్యాయమొనరించెడి క్షత్రియులపై తన పితృవధను కారణముగానే చేసుకొని (తరువాతి శ్లోకముతో అన్వయము). 18

శ్లో॥ త్రిస్సప్తకృత్వః పృథివీం కృత్వా నిఃక్షత్రియాం ప్రభుః ।
శమంతపంచకే చక్రే శోణితోదాన్ హ్రదాన్నవ ॥ 19

ఆ పరశురాముడు ఇరువది ఒక్కసార్లు భూమిని నిఃక్షత్రియము గావించి ఆ క్షత్రియుల రక్తమునే ఉదకముగా శమంతక పంచకమున తొమ్మిది మడుగులనొనరించెను. జమదగ్నిని, అర్జున పుత్రులు సంహరించు సమయమున రేణుక ఇరువది ఒక్కసార్లు దుఃఖావేశముతో ఉరస్తాడనము చేసుకొనినది. అందువలన రాముడు ఇరువది ఒక్కసార్లు పృథివిని నిక్షత్రియము గావించినాడని ప్రసిద్ధి. 19

శ్లో॥ పితుః కాయేన సంధాయ శిర ఆదాయ బర్హిషి ।
సర్వదేవమయం దేవమాత్మానమయజన్మఖైః ॥ 20

తండ్రి యొక్క శిరస్సును తెచ్చి శరీరముతో సంధించి సర్వ దేవమయుడు, ఆత్మస్వరూపుడు అగు భగవంతుని గూర్చి యజ్ఞముల నొనర్చెను. 20

శ్లో॥ దదౌ ప్రాచీం దిశం హోత్రే బ్రహ్మణే దక్షిణాం దిశమ్ ।
అధ్వర్యవే ప్రతీచీం వా ఉద్గాత్రే హ్యుత్తరాం దిశమ్ ॥ 21

ఆ యజ్ఞములలో హోతకు తూర్పు దిక్కును, బ్రహ్మకు దక్షిణ దిక్కును, అధ్వర్యునకు పడమటి దిక్కును, ఉద్ఘాతకు ఉత్తర దిక్కును ఇచ్చెను. 21

శ్లో॥ అన్యేభ్యో వాంతరదిశః కశ్యపాయ చ మధ్యతః ।
ఆర్యావర్తముప్రదష్టే సదసేభ్యస్తతః పరమ్ ॥ 22

మిగిలిన ఇతరులకు అవాంతర దిక్కులను కశ్యపునకు మధ్య ప్రాంతమును ఉపద్రష్టకు ఆర్యావర్త దేశమును సదస్యులకు మిగిలిన ప్రదేశమును ఒసగెను. 22

శ్లో॥ తతశ్చావభృథస్నాన విధూతాశేషకిల్బిషః ।
సరస్వత్యాం బ్రహ్మనద్యాం రేజేవ్యభ్ర ఇవాంశుమాన్ ॥ 23

టీ:- త్రిస్సప్తకృత్వ ఇతి. త్రిస్సప్తకృత్వః. రేణుకయా దుఃఖావేశాదురస్తాడనం కృతం తతో రామస్తావత్కృత్యః క్షత్ర ముత్సాదితవానితి ప్రసిద్ధిః. (19-23)

ఆ పిమ్మట బ్రహ్మ నదియగు సరస్వతీ నదిలో అవబృథస్నానము ఒనరించి సమస్త పాపములను కడిగివేసికొనినవాడై ఆకసమున సూర్యునివలె వెలుగొందెను. 23

శ్లో॥ స్వదేహం జమదగ్నిస్తు లబ్ధ్వా సంజ్ఞాన లక్షణమ్ ।
ఋషీణాం మండలే సోఽభూత్సప్తమో రామపూజితః ॥ 24

టీ:- స్వదేహమితి. సంజ్ఞానం స్మృతిః తదేవ లక్షణం చిహ్నం యస్య తం స్వదేహం లబ్ధ్వా సప్త ఋషీణాం మండలే సప్తమ ఋషిరభూత్. 24

జమదగ్ని స్మృతి రూపమగు సంకల్పమయ శరీరమునొంది పరశురామునితో పూజింపబడి సప్తర్షి మండలములో సప్తమ (ఏడవ) ఋషి అయ్యెను. సప్తర్షి మండలములో స్థానమునొందెను. 24

శ్లో॥ జామదగ్న్యోఽపి భగవాన్ రామః కమలలోచనః ।
ఆగామిన్యంతరే రాజన్ వర్తయిష్యతి వై బృహత్ ॥ 25

టీ:- జామదగ్న్యమితి. బృహత్ బ్రహ్మవేదం వేద ప్రవర్తకేషు సప్తర్షిష్వేకతమో భవిష్యతీత్యర్థః. (25-26)

ఓ పరీక్షిద్రాజా! పద్మపత్రాక్షుడు, భగవంతుడు అగు జమదగ్ని పుత్రుడగు పరశురాముడు రాబోవు మన్వంతరమున వేదప్రవర్తకులగు సప్తర్షులలో ఒక ఋషి కాగలడు. 25

శ్లో॥ ఆస్తేఽద్యాపి మహేంద్రాద్రౌన్యస్త దండః ప్రశాంతధీః ।
ఉద్గీయమాన చరితస్సిద్ధ గంధర్వచారణైః ॥ 26

ఆ పరశురాముడు ఇప్పుడు గూడా మహేంద్ర పర్వతమున, (ఉంచిన ఆయుధము కలవాడై అనగా శస్త్రాస్త్రములను వదిలి) ప్రశాంత చిత్తుడై, సిద్ధులు, గంధర్వులు, చారణులు అతని చరిత్రను గానము చేయుచుండగా ఉన్నాడు. (చిరంజీవి అయినాడు). 26

శ్లో॥ ఏవం భృగుషు విశ్వాత్మా భగవాన్ హరిరీశ్వరః ।
అవతీర్య పరం భారం భువోఽహన్ బహుశో నృపాన్ ॥ 27

టీ:- ఏవమితి. భువో భారమహన్ భారమేవాహ - నృపానితి. 27

భగవంతుడు, జగదాత్ముడగు, ప్రభువగు హరి, భృగు వంశములో అవతరించి అనేక మంది రాజులను సంహరించి భూ భారమును హరించెను. (భూమికి భారము నృపులే అని తాత్పర్యము). 27

శ్లో॥ గాధేరభూన్మహాతేజాస్సమిద్ధ ఇవ పావకః ।
తపసా క్షత్రముత్సృజ్య యో లేభే బ్రహ్మవర్చసమ్ ॥ 28

టీ:- తదేవం ప్రసక్తానుప్రసక్తం సమాప్య ప్రస్తుతమాహ - గాధేరితి. మహాతేజాః విశ్వామిత్రః. 28

కుశాంబుని పుత్రుడగు గాధికి, సమిధల నుండి అగ్ని జనియించినటుల తన తపస్సుచే క్షత్రియత్వమును వదిలి బ్రహ్మత్వమునొందిన (రాజర్షిత్వమును వదిలి బ్రహ్మర్షిత్వమునొందిన) మహా తేజోవంతుడగు విశ్వామిత్రుడు జన్మించెను. 28

శ్లో॥ విశ్వామిత్రస్య చైవాసన్పుత్రా ఏకశతం నృప ।
మధ్యమస్తు మధుశ్ఛందో మధుశ్ఛందస ఏవ తే ॥ 29

ఓ పరీక్షిద్రాజా! ఆ విశ్వామిత్రునకు వందమంది పుత్రులు కలిగిరి. వారిలో మధ్యవాడు మధుశ్ఛందుడు. ఆ విశ్వామిత్రుని పుత్రులు లింగ సమవాయన్యాయముతో ప్రాణభృత ఉపదధాతి అను దానివలె

టీ:- విశ్వామిత్రస్యేతి. తే సర్వే లింగసమవాయన్యాయేన ప్రాణభృత ఉపదధాతీతి వత్. మధుశ్ఛందస ఏవోచ్యంతే తథా చ శ్రుతిః. శ్రు. "తస్య హ విశ్వామిత్రస్యైకశతం పుత్రా ఆసన్. పంచాశదేవ జ్యాయాంసో మధుశ్ఛందసః పంచాశత్ కనీయాంస'' ఇత్యాది. తత్రచ విశ్వామిత్రపుత్రేషు భార్గవస్యాజీగర్తస్య దేవరాతస్య జ్యేష్ఠత్వమవగమ్యతే. తథా ఆశ్వలాయనబోధాయనాదిభిః కౌశికానాం దేవరాత ప్రవరత్వ ముక్తం.ప్రవరశ్చ తస్మిన్నేవ వంశే అవాంతరభేదః. న తు వంశాంతరం తథా చ స్మృతిః. శ్లో. "ఏక ఏవ ఋషిర్యావత్ ప్రవరేష్వనువర్తతే, తావత్సమానగోత్రత్వం వినా భృగ్వంగిరోగణా" దితి. 29

శ్లో॥ పుత్రం కృత్వా శునశ్శేఫం దేవరాతం చ భార్గవమ్ ।
ఆజీగర్తం సుతానాహ జ్యేష్ఠ ఏవ ప్రకల్ప్యతామ్ ॥ 30

టీ:- తత్కృతో భృగువంశప్రవరస్య దేవరాతస్య కౌశిక ప్రవరత్వ మిత్యాశంక్య. తదుప పాదయన్నాహ - పుత్రం కృత్వేత్యాది

మధుశ్ఛందస్సులని పలుకబడుదురు. "తస్య హ విశ్వామిత్రస్య ఏకశతం పుత్రా ఆసన్. పంచాశతేవ జ్యాయాంసో మధుశ్ఛందసః పంచాశత్ కనీయాంస" ఆ విశ్వామిత్రునికి వందమంది పుత్రులు. మధుశ్ఛందుని కంటే యాభైమంది పెద్దవారు. మధుశ్ఛందునినుండి యాభైమంది చిన్నవారు. అను మొదలుగాగల శ్రుతిచే తెలుపబడు చున్నది. ఆ విశ్వామిత్రుని పుత్రులలో భార్గవ వంశములో జన్మించిన అజీగర్తుని పుత్రుడగు (శునశ్శేపుడు) దేవరాతునకు జేష్ఠత్వము, అగ్ర సోదరత్వము తెలుపబడుచున్నది. ఆశ్వలాయనబోధాయనాదులచే కుశిక వంశోద్భవులగు వారలకు దేవరాత ప్రవరత్వము చెప్పబడినది. ఆ కౌశిక వంశములోనే అవాంతర బేధముతో దేవరాత ప్రవరత్వము కాని వేరే వంశము కాదు. "ఏక ఏవ ఋషిర్యావత్ ప్రవరేష్వనువర్తతే, తావత్సమానగోత్రత్వం వినా భృగ్వంగిరోగణాత్" అను శ్రుతిచే ఈ విషయము తెలుపబడు చున్నది. 29

భృగువంశ ప్రవరుడగు దేవరాతునకు విశ్వామిత్రుని చేత ఒనరించబడిన కౌశిక ప్రవరత్వము నాశంకించి దానినుపపాదిస్తు పుత్రంకృత్వా అను శ్లోకముతో మొదలుకొని అధ్యాయ పరిసమాప్తి వరకు తెలుపుచున్నాడు. భార్గవ వంశ సంజాతుడు ఆజీగర్తుని పుత్రుడగు దేవరాతుని (శునశ్శేపుని) విశ్వామిత్రుడు పుత్రుడుగా స్వీకరించి, తన

యావత్సమాప్తి. పుత్రమితి. పూర్వమాజీగర్తం. సుతేషు మధ్యమత్వేన పితృభ్యాం మమతాం విహాయ విక్రీతత్వాత్తస్య. కృపయా సుతానాహ – జ్యేష్ఠ ఏష ప్రకల్ప్యతామితి. 30

పుత్రులతో ఈతనిని జ్యేష్ఠునిగా కల్పించుడు (భావించుడు) అని పలికెను. 30

శ్లో॥ యో వై హరిశ్చంద్రమఖే విక్రీతః పురుషః పశుః ।
స్తుత్వా దేవాన్ ప్రజేశాదీన్ముముచే పాశబంధనాత్ ॥ 31

టీ:- ఏత దేవ స్పష్టయితుం తం విశినష్టి – ద్వాభ్యాం. య ఇతి. ముముచే అముచ్యత. 31

పై విషయమును స్పష్టము చేయుటకై యో వై ఇత్యాది రెండు శ్లోకములతో విశేషించి తెలుపుచున్నాడు. హరిశ్చంద్రుని యజ్ఞమున పురుష పశువుగా కొనబడిన శునశ్శేపుడు బ్రహ్మాది దేవతలను స్తుతి చేసి పాశబంధమునుండి విడువబడెను. 31

శ్లో॥ యోరాతో దేవయజనే దేవైర్గాధిషు తాపసః ।
దేవరాత ఇతిఖ్యాతశ్శున శ్శేఫస్తు భార్గవః ॥ 32

టీ:- య ఇతి. భార్గవోఽపి గాధిషు గాధేర్వంశజేషు. దేవరాత ఇతి ఖ్యాతః. 32

దేవయజ్ఞమున దేవతల చేత రక్షించబడిన భార్గవ వంశజుడగు శునశ్శేపుడు గాధి వంశమున దేవరాతుడని ఖ్యాతినొందెను. 32

శ్లో॥ యే మధుశ్ఛందసో జ్యేష్ఠాః కుశలం మేనిరే న తత్ ।
అశపత్తాన్మునిః క్రుద్ధో మ్లేచ్ఛా భవత దుర్జనాః ॥ 33

విశ్వామిత్రుని చేత దేవరాతుడు జ్యేష్ఠునిగా భావించమని అతని పుత్రులు కోరబడగా అందులో మధుశ్ఛందుని కంటే జ్యేష్ఠులగు యాభైమంది పుత్రులు దాని నంగీకరించక పోయిరి. విశ్వామిత్రుడు

టీ:- య ఇతి. తత్ తస్య జ్యేష్ఠత్వం కుశలం న మేనిరే. మధ్యమత్వ స్యానర్థావహత్వం దృష్ట్వా నాంగీకృతవంతః. మునిర్విశ్వాసమిత్రః. 33

శ్లో॥ సహోవాచ మధుశ్ఛందాస్సార్ధం పంచాశతా తతః ।
యన్నో భవాన్ సంజానీతే తస్మిన్ తిష్ఠామహేవయమ్ ॥ 34

టీ:- స ఇతి. పంచాశతా కనిష్ఠైస్సాకం. సమధ్యమో మధుశ్ఛందాః ఉవాచ - నోఽస్మాకం యత్ జ్యేష్ఠత్వం కనిష్ఠత్వం వా భవాన్ పితా సంజానీతే మన్యతే తస్మిన్ వయం తిష్ఠామేతి. 34

శ్లో॥ జ్యేష్ఠం మంత్రదృశం చక్రుస్త్వామన్వంచో వయం స్మ హి ।
విశ్వామిత్రస్సుతానాహ వీరవంతో భవిష్యథ ।
యే మానం మేఽనుగృహ్ణంతో వీరవంతమకర్తమామ్ ॥ 35

టీ:- జ్యేష్ఠమితి. ఏవముక్త్వా మంత్రదృశం. శ్రు. "కస్య నూనం కతమస్యామృతానా" మిత్యాదిమంత్రాణాం ద్రష్టారం శునశ్శేఫం జ్యేష్ఠం చక్రుః తదాహ - వయం సర్వేత్వామన్వంచః స్మ హి అనుగన్తారః కనిష్ఠాఃస్మ ఇత్యర్థః. తతః ప్రసన్నో విశ్వామిత్రః తాన్ సుతానాహ - వీరవంతః పుత్రవంతః భవిష్యథ యే యూయం మేమానం పూజ్యతా మనుగృహ్ణంతః అనువర్తమానాస్సంతః మాం వీరవంతం పుత్రవంతం అకర్తకృతవంత ఇత్యర్థః. 35

అందులకు కోపించి, పెద్దవారగు ఆ యాభై మందిని నా మాట నంగీకరించని దుర్మార్గులగు మీరు మ్లేచ్ఛులు కమ్మని శపించెను. 33

ఆ పిమ్మట విశ్వామిత్రుడు మధుశ్ఛందునితో కూడిన యాభై మంది కనిష్ఠులను ఈ దేవరాతుని జ్యేష్ఠునిగా భావించుడనెను. మధుశ్ఛందాదులు ఇటుల పలికిరి మాకు మీరు జ్యేష్ఠత్వమో, కనిష్ఠత్వమో ఏది నిర్ణయించెదరో ఆ నిర్ణయముపై మేముండగలమనిరి. 34

ఈ విధముగా శ్రుతి "కస్యనూనం కతమస్యామృతానాం" అని మొదలుగాగల మంత్రద్రష్టయగు ఆ శునశ్శేఫుని (దేవరాతుని) జ్యేష్ఠునిగా నొనరించి మేమందరము నిన్ననుసరించెదము. అనగా నీకు కనిష్ఠులము అని అంగీకరించిరి. అందుకు ప్రసన్నుడైన విశ్వామిత్రుడు ఆ పుత్రులను వీరవంతులగు పుత్రులు కలవారు కండని అనుగ్రహించెను. మీరు నా గౌరవము కాపాడి నన్ను పుత్రవంతునిగా చేసితిరని పలికెను. 35

శ్లో॥ ఏష వః కౌశికా వీరోదేవరాత స్తమన్విత ।
అన్యే చాష్టకహారీత జయంత సుమదాదయః ॥ 36

టీ:- ఏష ఇతి. హే కౌశికాః ఏష దేవరాతః వో యుష్మదీయః కౌశిక ఏవ. యతః వీరః మత్పుత్రః తమేనం అన్విత అనుగచ్ఛత అన్యే చాష్టకాదయస్తస్య సుతా ఆసన్. 36

ఓ కౌశిపులారా! ఈ వీరుడగు దేవరాతుడు మీ వాడు. వీనిని అనుసరించుడు. వీరుకాక అన్యులగు అష్టక హారీతజయంత సుమదాదులగు వారు విశ్వామిత్రుని పుత్రులుండిరి. 36

శ్లో॥ ఏవం కౌశికగోత్రం తద్వైశ్వామిత్రైః పృథగ్విధమ్ ।
ప్రవరాంతరమాపన్నం తద్ధిహ్యేవం ప్రకల్పితమ్ ॥ 37

టీ:- ఉపసంహరతి - ఏవమితి. ఏకే శప్తాః ఏకేఽనుగృహీతాః. అన్యస్తు పుత్రత్వేన స్వీకృత ఇత్యేవం కౌశికగోత్రం పృథగ్విధం నానాప్రకారం జాతం. తచ్చ ప్రవరాంతరమాపన్నం ప్రాప్తం. హి యస్మాత్. ఏవం దేవరాత జ్యేష్ఠత్వేన తత్రప్రకల్పితం. 37

ఈ విశ్వామిత్రుని పుత్రులలో కొందరు శపించబడి కొందరు అనుగ్రహింపబడి ఇతరులు (భార్గవ గోత్రోద్భవుడగు శునశ్శేపుడు) పుత్రుడుగా స్వీకరించబడి ఈ ప్రకారముగా కౌశిక గోత్రము నానా ప్రకారమైనదై వేరే ప్రవరత్వమునొంది ఈ దేవరాతుని జ్యేష్ఠత్వముగా కల్పించబడినది. 37

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
షోడశోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
పదహారవ అధ్యాయము సమాప్తము.

## సప్తదశోఽధ్యాయః

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ యః పురూరవసః పుత్ర ఆయుస్తస్యాభవన్ సుతాః ।
నహుషః క్షత్రవృద్ధశ్చ రజిరంభశ్చ వీర్యవాన్ ॥ 1

టీ:- శ్లో. "అయోస్సప్తదశేత్వైళ జ్యేష్ఠపుత్రస్య పంచసు, సుతేషు క్షత్రవృద్ధాదిచతుర్ణాం వంశవర్ణనం. యద్వా. వంశాన్ సప్తదశేఽవాదీ దైలజ్యేష్ఠసుతాయుషః, పుత్రైరంభ రజిక్షత్ర వృద్ధానేనోభిరాహితాన్. ఇహ శ్రీకృష్ణావతార ప్రస్తావాయ వంశానుక్రమణం. ఐలాది క్రమేణ ప్రక్రాంతమితి. యస్య వంశే శ్రీకృష్ణావతారః తస్య వంశోఽతి వితతత్వా దంతే నిరూప్యతే. అతః పురూరవసః పుత్రాణాం పంచానాం కనిష్ఠానాం వంశానుక్త్వేదానీం ప్రథమస్య వంశమాహ - య ఇతి. ఏవం నహుష యయాతి యదు ప్రభృతిష్వపి ద్రష్టవ్యం. (1-3)

శ్లో॥ అనేనా ఇతి రాజేంద్ర క్షత్రవృద్ధాన్వయం శృణు ।
క్షత్రవృద్ధసుతస్యాసన్ సుహోత్రస్యాత్మజాస్త్రయః ॥ 2

## 17 వ అధ్యాయము

ఈ పదిహేడవ అధ్యాయమున పురూరవుని జ్యేష్ఠ పుత్రుడగు ఆయువు పుత్రులగు ఐదుగురిలో క్షత్రవృద్ధాదులగు నల్వురి వంశము వర్ణించబడినది. ఇచట శ్రీకృష్ణావతార ప్రస్థావన కొరకు వంశాను వర్ణనము ఐలాదిక్రమముగా చెప్పబడినది. ఎవని వంశమున శ్రీకృష్ణుడు అవతరించునో అతని వంశము మిక్కిలి విస్తారమైనదైనందున చివరగా చెప్పబడును. అందువలన పురూరవుని పుత్రులగు వారిలో కనిష్ఠులగు ఐదుగురి వంశములను గూర్చి తెలిపి ఇపుడు మొదటివాడగు ఆయువు వంశము గురించి తెల్పబడుచున్నది. పురూరవుని పుత్రుడగు ఆయువునకు నహుషుడు, క్షత్రవృద్ధుడు, రజి, రంభుడు, (ఉత్తర శ్లోకముతో అన్వయము) అనేనుడు అను ఐదుగురు పుత్రులు కలిగిరి. 1

(అనేనుడు అను పుత్రులు కలిగిరి అని పూర్వ శ్లోకముతో అన్వయము) ఓ పరీక్షిద్రాజా! క్షత్రవృద్ధుని వంశమును గురించి వినుము. క్షత్రవృద్ధునకు సుహోత్రుడు పుత్రుడు, ఆ సుహోత్రునకు ముగ్గురు పుత్రులు. 2

శ్లో॥ కాశ్యః కుశో గృత్సమద ఇతి గృత్స మదాదభూత్ ।
శునక శ్శౌనకో యస్య బహ్వృచ ప్రవరో మునిః ॥ 3

సుహోత్రునకు కాశ్యుడు, కుశుడు, గృత్సమదుడు అను ముగ్గురు పుత్రులు. గృత్సమదునకు శునకుడు, శునకునకు ఋగ్వేద ప్రవరుడగు శౌనకముని జన్మించెను. 3

శ్లో॥ కాశ్యస్య కాశిస్తత్పుత్రో రాష్ట్రో దీర్ఘతపః పితా ।
ధన్వంతరిర్దీర్ఘ తపాదాయుర్వేద ప్రవర్తకః ॥ 4

టీ:- కాశ్యస్యేతి. దీర్ఘ తపసః పితా. 4

కాశ్యునకు కాశీ అతనికి రాష్ట్రుడు (అతని పుత్రుడు దీర్ఘతపుని తండ్రియగు రాష్ట్రుడు) రాష్ట్రునకు దీర్ఘతపుడు, దీర్ఘతపునకు ఆయుర్వేద ప్రవర్తకుడు అగు ధన్వంతరి జన్మించిరి. 4

శ్లో॥ యజ్ఞభాగ్వాసుదేవాంశస్స్మృత మాత్రార్తినాశనః ।
తత్పుత్రః కేతుమాన్ యస్య జజ్ఞే భీమరథస్తతః ॥ 5

ఈ ధన్వంతరి వాసుదేవాంశ సంభూతుడై యజ్ఞములలో హవిర్భాగము నొందెను. ఈ ధన్వంతరి స్మరించినంతనే రోగ దుఃఖములను నశింపజేయును. ఆ ధన్వంతరికి కేతుమంతుడు పుత్రుడు. కేతుమంతునకు భీమరథుడు పుత్రుడు. 5

శ్లో॥ దివో దాసోద్యుమాం స్తస్మాత్ప్రతదర్దన ఇతిస్మృతః ।
స ఏవ శత్రుజిద్వత్స ఋతధ్వజ ఇతీరితః ॥ 6

టీ:- యజ్ఞేతి. స్మృతమాత్ర ఏవ ఆర్తిం రోగం దుఃఖం నాశయతీతి తథా. (5-6)

భీమరథునకు దివోదాసు జన్మించెను. అతనికి ద్యుమంతుడే ప్రతర్ధనుడని శత్రుజిత్తునై ఋతద్వజుడని చెప్పబడును. 6

శ్లో॥ తతః కువలయా శ్వేతి ప్రోక్తోऽలర్కాదయ స్తతః ।
షష్టిం వర్షసహస్రాణి షష్టిం వర్షశతాని చ ॥ 7

టీ:- తత ఇతి.తతః ప్రతర్దనాది శబ్దవాచ్య ద్యుమత్సకాశా దలర్కాదయః. 7

అతడే కువలయాశ్వుడని చెప్పబడెను. ఆ కువలయాశ్వునకు అలర్కాదులు జన్మించిరి. ఈ అలర్కుడు అరువది ఆరువేల సంవత్సరములు రాజ్యమేలెను. 7

శ్లో॥ నాలర్కాదపరో రాజా బుభుజే మేదినీం యువా ।
అలర్కాత్సన్నతి స్తస్మాత్సునీతోऽథసుకేతనః ॥ 8

టీ:- నేతి. సన్నతిః సన్నతి సంజ్ఞః. 8

ఈ భూమండలమును అలర్కుడు తప్ప వేరే ఏ రాజు అరువది ఆరువేల సంవత్సరములు పాలించలేదు. ఆ అలర్కునకు సన్నతి, అతనికి సునీతుడు, సునీతునకు సుకేతనుడు జన్మించెను. 8

శ్లో॥ ధర్మకేతు సుతస్తస్మాత్సత్య కేతురజాయత ।
సత్యకేతో ధృష్టకేతుస్సుకుమారః క్షితీశ్వరః ॥ 9

టీ:- ధర్మేతి. సత్యకేతోః ధృష్టకేతుః తస్మాత్సుకుమారః.9

సుకేతునకు ధర్మకేతువు, అతనికి సత్యకేతువు జన్మించెను. సత్యకేతునకు దృష్టకేతువు, అతనికి సుకుమారుడు పుత్రుడు. 9

శ్లో॥ వీతిహోత్రోऽస్య భర్గోऽతో భార్గభూమిరభూన్నృప ।
ఇతీ మే కాశయో భూపాః క్షత్రవృద్ధాన్వయాయినః ॥ 10

సుకుమారునకు వీతిహోత్రుడు, అతనికి భర్గుడు, భర్గునకు భర్గభూమి జన్మించిరి. (వీరు) కాశ్యుడు మొదలుకొని భర్గభూమి వరకు గల రాజులు కాశ్యులని ప్రసిద్ధి చెందిరి. వీరందరు క్షాత్రవృద్ధ వంశజులు. 10

టీ:- వీతోహోత్ర ఇతి. తస్మాత్సుకుమారాద్వీతిహోత్రః తస్య అతో భర్గాత్ భార్గభూమిః కాశయః కాశేర్వంశ్యాః కాశేః ప్రపితామహస్య క్షత్రవృద్ధస్య యం అన్వయం అయంతే యాంతీతి తథా. 10

శ్లో॥ రంభసః పుత్రో గంభీరశ్చ కృతస్తతః ।
తస్యక్షేత్రే బ్రహ్మ జజ్ఞే శృణు వంశమనేనసః ॥ 11

ఆయువు పుత్రుడగు రంభునకు రభసుడు పుత్రుడు. అతనికి గంభీరుడు, గంభీరునకు కృతుడు జన్మించెను. ఆ కృతుని క్షేత్రమున బ్రహ్మ కులము జన్మించెను. ఆయువు మరొక పుత్రుడగు అనేనసుని వంశము గురించి వినుము. 11

శ్లో॥ శుద్ధస్తతశ్శుచిస్తస్మాత్త్రి కకుద్బ్రహ్మ సారథిః ।
తతశ్శాంతరజా జజ్ఞేకృతకృతస్య ఆత్మవాన్ ॥ 12

టీ:- శుద్ధ ఇతి. తతః అనేనసః. శుద్ధోజజ్ఞే. కృతకృత్యః సః. యతః ఆత్మవాన్ జ్ఞానీ అతః పుత్రోత్పాదనం న కృతవానిత్యర్థః. (11-12)

అనేనసునకు శుద్ధుడు, అతనికి శుచి, శుచికి బ్రహ్మ సారథియైన త్రికకుత్తు, త్రికకుత్తునకు శాంతరజుడు జన్మించిరి. ఈ శాంతరజుడు కృతకృత్యుడై ఆత్మజ్ఞానమునొందెను. అతను పుత్రోత్పాదనము కావించలేదని తాత్పర్యము. 12

శ్లో॥ రజేః పంచశతాన్యాసన్ పుత్రాణామమితౌ జసామ్ ।
దేవైరభ్యర్థితో దైత్యాన్ హత్వేంద్రాయాదదాద్దివమ్ ॥ 13

ఆయువు పుత్రుడగు రజికి మిక్కిలి పరాక్రమవంతులగు ఐదు వందల మంది పుత్రులు కలిగిరి. ఆ రజి దేవతలచే ప్రార్థించబడిన వాడై రాక్షసులను సంహరించి స్వర్గమును ఇంద్రునకొసగెను. 13

శ్లో॥ ఇంద్రస్తస్మై పునర్దత్వా గృహీత్వా చరణౌరజేః ।
ఆత్మానమర్పయామాస ప్రహ్లాదాత్పరిశంకితః ॥ 14

ఇంద్రుడు రజి రాజుకు ప్రణమిల్లి స్వర్గరాజ్యమును తిరిగి రజి రాజునకు నొసగి ప్రహ్లాదుని వలన ఆపదను శంకించి తనను కూడా అర్పించుకొనెను. (రాజిరాజు శరణు నొందెను). 14

శ్లో॥ పితర్యుపరతే పుత్రా యాచమానాయ నో దదుః ।
త్రివిష్టపం మహేంద్రాయ యజ్ఞే భాగాన్ సమాదదుః ॥ 15

టీ:- సింహావలోకనన్యాయేనాహ- రజేతి. (13-15)

తండ్రియగు రజిరాజు మరణించగా ఆ రజి పుత్రులు, ఇంద్రుడు స్వరాజ్యమును అడిగినను ఇవ్వకపోయిరి. మరియు యజ్ఞములలో హవిర్భాగములను కూడా తామే స్వీకరించుచుండిరి. 15

శ్లో॥ గురుణాహూయమానేఽగ్నౌ బలభిత్తనయాన్ రజేః ।
అదధీద్భ్రంశితాన్మార్గాన్న కశ్చిదవశేషితః ॥ 16

టీ:- గురుణేతి. తేషాం మతి భ్రంశాయ. గురుణా బృహస్పతినా అభిచారవిధానేన అగ్నౌ హూయమానే సతి. 16

అపుడు దేవగురువగు బృహస్పతి ఆ రజి పుత్రుల మతిభ్రంశము నకై అభిచార విధానముతో హోమము చేయగా ఇంద్రుడు ఆ రజి పుత్రులనందరిని చంపివేసెను. ఒక్కనిని గూడా మిగల్చలేదు. 16

శ్లో॥ కుశాత్ప్రీతిః క్షాత్రవృద్ధాత్సంజయస్తత్సుతో జయః ।
తతః కృతః కృతస్యాపి జజ్ఞే హర్యధ్వనో నృపః ॥ 17

క్షత్రవృద్ధుని పౌత్రుడు సుహోత్రుని పుత్రుడగు కుశునకు ప్రీతి, ప్రీతికి సంజయుడు, సంజయునకి జయుడు, జయునకు కృతి, కృతికి హర్యధ్వనుడు అను వారు జన్మించిరి. 17

శ్లో॥ సహదేవస్తతో భీమో జయత్సేనస్తు తత్సుతః ।
సంకృతిస్తస్య తు జయః క్షత్రధర్మో మహారథః ॥ 18

హర్యధ్వనునకు సహదేవుడు, సహదేవునకు భీముడు, భీమునకు జయత్సేనుడు, జయత్సేనునకు సంకృతి, సంకృతికి జయుడు, జయునకు మహారథుడగు క్షత్రధర్ముడు అనువారలు జన్మించిరి. 18

శ్లో॥ క్షత్రవృద్ధాన్వయా భూపా ఇమే శృణ్వథ నాహుషాన్ ॥ 19

వీరు క్షత్రవృద్ధ వంశమున జన్మించిన రాజులు. ఇటు పిమ్మట నహుషుని వంశజుల గురించి వినుము. 19

టీ:- కుశాదితి. క్షాత్రవృద్ధాత్ క్షత్రవృద్ధపౌత్రాత్ ప్రీతిః ప్రీతేః సంజయః (17-19)

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
సప్తదశోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
పదిహేడవ అధ్యాయము సమాప్తము.






ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

అష్టాదశోఽధ్యాయః

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ యతిర్యయాతిస్సంయాతి రాయాతిర్వియతిః కృతిః ।
షడిమే నహుషస్యాసన్నింద్రియాణీవ దేహినః ॥ 1

టీ:- శ్లో. "అష్టాదశే యయాత్తేస్తు నాహుషస్య కథోచ్యతే, యస్య పంచసు పుత్రేషు కనీయాన గ్రహీజ్జరామ్. యద్వా. ఆయుషో జేష్ఠ్యపుత్రస్య నహుషస్యాగ్రజస్సుతః, యయాతిః పూరుమకృతాష్టాదశే నృపమాత్మజమ్". 1

శ్లో॥ రాజ్యం నైచ్ఛద్యతిః పిత్రా దత్తం తత్పరిణామవిత్ ।
యత్ర ప్రవిష్టః పురుష ఆత్మానం నావబుధ్యతే ॥ 2

టీ:- రాజ్యమితి. తస్య రాజ్యస్య పరిణామం అనర్థావహత్వం వేత్తీతి తథా. తత్ర హేతుః - యత్రేతి. 2

18 వ అధ్యాయము

ఈ పద్దెనిమిదవ అధ్యాయమున నహుషుని పుత్రుడగు యయాతి చరిత్ర చెప్పబడుచున్నది. యయాతి ఐదుగురు పుత్రులలో చిన్నవాడు. తండ్రి ముసలి తనమును గ్రహించిన విషయమును తెలుపబడును.

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

శరీరికి ఇంద్రియముల వలె నహుషునికి యతి, యయాతి, సంయాతి, ఆయాతి, వియతి, కృతి అను ఆరుగురు పుత్రులు కలిగిరి. (ఉండిరి). 1

నహుషుడు పెద్ద కుమారుడగు యతికి రాజ్యమొసగగా అతడు రాజ్యము ననుభవించు పురుషుడు, ఆత్మను తెలిసికొనజాలడు, (ఆత్మజ్ఞానము నొందలేడు) అని రాజ్యము యొక్క పరిణామమును తెలిసినవాడై రాజ్యమును కోరక విరక్తుడాయెను. 2

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ



శ్లో॥ పితరిభ్రంశితే స్థానాదింద్రాణ్యా ధర్షణాద్ద్విజైః ।
ప్రాపితేఽజగరత్వం వై యయాతిరభవన్నృపః ॥ 3

టీ:- పితరీతి. స్థానాత్ స్వర్గాత్ ద్విజైరగస్త్యాదిభిః. 3

తండ్రియగు నహుషుడు ఇంద్రాణిని పరిగ్రహించబోవడము చేత అగస్త్యాది మునులచే స్వర్గమునుండి పడివేయబడి అజగరత్వమున (సర్పత్వమున) బంధించబడగా రెండవ పుత్రుడగు యయాతి రాజయ్యెను. (నహుషుడు నూరు యజ్ఞముల నొనరించి ఇంద్రపదవి నొంది ఇంద్రుని భార్యయగు శచీదేవిని పొందగోరి మునులు మోసెడి పల్లకీలో ఆమె వద్దకు పోవుచుండగా అగస్త్య శాపముచే పామై క్రిందకు పడెను అని ప్రసిద్ధి). 3

శ్లో॥ చతసృష్వాదిశద్దిక్షు భ్రాతా భ్రాతౄన్ యవీయసః ।
కృతదారో జుగోపోర్వీం కావ్యస్య వృషపర్వణః ॥ 4

రాజపదవి నొందిన యయాతి తనకంటే చిన్నవారగు తమ్ములను నాలుగు దిక్కుల రక్షణకు ఆదేశించెను. శుక్రుని పుత్రిక యగు దేవయానిని, వృషపర్వుడను దానవ రాజు పుత్రికయగు శర్మిష్ఠను భార్యలుగా చేసుకొని రాజ్యము పాలించెను. 4

రాజో ఉవాచ

శ్లో॥ బ్రహ్మర్షిర్భగవాన్ కావ్యః క్షత్రబంధుశ్చ నాహుషః ।
రాజన్యవిప్రయో కస్మాద్వివాహః ప్రాతిలోమికః ॥ 5

టీ:- చతసృష్వితి. యవీయసో భ్రాతౄన్ ఆదిశత్. కావ్యస్య శుక్రస్య. వృషపర్వణశ్చ. కన్యాభ్యాం కృతదారస్సన్. (4-5)

రాజు ఈ విధముగా పలికెను.

శుక్రుడు బ్రహ్మర్షి నహుష పుత్రుడగు యయాతి క్షత్రియుడు, క్షత్రియ బ్రాహ్మణులకు ప్రతిలోమ వివాహము ఎటుల సంభవించినది (తెలుపుము). 5

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఏకదా దానవేంద్రస్య శర్మిష్ఠా నామ కన్యకా ।
సఖీ సహస్ర సంయుక్తా గురుపుత్ర్యా చ భామినీ ॥ 6

టీ:- నాత్ర ప్రతిలోమతాదోషః ఈశ్వరఘటనాదితి దర్శయన్ కథమాహ - ఏకదేత్యాద్యారభ్య ప్రతిజగ్రాహ తద్వచ ఇత్యంతేన. ఏకదేదితి. గురోః శుక్రస్య పుత్ర్యా దేవయాన్యా చ సహ. వ్యచరదితి ద్వయోరన్వయః. 6

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

పై వివాహము ఈశ్వర ఘటనగా జరుగుటచే ప్రతిలోమ దోషము లేదని తెలుపుచు ముందు చరితను ఏకదేత్యాది శ్లోకము మొదలుకొని ప్రతిజగ్రాహతద్వచః అనునంత వరకు చెప్పుచున్నాడు.

ఒకానొకప్పుడు దానవ రాజు వృషపర్యుని పుత్రిక యగు శర్మిష్ఠ దానవ గురువు శుక్రుని పుత్రిక యగు దేవయానితో గూడి వేయిమంది చెలులతో గూడి (వ్యచరత్ అని ఉత్తర శ్లోకముతో అన్వయము). 6

శ్లో॥ దేవయాన్యా పురోద్యానే పుష్పిత ద్రుమసంకులే ।
వ్యచరత్కల గీతాళి నళినీ పులినేఽబలా ॥ 7

టీ:- దేవయాన్యేతి. కలగీతాః అలయో యేషు తాని నలినీ పులినాని యస్మిన్ పురోద్యానే. అబలా శర్మిష్ఠా. 7

పుష్పించిన వృక్షములతో కూడిన తుమ్మెదల మధుర గీతములు గల తామరలతో గూడిన పులీనస్థలములు గల పట్టణోద్యాన వనములో విహరించెను. 7

శ్లో॥ తా జలాశయమాసాద్య కన్యాః కమలలోచనాః ।
తీరే న్యస్య దుకూలాని విజహ్రుస్సించతీర్మిథః ॥ 8

టీ:- తా ఇతి. సించతీః సించత్యః ప్రథమార్థే ద్వితీయా. (8-9)

కమల లోచనులగు ఆ కన్యలందరు జలాశయమును చేరి తమ వస్త్రములను ఒడ్డున ఉంచి జలాశయమున ప్రవేశించి ఒకరిపైనొకరు నీళ్ళు చల్లుకొనుచు విహరించిరి. 8

శ్లో॥ వీక్ష్య వ్రజంతం గిరిశం సహదేవ్యా వృషస్థితమ్ ।
సహసోత్తీర్య వాసాంసి పర్యధు ర్వ్రీడితా స్త్రియః ॥ 9

ఆ సమనయమున పార్వతీ దేవితో గూడా వృషభ వాహనముపై వెళ్ళుచున్న శివుని గాంచి ఆ స్త్రీలు లజ్జితులై తొందరగా జలాశయము నుండి పైకి వచ్చి వస్త్రములు ధరించిరి. 9

శ్లో॥ శర్మిష్ఠా జానతీ వాసో గురుపుత్ర్యాస్సమవ్యధాత్ ।
స్వీయం మత్వా ప్రకుపితా దేవయానీదమబ్రవీత్ ॥ 10

టీ:- శర్మిష్ఠేతి. అజానతీ స్వీయం మత్వా గురుపుత్ర్యాః వాసః సమవ్యధాత్ పర్యధాత్. 10

ఆ తొందరలో రాజపుత్రిక శర్మిష్ఠ తన వస్త్రముగా భావించి గురు పుత్రికయగు దేవయాని వస్త్రమును ధరించెను. అదిగాంచి కోపించిన దేవయాని ఇటుల పలికెను. 10

శ్లో॥ అహో నిరీక్ష్యతామస్మద్దాస్యాః కర్మ హ్యసాం ప్రతమ్ ।
అస్మద్ధార్యం ధృతవతీ శునీవ హవిరధ్వరే ॥ 11

టీ:- అహో ఇతి. అసాంప్రతమన్యాయం. 11

మా దాసియగు శర్మిష్ఠ యొక్క అన్యాయమగు పనిని కాంచండి. నేను ధరించ వలసిన వస్త్రమును, యజ్ఞములో హవిస్సును శునకము హరించునటుల ధరించినది. 11

శ్లో॥ యైరిదం తపసా సృష్టం ముఖం పుంసః పరస్య యే ।
ధార్యతే యైరిహ జ్యోతిశ్శివః పంథాశ్చ దర్శితః ॥ 12

ఏ బ్రాహ్మణుల తపో ఫలముచేత ఈ విశ్వము సృష్టించబడినదో పరమ పురుషుడగు పరమాత్మకు ఏ బ్రాహ్మణులు ముఖ స్వరూపులో (పరమ పురుషుని ముఖము నుండి ఉద్భవించుటచే శ్రేష్ఠులైరి). ఏ బ్రాహ్మణులు నిరంతరము జ్యోతి స్వరూపుడగు భగవంతుని తమ

టీ:- అన్యాయ్యమేవ బ్రాహ్మణోత్కర్ష వర్ణనేన వ్యనక్తి త్రిభిః - యైరితి. యే బ్రాహ్మణాః పరస్య పుంసో ముఖం. ముఖదాత్పన్నత్వేన తృప్తిద్వార త్వేన చ శ్రేష్ఠా ఇత్యర్థః. జ్యోతిః. బ్రహ్మపంథాః వేదమార్గః. (12-13)

హృదయములలో ధ్యానించెదరో (ధరింతురో) ఏ బ్రాహ్మణులచేత సమస్త ప్రాణులకు మంగళ కరమగు వేదమార్గము చూపబడినదో (తరువాతి శ్లోకముతో అన్వయము). 12

శ్లో॥ యాన్నమంత్యుపతిష్ఠంతే లోకనాథాస్సురేశ్వరాః ।
భగవానపి విశ్వాత్మా పావనః శ్రీనికేతనః ॥ 13

లోకాదీశులగు ఇంద్రాది దేవతలు ఏ బ్రాహ్మణులను నమస్కరిస్తూ సేవించెదరో, లక్ష్మీదేవికి ఆశ్రయ భూతుడగు జగదాత్ముడు, భగవంతుడును అగుపరమపావనుడు అగు శ్రీహరియు ఏ బ్రాహ్మణులనునమస్కరించునో(తరువాతి శ్లోకముతో అన్వయము). 13

శ్లో॥ వయం తత్రాపి భృగవశ్శిష్యో నోఽస్యాః పితాసురః ।
అస్మద్ధార్యం ధృతవతీ శూద్రో వేదమివాసతీ ॥ 14

అలాంటి బ్రాహ్మణులు పూజ్యులు అందులో మేము భృగు వంశీయులము. (పరమ పూజ్యులమని భావము) ఈ శర్మిష్ఠ తండ్రి అసురడగు వృషపర్యుడు నా తండ్రికి శిష్యుడు. అలాంటి నా(దేవయాని) చేత ధరించబడెడి వస్త్రమును దుష్టురాలగు ఈ శర్మిష్ఠ శూద్రుడు వేదమును ధరించునటుల (పఠించునటుల) ధరించినది. 14

టీ:- తదేవం బ్రాహ్మణమాత్రమేవ. తావత్పూజ్యం. వయమితి. తత్రాపి వయం భృగవః. అస్యాశ్చ పితా అసురః. నః శిష్యః ఏవం సత్యపి. అస్మాభిర్ధార్యం వాసః ఇయమసతీ ధృతవతీ. (14-20)

శ్లో॥ ఏవం బ్రువంతీం శర్మిష్ఠా గురుపుత్రమపాషత ।
రుషాశ్వసంతీ వ్యాళీవ ధర్షితా దుష్టదచ్ఛదా ॥ 15

ఈ విధముగా నిందా వాక్యములు పలికెడి గురుపుత్రిక యగు దేవయానిని గూర్చి, ప్రేటుబడి కోపముతో బుసకొట్టెడి ఆడపాము వలె కోపముతో నిట్టూర్పులు వదుల్తూ పండ్లు కొరుకుచూ శర్మిష్ఠ ఇటుల పలికెను. 15

శ్లో॥ ఆత్మవృత్తమవిజ్ఞాయ కత్థసే బహుభిక్షుకీ ।
కిం న ప్రతీక్షసేఽస్మాకం గృహాన్ బలిభుజోయథా ॥ 16

ఓ భిక్షుకులారా! నీ స్థోమతను తెలిసికొనక అనేక విధముల గర్వపు మాటలు పలుకుచున్నావు. గృహములముందు బలిభుక్కులగు శ్వాన కాకములవలె నీవు మా ఇంటి ముందు ప్రతీక్షించుటలేదా? 16

శ్రీ శుక ఉవాచ

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

శ్లో॥ ఏవం విధైస్సపరుషైః క్షిప్త్వాచార్య సుతాం సతీమ్ ।
శర్మిష్ఠా ప్రాక్షిపత్కూపే వాసశ్చాదాయ సా యయౌ ॥ 17

శర్మిష్ఠ ఈ విధములగు కఠినములగు మాటలతో గురు పుత్రికయు, సాధ్వియునగు దేవయానిని బాధించి, బావిలో పడవేసి ఆమె వస్త్రములను తీసుకొని వెడలిపోయెను. 17

శ్లో॥ తస్యాం గతాయాం స్వగృహం యయా తిర్మృగయాం చరన్ ।
ప్రాప్తో యదృచ్ఛయా కూపే జలార్థం తాం దదర్శ హ ॥ 18

ఆ శర్మిష్ఠ వెడలిన పిదప యయాతి మహారాజు వేటకై వెడలి ఆ ప్రాంతము చేరి నీటిని త్రాగదలచిన వాడై అనుకోకుండా బావిలో దేవయానిని గాంచెను. 18

శ్లో॥ దత్వా స్వముత్తరం వాసస్తస్యై రాజా వివాససే ।
గృహీత్వా పాణినా పాణిముజ్జహార దయాపరః ॥ 19

యయాతి మహారాజు వివస్త్రురాలగు ఆ దేవయానికి తన ఉత్తరీయమును ఇచ్చి, ఆమెయందు దయకల్గినవాడై తన చేయిని ఆమె చేతికి అందించి ఆ బావి నుండి ఆమెను బయటకు తెచ్చెను. 19

శ్లో॥ తం వీరమాహౌశనసీ ప్రేమనిర్భరయా గిరా ।
రాజంస్త్వయా గ్రహీతో మే పాణిః పర పురంజయ ।
హస్తగ్రాహో పరోమాభూత్ గృహీతాయాస్త్వయా హి మే ॥ 20

శ్లో॥ ఏష ఈశకృతో వీర సంబంధో నౌ న పౌరుషః ।
యదిదం కూపలగ్నా యా భవతో దర్శనం మమ ॥ 21

టీ:- నిషిద్ధోఽయం ప్రతిలోమసంబంధ ఇతి చేత్తత్రాహ - ఏష ఇతి. 21

శ్లో॥ న బ్రాహ్మణో యే భవితా హస్తగ్రాహో మహాభుజ ।
కచస్య బార్హస్పతస్య శాపాద్యమశపం పురా ॥ 22

టీ:- బ్రాహ్మణమేవ త్వం వృణు హి కిమనేనాగ్రహేణేతి చేత్తత్రాహ -నేతి. బృహస్పతేస్సుతః కచః శుక్రాత్ మృతసంజీవినీం విద్యామభ్యగాత్. తదా దేవయానీ తం పతిం చకమే స చ గురుపుత్రీమమపూజ్యేతి న తాముదవహత్. తతశ్చ కుపితాసతీ తవేయం విద్యా నిష్ఫలా భవత్వితి

దేవయాని వీరుడగు యయాతితో ప్రేమ నిర్భరములగు మాటలతో ఇటుల పలికెను. శత్రుపురములను జయించెడి ఓ రాజా! నీ చేత నా చేయి గ్రహించబడినది. నీ చేత గ్రహించబడిన ఈ చేయి ఇతరులచేత గ్రహించబడకుండుగాక. (నా పాణిగ్రహణము ఇతరులతో జరగకుండుగాక) 20

ఈ ప్రతిలోమ సంబంధము నిషిద్ధము అనుటకు జవాబు చెప్పబడుచున్నది. ఓ వీరుడా! బావిలో పడిన నాకు ఈ నీ దర్శనము ఏదైతే కల్గినదో అది భగవంతునిచేత నాకు, నీకు కలుపబడిన సంబంధమే కాని మానవుల చేత కల్పించబడిన సంబంధము కాదు. 21

నీవు బ్రాహ్మణ కన్యవు, బ్రాహ్మణునే వరించుము, నన్ను వరించుట ఏల అనగా తెలుపుచున్నది. పూర్వము బృహస్పతి పుత్రుడగు కచుడు శుక్రుని నుండి మృతసంజీవిని విద్యను పొందెను. అపుడు నేను (దేవయానిని) ఆ కచుని భర్తగా నొందగోరితిని. ఆ కచుడు గురుపుత్రిక నగుటచే పూజ్యురాలిగా భావించి నన్ను వివాహమాడుటకు ఇష్టపడలేదు. అపుడు నేను కోపించి నీవు పొందిన ఈ మృతసంజీవిని విద్య నిష్ఫలమగుగాక అని శపించితిని. ఆ కచుడు నన్ను నీకు

శశాప. స చ త బ్రాహ్మణః పతిర్న భవేదితి తాం శశాప. తదేతవాహ– కచస్యేతి. యమహమశపం. తస్య శాపాత్. 22

బ్రాహ్మణుడు భర్తకాకుండుగాక అని శపించెను. ఆ విషయము ఈ శ్లోకమున తెలుపబడుచున్నది. ఓ వీరా! పూర్వము మొదట నాచే శపించబడిన బృహస్పతి పుత్రుడగు కచుని శాపముచే నా పాణి గ్రహణము బ్రాహ్మణునిచే చేయబడదు. 22

శ్లో॥ యయాతి రనభిప్రేతం దైవోపహృతమాత్మనః ।
మనశ్చ తద్గతం బుద్ధ్వా ప్రతిజగ్రాహ తద్వచః ॥ 23

టీ:– యయాతిరితి. అశాస్త్రీయత్వాత్ అనభిప్రేతమపి. దైవేనోప హృతం ప్రాహితం బుద్ధ్వా తద్గతం తస్యాం స కామం స్వమనశ్చ బుద్ధ్వా. నహ్యధర్మే మదీయం మనః ప్రవిశేదితి తస్యాః వచః. ప్రతిజగ్రాహ అంగీకృతవాన్. 23

యయాతి, దేవయాని పలికిన మాట అశాస్త్రీయమైనందున ఆచరించదగనిదైనను భగవంతునిచేత ఆ సంబంధము కల్పించ బడినదిగా భావించి తన మనస్సు కూడా ఆమెను కోరుటను గ్రహించి (తన మనస్సు అధర్మాచరణమును కోరదని గ్రహించి) ఆ దేవయాని మాటలు నంగీకరించెను. 23

శ్లో॥ గతే రాజని సా వీరే తత్ర స్మ రుదతీ పితుః ।
న్యవేద యత్తతస్సర్వ ముక్తం శర్మిష్ఠయా కృతమ్ ॥ 24

టీ:– శర్మిష్ఠాసంబంధోఽపి దైవవశాదేవాభూదితి దర్శయన్నాహ – నవభిః. గత ఇతి . ఉక్తం భిక్షుకీత్యాది. కృతం కూపప్రక్షేపాది. 24

యయాతికి శర్మిష్ఠ సంబంధము కూడా దైవ వశముననే కల్గినదని ఇచటినుండి తొమ్మిది శ్లోకములలో చెప్పబడుచున్నది. వీరుడగు యయాతి మహారాజు వెళ్ళిపోగా ఆ దేవయాని దుఃఖిస్తూ తండ్రియగు శుక్రుని వద్దకు వెడలి శర్మిష్ఠ పలికిన భిక్షుకి మొదలగు మాటలను, తనను బావిలో పడవేయుటను, యయాతి తననుద్ధరించుట మున్నగు సమస్త విషయములను తెలిపెను. 24

శ్లో॥ దుర్మనా భగవాన్ కావ్యః పౌరోహిత్యం విగర్హయన్ ।
స్తువన్ వృత్తిం చ కాపోతీం దుహిత్రా స యయౌ పురాత్॥25

టీ:- దుర్మనా ఇతి. కాపోతీ ముంఛవృత్తిం. 25

ఆ దేవయాని మాటలు విని శుక్రుడు మనస్సులో బాధనొంది పౌరోహిత్యమును నిందిస్తూ (వృషపర్వుని వద్ద పురోహితుడుగా నుండుటను) ఈ పౌరోహిత్యమునకంటే కపోత వృత్తియే (ఉంఛ వృత్తియే) శ్రేష్ఠమని స్తుతిస్తూ తన కూతురగు దేవయానిని వెంటనిడుకొని ఆ వృషపర్వుని పట్టణము వదిలి వెడలెను. 25

శ్లో॥ వృషపర్వాతమాజ్ఞాయ ప్రత్యనీక వివక్షితమ్ ।
గురుం ప్రసాదయన్ మూర్ధ్నా పాదయోః పతితః పథి ॥ 26

శ్లో॥ క్షణార్ధమన్యుర్భగవాన్ శిష్యం వాచష్ట భార్గవః ।
కామోఽస్యాః క్రియతాం రాజన్నైనాం సంత్యక్తుముత్సహే ॥27

టీ:- వృషపర్వేతి. ప్రత్యనీకాదేవాస్తే వివక్షితాః. జయం ప్రాపణీయా ఇత్యభిప్రేతా యస్య తథాభూతం జ్ఞాత్వా ప్రత్యనీకానాం వివక్షితమితి వా. (26-27)

దేవతలకు విజయం కలుగజేయవలయునను ఆ శుక్రుని అభిప్రాయమును (లేక) శుక్రునికి వృషపర్వునకు పరస్పర విబేధము కల్గించవలెనను దేవతల అభిప్రాయమును తెలుసుకొనిన వృషపర్వుడు వెళ్ళుచున్న శుక్రుని మార్గమున అడ్డుగా వచ్చి గురువగు శుక్రుని ప్రసాదింపజేస్తూ (అనునయిస్తూ) పాదములపై పడెను. 26

శుక్రుడు అర్ధక్షణములోనే కోపమును వదిలి శిష్యుడగు వృషపర్వునితో ఇట్లు పలికెను. ఓ రాజా! ఈ నా పుత్రికయగు దేవయానిని నేను విడువలేను కావున ఈ దేవయాని కోరికకు తగిన విధముగా ఆచరించుము. 27

శ్లో॥ తథేత్యవస్థితే ప్రాహ దేవయానీ మనోగతమ్ ।
పిత్రా దత్తా యతో యాస్యే సానుగా యాతు మామను ॥ 28

టీ:- తథేతి. సానుగా సఖీభిస్సహితా శర్మిష్ఠా మామనుయాత్వితి. 28

వృషపర్వుడు గురు అభిప్రాయమును అంగీకరించెను. అపుడు దేవయాని తన మనస్సులోని కోరిక నిటుల తెలిపెను. నా తండ్రియగు శుక్రుడు నన్ను ఎవరికిచ్చి పరిణయము గావించునో అతని వద్దకు నేను వెడలెదను. శర్మిష్ఠ తన చెలులతో సహా నన్ను అనుసరించి వర్తించుగాక. 28

శ్లో॥ స్వానాం తత్సంకటం వీక్ష్యత దర్థస్య చ గౌరవమ్ ।
దేవయానీం పర్యచరద్దాసీవత్ స్త్రీగణైస్సహ ॥ 29

టీ:- స్వానామితి. తస్మాన్నిర్గతాత్ శుక్రాత్. సంకటం వీక్ష్య తత్తస్మాద స్థితార్థస్య ప్రయోజనస్య గౌరవం వీక్ష్య. 29

శర్మిష్ఠ తనవారియొక్క (రాక్షసుల యొక్క) సంకటమును గాంచి ఆ ప్రయోజనము యొక్క గొప్పతనమును గ్రహించి తన చెలులతో గూడి దాసివలె దేవయానికి పరిచర్యలు గావించుచుండెను. 29

శ్లో॥ నాహుషాయ సుతాం దత్వా సహ శర్మిష్ఠయోశనా ।
తమాహ రాజన్ శర్మిష్ఠా మధాస్తల్పే న కర్హిచిత్ ॥ 30

శుక్రుడు తన పుత్రికయగు దేవయానిని శర్మిష్ఠతో సమా నహుష పుత్రుడగు యయాతికి ఒసగి ఇటుల పలికెను. ఓ యయాతి రాజా! నీవు ఎప్పుడుకూడా ఈ శర్మిష్ఠను నీ తల్పము చేరనీయకుము. 30

శ్లో॥ విలోక్యౌశనసీం రాజ్ఞీం శర్మిష్ఠా సుప్రజాః క్వచిత్ ।
తమేవ వవ్రే రహసి సఖ్యా పరివృతా సతీ ॥ 31

టీ:- నాహుషాయేతి. తల్పేనాధాః నోపగచ్ఛేరిత్యర్థః. (30-31)

ఓ పరీక్షిద్రాజా!కొంతకాలము పిదప దేవయాని సంతానవతి కాగా కాంచిన శర్మిష్ఠ ఒకప్పుడు ఋతుకాలమున రహస్యముగా యయాతిని తనకు సంతాన భాగ్యము కల్గించమని కోరెను.(పతినిగా వరించెను). 31

శ్లో॥ రాజ పుత్ర్యార్థితోఽపత్యే ధర్మంచావేక్ష్య ధర్మవిత్ ।
స్మరన్ శుక్ర వచః కాలే దిష్టమేవాభ్యపద్యత ॥ 32

టీ:- రాజేతి. అపత్యార్థమృతుకాలే ప్రార్థమానాయాస్తస్యాః కామ పూరణం ధర్మమవేక్ష్య శుక్రస్యవచశ్చ స్మరన్ దిష్టం దైవ ప్రాపితమేవ తత్సంగ మభ్యపద్యత న తు కామత ఇత్యర్థః. (32-33)

సంతానము కొరకై ఋతుకాలమున ప్రార్థించిన శర్మిష్ఠ కోరిక తీర్చడము ధర్మబద్ధమైనదిగా భావించిన యయాతి శుక్రుని మాటను తలచియు ఈ శర్మిష్ఠా సంగమము కోరికతో కాక దైవప్రాపితమైనదిగా తలచి (శర్మిష్ఠా సంగమము) ఒనరించెను. 32

శ్లో॥ యదుం చ తుర్వసుం చైవ దేవయానీ వ్యజాయత ।
ద్రుహ్యం చానుచ పూరుం చ శర్మిష్ఠా వార్షపర్వణీ ॥ 33

దేవయాని ఎదువు, తుర్వసుడు అను ఇద్దరు పుత్రులను కనెను. వృషపర్వుని పుత్రికయగు శర్మిష్ఠ దృష్యుడు, అనువు, పూరువు అను ముగ్గురు పుత్రులను కనెను. 33

శ్లో॥ గర్భ సంభవ మాసుర్యా భర్తుర్విజ్ఞాయ మానినీ ।
దేవయానీ పితుర్గేహం యయౌ క్రోధ విమూర్ఛితా ॥ 34

టీ:- గర్భేతి. అసుర్యాః శర్మిష్ఠాయాః భర్తుస్సకాశాత్. 34

రాక్షస పుత్రిక యగు శర్మిష్ఠకు సంతానము తన భర్తయగు యయాతి వలన కలిగినదని తెలుసుకొనిన దేవయాని కోపముతో తండ్రియగు శుక్రుని గృహమునకు వెడలెను. 34

శ్లో॥ ప్రియామనుగతః కామీవచోభిరుపమంత్రయన్ ।
న ప్రసాదయితుం శేకే పాదసమ్మర్దనాదిభిః ॥ 35

టీ:- ప్రియామితి. ఉపమంత్రయన్ ప్రసాదయన్. 35

కామాతురుడగు యయాతి దేవయానిననుసరించి వెళ్ళి ప్రియమగు మాటలతో అనునయిస్తూ పాద సమ్మర్దనాదుల నొనర్చి కూడా ఆమెను ప్రసన్నురాలను చేసుకొనలేక పోయెను. 35

శ్లో॥ శుక్రస్తమాహ కుపితః స్త్రీకామానృత పౌరుష ।
త్వాం జరా విశతాం మంద విరూపకరణీ నృణామ్ ॥ 36

టీ:- శుక్ర ఇతి. వికృతం రూపంకరోతీతి తథా. 36

అపుడు శుక్రుడు కోపించినవాడై ఓ అసత్యవాదీ! స్త్రీ లంపటుడా! మంధబుద్ధీ యయాతీ మానవుల ఆకారములను విషరూపముగా ఒనరించెడి ముసలితనము నిన్ను వరించుగాక అని పలికెను. 36

యయాతిరువాచ

శ్లో॥ అతృప్తోఽస్మ్యద్య కామానాం బ్రహ్మన్ దుహితరి స్మతే ।
వ్యత్యస్య తాం యథా కామం వయసాయోఽభిధాస్యతి ॥ 37

టీ:- అతృప్త ఇతి. తే దుహితరి కామైరద్యాప్యతృప్తోఽస్మి కామానాం భోగైరితివా శుక్ర ఆహ - తర్హి యోఽభిధాస్యతి అభితో ధారయిష్యతి తస్య వయసా కామం వ్యత్యస్యతాం. యథేచ్ఛం జరావ్యత్యయం యాతు వ్యత్యయం నీయతామితి వా. యద్వా. వ్యత్యస్యేతి ఛేదః. తాం జరాం వ్యత్యాసం గమయేత్యర్థః. 37

యయాతి ఈ విధముగా పలికెను.

ఓ శుక్రాచార్యా! నీ కూతురగు దేవయాని యందు నేను ఇప్పటికిని విషయ భోగముల తృప్తి నొందలేదు అని, పలుకగా శుక్రుడు ఈ ముసలితనమును గ్రహించి ఎవరైనా వయస్సు నొసగినచో మార్చు కొనుము అని పలికెను. (ఎవరైనను నీ ముసలితనమును గ్రహించినచో అతని తారుణ్యమును నీవు గ్రహించి మార్పు చేసుకొనవచ్చు). 37

శ్లో॥ ఇతి లబ్ధ వ్యవస్థానః పుత్రం జ్యేష్ఠమయాచత ॥ 38

ఈ విధముగా శుక్రునిచే ముసలితనమును మార్చుకొను వ్యవస్థనుపొందిన యయాతి పెద్దకొడుకగు యదువునుఅడిగెను. 38

యయాతిరువాచ

శ్లో॥ యదో తాత ప్రతీచ్ఛే మాం జరాం దేహి నిజం వయః ।
మాతామహ కృతాం వత్స మాతృప్తో విషయేష్వహం ।
వయసా భవదీయేన రంస్యే కతిపయాస్సమాః ॥ 39

యయాతి ఈ విధముగా పలికెను.

ఓ వత్సా యదూ! నీ మాతామహుడగు శుక్రునిచే కల్పించబడిన ఈ ముసలితనము నీవు గ్రహించి నీ యౌవనము నా కొసగుము. నేను విషయ భోగములతో తృప్తినొందలేదు. నీ యొక్క యౌవనముతో కొన్ని సంవత్సరములు (రమించెదను) విషయ భోగములను అనుభవించెదను అని అనెను. 39

యదురువాచ

శ్లో॥ నోత్సహే జరయా స్థాతుమంతరా ప్రాప్తయానఘ ।
అవిదిత్వా సుఖం గ్రామ్యం శాంతిం నోపైతి పూరుషః ॥ 40

టీ:- ఇతీతి.ఇతి లబ్ధం వ్యవస్థానం జరాయా వ్యవస్థితిర్యేనసః38-40

యదువు ఈ విధముగా పలికెను.

అకాలమున నీవు పొందిన ఈ ముసలితనమును గ్రహించి ఉండుటకు నేను ఇష్టపడడం లేదు, ఏలనన విషయసుఖములు అనుభవించక వాటి నుండి మానవుడు శాంతిని (వైరాగ్యమును) పొందలేడు. 40

శ్లో॥ తుర్వసుశ్చోదితః పిత్రా ద్రుహ్యశ్చానుశ్చ భారత ।
ప్రత్యాచఖ్యురధర్మజ్ఞా అనిత్యే నిత్యబుద్ధయః ॥ 41

టీ:- తుర్వ సురితి. యతో న ధర్మజ్ఞాః అనిత్యేచ యౌవనే నిత్య బుద్ధయః. 41

తండ్రియగు యయాతి తన పుత్రులగు తుర్వసు, దృహు, అనులను కూడా తన ముసలితనము గ్రహించి వారి యౌవనము నొసగమని అడిగెను. ధర్మము తెలియని అనిత్యమగు యౌవనమును నిత్యమైనదిగా భావించి వారలు ఆ మాట నంగీకరించకపోయిరి. 41

శ్లో॥ ఆపృచ్ఛత్తనయం పూరుం వయసోనం గుణాధికమ్ ।
నత్వమగ్రజవద్వత్స మాం ప్రత్యాఖ్యాతుమర్హసి ॥ 42

టీ:- అపృచ్ఛదితి.త్వం జరాం కిం గ్రహిష్యసీత్యపృచ్ఛత్. ప్రత్యాఖ్యానం మా కృథా ఇత్యాహ - న త్వమితి. 42

అపుడు యయాతి, వయస్సులో చిన్నవాడు, గుణములలో అధికుడగు పూరువును నీవు నా ముసలితనమును గ్రహించి నీ తారుణ్యమును ఒసగమని అడిగి, నీవు నీ అగ్రజుల వలె నా మాటను తిరస్కరించుట తగదని పలికెను. 42

పురురూరువాచ

శ్లో॥ కోను లోకే మనుష్యేంద్ర పితురాత్మకృతః పుమాన్ ।
ప్రతికర్తుం క్షమో యస్య ప్రసాదాద్విందతే పరమ్ ॥ 43

టీ:- క ఇతి. ఆత్మకృతః. స్వదేహకర్తుః ప్రత్యుపకారం కర్తుం కోను క్షమః. 43

పూరువు ఈ విధముగా పలికెను.

ఓ రాజా! తనకు శరీరమును ఒసగినట్టి ఏ తండ్రి యొక్క అనుగ్రహముతో పరమపదప్రాప్తి కలుగునో అట్టి తండ్రికి ప్రత్యుపకారముచేయ సామర్థ్యము ఈ లోకమున ఎవరి కుండును. 43

శ్లో॥ ఉత్తమశ్చింతితం కుర్యాత్ప్రోక్తకారీతు మధ్యమః ।
అధమోఽశ్రద్ధయా కుర్యాదకర్తోచ్చరితం పితుః ॥ 44

టీ:- ఉత్తమ ఇతి.తథాపి పితుః యశ్చింతితం కుర్యాత్ స ఉత్తమః యస్తు ప్రోక్తకారీ స మధ్యమః యస్త్వశ్రద్ధయా కుర్యాత్సోఽధమః. అకర్తా పితురుచ్చరితం పురీషప్రాయః. 44

తండ్రి మనస్సులోని అభిప్రాయమును గ్రహించి ఆచరించువాడు ఉత్తమ పుత్రుడు, తండ్రి చెప్పిన దాని నాచరించువాడు మధ్యముడు, తండ్రి చెప్పినచో అశ్రద్ధతో ఆచరించువాడు అధముడు, తండ్రి చెప్పిన దానినాచరించనివాడు పుత్రుడు కాడు పురీషప్రాయుడు. 44

శ్లో॥ ఇతి ప్రత్యుదితః పూరుః ప్రత్యగృహ్ణాజ్జరాం పితుః ।
సోఽపి తద్వయసా కామాన్ యథావజ్జుజుషే నృపః ॥ 45

టీ:- ఇతీతి. జుజుషే సేవితవాన్. 45

ఓ పరీక్షిద్రాజా! పూరువు ఈ విధముగా సంతోషముతో పలికి తండ్రి యొక్క ముసలితనమును గ్రహించెను. యయాతి ఆ పూరువు తారుణ్యమును గ్రహించి పూర్వమువలె విషయ భోగములను సేవించుచుండెను. (అనుభవించుచుండెను). 45

శ్లో॥ సప్తద్వీపవతీ స్సమ్యక్పితృవత్పాలయన్ప్రజాః ।
యథోపజోషం విషయాన్ జుజుషే వ్యాహతేంద్రియః ॥ 46

ఆ యయాతి ఇంద్రియ శక్తి సంపన్నుడై సప్తద్వీపాత్మకమగు పృథివిపైని ప్రజలను తండ్రివలె పాలించుచు తనకభీష్టమైనటుల విషయ భోగములను అనుభవించుచుండెను. 46

శ్లో॥ దేవయాన్యప్యనుదినం మనోవాగ్దేహ వృత్తిభిః ।
ప్రేయసః పరమాం ప్రీతిమువాహ ప్రేయసీ రహః ॥ 47

దేవయాని ప్రతిదినము ప్రియుడగు ఆ యయాతికి మనోవాక్కాయ కర్మలతో ఏకాంతమున గొప్ప సుఖములను అందించుచుండెను. 47

శ్లో॥ అయజద్యజ్ఞ పురుషం క్రతుభిర్భూరిదక్షిణైః ।
సర్వదేవమయం దేవం సర్వయజ్ఞమయం హరిం ॥ 48

టీ:- సప్తేతి. యథోపజోషం యథాప్రీతి జుజుషే. (46-48)

యయాతి సర్వదేవమయుడగు, సర్వయజ్ఞమయుడగు, యజ్ఞపురుషుడగు హరిని గూర్చి గొప్ప దక్షిణలుగల యజ్ఞములను ఒనరించెను. 48

శ్లో॥ యస్మిన్నిదం విరచితం వ్యోమ్నీవ జలదావళిః ।
నానేవ భాతి నాభాతి స్వప్నమాయామనోరథః ॥ 49

టీ:- యస్మిన్నితి. నానేవ భాతి యావదింద్రియ వృత్తిః. తదుపరమే నాభాతి చ. స్వప్నమాయాభ్యాం సహితో మనోరథ ఇవేత్యర్థః. (49-50)

ఆకాశములో మేఘ పంక్తి వలె ఏ భగవంతునిలో భగవంతునిచే రచించబడిన (సృష్టించబడిన) ఈ ప్రపంచము సప్న మాయలతో గూడిన కోరికవలె ఇంద్రియ ప్రవృత్తి ఉన్నంత వరకు అనేక రకాలుగా ప్రకాశించును. ఇంద్రియ ప్రవృత్తి ఉపశమించగా (నాశనమొందగ) ప్రకాశించదు. (కనబడదు) 49

శ్లో॥ తమేవ హృది విన్యస్య వాసుదేవం గుహాశయమ్ ।
నారాయణమణీయాంసం నిరాశీరయజత్ప్రభుః ॥ 50

అందరి హృదయాలలో విరాజిల్లెడి అతి సూక్ష్మరూపుడునగు నారాయణుణ్ణి మనస్సులో నుంచుకొని ఆ యయాతి నిష్కాముడై వాసుదేవుని సేవించెను. (యజనము కావించెను) 50

శ్లో॥ ఏవం వర్షసహస్రాణి మనష్షష్ఠైర్మనస్సుఖమ్ ।
విదధానోఽపి నాతృప్యత్సార్వభౌమః కదింద్రియైః ॥ 51

టీ:- ఏవమితి. మనస్సుఖం కామభోగం కదింద్రియైః కుత్సితైః పరాఙ్ముఖైరింద్రియైః. 51

ఈ విధముగా యయాతి వేయి సంవత్సరములు కుత్సితములగు ఇంద్రియములతో మనస్సునుంచి (జోడించి) కామభోగములను అనుభవించియూ తృప్తినొందక పోయెను. 51

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
అష్టాదశోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
పద్దెనిదవ అధ్యాయము సమాప్తము.

### ఏకోనవింశోఽధ్యాయః

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ స ఇత్థమాచరన్ కామాన్ స్త్రైణోఽపహ్నవమాత్మనః ।
బుద్ధ్వా ప్రియాయై నిర్విణ్ణోగాథామేతామగాయత ॥ 1

టీ:- "ఊనవింశే యయాతిస్స్వం చేష్టితం నన్వజోపమమ్ దేవయానీం సమాశ్రావ్య విరక్తో ముక్తిమాప్తవాన్. కించ. భుక్తభోగామజాంహాస్యన్న జవద్వృత్తిమాత్మనః, విడంబయన్ ప్రియామాహ నిర్వేదయితుమాత్మ వాన్" సఇతి. కామానాచరన్ ఉపభుంజానః గాథామితిహాసమ్. 1

యయాతి రువాచ

శ్లో॥ శృణుభార్గవ్యమూంగాథాం మద్విధా చరితాం భువి ।
ధీరాయస్యాను శోచంతి వనే గ్రామ నివాసినః ॥ 2

టీ:- శృణ్వితి. మద్విధేన మత్సదృశేన ఆచరితా మనుష్ఠితామ్ మద్విధస్యాచరితం యస్యామితి వా. యస్య గ్రామనివాసినః. కామినో మద్విధస్య ఆచరితం వనేస్థితా ధీరాః శోచంతి తస్య గాథాం శృణు. 2

### 19 వ అధ్యాయము

ఈ పంతొమ్మిదవ అధ్యాయమున యయాతి మేషముతో(మేకతో) పోల్చగల్గిన తన చేష్టను దేవయానికి వినిపించి విరక్తుడై ముక్తినొందిన విషయము తెలుపబడుచున్నది.

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

యయాతి ఈ విధముగా స్త్రీలంపటుడై కోరికలనుభవించుచు ఒకప్పుడు తన దుస్థితిని తెలిసికొని ప్రియురాలగు దేవయానికి ఈ ఇతిహాసమును (గాథను) వినిపించెను. (గానము చేసెను) 1

యయాతి ఈ విధముగా పలికెను.

ఓ భార్గవీ! దేవయానీ! ఈ భూమిపై నావలె ఆచరణ కల్గిన ఈ ఇతిహాసమును (గాథను) వినుము. గ్రామ నివాసి విషయలోలుడగు పురుషుని గురించి వనములలో నివసించెడి ధీరులు దుఃఖించెదరు. ఆ గాథను వినుము. 2



శ్లో॥ బస్త ఏకో వనే కశ్చిద్విచిన్వన్ ప్రియమాత్మనః ।
దదర్శ కూపే పతితాం స్వకర్మవశ గామజామ్ ॥ 3

టీ:- ఆత్మానమనులక్ష్యాహ - బస్త ఇతి. ప్రియామనువీక్ష్యాహ - అజామితి. వనే సంసారే. ప్రియం విషయం. 3

శ్లో॥ తస్యా ఉద్ధరణోపాయం బస్తః కామీ విచింతయన్ ।
వ్యధత్త తీర్థముద్ధృత్య విషాణాగ్రేణ రోధసి ॥ 4

టీ:- తస్యా ఇతి. రోధసి తటే విషాణాగ్రేణ మృదాదికముద్ధృత్య తీర్థం నిర్గమమార్గం వ్యధత్త. 4

శ్లో॥ సోత్తీర్య కూపాత్సుశ్రోణీ తమేవ చకమే కిల ।
తయా యుతం సముద్వీక్ష్య బహ్వ్యోజాః కాంతకామినీః ।
పీవానం శ్మశ్రులం భేజుర్మీఢ్వాంసం యభకోవిదమ్ ॥ 5

టీ:- స ఇతి. బహ్వ్య ఇతి. శర్మిష్ఠాప్రముఖాః కాంతం ప్రతికామినీః కామయంత్యః ప్రథమార్ధే ద్వితీయా పీవానం పుష్టం శ్మశ్రులం శ్మశ్రు బహుళం రతిసమర్థమిత్యర్థః. మిఢ్వాంసం. రేతస్సేక్తారం. యభకోవిదం మైథునాభిజ్ఞం. భేజుః. 5

యయాతి తనను మగ మేకగా దేవయానిని ఆడ మేకగా భావించి చెప్పుచున్నాడు. ఒక అరణ్యమున ఒక మగమేక (బస్తుడు) తనకు ప్రియమైన దానిని వెదకుచు తన కర్మ వశమున బావిలో పడియున్న ఆడ మేకను గాంచెను. 3

కామవంతుడగు ఆ మేక ఆ ఆడమేకను బయటకు తెచ్చు ఉపాయమును ఆలోచించి తన కొమ్ము కొసతో ఆ భావి ఒడ్డును ఒరసి మట్టిని తొలగించి బయటకు వచ్చు మార్గమును కావించెను. 4

ఆ ఆడమేక ఆ బావి నుండి బయటకు వచ్చి తనకు మార్గము కావించిన ఆ మేకను వరించెను. బాగా బలిసినట్టి బహుశ్మశ్రువులు గల్గినట్టి రతి సమర్థుడైనట్టి రేతఃసేక్త ఐనట్టి మైథున క్రియలో పండితుడై నట్టి, ఆ ఆడమేకతో కూడియున్నట్టి అతన్ని (ఆ మగమేకను) విషయోపభోగ కోరికలు గల అనేక ఆడమేకలు భజించినవి. (వరించినవి) 5

శ్లో॥ స ఏకోఽజవృషస్తాసాం బహ్వీనాం రతివర్ధనః ।
రేమే కామగ్రహగ్రస్త ఆత్మానం నావబుధ్యత ॥ 6

టీ:- స ఇతి. నావబుధ్యత నాన్వబుధ్యత. (6-7)

ఆ ఒక మగమేక అనేకములగు ఆడ మేకలకు రతి వర్ధనము కావిస్తూ కామగ్రహగ్రస్తుడై అనేక ఆడ మేకలతో రమిస్తూ తనను తెలుసుకొనలేక పోయెను (తన నిజమైన స్థితిని తెలిసికొనలేక పోయెను). 6

శ్లో॥ తమేవం ప్రేష్ఠత మయా రమమాణమజాన్యయా ।
విలోక్య కూప సంలగ్నా నామృష్యద్బస్తకర్మ తత్ ॥ 7

గాఢమైన అనురాగము గల, వేరే ఆడ మేకతో రమించెడి ఆ మగ మేకను కూపములో పడినట్టి మొదటి ఆడమేక చూచి అతని క్రియను సహించకపోయెను. 7

శ్లో॥ తమ దుర్హృదం సుహృద్రూపం కామినం క్షణసౌహృదమ్ ।
ఇంద్రియారామముత్సృజ్య స్వామినం దుఃఖితా యయౌ ॥ 8

టీ:- తమితి. స్వామినమితి శుక్రాభిప్రాయేణాహ. 8

కామవంతుడు, క్షణకాల స్నేహమును మాత్రమే చూపెడి మిత్రరూపియైన శత్రువగు, ఇంద్రియలోలుడగు ఆ మగ మేకను ఆ ఆడమేక వదిలి దుఃఖిస్తూ తన పాలికుని సమీపమునకు వెడలెను. (ఇచట స్వామినం అను పదము శుక్రుడు అను అభిప్రాయముతో చెప్పబడినది.) 8

శ్లో॥ స చైవానుగతస్త్రైణః కృపణస్తాం ప్రసాదితుమ్ ।
కుర్వన్నిలిబిలాశబ్దం నాశక్నోత్పథి సంధితుమ్ ॥ 9

టీ:- స ఇతి. ఇతి బిలాకారం బస్తజాతి శబ్దం. సంధితుం ప్రసాదయితుం. 9

స్త్రీలంపటుడగు ఆ మగమేక దీనుడై ఆడమేకను ప్రసన్నురాలను చేసుకొనుటకై, దానిననుసరించి వెడలుచూ ఇల బలా (మేష జాతి కావించెడి మే మే) అను ధ్వనిచేస్తూ కూడా దోవలో దానిని ప్రసన్నురాలినిగా చేసుకొనలేక పోయెను. 9

శ్లో॥ తస్య తత్ర ద్విజః కశ్చిదజాస్వామ్యచ్ఛినద్రుషా ।
లంబంతం వృషణం భూయస్సందధేఽర్థాయ యోగవిత్ ॥10

టీ:- తస్యేతి. వృషణమచ్ఛినత్. జరయా సంభోగాసమర్థమకరోత్. అర్థాయ స్వపుత్ర్యాః కామభోగాయ యోగవిత్. ఉపాయజ్ఞః జరా వ్యత్యయేన రతి శక్తిం దదావిత్యర్థః. 10

ఆ ఆడ మేక పాలకుడు ఒక బ్రాహ్మణుడు. అతడు కోపముతో ఆ మగ మేక వృషణమును ఛేదించెను. వ్రేలాడెడి వృషణమును యోగవేత్త యగు ఆ బ్రాహ్మణుడు తన పెంపుడుదైన ఆడమేక సౌఖ్యమునకై తిరిగి అతికించెను. (శుక్రుడు యయాతిని ముసలితనముతో సంభోగాసమర్థునిగావించి తన పుత్రికయగు దేవయాని సౌఖ్యమునకై ఉపాయజ్ఞుడై జరావ్యత్యయముతో రతి శక్తిని తిరిగి ఇచ్చెను అని తాత్పర్యము). 10

శ్లో॥ స లబ్ధ వృషణస్తత్ర హ్యజయా కూపలబ్ధయా ।
క్రీడన్ కాలం బహువిధం కామైర్నాద్యాపి తుష్యతి ॥ 11

ఆ మగ మేక లబ్ధ వృషణుడై బావిలో లభించిన ఆడమేకతో చాలా కాలము విషయభోగములను అనుభవించుచు ఇప్పటికిని (కోరికలతో) తృప్తి నొందుతూ లేదు. 11

శ్లో॥ తథాహం కూప లబ్ధాయా భవత్యాః ప్రేమయంత్రితః ।
ఆత్మానం నాభి జానామి మోహితస్తవ మాయయా ॥ 12

టీ:- స ఇతి. కూపలబ్ధయా సహ కామైః సేవ్యమానైః న తుష్యతి. (11-12)

ఓ దేవయానీ! ఆ మగమేక వలె నేను బావిలో లభించిన నీ యొక్క ప్రేమచే నియంత్రించబడి నీ మాయా మోహితుడనై ఈ విషయ భోగములలో పడి నన్ను నేను తెలిసికొనలేక పోవుచున్నాను. 12

శ్లో॥ యత్పృథివ్యాం వ్రీహి యవం హిరణ్యం పశవః స్త్రియః ।
న దుహంతి మనః ప్రీతిం పుంసః కామ హతస్య తే ॥ 13

టీ:- నను తర్హి పునరపి బహవో విషయాః సేవ్యంతాం. తతో మనసి ప్రీతే సతి. కామోపశాంత్యా మోహో నివర్తేతేతి చేత్తత్రాహ - ద్వాభ్యాం. యదితి. న దుహంతి న పూరయంతి. 13

శ్లో॥ న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి ।
హవిషా కృష్ణ వర్త్మేవ భూయ ఏవాభివర్థతే ॥ 14

టీ:- నేతి. హవిషా ఘృతేన కృష్ణవర్త్మా అగ్ని రివ. 14

శ్లో॥ యదా న కురుతే భావం సర్వభూతేష్వమంగళమ్ ।
సమదృష్టేస్తదా పుంసస్సర్వాస్సుఖమయా దిశః ॥ 15

టీ:- తర్హి కదా కేనో పాయేన వా మనస్సంపూర్ణాప్రీతిస్స్యాత్? యయా కామోపశమః స్యాదిత్యత ఆహ-షడ్భిః. యదేతి. అమంగలం భావం రాగద్వేషాదివైషమ్యం. 15

అటులైన యెడల తిరిగి అవే విషయభోగములను అనుభవించుము. అపుడు మనస్సు నానందమునొంది కామోపశాంతితో మోహము తొలుగగలదు. అనుదానికి ఈ రెండు శ్లోకములలో ఉత్తరము తెలుపబడుచున్నది. కామోపహతచేతస్కుడగు పురుషుని మనస్సునకు ఈ భూమియందలి సమస్తములగు ధాన్యము, యవలు, హిరణ్యము (ధనము) పశువులు, స్త్రీలు ప్రీతిని కల్గించవు. సమస్తముప్రాప్తించినను కామము ఉపశమించనిచో తృప్తికలుగదు. 13

విషయభోగములచేత విషయవాంఛ శాంతించదు. ఆజ్యముతో అగ్ని అభివృద్ధి చెందునటుల విషయములను అనుభవించునకొలది విషయవాంఛ అభివృద్ధి చెందును. 14

ఆ విధముగా అయిన యెడల ఏ ఉపాయముతో మనస్సుకు సంపూర్ణమగు ఆనందము కలుగును? దేనితో విషయవాంఛ శాంతి నొందును? అనగా ఇచటి నుండి ఆరు శ్లోకములతో ఆ విషయమును చెప్పబడుచున్నది. ఎపుడైతే మానవుడు సర్వప్రాణుల యందు రాగ ద్వేషాది వైషమ్యభావమును వదిలివేయునో అపుడు మానవునకు సర్వ దిశలు సుఖమయములగును. 15



శ్లో॥ యా దుస్త్యజా దుర్మతిభిర్జీర్యతో యా న జీర్యతే ।
తాం తృష్ణాం దుఃఖనివహాం శర్మ కామో ద్రుతం త్యజేత్ ॥ 16

టీ:- యేతి. దుఃఖాని నితరాం వహతీతి తథా తాం. 16

మందబుద్ధుల చేత వదలవేయబడజాలని విషయకాంక్ష (తృష్ణ, భోగం) మానవుని శరీరము జీర్ణావస్థ చెందుచున్నను జీర్ణమొందదు. (శైథిల్యమందదు) దుఃఖములకు నిలయమగు ఆ విషయతృష్ణను శుభము నొందగోరెడి మానవుడు త్వరగా వదలవలయును. 16

శ్లో॥ మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తాసనో భవేత్ ।
బలవానింద్రియ గ్రామో విద్వాంసమపి కర్షతి ॥ 17

స్త్రీజన సాంగత్యము ఎల్లప్పుడు విడువదగినదని తెలుపుచున్నాడు. తల్లి, చెల్లెలు, కూతురు, వీరలతో కూడా ఏకాంతమున ఒకే ఆసనమున ఆసీనుడు కాకూడదు. ఏలనన బలవంతమగు ఇంద్రియ సమూహము గొప్ప విద్వాంసులను కూడా విచలితులను చేయును. (ఆ సంకీర్ణము మనస్సులను చలింపజేయును.) 17

శ్లో॥ పూర్ణం వర్ష సహస్రం మే విషయాన్ సేవతోఽసకృత్ ।
తథాపి చానుసవనం తృష్ణా తేషూపజాయతే ॥ 18

ఎల్లప్పుడు విషయసేవనముతో నాకు వేయి సంవత్సరములు నిండినవి. అయినను ప్రతిక్షణము ఆ విషయముల కాంక్ష (తృష్ణ) కలుగుచునేయున్నది. 18

శ్లో॥ తస్మాదేతామహం త్యక్త్వా బ్రహ్మణ్యాధాయ మానసమ్ ।
నిర్ద్వంద్వోనిరహంకారశ్చరిష్యామి మృగైస్సహ ॥ 19

టీ:- స్త్రీసంనిధానం తు సర్వదా త్యాజ్యమిత్యాహ - మాత్రేతి. వివిక్తం. అసంకీర్ణమాసనం యస్య సః కర్షతి ఆకర్షతి. (17-19)

అందువలన నేను ఈ విషయ వాసనను వదిలి నా మనస్సును బ్రహ్మయందు నిలిపి శీతోష్ణ, సుఖదుఃఖ, రాగద్వేషాది ద్వంద్వములను వదిలి నిరహంకారుడనై హరిణములతో గూడి అరణ్యములలో చరించెదను. 19

శ్లో॥ దృష్టం శ్రుతమసద్బుద్ధ్వా నానుధ్యాయేన్న సంవిశేత్ ।
సంసృతిం చాత్మనాశం చ తత్ర విద్వాన్ స ఆత్మదృక్ ॥ 20

టీ:- నను తృష్ణా త్యాగస్య అతిదుష్కరత్వాత్కథం బ్రహ్మణి మనస అధానం స్యాత్తత్రాహ-దృష్టమితి.యోనానుధ్యాయేన్నసం విశేన్న చోప భుంజీతతత్ర దృష్టశ్రుతయోరనుధ్యానాదౌ.స ఆత్మదృగ్భవతి. 20-22

విషయతృష్ణా త్యాగము మిక్కిలి దుష్కరమైనది. వీరి దానిని వదిలి బ్రహ్మ యందు మనస్సు నిల్పుట ఎట్లో తెలుపబడుచున్నది. చూడబడెడి ఈ లోక సుఖము, వినబడెడి పరలోక సుఖము ఈ రెండింటి భోగము అసత్యమైనదని తెలిసికొని వాటిని చింతించవద్దు, అనుభవించ వద్దు వాటి ధ్యానము చేతనే జన్మమృత్యురూపమగు సంసార బంధనము, వాటి భోగముచే ఆత్మ నాశనము కల్గునని గ్రహించిన వాడే ఆత్మదర్శి (ఆత్మజ్ఞానవంతుడు) అగును. 20

శ్లో॥ ఇత్యుక్త్వా నాహుషో జాయాం తదీయం పూరవేవయః ।
దత్వా స్వాం జరసం తస్మాదాదదే విగతస్పృహః ॥ 21

విషయ వాసనను వదిలిన యయాతి తన భార్యయగు దేవయానితో ఇటుల పలికి పూరువునకు అతని తారుణ్యమునొసగి తన ముసలితనమును గ్రహించెను. 21

శ్లో॥ దిశి దక్షిణ పూర్వస్యాం ద్రుహ్యం దక్షిణతో యదుమ్ ।
ప్రతీచ్యాం తుర్వసుం చక్రే హ్యుదీచ్యామనుమీశ్వరమ్ ॥ 22

దక్షిణపూర్వదిశకు ద్రుహ్యుని, దక్షిణదిశకు యదువును, పశ్చిమమునకు తుర్వసుని, ఉత్తరమునకు అనువును రాజులుగా చేసెను. 22

శ్లో॥ భూమండలస్య సర్వస్య పూరుమర్హత్తమం విశామ్ ।
అభిషిచ్యాగ్రజాం స్తస్యవశే స్థాప్య యయౌ వనమ్ ॥ 23

టీ:- భూమండలం నస్యేతి. తస్య పూరోర్వంశే స్థాపయిత్వా. 23

సమస్త భూ మండలమునకు రాజగుటకు అర్హుడగు పూరువును రాజ్యాభిషక్తుని గావించి అగ్రజులను అతని అధీనులుగా ఉంచి అరణ్యమునకు వెడలెను. 23

శ్లో॥ ఆసేవితం వర్షపూగాన్ షడ్వర్గం విషయేషు సః ।
క్షణేన ముముచే నీడం జాతపక్ష ఇవ ద్విజః ॥ 24

టీ:- ఆసేవితమితి. విషయేషు శబ్దాదిషు ఆసేవితం. షడ్వర్గం షడింద్రియసుఖం ముముచే తత్యాజ యద్వా. విషయేషు ఆసేవితం సేవాం కారితం షణ్ణామింద్రియాణాంవర్గం ముముచే ఉపైక్షతేత్యర్థః. 24

ఆ యయాతి అనేక సంవత్సరములు షడింద్రియములతో విషయభోగములను అనుభవించియూ రెక్కలు మొలచిన పక్షి గూడును క్షణములో వదిలినటుల షడింద్రియ సుఖమును వదిలివేసెను. 24

శ్లో॥ స తత్ర నిర్ముక్త సమస్త సంగ
ఆత్మానుభూత్యా విధుతత్రిలింగః ।
పరేఽమలే బ్రహ్మణి వాసుదేవే
లేభే గతిం భాగవతీం ప్రతీతః ॥ 25

టీ:- సఇతి.విధుతం నిరస్తం త్రిగుణాత్మకం లింగం యేన. ప్రతీతః ప్రఖ్యాతః. 25

ఆ అరణ్యమున యయాతి సమస్తములగు ఆసక్తులను వదిలి ఆత్మానుభూతినొంది సత్వ, రజస్తమో గుణాత్మకమగు లింగ శరీరమును నిరసించి మాయాది మాలిన్య రహితమగు, పరబ్రహ్మయగు వాసుదేవుని యందు భక్తిని నిలిపి పరమ భాగవతులు నొందెడి గతిని పొందెను. 25

శ్లో॥ శ్రుత్వా గాథాం దేవయానీ మేనే ప్రస్తోభమాత్మనః ।
స్త్రీ పుంసోస్స్నేహ వైక్లబ్యాత్పరిహాస మివోదితమ్ ॥ 26

దేవయాని ఆ బస్తోపాఖ్యానమును విని స్త్రీ పురుషుల ప్రేమవిరహముతో వైక్లబ్యము చెందునని తలచి దానిని పరిహాసముగా భావించి ఈ గాథ తనకు నివృత్తి మార్గ బోధకమని తలచెను. 26

శ్లో॥ నాసన్నివాసం సుహృదాం ప్రపాయామివ గచ్ఛతామ్ ।
విజ్ఞాయేశ్వరతం త్రాణాం మాయా విరచితం ప్రభోః ॥ 27

శ్లో॥ సర్వత్ర సంగముత్సృజ్య స్వప్నౌపమ్యేన భార్గవీ ।
కృష్ణే మనస్సమావేశ్య వ్యధునోల్లింగమాత్మనః ॥ 28

టీ:- శ్రుత్వేతి. ప్రస్తోభమేవాహ - పరిహాసమివేతి. యద్వా - ప్రస్తోభం నివృత్తిమార్గే ప్రోత్సాహనం మేనే. (26-28)

శ్లో॥ నమస్తుభ్యం భగవతే వాసుదేవాయ వేధసే ।
సర్వభూతా నివాసాయ శాంతాయ బృహతే నమః ॥ 29

టీ:- కథం సమావేశ్యేత్యత ఆహ - నమ ఇతి. నమనాదిభిః సమావేశ్యేత్యర్థః. శ్రీశుకో వా నమస్కరోతి. 29

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
ఏకోనవింశో௨ ధ్యాయః

ఆ దేవయాని, సంబంధీకుల కలయిక మృగతృష్ణ సమీపమును చేరెడి పథికుల కలయిక వలె భావించి ఈ చేష్టలన్నియు భగవంతుని మాయతో రచించబడినవిగా తెలుసుకొనెను. 27

సమస్త విషయములు భగవంతుని మాయచే కల్పించబడినవి అనియు, స్వప్న సదృశ్యములని గ్రహించి అన్ని విషయములయందు ఆసక్తిని వదలి శ్రీకృష్ణునిపై మనస్సునుంచి తన లింగశరీరమును వదిలెను. 28

శ్రీకృష్ణుని యందు మనస్సు ఎటుల నిలిపినదనగా తెలుపుచున్నాడు. నమస్కారాదులతో మనస్సు కృష్ణునియందు నిలిపినదని అర్థము. సమస్త జగత్స్రష్ట, సర్వభూత నివాసి సమస్తులకు ఆశ్రయభూతుడగు, సర్వశక్తి సంపన్నుడును అగు భగవంతుడగు వాసుదేవునకు నమస్కారము. (శ్రీశుకునికి సమస్కారము) 29

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
పంతొమ్మిదవ అధ్యాయము సమాప్తము.

వింశోఽధ్యాయః

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ పూరోర్వంశం ప్రవక్ష్యామి యత్ర జాతోఽసి భారత ।
యత్ర రాజర్షయో వంశ్యా బ్రహ్మవంశ్యాశ్చ జజ్ఞిరే ॥ 1

శ్లో॥ జనమేజయోఽభవత్పూరోః ప్రాచిన్వాం స్తత్సుతస్తతః ।
ప్రవిరోధనమన్యుర్వై తస్మాచ్చారుస్సుతోఽభవత్ ॥ 2

టీ:- శ్లో."వింశే పితృప్రసాదాప్త రాజాసన మహోన్నతేః. పూరోర్వంశే తు దౌష్యంతే భరతస్యేర్యతే యశః." (1-2)

శ్లో॥ తస్య సుద్యురభూత్పుత్ర స్తస్మాద్బహుగతస్తతః ।
శర్యాతిస్తస్య సంయాతీ రౌద్రాశ్వస్తత్సుతస్స్మృతః ॥ 3

టీ:- తస్యేతి. తత్సుతః సంయాతేః సుతః. 3

20 వ అధ్యాయము

ఈ ఇరువదియవ అధ్యాయములో తండ్రియగు యయాతి అనుగ్రహముతో రాజ్యమునొందిన, ఉన్నతుడగు పూరువంశములో దుష్యంతుని పుత్రుడగు భరతునియొక్క కీర్తి తెలుపబడుచున్నది.

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

ఓ పరీక్షిద్రాజా బ్రహ్మర్షుల వంశములు, రాజర్షుల వంశములు జనించినట్టి, నీవు జన్మించినట్టి పూరువంశమునుగురించి తెలిపెదను. 1

పూరునకు జనమేజయుడు, జనమేజయునకు ప్రచిన్వానుడు ఆతనికి ప్రవీరుడు, ప్రవీరునకు నమన్యువు ఆతనికి చారుపదుడు పుత్రులైరి. 2

చారుపదునకు సుద్యువు పుత్రుడాయెను. ఆతనికి బహుగవుడు, బహుగవునకు శర్వాతి, శర్వాతికి సంయాతి, సంయాతికి రౌద్రాశ్వుడు పుత్రులుగా జన్మించిరి. 3

శ్లో॥ ఋతే పుస్తస్య కక్షేపుః సలేపుశ్చ కృతేపుకః ।
జలేపుస్సన్నతేపుశ్చ ధర్మసత్య వ్రతేపవః ॥ 4

టీ:- ఋతేపురితి. ధర్మేపుశ్చ సత్యేపుశ్చ వ్రతేపుశ్చ ధర్మ సత్యవ్రతే పవః. 4

శ్లో॥ దశైతేఽప్సరసః పుత్రావనేపుశ్చావమస్స్మృతః ।
ఘృతాచ్యామింద్రియాణీవ ముఖ్యస్య జగదాత్మనః ॥ 5

శ్లో॥ ఋతేపో రంతిసారోఽభూత్త్రయ స్తస్యాత్మజా నృప ।
సుమతిర్ధ్రువోఽప్రతిరథః కణ్వోఽప్రతిరథాత్మజః ॥ 6

శ్లో॥ తస్య మేధాతిథి స్తస్మాత్ప్రస్కందాద్యా ద్విజాతయః ।
పుత్రోఽభూత్సుమతేరైభ్యో దుష్యన్తస్తత్సుతో మతః ॥ 7

టీ:- దశేతి. వనేపుశ్చావమః స్మృతః. ఏవం దశైతే ఋతేపు ప్రముఖా స్తస్య రౌద్రాశ్వస్య ఘృతాచ్యామప్సరసి పుత్రా జాతాః. అప్సరస ఇతి సప్తమ్యర్థే షష్ఠీ వశవర్తిత్వే దృష్టాంతః. జగదాత్మనః. జగతః ఆత్మభూతస్య ముఖస్య ప్రాణస్య. ఇంద్రియాణీవ. (5-7)

జగదాత్మభూతమగు ప్రాణమునకు దశేంద్రియములవలె ఆ రౌద్రాశ్వునకు ఘృతాచి అను అప్సరసయందు ఋతేపువు, కక్షేపువు, సలేపువు, కృతేపువు, జలేపువు, సన్నతేపువు, ధర్మేపువు, సత్యేపువు, వ్రతేపువు, (అందరిలో చిన్నవాడు వనేపువు) అను పదిమంది పుత్రులు కలిగిరి. అప్సరస యందు జనించిరి అనుచోట సప్తమ్యర్థములో అప్సరసః అని షష్ఠి వశవర్తిత్వమునకు నిదర్శనము. (4-5)

ఋతేపునకు రంతిసారుడు పుత్రుడాయెను. ఆ రంతిసారునకు సుమతి, ధృవుడు, అప్రతిరథుడను ముగ్గురు పుత్రులు. అప్రతిరథునకు కణ్వుడు పుత్రుడు. 6

కణ్వునకు మేధాతిథి పుత్రుడాయెను, ఆ మేధాతిథి వలన ప్రస్కందాది బ్రాహ్మణులుద్భవించిరి. సుమతికి రైభ్యుడు, రైభ్యునకు దుష్యంతుడు పుత్రులుగా జన్మించిరి. 7

శ్లో॥ దుష్యన్తో మృగయాం యాతః కణ్వాశ్రమపదం గతః ।
తత్రాసీనాం స్వప్రభయా మండయంతీం రమామివ ॥ 8

టీ:- దుష్యంతస్య శకుంతలాయాం భరతః పుత్రోఽభవదితి కథా ద్వారేణాహ - పంచదశభిః. దుష్యంత ఇతి. తదాశ్రమపదం మండయంతీం భూషయంతీం. 8

దుష్యంతునకు శకుంతలయందు భరతుడు జన్మించెను అను విషయమును కథ ద్వారా పదిహేను శ్లోకములతో తెలుపుచున్నాడు. దుష్యంతుడు వేటకై వెడలి కణ్వమహర్షి ఆశ్రమమును చేరి, అచట తనయొక్క కాంతితో ఆశ్రమ స్థానమునలంకరించుచు లక్ష్మీదేవి వలెనున్నట్టి - తరువాతి శ్లోకముతో అన్వయము. 8

శ్లో॥ విలోక్య ముముహే సద్యోదేవ మాయామివ స్త్రియమ్ ।
జగామ తాం వరారోహాం భటైః కతిపయైర్వృతః ॥ 9

టీ:- విలోక్యేతి. స్త్రియం విలోక్య ముముహే అముహ్యత. 9

దేవమాయతో సమానమగు సౌందర్యము గల స్త్రీని గాంచి, కొంత మంది భటులతో ఆ అందవతిని (సౌందర్యరాశిని) చేరి వెంటనే మోహితుడయ్యెను. 9

శ్లో॥ తద్దర్శన ప్రముదితస్సన్నివృత్త పరిశ్రమః ।
పప్రచ్ఛ కామసంతప్తః ప్రహసన్ శ్లక్ష్ణయాగిరా ॥ 10

ఆ స్త్రీ దర్శనముతో సంతసించి మార్గాయాసమును తీర్చుకొని కామసంతప్తుడై చిరునవ్వు నవ్వుచూ మధురమగు మాటలతో ఇటుల అడిగెను. 10

దుష్యంత ఉవాచ

శ్లో॥ కా త్వం కమల గర్భాభే కస్యాసి హృదయంగ మే ।
కిం వా చికీర్షితం త్వత్ర భవత్యా విజనే వనే ॥ 11

టీ:- తదితి. తస్యాః దర్శనేన ప్రముదితః అత ఏవ. సన్నివృత్తః పరిశ్రమో యస్య. (10-11)

దుష్యంతుడు పలికెను.

కమల పూరేకుల వంటి కన్నులు గల హృదయమును దోచెడి సౌందర్యము గల నీవెవరవు? ఎవరి దానవు? విజనమగు ఈ అరణ్యమున నీవేమి కోరుచున్నావు. (ఏ కోరికతో ఈ ఆశ్రమమున ఉన్న దానవు) 11

శ్లో॥ వ్యక్తం రాజన్య తనయాం వేద్మ్యహం త్వాం సుమధ్యమే ।
న హి చేతః పౌరవాణామధర్మే రమతే క్వచిత్ ॥ 12

టీ:- వ్యక్తమితి. పౌరవాణాం చేతో న హ్యధర్మే రమతే. అతో మచ్చేతసః త్వయి రమణాదేవ అహం త్వాం రాజన్య తనయా వేద్మి. 12

ఓ సుందరురాలా! నేను నిన్ను రాజకన్యగా తలచుచున్నాను. ఏలనన పురువంశీకుల యొక్క చిత్తము ఎప్పుడు కూడా అధర్మ విషయమున రమించదు. పురువంశీయుడనగు నా యొక్క మనస్సు నిన్ను కోరుచున్నది కాన నీవు క్షత్రియ కన్యవనియే తలంచుచున్నాను. 12

శకుంతలోవాచ

శ్లో॥ విశ్వామిత్రాత్మజేవాహం త్యక్తా మేనకయా వనే ।
వేదైతద్భగవాన్ కణ్వోవీర కిం కరవామ తే ॥ 13

శకుంతల ఈ విధముగా పలికెను.

ఓ వీరుడా! నేను విశ్వామిత్రుని పుత్రికనే. విశ్వామిత్రునకు, మేనకకు జన్మించినదానను. ఆ మేనక స్వర్గమునకు వెళుతూ నన్ను అరణ్యమున వదిలినది. నా పాలక జనకుడగు కణ్వుడు ఈ విషయమంతయు తెలిసినవాడు. నేను నీకేమి సేవచేయవలయును. 13

శ్లో॥ ఆస్యతామరవిందాక్ష గృహ్యతా మర్హణం చ నః ।
భుజ్యతాం సంతి నీవారా ఉష్యతాం యది రోచతే ॥ 14

టీ:- విశ్వామిత్రేతి. విశ్వామిత్ర స్యాత్మజాహం మేనకాయాం జాతా తయా చ స్వర్గం గచ్ఛంత్యాత్ర వనే త్యక్తా. అతో రాజన్య కన్యైవాహ మిత్యర్థః. (13-14)

ఓ పద్మపత్రాక్షా! ఇచట కూర్చుండుడు. మా సత్కారమును స్వీకరించండి. ఇచట నీవార ధాన్యము కలదు. దానిని భుజించండి. మీకు నచ్చినచో ఇచట వసించండి. 14

దుష్మంత ఉవాచ

శ్లో॥ ఉపపన్నమిదం సుభ్రు జాతాయాః కుశికాన్వయే ।
స్వయం హి వృణతే రాజ్ఞాం కన్యకాస్సదృశం వరమ్ ॥ 15

టీ:- కిం కరవామేత్యాదివాక్యాత్ తదభిప్రాయం జ్ఞాత్వాహ - ఉపపన్నమితి. 15

దుష్మంతుడు ఈ విధముగా పలికెను.

కింకరవామతే అను వాక్యముతో శకుంతల అభిప్రాయమును గ్రహించిన దుష్యంతుడు పలుకుచున్నాడు. కుశిక వంశములో జన్మించిన నీకు ఇది తగియున్నది. ఏలనన రాజకన్యకలు తమకు తగిన వరుణ్ణి స్వయముగా వరించెదరు. 15

శ్లో॥ ఓమిత్యుక్తే యథా ధర్మముపయే మే శకుంతలామ్ ।
గాంధర్వ విధినా రాజా దేశకాల విధానవిత్ ॥ 16

శకుంతల అంగీకారము తెలుపగా దేశ, కాల, శాస్త్ర విధులు తెలిసిన ఆ దుష్యంతుడు ధర్మప్రకారముగా ఆ శకుంతలను గాంధర్వ విధితో వివాహము చేసుకొనెను. 16

శ్లో॥ అమోఘ వీర్యో రాజర్షిర్మహిష్యాం వీర్యమాదధే ।
శ్వోభూతే స్వపురం యాతః కాలేనాసూత సా సుతమ్ ॥ 17

అమోఘవీర్యుడు, రాజర్షియగు దుష్యంతుడు ఆ రాత్రి శకుంతలతో సంగమించి తెల్లవారి తన పట్టణమునకు వెడలెను. కొంతకాలము పిదప ఆ శకుంతల పుత్రుని కనెను. 17

శ్లో॥ కణ్వః కుమారస్య వనే చక్రే సముచితాః క్రియాః ।
బద్ధ్వా మృగేంద్రాన్ తరసా క్రీడతి స్మ స బాలకః ॥ 18

టీ:- ఓమితి. గాంధర్వ విధినా మిథస్సమయపూర్వకేణ. (16-18)

కణ్వమహర్షి ఆ బాలునకు ఆ అరణ్యములోనే జాతకర్మాది క్రియలను నొనరించెను. ఆ బాలుడు బాల్యావస్థలోనే సింహాది మృగములను బంధించి వాటితో క్రీడించుచుండెను. 18

శ్లో॥ తం దురత్యయ విక్రాంత మాదాయ ప్రమదోత్తమా ।
హరేరంశాంశ సంభూతం భర్తురంతికమాగమత్ ॥ 19

విష్ణ్వంశ సంభూతుడగు, అపరిమిత పరాక్రమవంతుడు అగు ఆ బాలుని వెంటనిడుకొని ఉత్తమురాలగు ఆ శకుంతల భర్తయగు దుష్యంతుని వద్దకు వచ్చెను. 19

శ్లో॥ యదా న జగృహే రాజా భార్యా పుత్రావనిందితౌ ।
శృణ్వతాం సర్వభూతానాం ఖే వాగాహ శరీరిణీ ॥ 20

టీ:- తమితి. దురత్యయం విక్రాంతం విక్రమః యస్య. (19-20)

రాజగు దుష్యంతుడు దోషరహితులగు భార్యాపుత్రులను స్వీకరించకపోవడంతో, సమస్త ప్రాణులు వినుచుండగా ఆకాశములో అశరీరవాణి ఇటుల పలికెను. 20

శ్లో॥ మాతా భస్త్రా పితుః పుత్రో యేన జాతస్స ఏవ సః ।
భరస్వ పుత్రం దుష్యంత మాఽవమంస్థాశ్శకుంతలామ్ ॥ 21

టీ:- మాతేతి. భస్త్రా చర్మపాత్రం. తద్వత్ మాతా ఆధారమాత్రం పితురేవ పుత్రః. తత్ర హేతుః యేనేతి. శ్రు. "ఆత్మావైపుత్రనామాసీ"తి శ్రుతేః పుత్రం. భరస్వపుషాణ. అనేన భరతనామనిరుక్తం. 21

తల్లి చర్మపాత్రవలె పుత్రునకు ఆధారభూతురాలు మాత్రమే, తండ్రియే పుత్రుడుగా జన్మించుచున్నాడు. ఈ విషయము "ఆత్మావై పుత్రనామాసి" అను శ్రుతిచే తెలుపబడుచున్నది. కావున ఓ దుష్యంతుడా ఈ పుత్రుని పోషించుము. (భరించుము) శకుంతలను తిరస్కరించకుము. 21

శ్లో॥ రేతోధాః పుత్రం పుత్రోనయత్యేవ యమక్షయాత్ ।
త్వం చాస్య ధాతా గర్భస్య సత్యమాహ శకుంతలా ॥ 22

వంశకర్తయగు పుత్రుడు తండ్రిని యముడి నుండి (నరకము నుండి) తరింపచేయును. "పున్నామో నరకాదస్మాత్పితరం త్రాయతే సుతః, తస్మాత్పుత్ర ఇతి ప్రోక్తః స్వయమేవ స్వయం భువే". "పుం" అను పేరుగల నరకము నుండి తండ్రిని పుత్రుడు రక్షించును. అందు వలననే పుత్రుడనబడుచున్నాడు అని శ్రుతి తెలుపుచున్నది. ఈ

శకుంతల గర్భమును (పుత్రుని) ధరించువాడవు నీవే శకుంతల సత్యమును వచించినది కావున ఈ బాలకుని భరించుము. (పోషించుము) అని ఆకాశవాణి పలికెను. 22

శ్లో॥ భర స్వపుత్రం భరతం వాసుదేవాంశ సంభవమ్ ।
బ్రహ్మణ్యం సత్యసంధం చ గుణజ్ఞం కీర్తివర్ధనమ్ ॥ 23

టీ:- కించ రేతోధా ఇతి. రేతోధాః రేతస్సేక్తా వంశకృత్ పుత్రః యమక్షయాత్ నిరయాత్ పితరం నయతి తారయతి. తథా చ స్మృతిః శ్లో."పున్నామ్నో నరకాద్యస్మాత్పితరం త్రాయతే సుతః, తస్మాత్పుత్ర ఇతి ప్రోక్తః స్వయమేవ స్వయంభువే" తి. రేతోధాః పుత్రం నయతి నరదేవేతి పాఠాంతరే మాతా పిత్రోః పుత్రం ప్రతి వివాదే యమక్షయాత్ ధర్మనిర్ణేతుః యమస్య సభాయాస్సకాశాత్. రేతోధాః రేతస్సేక్తా పితైవ ధర్మేణ విజిత్య పుత్రం నయతి నతు మాతేత్యర్థః. (22-23)

విష్ణ్వంశసంభూతుడు, వంశకీర్తిని అభివృద్ధి చెందించువాడు, మంచి గుణములు తెలిసిన వాడు, సత్యవంతుడు, బ్రాహ్మణులను పోషించు వాడును అగు ఈ భరతుని పోషించుము. 23

శ్లో॥ మహోత్సాహం స్థూల లక్షం కృతజ్ఞం వృద్ధసేవకమ్ ।
అశరీర వచశ్శ్రుత్వా స్వీచకార తదాత్మజమ్ ॥ 24

టీ:- మహోత్సాహమితి. తతశ్చభార్యాపుత్రౌ స్వీకృతవానితిజ్ఞేయం. 24

వృద్ధులను (పెద్దలను) సేవించెడి, చేసిన మేలును స్మరించెడి, చక్రవర్తి లక్షణోపేతుడు, గొప్ప ఉత్సాహవంతుడునగు ఈ భరతుని భరించుము అని పలికిన అశరీరవాణి వాక్కులను విని ఆ దుష్యంతుడు ఆ పుత్రుని స్వీకరించెను. భార్యాపుత్రులను స్వీకరించెనని తాత్పర్యము. 24

శ్లో॥ పితర్యుపరతే సోఽపి చక్రవర్తీ మహాయశాః ।
మహిమా గీయతే యస్య హరేరంశ భువో భువి ॥ 25

టీ:- పితరీతి. చక్రవర్తీ బభూవేతి శేషః. తస్య మహిమా గీయతే. శ్రు."తదప్యేతేశ్లోకా అభిగీతా" ఇత్యాది బహ్వృచ శ్రుత్యా. హరేరంశ భువః అంశాజ్జాతస్య. 25

తండ్రియగు దుష్యంతుడు మరణించగా ఆ భరతుడు గొప్ప కీర్తిమంతుడగు చక్రవర్తి అయ్యెను. విష్ణ్వంశసంభూతుడగు ఆ భరత చక్రవర్తి మహిమ ఇప్పటికిని ఈ భూమిచే గానము చేయబడుచున్నది. "తదప్యేతేశ్లోకా అభిగీతా" అను శ్రుతిచే ఈ విషయము అవగతమగుచున్నది. 25

శ్లో॥ చక్రం దక్షిణహస్తేఽస్యపద్మకోశశ్చ పాదయోః ।
ఈజే మహాభిషేకేణ సోఽభిషిక్తోఽధిరాడ్విభుః ॥ 26

టీ:- తత్ర లింగమాహ - చక్రమితి. 26

ఆ భరతుడు విష్ణ్వంశసంభూతుడు అనుటకు కారణములు తెలుపుచున్నాడు. ఈ భరతుని యొక్క దక్షిణ హస్తములో చక్ర చిహ్నము, పాదములో పద్మకోశ చిహ్నము గలవు. ఆ భరతుడు మహాభిషేక విధిలో చక్రవర్తి పదమునకు అభిషిక్తుడాయెను. 26

శ్లో॥ పంచ పంచాశతామేధ్యై ర్గంగాయా మనువాజిభిః ।
దీర్ఘతపసం పురోధాయ యమునాయా మను ప్రభుః ॥ 27

టీ:- పంచేతి. గంగాయామను అనులోమం. పంచపంచాశతా వాజిభిరీజే. పురోధాయ పురోహితం కృత్వా. యమయనాయామను యమునాయాశ్చానులోమం. 27

శ్లో॥ అష్టసప్తతిమేధ్యాశ్వాన్ బబంధప్రదదద్వసు ॥ 28

టీ:- అష్టేతి. అష్టాధికసప్తతి మేధ్యానశ్వాన్ బబంధ కిం కుర్వన్? వసు ధనం ప్రకర్షేణ దదత్. 28

చక్రవర్తియగు భరతుడు, (మమత పుత్రుడగు) దీర్ఘతపుడను మునిని పురోహితునిగా చేసుకొని గంగాతటము వెండి యాభైఐదు అశ్వమేధ యాగములను, యమునాతటము వెంబడి డెబ్బది ఎనిమిది అశ్వమేధములను చేసి ధనమును విశేషముగా దానము చేసెను. (27-28)

శ్లో॥ భరతస్య హి దౌష్యంతేరగ్నిస్సాచీ గుణేచితః ।
సహస్రం ద్వంద్వశో యస్మిన్ బ్రాహ్మణాగా విభేజిరే ॥ 29

టీ:– భరతస్యేతి. సాచీగుణే ప్రకృష్టగుణవతి దేశే అగ్నిశ్చితోఽభూత్. యస్మిన్నగ్నిచయనే దేశే వా. సహస్రం బ్రాహ్మణాః భరతేన భూరిదానేన దత్తాః గాః ద్వంద్వశః ప్రత్యేకం ద్వంద్వం విభేజిరే విభజ్య జగృహుః చతురశీత్యధికైః త్రయోదశసహస్రైరేకం ద్వంద్వం భవతి. తథాహి. శ్రు. "హిరణ్యేన పరివృతాన్ కృష్ణాన్ శుక్లదతో మృగాన్ మష్కారే భరతో దదాచ్ఛతం ద్వంద్వాని సప్త" చేతి శ్రుత్యుక్తాని సప్తాధికశతం ద్వంద్వాని శ్రీశుకేనోత్తర శ్లోకే చతుర్దశలక్షం తేన సంగృహీతాని. అదాత్కర్మణి మష్కారే నియుతాని చతుర్దశేతి. ఏవం చతుర్దశ లక్షాణాం సప్తాధిక శతభాగో ద్వంద్వమిత్యుక్తం భవతి. ఇయం చ ద్వంద్వ సంఖ్యా శ్లోకేన సంగృహ్యతే. శ్లో. చతుర్దశానాం లక్షాణాం సప్తాధికశతాంశకః, ద్వంద్వం చతుర్దశీత్యగ్ర సహస్రాణి త్రయోదశేతి. శ్రీధరీయోఽయం శ్లోకః. అత్రోదాహృత శ్రుతి ప్రతిపాదిత సంఖ్యాయాశ్శుకో క్తేర్ద్వాదశాధిక్యం వర్తత ఇతి. మంతవ్యం. 29

దుష్యంతుని పుత్రుడగు భరతుని యొక్క అగ్నిచయనము ప్రకృష్టమగు ప్రదేశమున ఒనరించబడెను. ఆ అగ్నిచయనములో భరతుడు ఒసంగిన ఆవులను వేయిమంది బ్రాహ్మణులు ఒక్కొక్కరు ఒక్కొక్క ద్వంద్వము చొప్పున పంచుకొనిరి. పదమూడువేల ఎనుబది నాలుగు ఆవులు ఒక ద్వంద్వమగును. శ్రుతి "హిరణ్యేన పరివృతాన్ కృష్ణాన్ శుక్లదతో మృగాన్ మష్కారే భరతో దదాచ్ఛతం ద్వంద్వాని సప్తచ" అను శ్రుతి ద్వారా తెలుపబడిన ఒక వంద ఏడు ద్వంద్వములను శ్రీ శుక మహర్షి తరువాతి శ్లోకములో పద్నాలుగు లక్షలుగా "అదాత్కర్మణి మష్కారే నియుతాని చతుర్దశేతి" అని చెప్పుచున్నాడు. ఈ ప్రకారముగా చూడగా పద్నాలుగు లక్షలలో ఒకవంద ఏడవ భాగము ద్వంద్వమని చెప్పబడినదగును. ఈ ద్వంద్వ సంఖ్య శ్లోకములో చెప్పబడుచున్నది. "చతుర్దశానాం లక్షాణాం సప్తాధికశతాంశకః, ద్వంద్వం చతుర్దశీత్యగ్రసహస్రాణి త్రయోదశ" పదునాలుగు లక్షలలో ఒకవంద ఏడు శతాంశముల భాగము ద్వంద్వము అనగా పదమూడువేల ఎనుబది నాలుగు సంఖ్య ద్వంద్వ మనబడును. ఈ శ్లోకము శ్రీధరస్వామిది. ఇక్కడ చెప్పబడిన శ్రుతిప్రతి పాదిత సంఖ్య కంటే శుక మహర్షి చెప్పబడిన పదునాలుగు లక్షలనునది పన్నెండు సంఖ్యలు అధికముగా ఉన్నదని గ్రహించవలయును.

పదమూడువేల ఎనుబది నాలుగు ఒక ద్వంద్వముకాగ వేయి

శ్లో॥ త్రయస్త్రింశచ్ఛతంహ్యశ్వాన్ బద్ధ్వా విస్మాపయన్నృపాక్ ।
దౌష్యంతిరత్యగాన్మాయాం దేవానాం గురుమాయయౌ ॥ 30

టీ:- త్రయస్త్రింశదితి. దేవానామపి మాయాం వైభవం అత్యగాత్ అత్యశేత. యతః గురుం పూజ్యం హరిం ఆయయౌ ప్రాప్తః. తదంశ సంభవత్వాత్. మాయవత్తర ఇతి పాఠే హ్రస్వం. శ్రుత్యనుసారేణ మాయావతాం శ్రేష్ఠః హరిరేవాసావిత్యర్థః. 30

శ్లో॥ మృగాన్ శుక్లదతః కృష్ణాన్ హిరణ్యేన సమావృతాన్ ।
అదాత్కర్మణి మష్కారే నియుతాని చతుర్దశ ॥ 31

టీ:- మృగానితి. మృగాన్ మృగజాతీయాన్ శ్రేష్ఠగజాన్ భద్రమంద్ర మృగాదయో గజ జాతి భేదాః మష్కార ఇత్యస్య శ్రుతిపదస్య వ్యాఖ్యానం కర్మణీతి కస్మింశ్చిత్కర్మవిశేషే. కేచిత్తు మష్కారే తీర్థ ఇతి వ్యాచక్షతే. (31-33)

మంది బ్రాహ్మణులు ఒక్కొక్క ద్వంద్వము గోవులను విభజించుకొనిరి. అనగా భరతుడు ఒక కోటి ముప్పది లక్షల ఎనుబది నాలుగువేల గోవులను దానమిచ్చెనని తెలియుచున్నది. 29

దుష్యంత పుత్రుడగు భరతుడు ఒకవంద ముప్పది మూడు అశ్వమేధముల నొనర్చి రాజులందరిని ఆశ్చర్యపరచెను. దేవతల వైభవమును కూడా అతిశయించి పూజ్యుడగు విష్ణువును చేరెను. (మాయను తరించి విష్ణ్వంశసంభూతుడగుటచే విష్ణువును చేరెను). 30

మష్కారమను పేరుగల కర్మలో (యజ్ఞములో) భరతుడు సువర్ణముతో అలంకరించిన తెల్లని దంతములు గల, నలుపు వర్ణము గల మృగ జాతికి చెందిన శ్రేష్ఠములగు పదునాలుగు లక్షల ఏనుగులను దానము చేసెను. (భద్రమంద్ర మృగాదులు గజ జాతి విశేషములు కొందరు మష్కారమనగా తీర్థ స్థలమని తెలిపిరి). 31

శ్లో॥ భరతస్య మహత్కర్మ న పూర్వే నాపరే నృపాః ।
నైవాపుర్నైవ ప్రాప్స్యంతి బాహుభ్యాం త్రివిదం యథా ॥ 32

భరతుడొనరించినటుల గొప్ప కర్మలను భరతుని కంటే పూర్వీకులైన రాజులు ఒనరించక పోయిరి. తరువాతి రాజులు కూడా చేయకపోయిరి. భరతుని వంటి స్థానమును, భుజములతో స్వర్గము నందుకొన జాలనట్లు ఇంతవరకు ఎవ్వరునూ పొందక పోయిరి. ముందును ఎవరు నొందజాలరు. 32

శ్లో॥ కిరాత హూణాన్ యవనానాంధ్రాన్ వంగాన్ శకాన్ కశాన్ ।
అబ్రహ్మణ్యాన్నృపాంశ్చాహన్ మ్లేచ్ఛాన్ దిగ్విజయే బలాత్ ॥33

భరతుడు దిగ్విజయమున బ్రాహ్మణ ద్రోహులగు కిరాత, హూణ, యవన, ఆంధ్ర, వంగ, శక, కశ, మ్లేచ్ఛులు మొదలగు రాజులను సంహరించెను. 33

శ్లో॥ జిత్వా పురాసురాదేవాన్ యే రసౌకాంసి భేజిరే ।
దేవస్త్రియో రసాంనీతాః ప్రాణిభిః పునరాహరత్ ॥ 34

టీ:- జిత్వేతి. పురా దేవాన్ జిత్వా యే అసురాః రసౌకాంసి రసాతలాది స్థానాని భేజిరే తైః ప్రాణిభిర్బలిభిః దేవస్త్రియో రసాతలం నీతాస్సతీః పునరాహరత్. ప్రాణిభిరన్యైర్మనుష్యాదిభిస్సహ నీతా ఇతి వా. పణిభిరితి పాఠే పణయః అసురాః తైర్నీతాః సతీః. యద్వా పణయో దూతాః తైః దూతాన్ ప్రస్థాప్యాహరదిత్యర్థః. 34

పూర్వకాలమున రాక్షసులు దేవతలను జయించి రసాతలాది లోకములను నివాసములుగా చేసుకొనిరి. దేవతాస్త్రీలను, మానవులను, నాగులను రసాతలము నకు తీసుకవెళ్ళి బంధించిరి. భరతుడు ఆ రాక్షసులను జయించి దేవతా స్త్రీలను బంధ విముక్తులను గావించెను. 34

శ్లో॥ సర్వాన్కామాన్ దుదుహతుః ప్రజానాం తస్య రోదసీ ।
సమాస్త్రిణవసాహస్రీర్దిక్షు చక్రమవర్తయత్ ॥ 35

టీ:- సర్వానితి. త్రిణవ సాహస్రీః సమాః సప్తవింశతి సహస్ర సంవత్సరాన్. చక్రం సేనాం ఆజ్ఞాం వా. 35

ఆ భరతుడు రాజ్యమును పాలించుచుండగా భూమ్యాకాశములు ప్రజల సమస్త కోరికలను తీర్చుచుండెను. ఆ భరతుడు ఈ విధముగా సమస్త దిక్కులను ఇరువది ఏడువేల సంవత్సరములు ఏకచ్ఛత్రాధిపత్యముగా పాలించెను. 35

శ్లో॥ స సమ్రాట్ లోకపాలనామైశ్వర్యమధిరాట్ఛ్రియమ్ ।
చక్రం జాయాస్సుతాన్ ప్రాణాన్మృషేత్యుపరరామ హ ॥ 36

టీ:- తస్య వైరాగ్యేణ. మోక్షప్రకారమాహ - స ఇతి. మృషేతి విచార్యేతి శేషః. 36

ఆ భరతుడు మోక్షమునొందుటను తెలుపుచున్నాడు. ఆ చక్రవర్తియగు భరతుడు దిక్పాలకుల ఐశ్వర్యమును అధిగమించెడి సంపద, రాజ్యము, భార్యాసుతులు, ప్రాణములు మిథ్యయని విచారించి వైరాగ్యమొందెను. 36

శ్లో॥ తస్యాసన్నృపవైదర్భ్యః పత్న్యస్తిస్రస్సుసంమతాః ।
జఘ్నుస్త్యాగభయాత్పుత్రాన్నానురూపా ఇతీరితే ॥ 37

టీ:- తస్యేతి. నానురూపాః మత్సదృశా న భవంతీతి భర్త్రా ఈరితే సతి. వ్యభిచారశంకయా అస్మాన్ త్యక్ష్యతీతి భయాత్పుత్రాన్ జఘ్నుః. పునః పునః పుత్రాణాం దర్శనే వైసాదృశ్యానుసంధానేన. త్యజేత్. నాన్యథేత్యాశయేన హతవత్యః. 37

ఆ భరతునకు విదర్భరాజు పుత్రికలు ముగ్గురు భార్యలైరి. వారికి ముగ్గురు పుత్రులు కలిగిరి. (వారిని) భరతుడు వీరు నాకు అనురూపులు (తగినవారు) కారని పలుకగా ఆ భార్యలు మేము వ్యభిచరించినారమను అనుమానముతో తమను భరతుడు వదిలివేయు నేమో అను భయముతో, ఆ మువ్వురు పుత్రులను చంపిరి. 37

శ్లో॥ తస్యైవం వితథే వంశే తదర్థం యజతస్సుతమ్ ।
మరుత్ స్తోమేన మరుతో భరద్వాజముపాదదుః ॥ 38

టీ:- తస్యేతి. వితథే వ్యర్థే సతి. తదర్థం పుత్రార్థం. మరుత్ స్తోమేన యాగేన. యజతస్తస్య.ప్రసన్నాస్సంతో మరుతః భరద్వాజం నామ పుత్రముపాదదుః సమర్పయామాసుః. 38

శ్లో॥ అంతర్వత్న్యాం భ్రాతృపత్న్యాం మైథునాయ బృహస్పతిః ।
ప్రవృత్తో వారితో గర్భం శప్త్వా వీర్యమపాసృజత్ ॥ 39

టీ:- మరుతాం భరద్వాజాగమప్రకారం దర్శయన్నాహ-చతుర్భిః. అంతర్వత్న్యాం గర్భిణ్యాం. భ్రాతురుచథ్యస్య పత్న్యాం మమతాయాం. చౌర్యేణ మైథునాయ కదాచిత్ ప్రవృత్తో బృహస్పతిః. తథా ద్వితీయ గర్భస్యావకాశాభావాదాక్రోశపూర్వకం గర్భస్థేన వారితః. తతః క్రుద్ధోబృహస్పతిః. అంధో భవేతి తం గర్భం శప్త్వా బలాద్వీర్యం న్యషించత్. తతో బృహస్పతేశ్శాపాత్. గర్భస్థో దీర్ఘతమాః అంధో బభూవ.తేన చ. తద్వీర్యం పార్ష్ణిప్రహారేణ యోనేర్బహిః నిస్సారితం భూమౌ పతితం సద్య ఏవ కుమారోఽభవత్. 39

ఈ విధముగా భరతుని వంశము విచ్ఛిన్నము కాగా పుత్రార్థియై భరతుడు మరుస్తోమమను యజ్ఞమునొనరించగా మరుత్తులు సంతసించి భరద్వాజుని పుత్రునిగా నొసగిరి. 38

మరుత్తులకు భరద్వాజుడు లభించిన విధమును నాలుగు శ్లోకములతో తెలుపుచున్నాడు. ఒకప్పుడు బృహస్పతి తన అన్నయగు ఉతథ్యుని భార్య మమత గర్భవతిగా నున్న సమయమున దొంగతనముగ ఆమెను సంగమించుటకు దృక్తుడాయెను. అపుడు ఆ మమత ఉదరమున గర్భముండుటచే రెండవ గర్భమునకు అవకాశము లేకపోవుటచే ఆక్రోశిస్తూ నివారించెను. కోపించిన బృహస్పతి ఆ మొదటి గర్భస్థుణ్ణి అంధునవు కమ్మని శపించి బలవంతముగా సంగమించెను. మొదటి గర్భములో నున్న దీర్ఘతముడు బృహస్పతి శాపముతో అంధుడై ఆ బృహస్పతి వీర్యమును పాష్ణీ ణ్ప్రహారముతో (కాలి మడమతో) యోని వెలుపలకు నెట్టివేయగా అది భూమిపై పడి వెంటనే శిశు వాయెను. (తన అన్న భార్య గర్భవతిగా నుండగ బృహస్పతి ఆమెతో సంగమించ ఉద్యుక్యుడుకాగ ఆమె గర్భస్థునితో నివారించబడి వానిని శపించి రేతస్సును వదిలెను). 39

శ్లో॥ తం త్యక్తు కామాం మమతాం భర్తుస్త్యాగ విశంకితామ్ ।
నామనిర్వచనం తస్య శ్లోకమేతం సురా జగుః ॥ 40

టీ:- తమితి. తం పరవీర్యజం భర్తుస్త్యాగాద్విశంకితాం సతీం త్యక్తు కామాం మమతాం ప్రతి.సురాః.ఏతం బృహస్పతేర్మమతాయాశ్చ వివాద రూపం శ్లోకం జగుః.కిమర్థం జగురతఆహతస్య నామనిరుచ్యతే యేన తం.తన్నామనిర్వచనేనైవ భర్త ృత్యాగశంకామపాకర్తుమిత్యర్థః.40

పరవీర్యముతో జనించిన ఆ శిశువును భర్త తనను వదిలి వేయునను ఆ శంకతో త్యజించుటకు ఉద్యుక్తురాలైన మమతను గూర్చి మమతా బృహస్పతుల వివాద రూపమగు శ్లోకమును దేవతలు గానము చేసిరి. ఏలనన అతని నామ నిర్వచనముతో భర్త వదిలివేయునను శంకను తొలగించుటకై పఠించిరి. 40

శ్లో॥ మూఢే భరద్వాజమిమం భరద్వాజం బృహస్పతే ।
యాతౌ యదుక్త్వా పితరౌ భరద్వాజ స్తతస్త్వయమ్ ॥ 41

టీ:- మూఢ ఇతి. తత్ర పుత్రం త్యక్త్వా యాంతీం మమతాం బృహస్పతిరాహ - హే మూఢే ఇమం పుత్రం భర పుషాణ భర్తుర్బిభేమీతి చేత్తత్రాహ - ద్వాజం ఏకస్య క్షేత్రే అన్యస్య బీజాదిత్యేవం ద్వాభ్యాం జాతం అతస్త్స్యాప్యయం పుత్ర ఇతి న తస్మాత్ భయశంకేత్యర్థః. ఏవముక్తా సతీ తం ప్రత్యాహ - హే బృహస్పతే త్వమిమం భర యతః ద్వాజం. ద్వాభ్యామావాభ్యామన్యాచయతో జాతం అతో నాహమేకాకినీ భరామీత్యర్థః. యద్యస్మాదేవముక్త్వా పితరౌ మమతా బృహస్పతీ. వివదమావౌ పుత్రం పరిత్యజ్య యాతౌ తతో హేతోరయం

ఆ శిశువును వదిలి వెళ్ళబోవుచున్న మమతకు బృహస్పతి- ఓ మూఢులారా! ఈ పుత్రుని భరించుము అని పలికెను. భర్త వదిలి వేయునేమోయని భయపడకుము, ఒకని క్షేత్రములో వేరొకని బీజము వలన జనించిన వీడు ఆ క్షేత్రాధికారిగా గూడా పుత్రుడే అగును అని పలికెను. ఈ విధముగా పలుకబడిన మమత నీవే ఇతనిని భరించుము. ఏలనన మన ఇద్దరి అన్యాయాచరణలో పుట్టిన (ద్వాజం ద్వాభ్యాం జతం) ఇతనిని నేనొకర్తెను భరించజాలననెను. ఈ విధముగా మమత, బృహస్పతులు పలికి ఆ పుత్రుని వదిలి వెళ్ళిరి. అందువలన ఇతడు భరద్వాజుడనబడెను. 41

భరద్వాజ ఇతి. పాఠాంతరే యస్య పుత్రస్యత్యాగాద్దుఃఖాత్‌యాతావిత్యర్థః 41

శ్లో॥ చోద్యమానాసురై రేవం మత్వా వితథమాత్మజమ్ ।
వ్యసృజన్మరుతోబిభ్రన్ దత్తోఽయం వితథేఽన్వయే ॥ 42

టీ:- చోద్యమానేతి. వితథం వ్యభిచార సంభవత్వాత్ తమాత్మజం వితథం నిరర్థకం మత్వా. మమతా. వ్యసృజత్ తత్యాజ. మత్వా దితరమితి. పాఠాంతరే ఆదితరం ప్రథమజం. భర్తృ వీర్యాజ్జాతమేవ ముఖ్యమాత్మజం మత్వా బృహస్పతేర్జాతం తత్యాజేత్యర్థః. ఏవం తయా త్యక్తం మరుతః అభిభ్రన్ అబిభరుః. తదేవం మరుద్భిః ప్రాప్తోఽయం భరతస్యాన్వయే వితథే సతి. దత్తః. 42

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
వింశోఽధ్యాయః

ఈ విధముగా నామనిర్వచన పూర్వకముగా పలుకబడిన మమత ఆ శిశువును (అన్యాయముగా) వ్యభిచారము వలన పుట్టి నందున నిరర్థకునిగా తలచి వదిలి వెడలెను. అపుడు మరుత్తులు ఆ శిశువును కాపాడి భరతుని వంశము విచ్ఛినము కాగా (వితథము కాగా) ఆ భరతునకు దత్త పుత్రునిగా నొసగిరి. 42

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
ఇరువదవ అధ్యాయము సమాప్తము.

ఏకవింశోఽధ్యాయః

శ్రీశుక ఉవాచ

శ్లో॥ వితథస్య సుతాన్మన్యోర్బృహక్షత్రో జయస్తథా ।
మహావీర్యోనరోగర్గస్సంకృతిస్తునరాత్మజః ॥ 1

టీ:- శ్లో. "ఏకవింశే తు దౌష్యం తేస్సుతస్యాన్వయ ఉచ్యతే, రంతి దేవాజమీఢాదేర్యత్ర కీర్తిః ప్రతన్యతే. యద్వా - ఏకవింశే భరద్వాజ పుత్రమన్యు సుతాన్వయః, వర్ణ్యతే రంతిదేవాజమీఢాద్యా యత్ర వంశినః భరతస్యాన్వయే వితథే సతి తద్దత్తత్వాద్వితథసంజ్ఞో భరద్వాజః స చ బ్రాహ్మణోఽపి భరతస్య దత్తపుత్రో జాత ఇతి తద్వంశోఽనుక్రమ్యతే. వితథస్యేతి. వితథస్య సుతో మన్యుః తస్మాత్ బృహత్ క్షత్రజయమహావీర్య నరగర్గాః పంచపుత్రాః బభూవుః. (1-2)

21 వ అధ్యాయము

ఈ ఇరువది ఒకటవ అధ్యాయమున దుష్యంతుని పుత్రుడగు భరతుని వంశము, రంతిదేవ, అజామీఢుల యొక్క కీర్తి విస్తరించి తెలుపబడుచున్నది. భరతుని వంశము వితద్ధముకాగా వితనుడనబడు భరద్వాజుడు బ్రాహ్మణుడైనను భరతునకు దత్తపుత్రుడగుటచే అతని వంశము చెప్పబడుచున్నది.

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

వితధునకు (భరద్వాజునకు) మన్యువు పుత్రుడు. ఆ మన్యువునకు బృహక్షత్రుడు, జయుడు, మహావీర్యుడు, నరుడు, గర్గుడు అను ఐదుగురు పుత్రులు కలిగిరి. అందులో నరునకు సంకృతి పుత్రుడు. 1

శ్లో॥ గురుశ్చ రంతి దేవశ్చ సంకృతేః పాండునందన ।
రంతిదేవస్య హి యశ ఇహాముత్ర చ గీయతే ॥ 2

ఓ పరీక్షిద్రాజా! సంకృతికి గురువగు రంతిదేవునకు ఇద్దరు పుత్రులు. రంతిదేవుని యొక్క కీర్తి ఇహలోక, పరలోకములలో గానము చేయబడుచున్నది. 2

శ్లో॥ వియద్విత్తస్య దదతో లబ్ధం లబ్ధం బుభుక్షతః ।
నిష్కించనస్య ధీరస్య సకుటుంబస్య సీదతః ॥ 3

ఆకాశమునుండి వలె అప్రయత్నముగా దైవముచేతనే ప్రాప్తమైన ధనము కల్గినట్టి అనగా (అప్రయత్నముగా దైవదత్తమైన విత్తము కల్గినట్టి

టీ:- వియదితి. వియద్విత్తస్య. వియతో గగనాదివోద్యమం వినా దైవాదుపస్థితమేవ విత్తం. భోగ్యం యస్య. యద్వా. వియద్వ్యయం ప్రాప్నువతీ విత్తం యస్య. తదేవాహ - బుభుక్షతోఽపి సతో లబ్ధం దదతః. తత్ప్రపంచయతి - నిష్కించన స్యేత్యాదిసార్ధైః పంచదశభిః. 3

ధనము కొరకై ప్రయత్నించినట్టి) దొరికినది దొరికినట్లుగా దానము చేసెడి ఆకలితో నున్నట్టి, సంగ్రహ, పరిగ్రహాదులపై ఆసక్తి లేనట్టి, ధీరుడైనట్టి కుటుంబముతో సహా బాధనొందెడి (ఆ రంతిదేవునకు) 3

శ్లో॥ వ్యతీయురష్టచత్వారింశ దహాన్యపిబతః కిల ।
ఘృత పాయస సంయావం తోయం ప్రాతరుపస్థితమ్ ॥ 4

ఒకసారి ఆ రంతిదేవునకు ఆహారము లేకుండ కనీసము త్రాగుటకు నీరు లేకుండగా నలుబది ఎనిమిది దినములు గడిచినవి. నలుబది తొమ్మిదవ రోజు ఉదయమున నేయి, పాయసము, సవాయము (హల్వా) నీరు దొరికెను. 4

శ్లో॥ కృచ్ఛ్ర ప్రాప్త కుటుంబస్య క్షుత్తృడ్భ్యాం జాతవే పథోః ।
అతిథిః బ్రాహ్మణః కాలే భోక్తుకామస్య చాగమత్ ॥ 5

ఆ రంతిదేవుని కుటుంబము కష్టముతో, ఆకలి దప్పికలతోనూ వణుకుచూ ఉండి ఆ దొరికిన ఘృత పాయసాదులను తినగోరుచున్న సమయమున ఒక బ్రాహ్మణుడు అతిథిగా వచ్చెను. 5

శ్లో॥ తస్మై సంవ్యభజత్సోఽన్నమాదృత్య శ్రద్ధయాన్వితః ।
హరిం సర్వత్ర సంపశ్యన్ భుక్త్వా స ప్రయయౌ ద్విజః ॥ 6

ఆ రంతిదేవుడు అందరిలో విష్ణువును గాంచుచు ఆ బ్రాహ్మణుణ్ణి శ్రద్ధతో ఆదరించి తనకు దొరికిన ఆహారములో కొంత విభజించి బ్రాహ్మణునకొసగెను. ఆ బ్రాహ్మణుడు రంతిదేవుడొనరించిన ఆహారమును భుజించి వెడలెను. 6

టీ:- వ్యతీయురితి. అపిబతో జలపాన మప్యకుర్వతః ఘృతాది త్రయాణాం ద్వంద్వైక్యం తోయం చ. (4-6)

శ్లో॥ అథాన్యో భోక్తు కామస్య విభక్తస్య మహీపతేః ।
విభక్తం వ్యభజత్తస్మై వృషలాయ హరిం స్మరన్ ॥ 7

టీ:- అథేతి. అథాన్యో వృషలోఽతిథిరాగమత్ విభక్తస్య కుటుంబార్థ మన్నాదికం విభక్తవతః. 7

ఆ రంతిదేవుడు బ్రాహ్మణునకొసగా మిగిలిన ఆహారమును విభజించి తినుటకుద్యుక్తుడుకాగా ఒక శూద్రుడు ఆహారార్థియై వచ్చెను. అపుడు రంతిదేవుడు విష్ణువును స్మరిస్తూ విభజించబడిన ఆహారములో కొంత ఆ శూద్రునకొసగెను. 7

శ్లో॥ యాతే శూద్రే తమన్యోఽగాదతిథి శ్శ్వభిరావృతః ।
రాజన్మే దీయతామన్నం సగాణాయ బుభుక్షతే ॥ 8

ఆ శూద్రుడు భుజించి వెడలిన పిదప వేరొకడు కుక్కలను వెంటనిడుకొని, అతిథిగా వచ్చి ఓ రాజా ఆకలితో నున్న నాకు, నా పరివారమునకు ఆహారము ఇమ్మని అడిగెను. 8

శ్లో॥ స ఆతిథ్యావశిష్టం యద్బహుమాన పురస్సరమ్ ।
తస్య దత్వా నమశ్చక్రే శ్వభ్యశ్శ్వపతయే విభుః ॥ 9

టీ:- యాత ఇతి. సగణాయ స్వయూథసహితాయ. (8-9)

ఆ రంతిదేవుడు వచ్చిన ఆ అతిథిని ఆదరించి, బహుమాన పూర్వకముగా అతిథులకు ఇవ్వగా మిగిలి ఆహారమును, అతనికొసంగి ఆ శునకములకు, వాటికి అధిపతియగు నాతనికి నమస్కరించెను. 9

శ్లో॥ పానీయ మాత్రముచ్ఛేషం తచ్చైకపరితర్పణమ్ ।
పాస్యతః పుల్కసోఽభ్యాగాదపోదేహ్య శుభాయ మే ॥ 10

ఒకనికి మాత్రమే సరిపడు నీరు మాత్రము మిగిలి ఉండగా రంతిదేవుడు ఆ నీరును త్రాగగోరునంతలో ఒక చండాలుడు వచ్చి అశుభడనగు (నీచుడనగు) నాకు జలమునిమ్ము అను అడిగెను. 10

శ్లో॥ తస్యాతి కరుణాం వాచం నిశమ్య విపులశ్రవాః ।
కృపయా భృశసంతప్త ఇదమాహామృతం వచః ॥ 11

టీ:- పానీయమాత్రమితి. ఉచ్ఛేషం ఉర్వరితం ఏకమేవ తర్పయతీతి తథా. (10-11)

శ్లో॥ న కామయేஉహం గతిమీశ్వరాణా
మష్టర్ధియుక్తా మపునర్భవం చ ।
ఆర్తిం ప్రపద్యేஉఖిల దేహభాజా
మంతస్థ్సితో యేన భవంత్య దుఃఖాః ॥ 12

టీ:- పరదుఃఖా సహిష్ణుతయా సర్వేషాం దుఃఖం స్వయం భోక్తు మాశాస్తే. నేతి. అష్టర్ధియుక్తాం అణిమాద్యష్టైశ్వర్య సమృద్ధియుక్తాం గతిమపి మోక్షమపి చాహం. న కామయే. తర్హి కిం కామయసే? తదాహ - అఖిలదేహభాజామార్తిం దుఃఖం తత్తద్భోక్త ౄరూపేణాం తస్థ్సితస్సన్నహం ప్రపద్యే ప్రాప్నుయామిత్యేవం కామయే యేన తత్తద్దుఖ భోక్త్రా మయా హేతుభూతేన సర్వే అదుఃఖాః భవంతి. 12

గొప్ప కీర్తిమంతుడగు ఆ రంతిదేవుడు ఆ చండాలుని యొక్క మిక్కిలి దయనీయమగు మాటలనువిని గొప్పదయతో అమృతమయము లగు ఈ మాటలు పలికెను. 11

రంతిదేవుడు ఇతరుల దుఃఖములను సహించనివాడై సమస్త ప్రాణుల దుఃఖమును స్వయముగా అనుభవించుటను కోరుచున్నాడు. అణిమాద్యాష్ట సిద్ధులతో కూడిన దేవతల గతినికాని, మోక్షమునుకాని నేను కోరను. మరేమి కోరెదవనిన తెలుపుచున్నాడు. సమస్త ప్రాణుల దుఃఖమును అనుభవించు రూపముతో సమస్త ప్రాణులలో ఉండి వారి దుఃఖము ననుభవించు స్థితిని కోరుచున్నాను. దానితో ఆ దుఃఖితులు దుఃఖ రహితులగుగాక. 12

శ్లో॥ క్షుత్తృట్ఛ్రమోగాత్ర పరిభ్రమశ్చ దైన్యం క్లమశ్శోక విషాద మోహాః
సర్వేని వృత్తాః కృపణస్య జంతోర్జిజీవిషోర్జీవ జలార్పణాన్మే ॥13

టీ:- నను దుఃఖం కిమితి ప్రార్థయసే? పరదుఃఖనివృత్త్యైవ మమ సర్వదుఃఖనివృత్తిరిత్యాహ – క్షుత్తృడితి. కృపణస్య జంతోర్జీవన హేతోః జలస్యార్పణాన్మే సర్వే క్షుత్తృడాదయో నివృత్తాః. 13

మరి దుఃఖమునెందుకు కోరుచున్నావన పర దుఃఖ నివృత్తియే నా సర్వ దుఃఖ నివృత్తియని తెలుపుచున్నాను. జీవించుటకు కోరుచున్న ఈ పుల్కసునకు జీవమునొసగెడి జలమును సమర్పించుటచే నా యొక్క ఆకలి దప్పికలు, శ్రమ, శరీర పరిభ్రమణము, దీనత్వము, దుఃఖ విషాద మోహములన్నియు తొలగి సుఖమునొందుదును. 13

శ్లో॥ ఇతి ప్రభాష్య పానీయం మ్రియమాణః పిపాసయా ।
పుల్కసాయాదదాద్ధీరో నిసర్గకరుణో నృపః ॥ 14

టీ:- ఇతీతి. ఇత్యేవం ప్రభాష్య. 14

అని పలికి దయా స్వభావుడగు ఆ రంతిదేవుడు దప్పికతో మరణాసన్నుడై ఉండికూడా ఆ చండాలునకు జలమునొసగెను. 14

శ్లో॥ తస్య త్రిభువనాధీశాః ఫలదా ఫలమిచ్ఛతామ్ ।
ఆత్మానం దర్శయాం చ క్రుర్మాయా విష్ణు వినిర్మితాః ॥ 15

టీ:- తస్యేతి. తిభువనాధీశాః బ్రహ్మాదయః. మాయాః తదీయ ధైర్య పరీక్షార్థం ప్రథమం మాయయా వృషలాది రూపేణ ప్రతీతాస్సంత ఇత్యర్థః. 15

విష్ణుమాయతో వృషలాది (శ్రేష్ఠమైన) అథిథుల రూపములో వచ్చినట్టి, ఫలముల కోరెడి వారికి ఫలముల నొసగునట్టి త్రిలోకాధిపతులగు త్రిమూర్తులు ఆ రంతిదేవునకు తమను దర్శింపజేసిరి. (తమ రూపముతో ప్రత్యక్షమైరి.) 15

శ్లో॥ స వై తేభ్యో నమస్కృత్య నిస్సంగో విగతస్పృహః ।
వాసుదేవే భగవతి భక్త్యా చక్రే మనః పరమ్ ॥ 16

టీ:- స ఇతి. పరం కేవలం వాసుదేవే. భక్త్యా మనుశ్చక్రే న తు తాన్ కిమపి యాచితవాన్. 16

ఆ రంతిదేవుడు ఆ త్రిలోకాధిపతులకు నమస్కరించి వారిని ఏమియూ కోరకపోయెను. నిస్సంగుడై వాసనారహితుడై భగవంతుడగు వాసుదేవుని యందు గొప్ప భక్తితో మనస్సును నిలిపెను. 16

శ్లో॥ ఈశ్వరాలంబనం చిత్తం కుర్వతోఽనన్యరాధసః ।
మాయా గుణమయీన్ రాజన్ స్వప్నవత్ప్రత్యలీయత ॥ 17

ఓ పరీక్షిద్రాజా! ఈశ్వరునికంటే వేరే ఫలము నపేక్షించనట్టి తన మనస్సును ఈశ్వరుని యందే ఉంచిన ఆ రంతిదేవునకు త్రిగుణాత్మకమగు మాయ స్వప్నములో కనిపించిన దృశ్యము, మేల్కొనిన పిదప నష్టమైనటుల తనలోనే లీనమాయెను. 17

శ్లో॥ తత్ప్రసంగానుభావేన రంతిదేవానువర్తినః ।
అభవన్ యోగినస్సర్వే నారాయణపరాయణాః ॥ 18

రంతిదేవుననుసరించి ఉండిన వారందరు రంతిదేవుని సాంగత్యముతో నారాయణ పరాయణులగు యోగులైరి. 18

టీ:- ఈశ్వరేతి. అనన్యరాధసః ఈశ్వరాతిరిక్త ఫలాంతరానపేక్షస్య. ప్రత్యలీయత ఆత్మన్యేవ లీనా బభూవ. (17-18)

శ్లో॥ గర్గాచ్ఛినిస్తతో గార్గ్యః క్షత్రాద్బ్రాహ్మమవర్తత ।
ఉరుక్షయో మహావీర్యాదస్య త్రయ్యారుణిః కవిః ॥ 19

మన్యుసుతుడగు నరుని వంశమును తెలిపి మన్యువునకు మరొక పుత్రుడగు గర్గుని వంశమును తెలుపుచున్నాడు. గర్గునకు శని పుత్రుడు.

టీ:- మన్యుసుతస్య నరస్య వంశముక్త్వా తత్సుతస్యైవ గర్గస్య వంశమాహ-గర్గాదితి. మహావీర్యస్య వంశమాహ-మహావీర్యాదురుక్షయః. తస్య త్రయ్యారుణిః కవిః పుష్కరారుణిశ్చేతి త్రయః పుత్రాః. 19

శ్లో॥ పుష్కరారుణిరిత్యత్ర యే బ్రాహ్మణగతిం గతాః ।
బృహత్ క్షత్రాత్రాత్సుహోత్రోऽస్మాద్ధస్తీ యద్ధస్తినాపురం ॥ 20

టీ:- పుష్కరారుణిరితి. తే కథంభూతాః యే అత్ర క్షత్రవంశే బ్రాహ్మణగతిం బ్రాహ్మణతాం గతాః మన్యుపుత్రాణాం పంచానాం జ్యేష్ఠస్య వంశమాహ - బృహత్ క్షత్రాత్ సుహోత్రః. అస్మాత్‌హస్తీ. యత్ యేన హస్తినాపురం కృతమిత్యర్థః. 20

శ్లో॥ అజమీఢో ద్వీమీఢశ్చ పురుమీఢశ్చ హస్తినః ।
అజమీఢస్య వంశ్యాస్స్యుః ప్రియమేధాదయో ద్విజాః ॥ 21

టీ:- అజమీఢ ఇతి. అజమీడాదయస్త్రయో హస్తినః పుత్రాః. 21

శనికి గార్గ్యుడు పుత్రుడిగా జన్మించెను. గార్గ్యుడు క్షత్రియుడే అయినను అతనినుండి బ్రాహ్మణ వంశమునుద్భవించెను. మన్యుపుత్రుడగు మహావీర్యునకు ఉరుక్షత్రియుడు, ఉరుక్షత్రియునకు త్రయ్యారుణి, కవి, పుష్కరారుణి అను ముప్వురు పుత్రులు (తరువాతి శ్లోకముతో అన్వయము). 19

ఉరుక్షత్రియునకు త్రయ్యారుణి, కవి, పుష్కరారుణి అను ముగ్గురు పుత్రులు. (పై శ్లోకముతో అన్వయము) ఈ ముప్వురు బ్రాహ్మణ కృతినొందిరి. మన్యు పుత్రులలో పెద్దవాడగు బృహ క్షత్రియుని వంశమును తెలుపుచున్నాడు. బృహక్షత్రునకు సుహోత్రుడు, సుహోత్రునకు హస్తినాపురమును నిర్మించిన హస్తి జన్మించెను. 20

ఈ హస్తికి అజామీఢుడు, ద్వీమీఢుడు, పురుమీఢుడను ముగ్గురు పుత్రులు. అజామీఢుని వంశములో ప్రియమేధుడు మొదలగువారు బ్రాహ్మణులైరి. 21

శ్లో॥ అజమీఢాద్బృహదిషుస్తస్య పుత్రో బృహద్ధనుః ।
బృహత్కాయ స్తతస్తస్య పుత్ర ఆసీజ్జయద్రథః ॥ 22

అజామీఢునకు రెండవ పుత్రుడు బృహదిషుడు, అతనికి బృహద్ధనువు, బృహద్ధనునకు బృహత్కాయుడు, బృహత్కాయునకు జయద్రథుడు పుత్రులైరి. 22

శ్లో॥ తత్సుతో విశ్వజిత్తస్య సేనజిత్సమజాయత ।
రుచిరాశ్వో దృఢహనుః కాశ్యోవత్సశ్చ తత్సుతాః ॥ 23

జయద్రథుని పుత్రుడు విశ్వజిత్తు, విశ్వజిత్తునకు సేనజిత్తు జన్మించెను. సేనజిత్తునకు ఋచిరాశ్వుడు, దృఢహనువు, కాశ్యుడు, వత్స్యుడు అను నలుగురు పుత్రులు. 23

టీ:- అజమీఢాదేవాన్యః పుత్రో బృహదిషుర్నామాభవత్. (22-23)

శ్లో॥ రుచిరాశ్వసుతః ప్రాజ్ఞః పృథుసేన స్తదాత్మజః ।
పారస్య తనయోనీపస్తస్య పుత్రశతం త్వభూత్ ॥ 24

అందులో ఋచిరాశ్వునకు ప్రాజ్ఞుడు పుత్రుడు. అతనికి పృథుసేనుడు, నీపుడు అను ఇద్దరు సుతులు. వారిలో నీపునకు వందమంది పుత్రులు కలిగిరి. 24

టీ:- రుచిరాశ్వేతి. పారస్య తనయో నీపః నీపస్య పుత్రశతం. 24

శ్లో॥ సుకృత్వ్యాం శుకకన్యాయాం బ్రహ్మదత్తమజీజనత్ ।
యోగీశో గవి భార్యాయాం విష్వక్సేనమధాత్సుతమ్ ॥ 25

ఆ నీపుడు కృత్వ అను పేరుగల శుకుని పుత్రిక యందు బ్రహ్మదత్తుడను పుత్రుని కనెను. ఈ విషయము హరి వంశాదులలో తెలుపబడినది. శుకుడు జనించిన వెంటనే విరాగుడై వెడలి పోయెను. అయినను పుత్రుడగు తనను అనుసరించి వచ్చెడి తన తండ్రియగు వ్యాసుని గాంచి ఛాయ శుకుని నిర్మించి వెడలెను. ఆ ఛాయశుకుడు

టీ:- స ఇతి. స ఏవ కృత్వీసంజ్ఞాయాం శుకకన్యాయాం బ్రహ్మదత్తం జనయామాస తదుక్తం హరివంశాదిషు. శ్లో. "పరాశరకులోత్పన్నశ్శుకో

నామ మహాయశాః, వ్యాసాదరణ్యాం సంభూతో విధూమోఽగ్నిరివ జ్వలన్. స తస్యాం పితృకన్యాయాం విరిణ్యాం జనయిష్యతి, కృష్ణం గౌర ప్రభం శంభుం తథా భూరిశ్రుతం జయం. కన్యాం కీర్తిమతీం కృత్వీం యోగినీం యోగమాతరం. బ్రహ్మదత్తస్య జననీం మహిషీ మణుకస్య" చేతి. యద్యపి శుకః జాతమాత్ర ఏవ విముక్తసంగో నిర్గతః తథాపి విరహాతురం వ్యాసమనుధావంతం దృష్ట్వా. ఛాయా శుకం నిర్మాయ గతవాన్ తదభిప్రాయేణైవాయం గార్హస్థ్యాదివ్యవహార ఇత్యవిరోధః.న చ బ్రహ్మదత్తో యోగీ గవి వాచి సరస్వత్యాం. 25

గృహస్థోచిత కర్మల నాచరించెనని తాత్పర్యము. ఆ బ్రహ్మదత్తుడు గొప్ప యోగి అయ్యెను. ఆ బ్రహ్మదత్తుడు సరస్వతీ అను భార్యయందు విష్వక్సేనున్ని పుత్రునిగా పొందెను. 25

శ్లో॥ జైగిషవ్యోపదేశేన యోగతంత్రం చకార హ ।
ఉదక్సేన స్తతస్తస్మాద్భలాదో బార్హ దీషవాః ॥ 26

టీ:- జైగిషవ్యేతి స ఏవ యోగతంత్రం చకార, బార్హ దీషవాః బృహది షోర్వంశ్యా ఇమే ఇషేః దీర్ఘత్వమార్షం. 26

ఈ విష్వక్సేనుడు జైగిషవ్యుని ఉపదేశముతో యోగతంత్రమును రచించెను. ఈ విష్వక్సేనునకు ఉదక్సేనుడు, ఉదక్సేనునకు భల్లాదుడు జన్మించెను. వీరందరు బృహదిషు వంశస్థులు. 26

శ్లో॥ యమీనరో ద్విమీఢస్య కృతిమాం స్తత్సుతస్తతః ।
నామ్నా సత్యధృతి స్తస్మాద్ధృఢనేమిస్సుపార్శ్వకృత్ ॥ 27

టీ:- యమీనర ఇతి. సుపార్శ్వకృత్ సుపార్శ్వస్య పితాన్. 27

ద్విమీఢునకు యమీనరుడు, అతనికి కృతిమంతుడు, కృతిమంతునకు సత్యధృతి, అతనికి దృఢనేమి, అతనికి సుపార్శ్వుడు పుత్రులైరి. 27

శ్లో॥ సుపార్శ్వాత్సుమతి స్తస్య పుత్రస్సన్నతిమాం స్తతః ।
కృతీ హిరణ్యనాభాద్యో యోగం ప్రాప్య జగౌస్మ షట్ ॥ 28

సుపార్శ్వనకు సుమతి, అతనికి స్నుతిమంతుడు పుత్రుడు. స్నుతిమంతునకు కృతి పుత్రుడు, ఈ కృతి హిరణ్యానాభుని నుండి యోగవిద్య నొంది ఆరు సంహితలను విభజించి శిష్యులకు చెప్పెను. (ఉత్తర శ్లోకముతో అన్వయము) 28

శ్లో॥ సంహితాః ప్రాచ్య సామ్నా వై తస్యాప్యుగ్రాయుధ స్సుతః ।
తస్యక్షేమ్యస్సువీరోఽథ సువీరస్య పురంజయః ॥ 29

టీ:- సు పార్శ్వాదితి. ప్రాచ్యసామ్నాం. షట్, సంహితాః. జగౌ విభజ్యాధ్యాపితవాన్. (28-29)

ఈ కృతి "ప్రాచ్యసామ" అను ఋక్కుల యొక్క ఆరు సంహితలను విభజించి చెప్పెను. ఈ కృతికి ఉగ్రాయుధుడు, ఉగ్రాయుధునకు క్షెమ్యుడు, క్షెమ్యునకు సువీరుడు, సువీరునకు పురంజయుడు పుత్రులైరి. 29

శ్లో॥ తతో బహురథో నామ పురుమీఢో ప్రజోఽభవత్ ।
నళిన్యామజమీఢస్య నీలశ్శాంతిస్తు తత్సుతః ।
శాంతేస్సుశాంతిస్తత్పుత్రః పురుజోఽర్కస్తతోఽభవత్ ॥ 30

టీ:- తత ఇతి. అజమీఢస్య వంశ్యాః ప్రియమేధాదయః కేచిద్బ్రాహ్మణా బభూవుః. బృహదిషు ప్రభృతయః క్షత్రియాశ్చేతి. వంశద్వయముక్తం. తస్యైవ వంశాన్తరమాహ-నళిన్యామితి యావత్సమాప్తి. 30

ఆ పురంజనునకు బహురథుడు పుత్రుడాయెను. పురుమీఢుడు సంతానహీనుడాయెను. అజామీఢుని వంశములోని ప్రియమేధాదులు కొందరు బ్రాహ్మణులైరి. బృహదిషువు మొదలగువారు క్షత్రియులు. ఈ విధముగా బ్రాహ్మణ, క్షత్రియుల రెండు వంశములు తెలుపబడినవి. అజామీఢుని వేరొక వంశము గురించి ఈ అధ్యాయ సమాప్తి వరకు చెప్పబడుచున్నది. అజామీఢునకు నలిని అను భార్యయందు నీలుడు జన్మించెను. అతనికి శాంతి, శాంతికి సుశాంతి, అతనికి పురుజుడు, పురుజునకు అర్కుడు జన్మించిరి. 30

శ్లో॥ భర్మ్యాశ్వస్తత్సుతస్తస్య పంచాసన్ముద్గలాదయః ।
యవీనరో బృహదిషుః కాంపిల్యస్సృంజయస్సుతాః ॥ 31

టీ:- భర్మ్యాశ్వ ఇతి. ముద్గల ఏకః. యవీనరాదయశ్చత్వారః ఇత్యేవం పంచ. (31-33)

అర్కునకు భర్మ్యాశ్వుడు, అతనికి ముద్గలుడు, యవీనరుడు, బృహదిషువు, కాంపిల్యుడు, సృంజయుడు అను ఐదుగురు పుత్రులు కలిగిరి. 31

శ్లో॥ భర్మ్యాశ్వః ప్రాహ పుత్రా మే పంచానాం రక్షణాయ హి ।
విషయాణామలమిమ ఇతి పాంచాలసంజ్ఞికాః ॥ 32

భర్మ్యాశ్వుడు తన ఈ ఐదుగురు పుత్రులు దేశమును రక్షించుటకు చాలిన వారని తలచెను. అందువలన వారు పాంచాలురనబడిరి. 32

శ్లో॥ ముద్గలాద్బ్రహ్మనిర్వృత్తం గోత్రం మౌద్గల్యసంజ్ఞితం ॥ 33

ముద్గలునినుండి మౌద్గల్యమను పేరుగల బ్రాహ్మణగోత్రము ఉద్భవించెను. 33

శ్లో॥ మిథునం ముద్గలాద్భార్మ్యాద్దివో దాసః పుమానభూత్ ।
అహల్యా కన్యకా యస్యాంశతానందస్తు గౌతమాత్ ॥ 34

భర్మ్యాశ్వుని పుత్రుడగు ముద్గలునకు కవలలు జన్మించిరి. ఆ కవలలలో పురుషుడు, దివోదాసు కన్యక అహల్య. ఆ అహల్యయందు గౌతముడు శతానందుని కనెను. 34

శ్లో॥ తస్య సత్యధృతిః పుత్రో ధనుర్వేద విశారదః ।
శరద్వాం స్తత్సుతో యస్మాదూర్వశీదర్శనాత్కిల ॥ 35

ఈ శతానందునకు సత్యధృతి అను పుత్రుడు కలిగెను. అతడు ధనుర్విద్యలో గొప్ప పండితుడు. అతనికి శరద్వంతుడు జన్మించెను. ఈ శరద్వంతునకు ఊర్వశీ దర్శనముతో (తరువాతి శ్లోకముతో అన్వయము). 35

శ్లో॥ శరస్తంభేఽపతద్రేతో మిథునం తదభూచ్ఛుభం ।
తద్దృష్ట్వా కృపయాఽగృహ్ణాచ్ఛంతనుర్మృగయాం చర ॥ 36

టీ:- మిథునమితి. భార్యాత్ భార్యాశ్చ పుత్రాత్ మిథునం నాభూత్ తదేవాహ - దివో దాసః పుమాన్ అహల్యా చ కన్యకేతి. (34-37)

శ్లో॥ కృపః కుమారః కన్యా చ ద్రోణపత్న్యభవత్కృపీ ॥ 37

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
ఏకవింశోఽధ్యాయః

ఆ శరద్వంతుని యొక్క వీర్యము శరస్తంబముపై (ముంజ వృక్షముపై) పడెను. దానినుండి శుభలక్షణములు గల పుత్రి, పుత్రులు కవలలుగా జన్మించిరి. ఆ సమయమున వేటకై అరణ్యములో తిరుగుచున్న శంతనరాజు ఆ కవలలను చూచి దయతో వారిని స్వీకరించెను. 36

ఆ పుత్రుడు కృపుడు, కన్యక కృపి. ఈ కృపి ద్రోణాచార్యునకు భార్య అయ్యెను. 37

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
ఇరువది ఒకటవ అధ్యాయము సమాప్తము.

ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య.

ద్వావింశో௨ధ్యాయః

శ్రీశుక ఉవాచ

శ్లో॥ మిత్రాయుశ్చ దివో దాసాచ్చ్యవనస్తత్సుతో నృప ।
సుదానస్సహదేవో௨థ సోమకో జంతు జన్మకృత్ ॥ 1

టీ:- శ్లో. ద్వావింశే తు దివోదాస వంశముక్త్వాథ వర్ణితాః, ఋక్షవంశే జరాసంధ పార్థ దుర్యోధనాదయః. యద్వా. దివోదాసాత్తు పాంచాల వంశో ద్వావింశ ఉచ్యతే. వంశాంతరాదాజమీఢచైద్య మాగధ కౌరవాః 1

శ్లో॥ తస్య పుత్రశతం తేషాం యవీయాన్ పృషదస్తతః ।
ద్రుపదో ద్రౌపదీ తస్య ధృష్టద్యుమ్నాదయస్సుతాః ।
ధృష్టద్యుమ్నాద్ధృష్టకేతుర్భార్మ్యాః పాంచాలకా ఇమే ॥ 2

టీ:- తస్యేతి. తస్య సోమకస్య పుత్రాణాం శతం బభూవ తేషాం జంతుః జ్యేష్ఠః. యవీయాన్ పృషదః. 2

శ్లో॥ యో௨జమీఢసుతో హ్యన్యత్వృక్షస్సంవరణస్తతః ॥ 3

22 వ అధ్యాయము

ఈ ఇరువది రెండవ అధ్యాయమున దివోదాసుని వంశము వర్ణించబడి, ఋక్షవంశడగు జరాసంధుడు, పార్థుడు, దుర్యోధనాదులను గురించి చెప్పబడుచున్నది.

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

ఓ పరీక్షిద్రాజా! దివోదాసునకు మిత్రాయువు పుత్రుడు, మిత్రాయువునకు చ్యవనుడు, సుదాసుడు, సహదేవుడు, సోమకుడు అను నలుగురు పుత్రులు కలిగిరి. 1

ఆ సోమకునకు వందమంది పుత్రులు కలిగిరి. వారిలో జంతువనువాడు పెద్దవాడు. పృషదుడు చిన్నవాడు. ఆ పృషదునకు ద్రుపదుడు, ద్రుపదునకు ద్రౌపదీ అను కన్య, ధృష్టద్యుమ్నాదులు పుత్రులుగా జన్మించిరి. ధృష్టద్యుమ్నునకు దృష్టకేతువు అను పుత్రుడు కలిగెను. భర్మ్యాశ్వుని వంశములో జన్మించిన వీరు పాంచాలురనబడిరి. 2

అజామీఢుని యొక్క వేరొక వంశము చెప్పబడుచున్నది. అజామీఢునకు ఋక్షుడు, ఋక్షునకు సంవరణుడు పుత్రుడాయెను. 3

శ్లో॥ పరీక్షిత్సుధనుర్జహ్నుర్నిషధశ్చ కురోస్సుతాః ।
సుహోత్రోఽభూత్సుధనుషశ్చ్యవనస్తత్సుతః కృతీ ॥ 4

టీ:- అజమీఢస్య వంశాంతరమాహ - య ఇతి. తతః సంవరణాత్కురుః. (3-4)

శ్లో॥ వసుస్తస్యోపరిచరో బృహద్రథముఖాస్తతః ।
కుసుంభమత్స్య ప్రత్యగ్ర చేదిపాద్యాశ్చ చేదిపాః ॥ 5

టీ:- వసురితి. తస్య కృతినః ఉపరిచరో వసుః తతః వసోః బృహద్రథో ముఖం ఆదిరేష్యాం. తానేహహ - కుసుంభేతి. 5

శ్లో॥ బృహద్రథాత్కుశాగ్రోఽభూదృషభ స్తస్య చాత్మజః ।
జజ్ఞే సత్యహితోఽపత్యం పుష్పవాం స్తత్సుతోజహుః ॥ 6

టీ:- బృహద్రథాదితి. తత్సుతః పుష్పవాన్. జజ్ఞేతస్యాపత్యం సత్యహిత ఇతి యోజ్యం. 6

సంవరుణకు సూర్యపుత్రికయగు తపతి యందు కురుక్షేత్రపతి కురువు జన్మించెను. ఆ కురువునకు పరీక్షిత్తు, సుధనువు, జహ్నువు, నిషదుడను నలుగురు పుత్రులు. సుధనవునకు సుహోత్రుడు, సుహోత్రునకు చ్యవనుడు, చ్యవనునకు కృతి, కృతికి ఉపరిచరవసువు, ఉపరిచరవసునకు బృహద్రథుడు మొదలగు పుత్రులు కలిగిరి. ఉపరిచరవసువు పుత్రులగు సుంభుడు, మత్స్యుడు, ప్రత్యగ్రుడు, చేదిపుడు మొదలగువారు చేది దేశపాలకులైరి.(4,5)

బృహద్రథునకు కుశాగ్రుడు కుశాగ్రునకు ఋషభుడు, ఋషబునకు పుష్పవంతుడు, పుష్పవంతునకు సత్యహితుడు, సత్యహితునకు జహువు పుత్రులుగా జన్మించిరి. 6

శ్లో॥ అన్యస్యామపి భార్యాయాం శకలే ద్వే బృహద్రథాత్ ।
తే మాత్రా బహిరుత్సృష్టే జరయా చాభిసంధితే ॥ 7

టీ:- అన్యస్యామితి. జరయా రాక్షస్యా. 7

బృహద్రథునకు వేరొక భార్య యందు ఒక శరీరము రెండు ముక్కలుగా విడిపోయి జన్మించెను. రెండు ముక్కలు తల్లిచేత బయట వదిలి వేయబడగా జరా అను రాక్షసునిచే ఆ రెండు ముక్కలు కలుపబడెను. 7

శ్లో॥ క్రీడంత్యా జీవ జీవేతి జరాసంధస్తతోఽభవత్ ।
తతశ్చ సహదేవోఽభూత్సోమాపిర్యచ్ఛ్రుతశ్రవాః ॥ 8

టీ:- క్రీడంత్యేతి. యత్ యస్మాత్ సోమాపేః శ్రుత శ్రవాః. 8

ఆ జర ఆ ముక్కలను కలిపి బ్రతుకు బ్రతుకు అనుచు ఆడుచుండ జరాసంధుడు అనువాడయ్యెను. ఆ జరాసంధునకు సహదేవుడు, సహదేవునకు సోమాపి, సోమాపికి శ్రతశ్రవుడు జన్మించిరి. 8

శ్లో॥ పరీక్షిదనపత్యోఽభూత్సురథో నామ జాహ్నవః ।
తతో విదూరథస్తస్మాత్సార్వభౌమస్తతోఽభవత్ ॥ 9

టీ:- పరీక్షిదితి. కురోః పుత్రః పరీక్షిత్. అనపత్యః జాహ్నవః జహ్నోః పుత్రః. 9

కురు పుత్రుడగు పరీక్షిత్తు సంతానహీనుడాయెను. కురువుకు మరో పుత్రుడగు జహ్నువుకు సురథుడు, సురథునకు విదూరథుడు, విదూరథునకు సార్వభౌముడు పుత్రులైరి. 9

శ్లో॥ జయత్సేనస్తత్తనయో రథికోఽతోఽయుతాయుషః ।
తతశ్చక్రోధన స్తస్మాద్దేవాతిథిరముష్య చ ॥ 10

టీ:- జయత్సేన ఇతి. అతోరథికాదయుతాయురిత్యర్థః. 10

సార్వభౌమునకు జయత్సేనుడు, జయత్సేనునకు రథికుడు, రథికునకు ఆయుతాయువు, అతనికి క్రోధనుడు, క్రోధనునకు దేవాతిథి పుత్రులైరి. 10

శ్లో॥ ఋక్షోఽస్మాద్భీమసేనోఽభూత్ప్రతీపస్తస్య చాత్మజః ।
దేవాపి శ్శంతనుశ్చైవ బాహ్లికస్తత్సుతాస్త్రయః ॥ 11

టీ:- ఋక్ష ఇతి. తస్య ప్రతిపస్య దేవాపి శంతనుబాహ్లీకాః. 11

దేవాతిథికి ఋక్షుడు, ఋక్షునకు భీమసేనుడు, అతనికి ప్రతీపుడు పుత్రుడాయెను. ఈ ప్రతీపునకు దేవాపి, శంతనుడు, బాహ్లికుడు అను ముగ్గురు పుత్రులు. 11

శ్లో॥ పిత్ర్యం రాజ్యం సముత్సృజ్య దేవాపిస్తు వనం గతః ।
అభవచ్ఛంతనూ రాజా ప్రాఙ్మహాభీష సంజ్ఞకః ॥ 12

శ్లో॥ యం యం కరాభ్యాం స్పృశతి జీర్ణం యౌవనమేతి సః ।
శాంతిమాప్నోతి చైవాగ్ర్యాం కర్మణా తేన శంతనుః ॥ 13

టీ:- పిత్ర్యమితి. ప్రాక్ పూర్వజన్మని. మహాభీష ఇతి సంజ్ఞా యస్య సః. (12-13)

దేవాపి తండ్రి రాజ్యమును వదిలి అరణ్యములకు వెడలెను. శంతనుడు రాజాయెను. ఈశంతనుడు పూర్వజన్మలో మహాభీషణుడు అనుపేరుగల వాడైయుండెను. 12

ఈ శంతనుడు ఏ యే ముసలి వ్యక్తిని తన చేతులతో స్పృశించునో ఆ యా వ్యక్తి పోయిన యవ్వనమును పొందుచూ శాంతిని పొందుచుండెను. ఆ కర్మచేత ఇతడు శంతనుడనబడెను. 13

శ్లో॥ సమా ద్వాదశ తద్రాష్ట్రే న వవర్ష యదా విభుః ।
శంతనుర్బ్రాహ్మణైరుక్తః పరివేత్తా త్వమగ్రభుక్ ।
రాజ్యం దేహ్యగ్రజా యాశు పురరాష్ట్రవివృద్ధయే ॥ 14

ఆ శంతనుని రాజ్యమున ఒకసారి పన్నెండు సంవత్సరములు ఇంద్రుడు వర్షమును కురిపించక పోయెను. అప్పుడు శంతనుడు బ్రాహ్మణులను ఈ అనావృష్టికి కారణమడుగగా వారీవిధముగా తెలిపిరి. శ్లో."దారాగ్ని హోత్రసంయోగం కురుతే యోఽగ్రజే స్థితే, పరివేత్తా స విజ్ఞేయః పరివిత్తిస్తు పూర్వజః" ఏ వ్యక్తి తన కంటే పెద్దవాడుండగా

టీ:- సమా ఇతి. యదా దేవో న వవర్ష, తదా శంతనుస్తత్ర కారణం బ్రాహ్మణాన్ పప్రచ్ఛ బ్రాహ్మణైస్త్వేవముక్తః. శ్లో. "దారాగ్ని హోత్ర సంయోగం కురుతే యోఽగ్ర జేస్థితే, పరివేత్తా స విజ్ఞేయః పరివిత్తిస్తు పూర్వజ" ఇతి స్మృతేః యోఽగ్రభుక్. భువమగ్రతో భునక్తి సత్వం పరివేత్తైవ భవసి అతస్తద్దోష పరిహారాయ రాజ్య మగ్రజాయ దేహి. తతో వృష్టిర్భవిష్యతీతి. 14

మొదట వివాహమును, అగ్నిహోత్ర సంయోగమును ఒనరించునో ఆవ్యక్తి పరివేత్తయనబడును. పెద్దవాడు పరివేత్తి అనబడును. అను శ్రుతిచే అన్నయుండగా రాజ్యమును మొదట భజించిన నీవు పరివేత్తవగుదువు. ఆ దోషముచే అనావృష్టి కలిగినది. ఆ దోషపరిహారమునకై నీ అన్నయగు దేవాపికి, పురరాష్ట్వ్యాద్యభివృద్ధికై రాజ్యమును ఒసగుము. అపుడు వర్షములు కలుగగలవని చెప్పిరి. 14

శ్లో॥ ఏవముక్తో ద్విజైర్జ్యేష్ఠం ఛందయామాస సోఽబ్రవీత్ ॥ 15

టీ:- ఏవమితి. ఏవముక్తశ్శంతనుః. వనం గత్వా జేష్ఠం ఛందయా మాస రాజ్ఞాః ప్రజాపరిపాలనాదిః పరమో ధర్మః. అతస్త్వం రాజ్యం స్వీకుర్విత ప్రార్థితవాన్. 15

ఈ విధముగా బ్రాహ్మణులచే తెలుపబడిన శంతనుడు అరణ్యమునకు వెడలి అన్నయగు దేవాపిని, రాజుకు ప్రజలను పాలించడము మొదలుగునవి పరమధర్మములు కావున రాజ్యమును స్వీకరించి పరిపాలించమని ప్రార్థించెను. 15

శ్లో॥ తన్మంత్రిప్రహితైర్విప్రైర్వేదాద్విభ్రంశితో గిరా ।
వేదవాదాతివాదాన్ యైస్తతో దేవో వవర్ష హ ॥ 16

టీ:- తదితి. తతః పూర్వమేవ తస్య మంత్రిణా అశ్వరావసంజ్ఞేన దేవాపిం పాషండీ కృత్య రాజ్యానర్హం కర్తుం యే ప్రహితా విప్రాస్తైః పాషాండమతాశ్రయయా గిరా వేదాత్ విభ్రం శితస్సన్ వేదవాదస్య

శంతనుడు అన్నయగు దేవాపి వద్దకు వెళ్ళక ముందే ఆ శంతనుని మంత్రియగు అశ్వరావుడను వానిచేత, దేవాపిని పాషండునిగా చేసి రాజ్యానర్హుడుగా ఒనర్చుటకు పంపబడిన బ్రాహ్మణులు దేవాపికి పాషండమతమును ప్రతిపాదించెడి వాక్కులను వచించిరి. ఆ వాక్కులతో వేదమతము నుండి తొలగిన బుద్ధి కలవాడై వేదమతమునకు అపవాదములగు నిందా వాక్కులను పలికెను. దానితో దేవాపి పతితుడై రాజ్యార్హతను కోల్పోయెను. అపుడు శంతనునకు

అతివాదాన్ నిందావచనాని సోఽబ్రవీత్. తతస్తస్య పాతిత్యేన రాజ్యానర్హత్వే జాతే శంతనోర్దోషాభావాత్ దేవో వవర్షేత్యర్థః.(16-17)

శ్లో॥ దేవాపిర్యోగమాస్థాయ కలాపగ్రామమాస్థితః ।
సోమవంశే కలౌనష్టే కృతాదౌ స్థాపయిష్యతి ॥ 17

శ్లో॥ బాహ్లికాత్సోమదత్తోఽభూద్భూరిర్భూరిశ్రవాస్తతః ।
శలశ్చ శంతనో రాసీద్గంగాయాం భీష్మ ఆత్మవాన్ ॥ 18

టీ:- బాహ్లీకాదితి. తతః సోమదత్తా ద్భూరిః భూరిశ్రవాః శలశ్చేతి త్రయః. 18

శ్లో॥ స చ ధర్మవిదాం శ్రేష్ఠో మహాభాగవతః కవి ।
వీర యూథాగ్రణీర్యేన రామోఽపి యుధి తోషితః ॥ 19

టీ:- స ఇతి. రామోఽపి జామదగ్న్యః. 19

పరివేత్త దోషము లేకుండాపోయెను. దానితో ఇంద్రుడు వర్షము కురిపించెను అని తాత్పర్యము. 16

దేవాపి యోగ విద్యను సాధించి కలాప అను గ్రామములోనున్నాడు. కలియుగమున చంద్రవంశము నశించగా తిరిగి కృత యుగాదిలో సోమవంశమును స్థాపించును. 17

బాహ్లికునకు సోమదత్తుడు పుత్రుడు. ఆ సోమదత్తునకు భూరి, భూరిశ్రవుడు, శలుడు అను మువ్వురు పుత్రులు కల్గిరి. శంతనునకు గంగయందు భీష్ముడు జన్మించెను. ఆ భీష్ముడు గొప్ప మహాత్ముడు. 18

ఆ భీష్ముడు ధర్మవేత్తలలో అగ్రగణ్యుడు గొప్పభాగవతుడు. మిక్కిలి జ్ఞాన సంపన్నుడు, పరాక్రమవంతులలో శ్రేష్ఠుడు. అట్టి భీష్ముడు యుద్ధమున తన గురువగు పరశురామునిగూడా సంతసింపచేసెను. 19

శ్లో॥ శంతనోర్దాశకన్యాయాం జజ్ఞే చిత్రాంగదస్సుతః ।
విచిత్రవీర్యోఽవరజో నామ్నా చిత్రాంగదో హతః ॥ 20

టీ:- శంతనోరితి. దాశకన్యాయామితి ఉపరిచరస్య వసోర్వీర్యేణ మత్స్యగర్భాదుత్పన్నా కన్యా దాశైః కైవర్తైః పాలితా. అతో దాశకన్యేతి ప్రసిద్ధాయాం సత్యవత్యాం. నామ్నా తత్సమాననామ్నా చిత్రాంగదేన గంధర్వేణ. యుద్ధే చిత్రాంగదః హతః. 20

శంతనునకు దాస కన్య యగు సత్యవతి యందు (ఈ సత్యవతి ఉపరిచరవసువు వీర్యముతో మత్స్య కన్య గర్భమున జనించి కైవర్తకులచే పెంచబడుటచే దాసకన్యకగా ప్రసిద్ధిచెందినది.) చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడును ఇద్దరు పుత్రులు కలిగిరి. వారిలో చిత్రాంగదుడు, తన పేరుతోను ఉన్న చిత్రాంగదుడను గంధర్వులతో చంపబడెను. 20

శ్లో॥ యస్యాం పరాశరాత్సాక్షాదవతీర్ణో హరేఃకళా ।
వేదగుప్తో మునిః కృష్ణో యతోఽహమిదమధ్యగామ్ ॥ 21

ఈ సత్యవతిని శంతనుడు పరిగ్రహించక ముందు, సత్యవతి యందు పరాశరుని వలన విష్ణుకళావతారమగు వేదరక్షకుడగు కృష్ణద్వైపాయనుడనబడు వ్యాసుడు జన్మించెను. అతని నుండి నేను ఈ భాగవతమును పొందితిని. (అధ్యయనము గావించితిని) 21

శ్లో॥ హిత్వా స్వశిష్యాన్ పైలాదీన్ భగవాన్ బాదరాయణః ।
మహ్యంపుత్రాయ శాంతాయ పరంగుహ్యమిదం జగౌ ॥ 22

టీ:- యస్యామితి. యస్యాం సత్యవత్యాం శంతనుపరిగ్రహాత్. పూర్వమేవ వేదాగుప్తా యేన యతోఽహం జాతః. ఇదం శ్రీభాగవతం చ అధ్యగాం అధిగతావానస్మి. 21-22

భగవంతుడగు బాదరాయణమహర్షి తన శిష్యులగు పైలాదును వదలి, పుత్రుడను, శాంతుడను అగు నాకు మిక్కిలి రహస్యమగు ఈ భాగవత సంహితను బోధించెను. 22

శ్లో॥ విచిత్రవీర్యోஉథోవాహ కాశీరాజసుతే బలాత్ ।
స్వయంవరాదుపానీతే అంబికాం బాలికే చ సః ॥ 23

టీ:- విచిత్ర వీర్య ఇతి.స్వయంవరాద్భీష్మేణ బాలాదుపానీతే. 23-24

శ్లో॥ తయోరాసక్తహృదయో గృహీతో యక్ష్మణామృతః ।
క్షేత్రేహ్యప్రజసో భ్రాతుర్మాత్రోక్తో బాదరాయణః ॥ 24

శ్లో॥ ధృతరాష్ట్రం చ పాండుం చ విదురం చాప్యజీనత్ ॥ 25

టీ:- క్షేత్ర ఇతి. మాత్రా సత్యవత్యా ఉక్త ఇతి. నిషేధాభావమాహ - అపతిరపత్యలిప్సుర్దేవరాద్గురు ప్రయుక్తాదృతుమతీ యాయాదిత్యాది వచనాత్. 25

శ్లో॥ గాంధార్యాం ధృతరాష్ట్రస్య జజ్ఞే పుత్రశతం నృప ।
తత్ర దుర్యోధనో జ్యేష్ఠో దుశ్శలా చాపి కన్యకా ॥ 26

టీ:- గాంధార్యామితి. దుశ్శలా నామ కన్యకా చ జజ్ఞే. 26

స్వయం వరమునుండి బలవంతముగా భీష్ముని చేత తీసుకొని రాబడిన కాశీరాజ పుత్రికలగు అంబికా, అంబాలికలను విచిత్రవీర్యుడు వివాహము చేసుకొనెను. 23

ఆ విచిత్రవీర్యుడు వారి యందు మిక్కిలి ఆసక్తి కలిగినవాడై రాజ యక్ష్మ అను రోగగ్రస్తుడై మృతినొందెను. 24

సంతానహీనుడగు ఆ విచిత్రవీర్యుని క్షేత్రములో, తల్లి సత్యవతి ఆజ్ఞతో బాదరాయణుడు (వ్యాసుడు) అంబిక యందు ధృతరాష్ట్రుని, అంబాలిక యందు పాండురాజును, దాసి యందు విదురుని పుట్టించెను. (ఈవిషయమున నిషేదములేకుండుట తెలుపబడుచున్నది) "అపతిరపత్యలిప్సుర్దేవరాద్గురు ప్రయుక్తాదృతుమతీ యాయాత్" అను మొదలగు వచనములు తెలుపుచున్నవి. (దేవర న్యాయముతో పిల్లలను కనుట కలియుగములో నిషేధము.)25

ఓ పరీక్షిద్రాజా! ధృతరాష్ట్రునకు గాంధారి యందు వందమంది పుత్రులు కలిగిరి. వారిలో దుర్యోధనుడు పెద్దవాడు. దుశ్శలా యను కన్యకయు జన్మించెను. 26

శ్లో॥ శాపాన్మైథునరుద్ధస్య పాండోః కుంత్యాం మహారథాః ।
జాతాధర్మానిలేంద్రేభ్యో యుధిష్ఠిరముఖాస్త్రయః ॥ 27

టీ:- శాపాదితి. అరణ్యే మృగశాపాత్ మైథునే రుద్ధస్య ప్రతిబద్ధస్య. 27

అరణ్యములో మృగ శాపముతో, పాండురాజు సంభోగము నిషేదించబడిన వాడుకాగా ఆతని భార్యయగు కుంతికి ధర్మ, వాయు, ఇంద్రుల ద్వారా ధర్మరాజు, భీముడు, అర్జునుడు(యుధిష్ఠిరుడు మొదలగు ముప్వురు పుత్రులు). అను ముప్వురు పుత్రులు కలిగిరి. ఈ ముప్వురును మహారథులు. 27

శ్లో॥ నకులస్సహదేవశ్చ మాద్ర్యాం నాసత్యదస్రయోః ।
ద్రౌపద్యాం పంచ పంచభ్యః పుత్రాస్తే పితరోఽభవన్ ॥ 28

టీ:- నకుల ఇతి. నా సత్యదస్రాభ్యామశ్విభ్యాం. పంచభ్యో యుధిష్ఠిరాదిభ్యః పంచ అభవన్. 28

పాండురాజుకు మరొక భార్యయగు మాద్రికి అశ్వినీ కుమారుల వలన నకుల, సహదేవులు జన్మించిరి. ఈ ఐదుగురికి ద్రౌపదియందు ఐదుగురు పుత్రులు నీ చిన్నాన్నలు జన్మించిరి. 28

శ్లో॥ యుధిష్ఠిరాత్ప్రతీవింధ్యశ్శ్రుతసేనో వృకోదరాత్ ।
అర్జునా చ్ఛ్రుతకీర్తిస్తు శతానీకస్తు నా కులిః ।
సహదేవ సుతో రాజన్ శ్రుతకర్మా తథాపరే ॥ 29

టీ:- యుధిష్ఠిరాదితి. తథా పరేచ భార్యాంతరేషు. 29

ఓ పరీక్షిద్రాజా! ద్రౌపదికి యుధిష్ఠరునివలన ప్రతివింధ్యుడు, భీముని వలన శ్రుతసేనుడు, అర్జునుని వలన శ్రుతకీర్తి, నకులుని వలన శతానీకుడు, సహదేవుని వలన శ్రుతకర్మ అను ఐదుగురు పుత్రులు జన్మించిరి. 29

శ్లో॥ యుధిష్ఠిరాత్పౌరవత్యాం దేవకోఽథ ఘటోత్కచః ।
భీమసేనాద్ధిడింబాయాం కాళ్యాం సర్వగత స్తతః ॥ 30

ఈ పాండవులకు వేరే భార్యలయందును పుత్రులు జన్మించిరి. పౌరవతి అను భార్యయందు యుధిష్ఠిరునకు దేవకుడు, భీమసేనునకు హిడింబి యందు ఘటోత్కచుడు, కాళీయను ఆవిడయందు సర్వగతుడు అను పుత్రులు జన్మించిరి. 30

శ్లో॥ సహదేవాత్సుహోత్రం తు విజయాఽసూత పార్వతీ ।
కరేణుమత్యాం నకులో నిరమిత్రం తథార్జునః ॥ 31

సహదేవుని వలన పర్వతపుత్రికయగు విజయ సుహోత్రుడను పుత్రునికనెను. నకులుడు కరేణుమతియందు నిరమిత్రునికనెను. 31

టీ:- యుధిష్ఠిరాదితి. కాళీనామచాన్యా భీమస్య భార్యా తస్యాం తతో భీమాత్సర్వగతో నామ పుత్రోఽభవదిత్యర్థః. (30-31)

శ్లో॥ ఇరావంతములూప్యాం వై సుతాయాం బభ్రువాహనమ్ ।
మణలూరుపతేస్సోఽపి తత్పుత్రః పుత్రికా సుతః ॥ 32

అర్జునుడు ఉలూపి అను నాగకన్యయందు ఇరావంతుని కనెను. మణుతారపతి యగు చిత్రాంగదయందు బభ్రువాహనున్ని కనెను. ఈ బభ్రువాహనుడు అర్జునుని పుత్రుడైనను చిత్రాంగదను పుత్రికా ధర్మముచే ఇచ్చుటచే చిత్రాంగద పుత్రుడగు బభ్రువాహనుడు మాతామహ సుతుడే అనబడును. 32

శ్లో॥ తవ తాతస్సుభద్రాయా మభిమన్యురజాయత ।
సర్వాతిరథజిద్వీర ఉత్తరాయాం తతో భవాన్ ॥ 33

అర్జునునకు సుభద్ర యందు నీ తండ్రియగు అభిమన్యుడు జన్మించెను. అతిరథులనందరిని జయించిన అభిమన్యునకు ఉత్తర గర్భములో నీవు జన్మించితివి. 33

శ్లో॥ పరిక్షీణేషు కురుషు ద్రౌణేర్బ్రహ్మాస్త్రతేజసా ।
త్వం తు కృష్ణానుభావేన సజీవో మోచితోఽన్తకాత్ ॥ 34

ద్రోణపుత్రుడగు అశ్వత్థామ యొక్క బ్రహ్మాస్త్ర తేజస్సుతో కురువంశము నశించగా, నీవు కూడా బ్రహ్మాస్త్రముతో కాల్చబడినవాడవై శ్రీకృష్ణుని యొక్క ప్రభావముతో మృత్యువు నుండి వదలబడి జీవించితివి. 34

శ్లో॥ తవేమే తనయాస్తాత జనమేజయ పూర్వకాః ।
శ్రుతసేనో భీమసేన ఉగ్రసేనశ్చ వీర్యవాన్ ॥ 35

నీకు (పరిక్షిత్తునకు) జనమేజయుడు, శ్రుతసేనుడు, భీమసేనుడు, ఉగ్రసేనుడు అను వీరు పుత్రులు. 35

శ్లో॥ జనమేజయస్త్వాం జ్ఞాత్వా తక్షకాన్నిధనం గతమ్ ।
సర్పాన్ వై సర్పయాగాగ్నౌ సహోష్యతి రుషాన్వితః ॥ 36

నీ పుత్రుడగు జనమేజయుడు తక్షకుడను సర్పము వలన నీవు మృత్యువు నొందినావని తెలిసికొని క్రోధముతో సర్పయాగాగ్నిలో సర్పములను హోమము చేయగలడు. 36

టీ:- ఇరావంతమితి. ఉలూప్యాం నాగకన్యాయాం మణలూరుపతేః సుతాయాం పుత్రికాధర్మేణ దత్తాయాం బభ్రువాహనమసూత. అత స్తత్పుత్రస్సన్నపి సః పుత్రికాసుతః మాతామహసుత ఇత్యర్థః. 32-36

శ్లో॥ కావషేయం పురోధాయ తురం తురగమేధసా ।
సమంతాత్పృథివీం సర్వాం జిత్వా యక్ష్యతి చాధ్వరైః ॥ 37

జనమేజయుడు కావషేయుడగు తురువును పురోహితునిగా చేసుకొని సమస్త భూమండలమును జయించి అశ్వమేధయాగము ఒనరించగలడు. 37

టీ:- కావషేయమితి. తురసంజ్ఞం పురోహితం కృత్వా. 37

శ్లో॥ తస్య పుత్రశతానీకో యాజ్ఞవల్క్యాత్త్రయీం పఠన్ ।
అస్త్రజ్ఞానం క్రియాజ్ఞానం శౌనకాత్పరమేష్యతి ॥ 38

ఈ జనమేజయునకు శతానీకుడు పుత్రుడు. ఈ శతానీకుడు యాజ్ఞవల్క్యఋషి వలన వేదమును పఠించి క్రియాజ్ఞానమును, శౌనకుని వలన ఆత్మజ్ఞానమును, కృపాచార్యుని వలన అస్త్రజ్ఞానమును పొందును. 'యాజ్ఞవల్క్యాత్ త్రయీమధీత్య కృపాదస్త్రాణ్యవా' అని విష్ణుపురాణములో చెప్పబడినది. 38

శ్లో॥ సహస్రానీక సత్పుత్ర స్తతశ్చైవాశ్వమేధజః ।
ఆసీమకృష్ణస్తస్యాసీన్నిచకస్తత్సుత స్తతః ॥ 39

శతానీకునకు సహస్రానీకుడు అతనికి అశ్వమేధుడు, అశ్వమేధజునికి ఆసేమకృష్ణుడు, ఆసేమకృష్ణునకు నిచకుడు పుత్రులగుదురు. 39

శ్లో॥ గజాహ్వయే హృతే నద్యాకౌశాంబ్యాం సాధువత్స్యతి ।
ఉప్తస్తతశ్చిత్రరథ స్తస్మాచ్ఛుచిరథస్సుతః ॥ 40

ఈ నిచకుడు, హస్తినాపురి నదిలో మునగగా, కౌశాంబి నగరమున నివసించగలడు. ఈ నిచకునకు ఉప్తుడు, అతనికి చిత్రరథుడు, చిత్రరథునకు శుచిరథుడు కలుగగలరు. 40

టీ:- భవిష్యానాహ - యావత్సమాప్తి. తస్యేతి. యాజ్ఞవల్క్యాత్ క్రియాజ్ఞానం. పరం చాత్మజ్ఞానం శౌనకాత్ప్రాప్స్యతి. అస్త్రజ్ఞానం కృపాచార్యాదితి ద్రష్టవ్యం. యాజ్ఞవల్క్యాత్ త్రయీమధీత్య కృపాదస్త్రాణ్యవాపేతి వైష్ణవోక్తేః. క్వచిత్ అస్త్రజ్ఞానం కృపాచార్యాది త్యేవ పాఠః. (38-40)





శ్లో॥ తస్మాచ్చ వృష్టిమాంస్తస్య సుషేణోఽథ మహీపతిః ।
సుపీతస్తస్య భవితా నృచక్షుర్యత్సుఖానిలః ॥ 41

టీ:- తస్మాదితి. యత్ యస్మాత్సుఖానిలః పుత్రః. 41

ఈ శుచిరథునకు వృష్టిమంతుడు, అతనికి సుశేనుడు, అతనికి సుపేతుడు, సుపేతునకు నృచక్షువు, అతనికి సుఖానిలుడు జన్మించగలరు. 41

శ్లో॥ పరిప్లవస్సుతస్తస్మాన్మేధావీ సునయాత్మజః ।
నృపంజయస్తతో దూర్వో నిమిస్తస్మాజ్జనిష్యతి ॥ 42

టీ:- పరిప్లవ ఇతి. తస్మాత్పరిప్లవాత్సునయః. తస్యాత్మజో మేధావీత్యర్థః. 42

సుఖానిలునకు పరిప్లవుడు, అతనికి సునయుడు, సునయునకు మేధావి, మేధావికి నృపంజయుడు అతనికి దూర్వుడు, అతనికి నిమి జన్మించగలడు. 42

శ్లో॥ నిమేర్బృహద్రథస్తస్మాచ్ఛతానీకస్సుదాసజః ।
శతానీకాద్దుర్దమన స్తస్యాపత్యం విహీనరః ॥ 43

నిమికి బృహద్రథుడు, అతనికి సుదాసుడు, అతనికి శతానీకుడు, శతానీకునికి దుర్ధమనుడు, దుర్ధమునునకు విహీనరుడు గలుగగలరు. 43

శ్లో॥ దండపాణిర్మితస్తస్య క్షేమకో భవితా నృపః ।
బ్రహ్మక్షత్రస్య వై యో నిర్వంశో దేవర్షిసత్కృతః ॥ 44

విహీనరునకు దండపాణి, దండపాణికి మితుడు అతనికి క్షేమకుడు జన్మించగలరు. దేవర్షులచేత సత్కరించబడిన బ్రహ్మక్షత్రియ వంశములకు జన్మస్థానమగు సోమవంశము తెలుపబడినది. 44



శ్లో॥ క్షేమకం ప్రాప్య రాజానం సంస్థాం ప్రాప్స్యతి వై కలౌ ।
అథమాగధ రాజానో భావినో యే వదామి తే ॥ 45

ఈ సోమవంశము కలియుగమున క్షేమకునితో సమాప్తి నొందగలదు. అటు పిమ్మట రాబోవు మగధవంశ రాజుల గురించి నీకు చెప్పెదను. 45

టీ:- నిమేరితి. తస్మాత్సుదాసః. తతః శతానీక ఇత్యర్థః. (43-45)

శ్లో॥ భవితా సహదేవస్య మార్జారిర్యచ్ఛ్రుతశ్రవాః ।
తతోఽయుతాయుస్తస్యాపి నిరమిత్రోఽథ తత్సుతః ॥ 46

బృహద్రథునకు జరాసంధుడు, అతనికి సహదేవుడు, సహదేవునకు మార్జారి, మార్జారికి శ్రుతశ్రవుడు, శ్రుతశ్రవునకు అయుతాయువు అతనికి నిరమిత్రుడను వారలు జన్మించగలరు. 46

శ్లో॥ సునక్షత్రస్సునక్షత్రాత్ బృహత్ క్షత్రోఽథకర్మజిత్ ।
తతశ్శ్రుతంజయో విప్రశ్శుచిస్తస్య భవిష్యతి ॥ 47

నిరమిత్రునకు సునీక్షత్రుడు, సునీక్షత్రునకు బృహక్షత్రుడు, బృహక్షత్రునకు కర్మజిత్తు, అతనికి శ్రుతంజయుడు, శ్రుతంజయునకు విప్రుడు, విప్రునకు శుచి అనువారు జన్మించగలరు. 47

శ్లో॥ క్షేమోఽథ సువ్రతస్తస్మాద్ధర్మనేత్రశ్శ్రుత స్తతః ।
దృఢసేనోఽథ సుమతిస్సుబలో జనితాతతః ॥ 48

శుచికి క్షౌముడు, అతనికి సువ్రతుడు, సువ్రతునకు ధర్మనేతుడు అతనికి శ్రుతుడు, శ్రుతునకు దృఢసేనుడు, దృఢసేనునకు సుమతి, సుమతికి సుబలుడు జన్మించగలరు. 48

టీ:- భవితేతి. బృహద్రథస్య జరాసంధః. తస్య సహదేవః. తస్య మార్జారిః. యత్ యస్మాన్మార్జారేః శ్రుతశ్రవాః. (46-48)

శ్లో॥ సునీతస్సత్యజిదథ విశ్వజిచ్చ పురంజయః ।
ఏతే బార్హద్రథా భూపా భావ్యాస్సాహస్రవత్సరాః ॥ 49

టీ:- సునీత ఇతి. సహస్రం సంవత్సరం ఏతే. భావ్యా భూపాలాః తతః భావ్యాన్ ద్వాదశస్కంధే వక్ష్యతి. 49

సుబలునకు సునీతుడు, అతనికి సత్యజిత్, అతనికి విశ్వజిత్, అతనికి పురంజయుడు జన్మించగలరు. వీరు బార్హద్రథ వంశపు రాజులు వీరు వెయ్యి సంవత్సరములు రాజ్యమును ఏలగలరు. ఆ తరువాతి వారిని గురించి ద్వాదశ స్కంధమున తెలుపబడును. 49

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
ద్వావింశోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
ఇరువది రెండవ అధ్యాయము సమాప్తము.

త్రయోవింశోఽధ్యాయః

శ్రీశుక ఉవాచ

శ్లో॥ అనోస్సభానరశ్చక్షుః పరోక్షశ్చ త్రయస్సుతాః ।
స భాన రాత్కాలనాదస్సృంజయః స్తత్పురంజయః ॥ 1

టీ:- శ్లో. "త్రయోవింశే త్వనోర్ద్రుహ్యోస్తుర్వసోశ్చాన్వయః క్రమాత్, యదోశ్చ వంశోఽను క్రాంతో యావజ్జ్యామఖసంభవః. యద్వా. త్రయోవింశేఽన్వయానుక్త్వా శుకోఽను ప్రముఖైః కృతాన్, జ్యామఖావధిమాచఖ్యౌ యదోర్వంశం మహత్తరమ్." తదేవం యయాతేః పుత్రాణాం పంచమస్య పూర్వోర్వంశః అనుక్రాంతః. ఇదానీం చతుర్థస్య వంశమనుక్రామతి - అనోరిత్యారభ్య వర్ణస్య జగతీపతేరిత్యం తేన. 1

శ్లో॥ జనమేజయ స్తస్య పుత్రో మహాశాలో మహామనాః ।
ఉశీనర స్తితిక్షుశ్చ మహామనస ఆత్మజౌ ॥ 2

టీ:- జనమేజయ ఇతి. తస్య జనమేజయస్య మహాశాలః. తస్య మహామనాః. 2

23 వ అధ్యాయము

ఈ ఇరువది మూడవ అధ్యాయమున యయాతి పుత్రుడగు ద్రుహ్యాతుర్వసుల వంశములు చెప్పి యదు వంశము జ్యామఖుని పుట్టుక వరకు తెలుపబడుచున్నది.

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

యయాతి పుత్రులలో ఐదవవాడగు పురువు వంశమును గురించి తెలిపి ఇపుడు నాల్గవవాడగు ఆనుని వంశము తెలుపుచున్నాడు. ఆనునకు సభానరుడు, చక్షువు, పరోక్షుడు అను ముగ్గురు పుత్రులు. సభానరునకు కాలనాదుడు ఆతనికి సృంజయుడు అను పుత్రులు కల్గిరి. 1

సృంజయునకు జనమేజయుడు, జనమేజయునకు మహాశాలుడు, మహాశాలునకు మహామనుడు, మహామనునకు ఉశీనరుడు, తితిక్షువు అను ఇద్దరు పుత్రులు. 2

శ్లో॥ శిబిర్వనః క్రిమిర్దర్పశ్చత్వారో శీనరాత్మజాః ।
వృషదర్పస్సువీరశ్చ మద్రః కేకయ ఆత్మజాః ॥ 3

ఉశీనరునకు శిబి, వనుడు, క్రిమి, దర్పుడు, అను నలుగురు పుత్రులు. శిబికి వృషదర్పుడు, సువీరుడు, మద్రుడు, కేకయుడు అను నలుగురు పుత్రులైరి. 3

శ్లో॥ శిబేశ్చత్వార ఏవాసన్ తితిక్షోశ్చ రుశద్రథః ।
తతో హేమోऽథసుతపా బలిస్సుతపపోऽభవత్ ॥ 4

శిబికి వృష దర్పాదులు నలుగురే పుత్రులు. ఉశీనరుని తమ్ముడగు తితిక్షునకు రుశద్రథుడు, రుశద్రథునకు హేముడు, హేమునకు సుతపుడు, సుతపునకు బలి పుత్రులైరి. 4

శ్లో॥ అంగ వంగ కళింగాద్యా సింహపుండ్రాంధ్ర సంజ్ఞికాః ।
జజ్ఞిరే దీర్ఘతపసో బలేః క్షేత్రే మహీక్షితః ॥ 5

బలి పత్ని గర్భమున దీర్ఘతపసుడను మునివలన అంగుడు, వంగుడు, కళింగుడు, సింహుడు, పుండ్రుడు, ఆంధ్రుడు అను పేర్లుగల ఆరుగురు పుత్రులు కలిగిరి. 5

శ్లో॥ చక్రుస్స్వనామ్నా విషయాన్ షడిమాన్ ప్రాప్య గాం స్మతే ।
అనుమానం గతో జజ్ఞే తస్మాద్ధవిరథస్తతః ॥ 6

ఆ ఆరుగురు రాజ్యమును(భూమిని) పొంది తమ తమ పేర్లతో అంగ, వంగ, కళింగ, సింహ, పుండ్ర, ఆంధ్ర దేశములను నిర్మించిరి. అంగునికి అనుమానుడు జన్మించెను. అనుమానునకు హవిరథుడు జన్మించెను. 6

శ్లో॥ సుతో ధర్మరతో యస్య జజ్ఞే చిత్రరథో ప్రజాః ।
రోమపాద ఇతి ఖ్యాతస్తస్మై దశరథస్సఖా ॥ 7

హవిరథుని పుత్రుడు ధర్మరథుడు, ధర్మరథుడు చిత్రరథుని కనెను. ఈ చిత్రరథుడు సంతానహీనుడు. రోమపాదుడని ప్రసిద్ధిచెందెను. ఈ రోమపాదునకు దశరథుడు మిత్రుడు. 7

శ్లో॥ శాంతాం స్వకన్యాం ప్రాయచ్ఛదృశ్యశృంగ ఉవాహ తామ్ ।
దేవేఽవర్షతి యం రామా ఆనిన్యుర్హరిణీసుతమ్ ॥ 8

రోమపాదునకు సంతానము లేకపోవుటచే దశరథుడు తన పుత్రికయగు శాంత అనునావిడను పుత్రికగా నొసగెను. ఈ శాంతను ఋష్యశృంగుడు వివాహమాడెను. ఈ ఋష్యశృంగుడు విభాండక మునికి హరిణీ గర్భమున జన్మించెను. రోమపాదుని రాజ్యమున చాలా కాలము వర్షము కురువక పోగా ఋష్యశృంగుని కొనివచ్చిరి. 8

శ్లో॥ నాట్య సంగీత వాదిత్రైర్విభ్రమాలింగనాదిభిః ।
స తు రాజ్ఞోఽనత్యస్య నిరూప్యేష్టిం మరుత్వతేః ॥ 9

గణికలు నాట్యము, సంగీత వాద్యములు, హావ భావములతో గూడిన ఆలింగనాదులతో ఋష్యశృంగుని మోహింపచేసి రోమపాదుని రాజ్యమునకు తెచ్చిరి. ఋష్యశృంగుడు రాగానే రోమపాదుని రాజ్యమున సువృష్టి కలిగెను. ఆ ఋష్యశృంగుడు సంతానహీనుడగు రోమపాదునిచే ఇంద్రయాగమును చేయించి(తరువాతి శ్లోకముతోఅన్వయము)**9**

శ్లో॥ ప్రజామదాద్దశరథో యేనలేభేఽప్రజాః ప్రజాః ।
చతురంగో రోమపాదాత్పృథులాక్షస్తు తత్సుతః ॥ 10

రోమపాదునకు సంతానము కలుగచేసెను. సంతానహీనుడగు దశరథుడును ఈ ఋష్యశృంగుని ప్రయత్నముతో సంతానము నొందెను. ఈ రోమపాదుని నుండి చతురంగుడు జన్మించెను. ఈ చతురంగునకు పృథులాక్షుడు పుత్రుడు. 10

శ్లో॥ బృహద్రథో బృహత్కర్మా బృహద్భానుశ్చ తత్సుతాః ।
తతో బృహన్మనా స్తస్మాజ్జయద్రథ ఉదాహృతః ॥ 11

పృథులాక్షునకు బృహద్రథుడు, బృహద్భానుడు, బృహత్కర్మ అను ముగ్గురు పుత్రులు. బృహద్రథుని పుత్రుడు బృహన్మనుడు. అతనికి జయద్రథుడు పుత్రుడు. 11



శ్లో॥ విజయస్తస్య సంభూత్యాం ధృతిస్తస్య ధృతవతః ।
సత్యకర్మాऽభవత్తస్య పుత్రశ్చాతిరథ స్తతః ॥ 12

జయద్రథునకు సంభూతి యందు విజయుడు జన్మించెను. ఆ విజయునకు ధృతి, ధృతికి ధృతవ్రతుడు, ధృతవ్రతునకు సత్యకర్మ పుత్రుడాయెను. సత్య కర్మకు అతిరథుడు పుత్రుడు. 12

శ్లో॥ యోऽసౌ గంగాతటేక్రీడాన్మంజూషాంతర్గతం శిశుమ్ ।
కుంత్యాపవిద్ధం కానీనమనపత్యోऽకరోత్సుతమ్ ।
వృషసేనస్సుత స్తస్య కర్ణస్య జగతీ పతేః ॥ 13

ఈ అతిరథుడు గంగా తటమున విహరిస్తూ, గంగలో కుంతిచేత వదలబడిన ఒక పెట్టెలో నున్న శిశువును చూచి (కర్ణుని) తనకు సంతానము లేకపోవుటచే పుత్రునిగా చేసుకొనెను. రాజగు ఆ కర్ణునకు వృషసేనుడు పుత్రుడు. 13

శ్లో॥ ద్రుహ్యోస్తు తనయో బభ్రుస్సేతుస్తస్యాత్మజస్తతః ।
ఆరబ్ధస్తస్యగాంధారస్తస్యఘర్మస్తతోఘృతః ॥ 14

యయాతి పుత్రుడగు ద్రుహ్యుని పుత్రుడు బభృవు. అతనికి సేతు, సేతునకు ఆరబ్ధుడు, ఆరబ్ధునకు గాంధారుడు, అతనికి ఘర్ముడు, ఘర్మునకు ఘృతుడు పుత్రులైరి. 14

శ్లో॥ ఘృతస్య దుర్మదస్తస్మాత్ప్రచేతాస్తత్సుతాశ్శతం ।
మ్లేచ్ఛాధి పతయోऽభూవన్నుదీచీం దిశమాశ్రితాః ॥ 15

ఘృతునకు దుర్మదుడు, దుర్మదునకు ప్రచేతుడు పుత్రుడు. ఈ ప్రచేతనుకు వంద మంది పుత్రులు కలిగిరి. ఈ వంద మంది ఉత్తర దిక్కున మ్లేచ్ఛాధి పతులైరి. 15

శ్లో॥ తుర్వసోస్తు సుతోవహ్నిర్వహ్నేర్భర్గోऽథ భానుమాన్ ।
త్రిసాను స్తత్సుతోऽస్యాపి కరంధమ ఉదారధీః ॥ 16

టీ:- శిబిరితి. చత్వారః ఉశీనరస్య ఆత్మజాః సంధిరార్షః. (3-16)

యయాతి మరో పుత్రుడగు తుర్వసునకు వహ్ని, వహ్నికి భర్గుడు, భర్గునకు భానుమంతుడు, భానుమంతునకు త్రిసానువు, త్రిసానువు నకు కరంధముడు పుత్రులైరి. 16



శ్లో॥ మరుత్తస్తత్సుతో పుత్రః పుత్రం పౌరవమన్వగాత్ ।
దుష్యంతం స పునర్భేజే స్వవంశం రాజ్యకాముకః ॥ 17

కరంధమునకు మరుత్తు పుత్రుడాయెను. ఆ మరుత్తు సంతానహీనుడై పురువంశ సంభవుడగు దుష్యంతుని పుత్రునిగా స్వీకరించెను. ఆ దుష్యంతుడు రాజ్యకాంక్షియై పురువంశమునే చేరెను. 17

శ్లో॥ యయాతేర్జ్యేష్ఠపుత్రస్య యదోర్వంశం నరర్షభ ।
వర్ణయామి మహాపుణ్యం సర్వపాపహరం నృణాం ॥ 18

ఓ పరీక్షిద్రాజా! యయాతి పెద్దకుమారుడు యదువు. గొప్ప పుణ్యవంతుడైనట్టి మానవుల సమస్త పాపములను హరించెడి ఆ యదువు యొక్క వంశమును వర్ణించెదను. 18

శ్లో॥ యదోర్వంశం నరశ్శ్రుత్వా సర్వపాపైః ప్రముచ్యతే ।
యత్రావతీర్ణో భగవాన్ పరమాత్మా నరాకృతిః ॥ 19

ఏ యదు వంశమున పరమాత్ముడు భగవంతుడు మానవాకృతితో అవతరించినాడో ఆ యదు వంశమును గురించి వినిన మానవుడు సర్వ పాపముల నుండి విముక్తుడగును. 19

టీ:- మరుత్త ఇతి. సః దుష్యంతః. స్వవంశం పౌరవవంశం. (17-19)

శ్లో॥ యదోస్సహస్రజిత్క్రోష్టుర్నలోరిపురితి శ్రుతాః ।
చత్వారస్సూనవస్తత్ర శతజిత్ప్రథమాత్మజః ॥ 20

యదువునకు సహస్రజిత్తు, క్రోష్టువు, నలుడు, రిపువు అను నలుగురు కుమారులు. వారిలో మొదటి వాడగు సహస్రజిత్తునకు శతజిత్తు పుత్రుడు. 20

శ్లో॥ మహాహయో వేణుహయో హేమయశ్చేతి తత్సుతాః ।
ధర్మస్తుహేహవయసుతో నేత్రః కుంతేః పుతా తతః ॥ 21

శతజిత్తునకు మహాహయుడు, వేణుహయుడు, హేమయుడు అను ముగ్గురు పుత్రులు. హేమయునకు ధర్ముడు, ధర్మునకు నేత్రుడు, నేత్రునకు కుంతి అనువారలు పుత్రులు. 21

టీ:- యదోరితి. ప్రథమస్య సహస్రజితః ఆత్మజః. (20-21)

శ్లో॥ సోభంజిరభవత్కుంతేర్మహిష్మాన్ భద్రసేనకః ।
దుర్మదోభద్రసేనస్య ధనినః కృతవీర్యసూః ।
కృతాగ్నిః కృతవర్మా చ కృతౌజా ధనికాత్మజాః ॥ 22

కుంతికి సోభంజి, సోభంజికి మహిష్మంతుడు, ఆ మహిష్మంతునకు భద్రసేనుడు, భద్రసేనునకు దుర్మదుడు, ధనికుడు అను ఇద్దరు పుత్రులు. ధనికునకు కృతవీర్యుడు, కృతాగ్ని, కృతవర్మా, కృతౌజుడు అను నలుగురు కుమారులు. 22

శ్లో॥ అర్జునః కృతవీర్యస్య సప్తద్వీపేశ్వరోఽభవత్ ।
దత్తాత్రేయాద్ధరేరంం శాత్ప్రాప్తయోగ మహాగుణః ॥ 23

కృతవీర్యునకు అర్జునుడను పుత్రుడు కలిగెను. ఈ అర్జునుడు విష్ణ్వంశసంభూతుడగు దత్తాత్రేయుని వలన యోగవిద్యను, అణిమాద్యష్ట సిద్ధులను పొంది సప్తద్వీపాత్మకమగు భూమండలమునకు ఏకచ్ఛత్రాధిపతి యయ్యెను. 23

శ్లో॥ న నూనం కార్తవీర్యస్య గతిం యాస్యంతి పార్థివాః ।
యజ్ఞ దాన తపోయోగై శ్శృత వీర్య జయాదిభిః ॥ 24

ఇతర రాజులెవ్వరును యజ్ఞ, దాన, తపో, యోగ, శాస్త్రజ్ఞాన, పరాక్రమ, జయాదులతో కార్తవీర్యార్జునితో సమానస్థితి నొందలేరు. ఇది నిశ్చయము. 24

శ్లో॥ పంచాశీతి సహస్రాణిహ్యవ్యాహత బలస్సమాః ।
అకరోదర్జునో రాజ్యం హరిం చైవాన్వహం స్మరన్ ॥ 25

టీ:- సోభంజిరితి. కుంతేః సోభంజిః. సోభంజేర్మహిష్మాన్. మహిష్మతో భద్రసేనకః. తస్య దుర్మదో ధనికశ్చేతి ద్వౌ పుత్రౌ కృతవీర్యసూః కృతవీర్యస్య జనకః.కృతవీర్యాదయశ్చత్వారో ధనికస్యాత్మజా ఇత్యర్థః. (22-25)

ఈ కార్తవీర్యార్జునుడు అవ్యాహతబలుడై సర్వదా విష్ణుస్మరణ కావిస్తూ ఎనుబదిఐదు వేల సంవత్సరములు రాజ్యమేలెను. 25

శ్లో॥ అనష్టవిత్తస్మరణోబుభుజే క్షయ్యష్ద్వసు ।
తస్య పుత్ర సహస్రస్య పంచైవ ప్రథితా మృథే ॥ 26

ఆ కార్తవీర్యార్జునుడు ఎనుబది ఐదువేల సంవత్సరములు షడింద్రియ విషయములను అక్షయముగా అనుభవిస్తూ అవినాశమగు ధనస్మరణుడై అవ్యాహతబలుడై రాజ్యమును అనుభవించెను. అతని వెయ్యి మంది పుత్రులలో పరశురాముని క్రోధాగ్నికి బలికాకుండా ఐదుగురే జీవించిరి. 26

శ్లో॥ జయధ్వజ శ్శూరసేనో వృషణో మధురూర్జితః ।
జయాధ్వజాత్తాళజంఘస్తస్య పుత్రశతం త్వభూత్ ॥ 27

టీ:- అనష్టేతి. అనష్టమవినాశం విత్తం యేన తథావిధం స్మరణం యస్య అక్షయ్యం షడ్వసు షడింద్రియవిషయం బుభుజే. (26-27)

కార్తవీర్యార్జుని వేయి మంది పుత్రులలో జయధ్వజుడు, శూరసేనుడు, వృషణుడు, మధువు, ఊర్జితుడు అను ఐదుగురు మాత్రమే పరశురాముని క్రోధాగ్నికి బలి కాకుండా మిగిలిరి. జయధ్వజునకు తాళజంఘుడు జన్మించెను. ఈ తాళజంఘునకు వందమంది పుత్రులు కలిగిరి. 27

శ్లో॥ క్షత్రం యత్తాళజంఘాఖ్య మౌర్వ తేజోప సంహృతమ్ ॥ 28

టీ:- క్షత్రమితి. ఔర్వస్య తేజసా సగరేణోప సంహృతమిత్యర్థః. 28

ఈ వందమంది తాళజంఘులు క్షత్రియులైరి. ఈ వంద మందిని ఔర్వుడను మహర్షి తేజస్సుతో సగరుడు సంహరించెను. 28

శ్లో॥ తేషాం జ్యేష్ఠో వీతిహోత్రో వృష్ణపుత్రో మధోస్స్మృతః ।
తస్య పుత్రశతం త్వాసీత్ వృష్ణిజ్యేష్ఠం యతః కులం ॥29

ఈ తాళజంఘుని పుంత్రులలో వీతిహోత్రుడు పెద్దవాడు. ఈ వీతిహోత్రునకు మధువు, మధువుకు వందమంది పుత్రులు వారిలో వృష్ణి అనువాడు పెద్దవాడు. 29

శ్లో॥ మాధవా వృష్ణయో రాజన్ యాదవాశ్చేతి సంజ్ఞితం ।
యదుపుత్రస్య చ క్రోష్టోః పుత్రో వృజినవాం స్తతః ॥ 30

ఈ కులములోని వారు మధువు, వృష్ణి, యదువు. ఈ ముప్వురి కారణమున మాధవులని (వృష్ణులు) వార్ష్ణీయులని, యాదవులని ప్రసిద్ధులైరి. యదు పుత్రుడగు క్రోష్టునకు వృజనవంతుడు పుత్రుడాయెను. 30

శ్లో॥ శ్వాహితో భేరుశేకుర్వై తస్య చిత్రరథ స్తతః ॥ 31

టీ:- తేషామితి. తేషాం తాలజంఘపుత్రాణాం జ్యేష్ఠస్తస్య మధోః పుత్రశతం వృష్ణిర్జ్యేష్ఠో యస్మిన్ యతో మధోః వృష్ణేర్యశ్చ హేతోః. (29-31)

వృజన వంతునకు శ్వాషి, శ్వాషికి భీరుశేకువు, అతనికి చిత్రరథుడు పుత్రులైరి. 31



శ్లో॥ శశిబిందుర్మహాయోగీం మహాభాగో మహానభూత్ ।
చతుర్దశ మహారత్నశ్చక్రవర్త్యపరాజితః ॥ 32

టీ:- శశిబిందురితి. చతుర్దశ మహారత్నాని తత్తజ్జాతిశ్రేష్ఠాని యస్య సః. తాని చ మార్కండేయ పురాణే వర్ణితాని. శ్లో. గజవాజిరథస్త్రీషు నిధిమాల్యాంబర ద్రుమాః. శక్తి పాశమణిచ్ఛత్ర విమానాని చతుర్దశేతి. 32

ఈ చిత్రరథునకు శశిబిందువు పుత్రుడు. ఈ శశిబిందువు గొప్ప యోగైశ్వరసంపన్నుడైన మహాభాగుడైపదునాలుగు మహారత్నము లకు అధికారియగు చక్రవర్తియై ఇతరులచేత జయింపజాలనివాడై యుండెను. పద్నాలుగు మహారత్నములు ఆయా జాతి శ్రేష్ఠములైనవి. మార్కండేయ పురాణములో "గజ వాజిరథ స్త్రీషు నిధి మాల్యాంబర ద్రుమాః. శక్తి పాశమణిచ్ఛత్ర విమానాని చతుర్దశేతి" అని వర్ణించబడినవి. 1.గజములు 2. గుఱ్ఱములు 3. రథములు 4. స్త్రీలు 5. బాణములు 6. నిధులు 7. పుష్పమాలలు 8. వస్త్రములు 9. వృక్షములు 10. శక్తులు 11. పాశములు 12. మణులు 13. ఛత్రములు 14. విమానములు ఈ పద్నాలుగు మహారత్నములని చెప్పబడినవి. 32

శ్లో॥ తస్య పత్నీ సహస్రాణి దశాసన్ సమహాయశాః ।
దశ లక్ష సహస్రాణి పుత్రాణాం తాస్వజీజనత్ ॥ 33

టీ:- తస్యేతి. దశానాం పత్నీ సహస్రాణాం భార్యా యుతస్య ప్రత్యేకం లక్షం లక్షమిత్యేవం తాసు పుత్రాణాం దశలక్షసహస్రాణి శతకోటి సంఖ్యాకాన్ పుత్రానిత్యర్థః. జనయామాస. 33

ఆ శశిబిందువునకు పదివేల మంది భార్యలు గొప్ప యశస్సంపన్నుడగు ఆ శశిబిందువు ఆ పదివేల మంది భార్యలలో ఒక్కొక్కరి యందు లక్షమంది చొప్పున దశ లక్ష సహస్ర పుత్రులను (శతకోటి మందిని) కనెను. 33

శ్లో॥ తేషాం తు షట్ప్రధానానాం పృథుశ్రవస ఆత్మజాః ।
ధర్మోనామోశనా తస్య హయమేధ శతస్య యాట్ ॥ 34

టీ:- తేషామితి. పృథుశ్రవాః పృథుకీర్తిః పృథుయశా ఇత్యాదయః. షట్ ప్రధానాః శ్రేష్ఠాః యేషాం తేషాం మధ్యే. 34

ఆ వందకోట్లమంది పుత్రులలో పృథుశ్రవుడు, పృథుకీర్తి, పృథుయశుడు మొదలగు ఆరుగురు ప్రధానమైనవారు. పృథుశ్రవుని పుత్రుడు ధర్ముడు. ధర్మునకు ఉశనుడు, ఈ ఉశనుడు నూరు అశ్వమేధములనొనర్చెను. 34

శ్లో॥ తత్సుతో రుచకస్తస్య పంచాసన్నాత్మ జాశ్శృణు ।
పురుజిద్రుద్మరుక్మేషు పృథుజ్యామఖసంజ్ఞితాః ॥ 35

టీ:- తదితి.పంచఆత్మజాః ఆసన్ శృణు.తానేవాహ-పురుజిదితి. 35

ఈ ధర్మునకు ఋచకుడు పుత్రుడు. ఈ ఋచకునకు పురుజిత్తు, రుక్ముడు, రుక్మీషువు, పృథువు, జ్యామఖుడు అను పేర్లుగల ఐదుగురు పుత్రులు. 35

శ్లో॥ జ్యామఖస్త్వప్రజాహ్యన్యాం భార్యాం శైబ్యాపతిర్భయాత్ ।
నావిందచ్ఛత్రుభవనాద్భోజ్యాం కన్యాం సమాహరత్ ॥ 36

భార్యయొక్క భయముతో ఒకే భార్యను వివాహమాడినట్టి వంధ్యురాలగు ఆవిడకు పతియైనట్టి జ్యాముఖునకు ఆ భార్యా భయమే పుత్ర సంతాన ప్రదమాయెను అని తెలుపుచున్నాడు. జ్యాముఖుని భార్య పేరు శైబ్యా, ఈతడు సంతానహీనుడై తన భార్యయగు శైబ్యా భయముతో వేరొక స్త్రీని వివాహమాడక పోయెను. ఒకసారి ఆ జ్యాముఖుడు శత్రు భవనము నుండి భోజ్యా అను పేరుగల కన్యను హరించి తెచ్చెను. 36



శ్లో॥ రథస్థాం తాం నిరీక్ష్యాహ శైబ్యా పతిమమర్షితా ।
కేయం కుహకమత్స్థానం రథమారోపితేతి వై ॥ 37

టీ:- భార్యాభయాదేవైకభార్యస్య వంధ్యాపతేర్జ్యామఖస్యాపుత్రస్య తద్భయమేవ పుత్ర ప్రదమభవదితి దర్శయన్నాహ - జ్యామఖ ఇతి.(36-37)

రథముపై కూర్చుండబెట్టుకొని తెచ్చుచున్న ఆ భోజ్యా అను కన్యను గాంచి శైబ్యా పతియగు జ్యాముఖునిపై కోపించి ఓ కపటుడా! ఈ కన్య ఎవరు? నేను కూర్చుండవలసిన రథమున కూర్చుండబెట్టి నావనెను. 37

శ్లో॥ స్నుషా తవేత్యభిహితే స్మయంతీ పతిమబ్రవీత్ ।
అహం వంధ్యా సపత్నీ చ స్నుషా యుజ్యేత మే కథమ్ ॥ 38

టీ:- స్నుషేతి. యది మే సపత్నీ స్యాత్తర్హి స్నుషేయం యుజ్యేతాపి న త్వేతదస్తీత్యాహ - అసపత్నీ చేతి. 38

అపుడు జ్యాముఖుడు ఈ కన్యక నీకు కోడలని చెప్పెను. శైబ్యా ఆశ్చర్యమొందుచూ తన భర్తతో ఇట్లు పలికెను. నేనా వంధ్యురాలను (గొడ్రాలను), నాకు సవతి లేదు, ఈవిడ నాకు కోడలనుట ఎటుల సంగతమగును. 38

శ్లో॥ జనయిష్యసి యం రాజ్ఞి తస్యేయముపలప్స్యతే ।
అన్వమోదంత తద్విశ్వేదేవాః పితర ఏవ చ ॥ 39

టీ:- అతిభయ వ్యాకుల ఆహ - జనయిష్యసీతి. భార్యాభయ ప్రకంప మానస్విన్న సర్వాంగస్య రాజ్ఞః. ప్రాణసంకట మాలోక్యానుకంపితాస్తేన పూర్వం బహుకాలమారాధితాః విశ్వేదేవాఃపితరశ్చ తథేత్యన్వమోదంత. 39

ఆ శైబ్యా మాటలకు జ్యాముఖుడు ఓ రాజ్ఞీ! నీవు ఏ పుత్రుని కనెదవో అతడు ఈ కన్యను పొందగలడనెను. భార్యా భయముతో వణుకుతూ చమటపట్టిన శరీరముగల జ్యాముఖుని ప్రాణసంకటస్థితిని గాంచి దయనొందినట్టి జ్యాముఖునిచే పూర్వము చాలా కాలము ఆరాధించబడిన విశ్వేదేవతలు, పితృదేవతలు జ్యాముఖుని మాటలను అటులనే అగుగాక అని ఆమోదించిరి. 39

శ్లో॥ శైబ్యా గర్భమధాత్కాలే కుమారం సుషువే శుభం ।
స విదర్భ ఇతిప్రోక్త ఉపయేమే స్నుషాం సతీమ్ ॥ 40

టీ:- శైబ్యేతి. తతశ్చ దేవతా ప్రసాదేన జనయిష్యసీతి ప్రతివచనేన ముహూర్తగుణేన చ. నిర్వృత్తరజస్కాపి శైబ్యాగర్భమధాత్. తస్య చ మహిమా పరాశరాదిభిరుక్తః యథోక్తం. శ్లో. భార్యావశ్యాస్తు యే కేచిద్భవిష్యంత్యథవా మృతాః, తేషాం తు జ్యామఖశ్రేష్ఠః శైబ్యాపతిరభూన్నృప. 40

శ్రీమద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
త్రయోవింశోఽధ్యాయః

దయగల విశ్వేదేవతల, పితృదేవతల అనుగ్రహముతో కొంత కాలమునకు జ్యాముఖుని భార్యయగు శైబ్యా గర్భమును దాల్చి శుభలక్షణ యుక్తుడగు పుత్రుని కనెను. ఈ జ్యాముఖుని మహిమ, పరాశరాదులతో ఇటుల చెప్పబడినది. "భార్యావశ్యాస్తు యే కేచిద్భవిష్యంత్యథవా మృతాః, తేషాం తు జ్యామఖశ్రేష్ఠః శైబ్యాపతిరభూన్నృప" భార్యా దీనులైన కొందరు అనృతవాక్కులగుదురు. అలాంటి వారిలో శైబ్యాపతియగు జ్యాముఖుడు శ్రేష్ఠుడాయెను అని తెలిపిరి. ఆ శైబ్యకు జన్మించిన పుత్రుడు విదర్భుడని చెప్పబడినవాడై జ్యాముఖునిచే స్నుష అని చెప్పబడిన భోజ్య అను కన్యకను వివాహమాడెను. 40

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
ఇరువది మూడవ అధ్యాయము సమాప్తము.

చతుర్వింశోఽధ్యాయః

శ్రీశుక ఉవాచ

శ్లో॥ తస్యాం విదర్భోఽజనయత్పుత్రౌ నామ్నా కుశక్రుథౌ ।
తృతీయం రోమపాదం చ వైదర్భకులనందనమ్ ॥ 1

టీ:- శ్లో. "చతుర్వింశే విదర్భస్య పుత్రత్ర యసముద్భవాః, వంశా నానాముఖాః ప్రోక్తాః రామకృష్ణోద్భవావధి." యద్వా చతుర్వింశే విదర్భాది వర్ణ్యతే యదుజాన్వయః, యత్రాసీద్భగవాన్ ఖ్యాతే వృష్ణ్యంధక ముఖైర్నృపైః. 1

శ్లో॥ రోమపాదసుతో బభ్రుర్బభ్రోః కృతిరజాయత ।
ఉశికస్తత్సుత స్తస్మాచ్చేదిశ్చైద్యాదయో నృపాః ॥ 2

శ్లో॥ క్రుథస్య కుంతిః పుత్రోఽభూద్ధృష్టిస్తస్యాథ నిర్వృతిః ।
తతో దశార్హో నామ్నాస్య తస్య వ్యోమస్సుత స్తతః ॥ 3

శ్లో॥ జీ మూతో వికృతిస్తస్య యస్య భీమరథస్సుతః ॥ 4

టీ:- రోమపాదేతి. చైద్యాదయః దమఘోషాదయః. (2-4)

24 వ అధ్యాయము

ఈ ఇరువది నాల్గవ అధ్యాయమున విదర్భునికి ముప్వురు పుత్రులు పుట్టుట, అనేకములగు వంశముల చరిత బలరామకృష్ణుల జన్మ వరకు వర్ణించ బడుచున్నది.

శుకమహర్షి ఈవిధముగా పలికెను.

ఆ విధర్భుడు భోజ్య అను స్త్రీ యందు కుశుడు, కృధుడు, రోమపాదుడను ముగ్గురు పుత్రులను కనెను. ఈ రోమపాదుడు వైదర్భ కులములో శ్రేష్ఠుడు. 1

రోమపాదునకు బభ్రువు అతనికి కృతి, కృతికి ఉశికుడు, ఉశికునకు చేది, ఈ చేదికి దమఘోషాది పుత్రులు జన్మించిరి. 2

కృధునకు కుంతి పుత్రుడాయను. కుంతికి ధృష్టి, ధృష్టికి నిర్వృతి, నిర్వృతికి దశార్హుడు, దశార్హునకు వ్యోముడు పుత్రులైరి. 3

వ్యోమునకు జీమూతుడు, జీమూతునకు వికృతి, వికృతికి భీమరథుడు పుత్రుడాయను. 4

శ్లో॥ తతో నవరథః పుత్రోజాతో దశరథస్తతః ।
శకునిస్తత్సుతః కుంతిః దేవరాత స్తదాత్మజః ॥ 5

టీ:- తత ఇతి. తతో దశరథాత్ శకునిః తస్య సుతః కుంతిః పురాణాంతరాదేవమాది విశేషో ద్రష్టవ్య. 5

భీమరథునకు నవీరథుడు పుత్రుడు. అతనికి దశరథుడు, దశరథునకు శకుని, శకునికి కుంతి పుత్రులుగా జన్మించిరి. (వేరే పురాణముల నుండి ఈ విశేషములు చూడవలెను.) కుంతికి దేవరాతుడు పుత్రుడు. 5

శ్లో॥ దేవక్షత్ర స్తతస్తస్య మధుః కురవశస్త్వనుః ।
పురుహూతస్త్వనోః పుత్రస్తస్యాంశుస్సాత్వతి స్తతః ॥ 6

టీ:- దేవక్షత్ర ఇతి. తతః కురువంశాదనుః. అనోః పుత్రః పురుహోత్రః 6

దేవరాతునకు దేవక్షత్రుడు, దేవక్షత్రునకు మధువు, మధుకు కురువశుడు, కురువశువునకు అనువు, అనువునకు పురుహూతుడు, పురుహూతువునకు అంశువు, అంశువునకు సాత్వతి పుత్రులుగా జన్మించిరి. 6

శ్లో॥ భజమానో భజిర్దివ్యో వృష్టిర్దేవాపృథోఽంధకః ।
సాత్వతస్య సుతాస్సప్త మహాభోజశ్చ మారిష ॥ 7

ఓ ఆర్యుడా! ఈ సాత్వతికి భజమానుడు, భజిదేవ్యుడు, వృష్టి, దేవాపృథుడు, అంధకుడు, మహాభోజుడని ఏడుగురు పుత్రులు. 7

శ్లో॥ భజమానన్య నిమ్రోచిః కంకణో వృష్ణిరేవ చ ।
ఏకస్యామాత్మజాః పత్న్యా మన్యస్యాం చ త్రయస్సుతాః ॥ 8

భజమానునకు ఒక భార్య యందు నిమ్రోచి, కంకణుడు, వృష్ణి అను ముగ్గురు పుత్రులు వేరే భార్య యందును ముగ్గురు పుత్రులు (తరువాతి శ్లోకముతో అన్వయము). 8

శ్లో॥ శతజిచ్చ సహస్రజి త్తథా యుతజిదేవ చ ।
బభ్రుర్దేవా పృథసుత స్తయోశ్శ్లోకం పఠంత్యముమ్ ॥ 9

భజమానునకు వేరే భార్య యందు శతజిత్, సహస్రజిత్, అయుతజిత్ అను ముగ్గురు పుత్రులు కలిగిరి. దేవాపృథునకు బభ్రువు పుత్రుడు. దేవాపృథు, బభ్రువుల గురించి ఈ శ్లోకమును పఠించెదరు. (వారి గురించి ఇట్లు చెప్పుదురు.) 9

శ్లో॥ యథైవ శృణుమోదూరాత్సంపశ్యామ స్తథాంతికాత్ ।
బభ్రుశ్శ్రేష్ఠో మనుష్యాణాం దేవైర్దేవాపృథస్సమః ॥ 10

మనము దూరమునుండి ఏది వినుచున్నామో దగ్గర నుండి దానినే చూచుచున్నాము. బభ్రువు మానవులలో శ్రేష్ఠుడు. దేవాపృథుడు దేవతలతో సమానుడు. 10

టీ:- భజమాన ఇతి. మహాభోజశ్చేత్యేవం సప్త. మారిషహే ఆర్య. 7-10

శ్లో॥ పురుషాః పంచషష్టిశ్చ షట్సహస్రాణి చాష్ట చ ।
యేఽమృతత్వమనుప్రాప్తాః బభ్రోర్దేవా పృథాదపి ॥ 11

ఈ బభ్రువు మరియు దేవాపృథుల ఉపదేశముతో పదునాల్గువేల అరువది ఐదుమంది మనుష్యులు మోక్షమునొందిరి. (అను శ్లోకము పఠించబడినది) 11

శ్లో॥ మహాభోజోఽతి ధర్మాత్మా భోజా ఆసం స్తదన్వయే ।
వృష్ణేస్సుమిత్రః పుత్రోఽభూద్యుధాజిచ్చ పరంతప ॥ 12

సాత్వతి పుత్రులలో మహాభోజుడు గొప్ప ధర్మాత్ముడు. ఆ మహాభోజుని వంశమున భోజ(యాదవులు)వంశీయులు కలిగిరి. ఇక వృష్ణికి సుమిత్రుడు, యుధాజిత్తు అను ఇద్దరు పుత్రులు కలిగిరి. 12

టీ:- పురుషా ఇతి. తత్తదుపదేశభేదేన యే పంచషష్ట్యాదిసంఖ్యాః పురుషాస్తే అమృతత్వం మోక్షం ప్రాప్తాః. (11-12)

శ్లో॥ శినిస్తస్యానమిత్రశ్చ నిమ్నోభూదన మిత్రతః ।
సత్రాజితః ప్రసేనశ్చ నిమ్నస్యాధాపతుస్సుతౌ ॥ 13

టీ:- శినిరితి. తస్య యుధాజితః శినిరనమిత్రశ్చ. 13

యుధాజిత్తునకు శిని, అనమిత్రుడు అను ఇద్దరు పుత్రులు అనమిత్రునకు నిమ్నుడు, నిమ్మునకు సత్రాజిత్తు, ప్రసేనుడు అను ఇద్దరు పుత్రులు జన్మించిరి. 13

శ్లో॥ అనమిత్రసుతో హ్యన్యః శినిస్తస్య చ సత్యకః ।
యుయుధాన స్సాత్యకిర్వై జయస్తస్య కుణిస్తతః ॥ 14

టీ:- అనమిత్రేతి. సత్యకస్య పుత్రో యయుధానః సాత్యకిః తస్య జయః . తస్య కుణిః. 14

అనమిత్రుని వేరొక పుత్రుడగు శినికి సత్యకుడు, సత్యకునకు యుయుధానుడు పుత్రుడు. ఈ యుయుధానుడే సాత్యకి అని ప్రసిద్ధి చెందెను. సాత్యకికి జయుడు, జయునకు కుణి పుత్రులైరి. 14

శ్లో॥ యుగంధరోஉనమిత్రస్య పృశ్నిః పుత్రో పరస్తతః ।
శ్వఫల్కశ్చిత్రకశ్చైవ గాదిన్యాం తు శ్వఫల్కతః ॥ 15

టీ:- యుగంధర ఇతి. తతః కుణేర్యుగంధరః. అనమిత్రస్యైవాపరః పృశ్నిర్నామ పుత్రః. 15

కుణికి యుగంధరుడు పుత్రుడు, అనమిత్రునకు మూడవ పుత్రుడు పృశ్ని, పృశ్నికి శ్వఫల్కుడు, చిత్రకుడు అను ఇద్దరు పుత్రులు. శ్వఫల్కునకు గాధిని అను స్త్రీ యందు (తరువాతి శ్లోకముతో అన్వయము). 15

శ్లో॥ అక్రూర ప్రముఖా ఆసన్ పుత్రా ద్వాదశవిశ్రుతాః ।
అసంగస్సారమేయశ్చమృదుకో మృదుపచ్ఛివః ॥ 16

శ్వఫల్కునకు గాధిని యను స్త్రీయందు అక్రూరుడు, ప్రముఖుడుగా పన్నెండు మంది పుత్రులు కలిగి ప్రసిద్ధులైరి. (అక్రూర ప్రముఖాః మేషామిత్యతద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి) అక్రూరుడు ప్రముఖుడుగా గల పన్నెండుగురు పుత్రులు అక్రూరునితో పదముగ్గురు



ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

పుత్రులు. అందువలన అక్రూరుని కంటే ఇతరులగు పన్నెండుగురిని చూపుచున్నాడు. అసంగుడు, సారమేయుడు, మృధుకుడు, వృధుపుడు, శివుడు. 16

శ్లో॥ వర్మదృగ్ధృష్టవర్మశ్చ క్షత్రోపేక్షోఽరిమర్దనః ।
శత్రుఘ్నో గంధమాదాహ్వః ప్రతిబాహుశ్చ ద్వాదశ ॥ 17

వర్మదృక్కు, దృష్టవర్మ, క్షత్రోపేక్షుడు, అరిమర్ధనుడు, శత్రుఘ్నుడు, గంధమాదుడు, ప్రతిబాహువు అను పన్నెండుగురు అక్రూరునితో పదముగ్గురు శ్వఫల్కుని పుత్రులు. 17

శ్లో॥ తేషాం స్వసాసు చార్వాఖ్యాద్వావక్రూరసుతావపి ।
దేవలోఽనుపదేవశ్చ తథా చిత్రరథాత్మజాః ॥ 18

వీరికి చెల్లెలు సుచారు అను పేరుగలది. అక్రూరునకు దేవలుడు అనుపదేవుడు ఇద్దరు పుత్రులు. శ్వఫల్కుని భ్రాతయగు చిత్రకునకు చిత్రరథుడు, 18

టీ:- అక్రూరేతి. గాదిన్యాం శ్వఫల్కాత్. అక్రూర ప్రముఖాః అక్రూరః ప్రముఖో యేషామిత్యతద్గుణసంవిజ్ఞాన బహువ్రీహిః. అతః అక్రూరాతిరిక్తాన్ ద్వాదశ దర్శయతి - అసంగ ఇతి. (16-18)

శ్లో॥ పృథుర్విదూరథాద్యాశ్చ బహవో వృష్ణి నందనాః ।
కుకురో భజమానశ్చ శుచిః కంబళ బర్హిషః ॥ 19

చిత్రరథునకు పృథువు ఒక పుత్రుడు. ఈతనే కాక, విడూరథాదులు అనేకులు ఉండిరి. వీరు వృష్ణి వంశములో శ్రేష్ఠులు. విడూరథాదులు అని చెప్పుటచే "తసశ్చశూరోవిడూరథాదాసీత్" అని చెప్పబోవు దానికి ఇది ఉపపత్తి. కుకురుడు, భజమానుడు, శుచి,

కంబళబర్హి అను నలుగురు సాత్వకుని పుత్రుడగు అంధకుని పుత్రులు అని తెలియవలయును. పరాశరుడు "కకుర భజమాన శుచి కంబళ బర్హిషాఖ్యాః తథాంధక పుత్రాః" అని చెప్పినాడు. 19

శ్లో॥ కుకురస్య సుతో వృష్ణిర్విలోమతనయ స్తతః ।
కపోతరో మాతస్యానుస్సఖ్యా యస్య చ తుంబురుః ॥ 20

కకురునికి వృష్ణి పుత్రుడు, వృష్ణికి విలోముడు, విలోమునకు కపోతరోముడు, కపోతరోమునకు అనువు అను వారలు పుత్రులు. ఈ అనువునకు తుంబురుడు మిత్రుడు. 20

టీ:- పృథురితి. పృథురేకః విదూరథాద్యా అన్యే చ బహవః. విపృథు యానాద్యా ఇతి పాఠే ఆద్య శబ్దేన విదూరథోఽప్యుక్తః. తతశ్చ. శూరో విదూర థాదాసీదితి వక్ష్యమాణనిర్దేశోపపత్తిః. కుకురాదయ శ్చత్వారో ఽంధకస్య పుత్రా ఇతి జ్ఞేయం. తథా చ పరాశరః. కుకుర భజమాన శుచి కంబళ బర్హి షాఖ్యా స్తథాంధకస్య పుత్రా ఇతి. (19-20)

శ్లో॥ అనోశ్చ దుందుభిస్తస్య దవిద్యోతః పునర్వసుః ।
తస్యాహుకశ్చాహుకీచ కన్యాద్వావాహుకాత్మజౌ ॥ 21

అను పుత్రుడు అంధకుడు, అంధకుని పుత్రుడు దుందుభి అని కూడా ఆ పరాశరుని వచనములోనే తెలియవలయును. దుందుభికి దవిద్యోతుడు, దవిద్యోతునకు పునర్వసువు, అనువారలు పుత్రులైరి. పునర్వసునకు ఆహుకుడు అను పుత్రుడు, ఆహుకీ అను పుత్రిక కలిగిరి. ఆహుకునకు ఇద్దరు పుత్రులు. 21

శ్లో॥ దేవకశ్చోగ్రసేనశ్చ చత్వారో దేవకాత్మజాః ।
దేవలోఽనుపదేవశ్చ సుదేవో దేవవర్ధనః ॥ 22

దేవకుడు ఉగ్రసేనుడు ఇద్దరు ఆహుకుని పుత్రులు. దేవకునకు దేవలుడు, అనుపదేవుడు, సుదేవుడు, దేవవర్ధనుడు అని నలుగురు పుత్రులు. 22

టీ:- అనోరితి. అనోరంధకః అంధకాత్ దుందుభిరిత్యపి తద్వచనాదేవ జ్ఞేయం. (21-22)

శ్లో॥ తేషాం స్వసారస్సప్తాసన్ ధృతదేవాదయో నృప ।
శాంతిదేవోపదేవా చ శ్రీదేవా దేవరక్షితా ।
సహదేవా దేవకీ చ వసుదేవ ఉవాహృతాః ॥ 23

దేవకుని పుత్రులగు ఆ నలుగురికి ఏడుగురు భగినులుండిరి. వారు ధృతదేవా, శాంతిదేవా, ఉపదేవా, శ్రీదేవా, దేవరక్షితా, సహదేవా, దేవకీ అను వారలు. ఈ ఏడుగురిని వసుదేవుడు వివాహమాడెను. 23

టీ:- తేషామితి. ధృతదేవా ఆదిర్యాసాం శాంతిదేవాదీనాం షణ్ణాం తాస్సప్త. 23

శ్లో॥ కంసస్సునామా న్యగ్రోధః కహ్వాశ్శంకుస్సుభూస్తథా ।
రాష్ట్రపాలో విసృష్టశ్చ తుష్టిమానౌగ్రసేనయః ॥ 24

కంసుడు, సునాముడు, న్యగ్రోధుడు, కంకుడు, శంకుడు, సుభువు, రాష్ట్రపాలుడు, విసృష్టుడు, తుష్టి అను తొమ్మండ్రుగురు ఉగ్రసేనుని పుత్రులు. 24

టీ:- కంస ఇతి. ఔగ్రసేనయః ఉగ్రసేనస్య సుతాః. 24

శ్లో॥ కంసాకంసవతీ కంకాసురాభూ రాష్ట్రపాలికా ।
ఉగ్రసేన దుహితరో వసుదేవానుజ స్త్రియః ॥ 25

టీ:- కంసేతి. వసుదేవస్య యే అనుజా దేవభాగాదయః తేషాం స్త్రియో భార్యాః. 25

కంస, కంసవతీ, కంకాసురా, భూ, రాష్ట్రపాలిక అను ఐదుగురు ఉగ్రసేనుని పుత్రికలు. ఈ ఐదుగురు వసుదేవుని తమ్ములగు దేవభాగుడు మొదలగు వారి భార్యలు. 25

శ్లో॥ శూరోవిదూరథాదాసీద్భజమానసుతాత్తతః ।
శినిస్తస్మాత్స్వయం భోజో హృదికస్తత్సుతో మతః॥
దేవమీఢశ్శతధనుః కృతవర్మేతి తత్సుతాః ॥ 26

టీ:- అంధకస్య సుతానాం చతుర్ణాం ప్రథమస్య కుకురస్య వంశ ఉక్తః. ద్వితీయస్య భజమానస్య వంశమాహ - శూర ఇతి. భజమానాచ్చ విదూరథః పుత్రోఽభవత్ విదూరథాచ్చ శూర ఇతి. పరాశరాది వచనాత్. యద్వా పృథుర్విదూరథాద్యాశ్చేతి పూర్వోక్త చిత్రరథాత్మజాద్విదూరథాత్. 26

అందకుని పుత్రులు నలుగురిలో మొదటివాడగు కుకురుని వంశమును చెప్పి రెండవవాడగు భజమానుని వంశమును తెలుపుచున్నాడు. భజమానుని పుత్రుడగు విడూరథునకు శూరుడు పుత్రుడు (అని పరాశరవచనము) లేక పృథుర్విధూరథాద్యాశ్చా అని ముందు చెప్పబడిన చిత్రరథుని పుత్రుడగు విడూరథునకు శూరుడు పుత్రుడు. శూరునకు శిని, శినికి స్వయంభోజుడు, స్వయంభోజికి హృథికుడు, హృథికునకు దేవమీఢుడు, శతధనువు, కృతవర్మ అనిముగ్గురు పుత్రులు. 26

శ్లో॥ దేవమీఢస్య శూరస్య మారిషా నామ పత్న్యభూత్ ।
తస్యాం స జనయామాస దశపుత్రానకల్మషాన్ ॥ 27

దేవమీఢునకు శూరడను పుత్రుడు, ఆతనికి మారిషా అనునామె భార్య. ఆమెను ఆ మారిష యందు శూరుడు పాప రహితులగు పది మంది పుత్రులను జన్మింపజేసెను. 27

శ్లో॥ వసుదేవం దేవభాగం దేవశ్రవసమానకమ్ ।
సృంజయం శ్యామ కంకం కమనీకం వత్సకం వృకమ్ ॥ 28

వసుదేవుడు, దేవభాగుడు, దేవశ్రవసుడు, ఆనకుడు, సృంజయుడు, శ్యామకుడు, కంకుడు, అనీకుడు, వత్సకుడు, వృకుడు అను పది మంది మారిషయందు శూరునకు జన్మించిన పుత్రులు. 28

టీ:- దేవమీఢస్యేతి. దేవమీఢస్య యఃశూరోనామపుత్రః తస్య దేవమీఢో హృదికస్యైవ సుతః యథాపరాశరః. తస్యాపి కృతవర్మ శతధనుర్దేవ మీఢాద్యాః పుత్రాబభూవుః దేవమీఢస్యశూరస్తస్య మారిషానామ పత్న్యభవత్ తస్యాం చాసౌ దశ పుత్రాన్ అజయత్ వసుదేవపూర్వానితి. (27-28)

శ్లో॥ దేవ దుందుభయో నేదురానకా యస్య జన్మని ।
వసుదేవం హరేస్థానం వదన్త్యానక దున్దుభిమ్ ॥ 29

విష్ణువునకు ప్రాదుర్భావస్థానుడగు వసుదేవుడు జన్మించిన సమయమున దేవలోకములో దుందుభులు అనేకములు మ్రోగినందున ఆతనిని ఆనక దుందుభి అని అందురు. 29

శ్లో॥ పృథా చ శ్రుతదేవా చ శ్రుతకీర్తిశ్శ్రుతశ్రవాః ।
రాజాధిదేవీ చైతేషాం భగిన్యః పంచకన్యకాః ॥ 30

పృథా, శ్రుతదేవా, శ్రుతకీర్తి, శ్రుతశ్రవా, రాజాధిదేవీ అను ఐదుగురు కన్యకలు వసుదేవాదుల భగినులు, శూరుని పుత్రికలు. 30

టీ:- దేవేతి. ఆనకాశ్చ నేదుః హరేః ప్రాదుర్భావస్థానం. (29-30)

శ్లో॥ కున్తేస్సఖ్యుః పితా శూరో హ్యపుత్రస్య పృథామదాత్ ।
సాప దుర్వాససో విద్యాం దేవహూతిం ప్రతోషితాత్ ॥ 31

టీ:- పృథాయాః కన్యకావస్థాయాం కర్ణోత్పత్తి ప్రకారమాహ - పంచభిఃకుంతేరితి. కదాచిత్ స్వయమాగతం దుర్వాససం పృథా పరిచర్యాదినా తోషయామాస తతశ్చ సా తస్మాత్ దేవహూతిం దేవాహ్వానహేతుం విద్యామవాప తదాహ - సేతి. 31

పృథకు తండ్రియగు శూరుడు సంతానములేని తన స్నేహితుడగు కుంతికి పృథను పుత్రికగా నొసంగెను. ఈ పృథ కన్యకావస్థలోఉండగా కర్ణుడు జన్మించిన విషయమును ఇచటినుండి ఐదు శ్లోకములతో తెలుపుచున్నాడు. ఒకానొకప్పుడు పృథ గృహమునకు తనంత తాను వచ్చిన దుర్వాస మునిని పృథ పరిచర్యాదులతో సంతోషింపజేసెను. ఆ దుర్వాసముని నుండి పృథ దేవతాహ్వాన హేతువగు విద్యను పొందెను. 31

శ్లో॥ తస్యా వీరపరీక్షార్థమాజుహావ రవిం శుచిః ।
తదాప్రాహాగతం దేవం వీక్ష్య విస్మితమానసా ॥ 32

టీ:- తస్యా ఇతి. దేవముపాగతం వీక్ష్య సా ప్రాహ. 32

ఆ దుర్వాసుని నుండి పొందిన విద్యను పరీక్షించుటకై పృథ శుచియై సూర్యభగవానుని ఆహ్వానించెను. వెంటనే వచ్చిన (ప్రత్యక్షమైన) ఆ సూర్యభగవానుని చూచి విస్మితురాలై ఇటుల పలికెను. 32

శ్లో॥ ప్రత్యయార్థం ప్రయుక్తా మే యాహి దేవ క్షమస్వ భో ।
అమోఘం దేవసందర్శమాధాస్యే త్వయిచాత్మజమ్ ।
యోనిర్యథా న దుష్యేత కర్తాహం తే సుమధ్యమే ॥ 33

ఓ సూర్యదేవా! నన్ను క్షమించుము. నేను దేవతాహ్వాన విద్యను పరీక్షించుటకై ఆ విద్యను ప్రయోగించితిని. నీతో ఏమియూ పనిలేదు, అందువలన వెళ్ళుము అని పలుకబడిన సూర్యుడు ఇటుల పలికెను. దేవసందర్శనము అమోఘమైనది, నీ యందు పుత్రుని జనింపజేసెదను, నేను కన్యకనని సందేహించకుము, నీ యోని దోషము నొందకుండునటుల నేను పుత్రుని ప్రసాదించెదను. 33



శ్లో॥ ఇతి తస్యాం స ఆధాయ గర్భం సూర్యోదివం గతః ।
సద్యః కుమారస్సంజజ్ఞే ద్వితీయ ఇవ భాస్కరః ॥ 34

అని చెప్పి సూర్యుడు ఆ పృథకు గర్భము గావించి దివమునకు వెడలెను. వెంటనే రెండవ సూర్యునివలెనున్న పుత్రుడు జన్మించెను. 34

శ్లో॥ తం సాత్యజన్నదీతో యే కృచ్ఛ్రా ల్లోకస్య బిభ్యతీ ।
ప్రపితామహస్తామువాహ పాండుస్తే సత్య విక్రమః ॥ 35

ఆ సూర్యుని అనుగ్రహము వలన జన్మించిన శిశువును, పృథ లోకాపవాదమునకు భీతిల్లి మిక్కిలి కష్టముతో నదీ జలములో వదిలెను. ఆ పృథను నీ ప్రపితామహుడగు గొప్ప పరాక్రమవంతుడును అగు పాండురాజు వివాహము చేసుకొనెను. 35

శ్లో॥ శ్రుతదేవాం తు కారూషో వృద్ధశర్మాసమగ్రహీత్ ।
యస్యామభూద్దంతవక్త్ర ఇతి శప్తో దితేస్సుతః ॥ 36

పృథ చెల్లెలగు శ్రుతదేవాను కారూష దేశాధిపతియగు వృద్ధకర్మ వివాహమాడెను. ఆమె యందు దంతవక్త్రుడు జన్మించెను. ఈ దంతవక్త్రుడు పూర్వజన్మలో సనకాది మునులచే శపించబడిన దితి సుతుడు. 36

శ్లో॥ కేకయో దృష్టకేతుశ్చ శ్రుతకీర్తిమవిందత ।
ప్రతర్దనాదయస్తస్యాం పంచాసన్ కేకయాత్మజాః ॥ 37

టీ:- ప్రత్యయార్థమితి. ప్రత్యయార్థం పరీక్షార్థం మయా విద్యా ప్రయుక్తా న తు త్వయా కించిత్కార్యమిత్యభిసంధినా అతో యాహీతి ఏవముక్తో రవిరువాచ అమోఘం దేవసందర్శమితి. కన్యాహమితి చేత్త త్రాహ-యథా యోనిర్నదుష్యేత తథాహం కర్తా కరిష్యామి. (33-37)

కైకయ దేశాదిపతియగు దృష్టకేతువు శ్రుతకీర్తిని వివాహ మాడెను. ఆవిడ యందు ప్రతర్దనాదులు అగు ఐదుగురు పుత్రులు కలిగిరి. 37

శ్లో॥ రాజాధిదేవ్యామావంత్యౌ జయత్సేనోఽజనిష్ట హ ।
దమఘోషశ్చేది రాజఃశ్రుతశ్రవసమగ్రహీత్ ॥ 38

టీ:- రాజాధిదేవ్యామితి. ఆవంత్యౌ విందానువిందౌ. 38

జయత్సేనుడనువాడు రాజాధిదేవి యందు విందానువిందులను ఇద్దరు పుత్రులను కనెను. వారు అవంతి రాజులైరి. ఛేది రాజగు దమఘోషుడు శ్రుతశ్రవసను వివాహమాడెను. 38

శ్లో॥ శిశుపాలస్సుతస్తస్యాః కథితస్తస్యసమ్భవః ।
దేవభాగస్య కంసాయాం చిత్రకేతుబృహద్బలౌ ॥ 39

ఆ శ్రుతశ్రవసకు శిశుపాలుడు పుత్రుడు. ఈ శిశుపాలుని గురించి పూర్వము సప్తమ స్కంధములో చెప్పితిని. ఈ ప్రకారము వసుదేవుని చెల్లెండ్ల పతులను గురించి, పుత్రులను గురించి చెప్పి అతని తమ్ములు తొమ్మండుగురి భార్యలు, పుత్రులను గురించి "దేవభాగస్య" అను మొదలుకొని నాలుగున్నర శ్లోకములలో తెలుపుచున్నాడు. దేవభాగునకు కంసా అనునామె యందు చిత్రకేతు, బృహద్బలు అను ఇద్దరు పుత్రులు కలిగిరి. 39

శ్లో॥ కంసవత్యాం దేవశ్రవసస్సువీర ఇషుమాంస్తథా ।
బకః కంకాత్తు కంకాయాం సత్యజిత్పురుజిత్తథా ॥ 40

దేవశ్రవసునకు కంసవతియందు సువీరుడు, ఇషుమంతుడు అని ఇద్దరు పుత్రులు కలిగిరి. ఆనకుని వలన కంకా అను ఆవిడయందు సత్యజిత్తు, పురుజిత్తు అను ఇద్దరు పుత్రులు జన్మించిరి. 40

శ్లో॥ సృంజయో రాష్ట్రపాల్యాం తు వృషదుర్మర్షణాదికాన్ ।
హరికేశహిరణ్యాక్షౌసురభూమ్యాం తు శ్యామకః ॥ 41

సృంజయుడు రాష్ట్రపాలియందు వృష, దుర్మర్షణాది పుత్రులను కనెను. శ్యామకుడు సురభూమియందు హరికేశ, హిరణ్యాక్షులను ఇద్దరు పుత్రులను కనెను. 41

శ్లో॥ మిశ్రకేశ్యామప్సరసి వృకాదీన్ వత్సనామకః ।
తక్షపుష్కరసాల్వాదీన్ దూర్వాక్ష్యాం వృక ఆదధే ॥ 42

మిశ్రకేశి అను అప్సరసయందు వత్సకుడు, వృకాది పుత్రులను కనెను. దుర్వ్యాక్షి అనునామెయందు వృకుడు తక్ష, పుష్కర, శాల్వాదులను పుత్రులుగా పొందెను. 42

శ్లో॥ సుమిత్రానీకబాణాదీననీకాత్తు సుదామనీ ।
ఆనకః కర్ణికాయాం వా ఋతధామ జయావపి ॥ 43

అనీకుడు సుదామిని యందు సుమిత్రానీకబాణాది పుత్రులను బడసెను. ఆనీనకుడు కర్ణిక అను భార్య యందు ఋతధాముడు, జయుడను పుత్రులనొందెను. 43

టీ:- శిశుపాల ఇతి. తదేవం వసుదేవస్య భగినీనాం పతీన్ పుత్రాంశ్చోక్త్వా తద్భ్రాతౄణాం నవానాం పత్నీః పుత్రాంశ్చహ – దేవభాగస్యేతి సార్ధైశ్చతుర్భిః. (39-43)

శ్లో॥ పౌరవీ రోహిణీ భద్రా మదిరా రోచనా ఇళా ।
దేవకీ ప్రముఖా ఆసన్ పత్న్య ఆనకదుందుభేః ॥ 44

వసుదేవుని భార్యా పుత్రాదులను గురించి ఈ శ్లోకము నుండి పదకొండు శ్లోకములలో తెలుపుచున్నాడు. వసుదేవునకు పౌరవీ, రోహిణి, భద్రా, మదిర, రోచన, ఇళా, దేవకీ మొదలగు అనేకమంది భార్యలుండిరి. 44

టీ:- వసుదేవస్య పత్నీః పుత్రాంశ్చాహ – పౌరవీత్యేకాదశభిః. 44-46

శ్లో॥ బలం గదం సారణం చ దుర్మదం విపులం ధ్రువం ।
వసుదేవస్తు రోహిణ్యాం కృతాదీనుదపాదయత్ ॥ 45

వసుదేవుడు రోహిణీ దేవియందు బలుడు, గదుడు, సారణుడు, దుర్మదుడు, విపులుడు, ధృవుడు, కృతుడు మొదలగు పుత్రులను జన్మింపజేసెను. 45

శ్లో॥ సుభద్రో భద్రబాహుశ్చ దుర్మదో భద్ర ఏవ చ ।
పౌరవ్యాస్తనయా హ్యేతేభూతాద్యా ద్వాదశాభవన్ ॥ 46

వసుదేవునకు పౌరవి అను భార్య యందు సుభద్రుడు, భద్రబాహుడు, దుర్మాదుడు, భద్రుడు, భూతుడు మొదలగు పన్నెండు మంది పుత్రులు కలిగిరి. 46

శ్లో॥ నందోపనందకృతకశూరాద్యా మదిరాత్మజాః ।
కౌసల్యా కేశినం త్వేకమసూత కులనందనమ్ ॥ 47

టీ:- నందేతి. కౌసల్యా నామ భద్రా. (47-53)

నందుడు, ఉపనందుడు, కృతుడు, శూరుడు మొదలగువారు వసుదేవునకు మదిర అను భార్యకు జన్మించిన పుత్రులు. కౌసల్యా అనగా భద్ర, వసుదేవునకు కౌసల్య యందు (భద్ర) వంశోద్ధారకుడగు కేశియను ఒకే పుత్రుడు కలిగెను. 47

శ్లో॥ రోచనాయాం తతో జాతాహస్త హేమాంగదాదయః ।
ఇళయాமురువల్కాదీన్యదుముఖ్యాదజీజనత్ ॥ 48

వసుదేవునకు రోచన అను భార్య యందు హస్తుడు, హేమాంగదుడు మొదలగు పుత్రులు జన్మించిరి. వసుదేవునకు ఇళ యందు యదు వంశ ముఖ్యులగు ఉరువల్కాదులు జన్మించిరి. 48

శ్లో॥ త్రిపృష్ఠోధృత దేవాయామేక ఆనక దుందుభేః ।
శాన్తిదేవాత్మజా రాజన్ ప్రశమప్రశ్రితాదయః ॥ 49

వసుదేవునకు ధృతదేవయందు త్రిపృష్ఠుడను ఒక పుత్రుడు కలిగెను. ప్రశముడు, ప్రశ్రితుడు మొదలగువారు శాంతిదేవి యందు జన్మించిరి. 49

శ్లో॥ రాజానః కల్పవృష్ట్యాద్యా ఉపదేవాసుతా దశ ।
వసుహంససుధన్వాద్యాః శ్రీదేవాయాస్తు షట్సుతాః ॥ 50

కల్పవృష్టాది రాజులు పది మంది ఉపదేవా పుత్రులు. శ్రీదేవా అను భార్యకు వసుహంస, సుధన్వాదులు మొదలగు ఆరుగురు పుత్రులు కలిగిరి. 50

శ్లో॥ దేవరక్షితయా లబ్ధా నవ చాత్ర గదాదయః ।
వసుదేవసుతా నష్టావాదదే సహ దేవాయ ॥ 51

వసుదేవునకు దేవరక్షితా అను భార్యయందు గదుడు మొదలగు తొమ్మండుగురు పుత్రులు కలిగిరి. సహదేవా అను భార్య యందు వసుదేవుడు ఎనమండుగురు పుత్రులను కనెను. 51

శ్లో॥ పురూధశ్రుతముఖ్యాంశ్చసాక్షాద్ధర్మో వసూనివ ।
వసుదేవస్తు దేవక్యామష్టపుత్రానజీజనత్ ॥ 52

ధర్ముడు అష్టవసులను కనినటుల, వసుదేవుడు, దేవకీదేవి యందు పురూధుడు, శ్రుతుడు మొదలగు ఎనిమిది మంది పుత్రులను కనెను. (జన్మింపచేసెను) 52

శ్లో॥ కీర్తిమంతం సుషేణం చ భద్రసేనముదారధీః ।
ఋజుం సుమదనం భద్రం సంకర్షణమహీశ్వరమ్ ॥ 53

కీర్తిమంతుడు, సుశేషుణుడు, భద్రసేనుడు, ఋజుడు, సమదనుడు, భద్రుడు, ఆదిశేషావతారమగు సంకర్షణుడు (బలరాముడు) అను ఏడుగురు. 53

శ్లో॥ అష్టమస్తు తయోరాసీత్స్వయమేవ హరిః కిల ।
సుభద్రా చ మహాభాగ తవ రాజన్ పితామహీ ॥ 54

టీ:- అష్టమ ఇతి. అష్టమస్తు స్వయమేవాసీత్. న తు కర్మాదినా హేతునా తాభ్యాం చ జనితో వా. యతోఽసౌ శ్రీహరిః. 54

ఎనిమిదవవాడు కర్మాది కారణములతో గాక స్వయముగానే ఆ దేవకీవసుదేవులకు ఆవిర్భవించెను. ఏలనన అతడు శ్రీహరికదా! ఓ పరీక్షిద్రాజా! మీ నాయనమ్మ యగు సుభద్ర అను కన్యక దేవకీ వసుదేవులకు శ్రీహరి కల్గెను. 54

శ్లో॥ యదా యదేహ ధర్మస్య క్షమోవృద్ధిశ్చ పాప్మనః ।
తదా తు భగవానీశ ఆత్మానం సృజతే హరిః ॥ 55

టీ:- తదేవోపపాదయతి - యదేతి త్రిభిః. 55

శ్రీహరి స్వయముగా ఆవిర్భవించినాడను విషయమును మూడు శ్లోకములతో ప్రతిపాదిస్తున్నాడు. ఈ విశ్వమున ఎప్పుడెప్పుడు ధర్మ క్షయము, పాప వృద్ధి కల్గునో అప్పుడు భగవంతుడు, ప్రభువును అగు శ్రీహరి తనను సృజించుకొనును. (అవతరించును). 55

శ్లో॥ న హ్యస్య జననే హేతుః కర్మణో వా మహీపతే ।
ఆత్మమాయాం వినేశస్య పరస్య ద్రష్టురాత్మనః ॥ 56

టీ:- ఈశస్య మాయానియంతుః పరస్య అంగస్య. ద్రష్టుః సాక్షిణః. ఆత్మనః సర్వగస్య. న హ్యేవం భూతస్య మాయావినోదం వినా, జన్మనః కర్మణో వా హేతుస్సంభవతీత్యర్థః. 56

ఓ పరీక్షిద్రాజా! సర్వమాయా నియంతయగు సమస్తమునకు సాక్షీభూతుడును అగు, సర్వత్ర ఉండెడి ఈ భగవంతుని జన్మకు, కర్మలకును ఆ భగవంతుని మాయా వినోదమే కారణము కాని ఏ కర్మయు కారణము కాజాలదు. 56

శ్లో॥ యన్మాయాచేష్టితం పుంసస్థిత్యుత్పత్త్యప్యయాయ హి ।
అనుగ్రహ స్తన్నివృత్తేరాత్మా లాభాయచేష్యతే ॥57

టీ:- కించ. యదితి. యస్య మాయాచేష్టితం. పుంసో జీవస్యానుగ్రహః తస్య సర్వజీవానుగ్రాహకస్య కుతః కర్మాదిపాతరంత్ర్యేణ జన్మాది సంభవః. అనుగ్రహమేవాహ - హి యస్మాత్ తదేవ స్థిత్యాదయే ఇష్యతే. ప్రళయే లీనోపాధేర్జీవస్య ధర్మాద్యసంభవాదుపాధి సృష్ట్యాదినా ధర్మాది

ఏ భగవంతుని యొక్క మాయా వినోదము జీవులకనుగ్రహమగుచున్నదో అలాంటి సమస్త జీవులకు అనుగ్రహమును కల్గజేసెడి భగవంతునకు కర్మాదులతో జన్మమెలా కలుగును, కావున భగవజన్మ జీవానుగ్రహమే. జీవుని జనన వృద్ధి క్షయములకు, అనుగ్రహమునకు శ్రీహరి మాయా విలాసములే కారణములు. ప్రళయ సమయమున ఉపాధిలీనమైన జీవునకు ధర్మాదులు సంభవించినందున తిరిగి ఉపాధి సృష్టితో ధర్మాది సంపాదనముతో అనుగ్రహము కలుగుచున్నది.

సంపాదనే నాను గ్రహః. తథా ఆత్మ లాభాయ మోక్షాయ చేష్యతే తత్ర హేతుః. తేనైవ శ్రూయమాణేన తస్య స్థిత్యాదేర్ని వృత్తేః. 57

అటులనే మోక్షమునకు కూడా భగవదనుగ్రహమే కారణము, ఏలనన స్థిత్యాది నివృత్తితో మోక్షము కలుగును. 57

శ్లో॥ అక్షౌహిణీనాం పతిభిరసురైర్నృఫలాంచనైః ।
భువ ఆక్రమ్యమాణా యాహ్యభారాయ కృతోద్యమః ॥ 58

టీ:- తస్య చేష్టితం భూమేరప్యనుగ్రహ ఇత్యాహ - ద్వాభ్యాం. అక్షౌహిణీనామితి. అభారాయ భారపరిహారాయ. 58

ఆ భగవంతుని చేష్టితము భూమండలమునకును అనుగ్రహమే యని రెండు శ్లోకములలో తెలుపుచున్నాడు. రాజలాంఛనములను ధరించి రాక్షసులు, అక్షౌహిణీల సేనలకధిపతులై భూమిని ఆక్రమించి జనుల బాధించుచుండగా భూభార హరణమునకై భగవంతుడు ఉద్యమించినవాడై (తరువాతి శ్లోకముతో అన్వయము). 58

శ్లో॥ కర్మాణ్యపరిమేయాని మనసాపి సురేశ్వరైః ।
సహ సంకర్షణశ్చక్రే భగవాన్మధుసూదనః ॥ 59

టీ:- కర్మాణీతి. సురేశ్వరైరపి మనసాపి అపరిమేయాని అవితర్క్యాణి సంకర్షణేన సహితశ్చక్రే. 59

దేవాధిపతులు మనస్సుతో కూడా ఊహించజాలని లీలా కర్మలను భగవంతుడగు మధుసూదనుడు (శ్రీకృష్ణుడు) సంకర్షణునితో (బలరామునితో) గూడి చేసెను. 59

శ్లో॥ కలౌ జనిష్యమాణానాం దుఃఖశోకతమోనుదమ్ ।
అనుగ్రహాయ భక్తానాం స్వపుణ్యం వ్యతనోద్యశః ॥ 60

టీ:- సంకల్పమాత్రేణ భూభారహరభసమర్థస్యాఽపి కర్మకరణం

కేవలము సంకల్పము చేతనే భూభార హరణ సమర్థుడగు భగవంతుడు లీలాకర్మనాచరించడము, తన కీర్తిని విస్తరించి భక్తులను అనుగ్రహించుటకే యని రెండు శ్లోకాలలో తెలుపుచున్నాడు. కలియుగమున జన్మించెడి వారికి దుఃఖ, శోక, అజ్ఞానములను

యశోవిస్తార ద్వారా భక్తానుగ్రహార్థమిత్యాహ - ద్వాభ్యాం. కలావితి. దుఃఖ శోక తమాంసి నుదతీతి తథా. తద్యశః వ్యతనోత్. 60

తొలగించెడి పుణ్యవంతమగు కీర్తిని భక్తులను అనుగ్రహించుటకై విస్తరింపచేసెను. (భగవంతుని యశస్సును కీర్తించెడి వారికి దుఃఖ, శోక, అజ్ఞానములు తొలగునని తాత్పర్యము). 60

శ్లో॥ యస్మిన్ సత్కర్ణ పీయూషే యశస్తీర్థవరే సకృత్ ।
శ్రోత్రాంజలిరుపస్పృశ్య ధునుతే కర్మవాసనామ్ ॥ 61

టీ:- యస్మిన్నితి. యస్మిన్ సతాం కర్ణ పీయూషే యశోరూపేతీర్థవరే శ్రోత్రమేవాంజలిఃపానసాధనం యస్య సః పురుషః.సకృదపిఉపస్పృశ్య ఆచమనమాత్రం కృత్వాతత్సౌందర్యాకృష్టచిత్తః కర్మవాసనాం ధునుతే.61

సత్పురుషుల కర్ణములకు అమృతములాంటిదగు భగవంతుని యశస్సనెడి తీర్థరాజమును, శోత్రమనెడి పానసాధనముతో (అంజలితో) ఆచమనమాత్రము ఒనరించినపుడు భగవంతుని సౌందర్యముతో ఆకర్షించబడిన చిత్తము కలవారై, కర్మవాసనను ప్రక్షాళనము కావించు కొందురు. (వాసనా త్యాగము జరుగును) 61

శ్లో॥ భోజవృష్ణ్యంధక మధు శూరసేన దశార్హ్వకైః ।
శ్లాఘనీయే హితశ్శశ్వత్కురు సృంజయపాండుభిః ॥ 62

టీ:- తదేవాహ - ద్వాభ్యాం. భోజేతి. భోజాదిభిః శ్లాఘనీయమీహితం యస్య. 62

పైన చెప్పిన దానినే ఈ రెండు శ్లోకములలో బలపరచు చున్నాడు. భోజ, వృష్ణి, అంధక, మధు, శూరసేన, దాశార్హ్వ, కురు, సృంజయ, పాండు వంశీయులగు రాజుల చేత ఎల్లప్పుడు ఆ భగవంతుడు కొనియాడబడు చుండెను. 62

శ్లో॥ స్నిగ్ధ స్మితేక్షణో ద్వారైర్వాక్యైర్విభ్రమలీలయా ।
నృలోకం రమయామాస మూర్త్యా సర్వాంగరమ్యయా ॥ 63

ఆ భగవంతుడు సర్వాంగ సుందరమగు ఆకారముతో, ప్రేమతో గూడిన చిరునవ్వుతో, చల్లని దయగల చూపులతో, మధురములగు





టీ:- స్నిగ్ధేతి. సర్వైరంగైః రమ్యయా మూర్త్యా చ. 63

శ్లో॥ యస్యాననం మకరకుండలచారుకర్ణ
భ్రాజత్కపోలసుభగం సవిలాసహాసమ్ ।
నిత్యోత్సవం నతతృపుర్దృశిభిః పిబంత్యో
నార్యో నరాశ్చ ముదితాః కపితాని మేశ్చ ॥ 64

టీ:- తత్రప్రదర్శనార్థం ముఖశోభమాహ - యస్యేతి.యస్యాననం దృశిభిర్నేత్రైః.పిబంత్యో నార్యో నరాశ్చ న తతృపుః న తృప్తాః నిమేషోన్మేష మాత్ర వ్యవధానమప్యసహమానా స్తత్కర్తుర్నిమేఃకుపితాశ్చ బభూవుః. కథం భూతమాననం మకరకుండలాభ్యాం చారూకర్ణౌ భ్రాజంతౌ కపోలౌ చ తైః సుభగం సవిలాసో హాసో యస్మిన్ నిత్యముత్సవో యస్మిన్. 64

శ్లో॥ జాతోగతః పితృ గృహాద్వ్రజమేధితార్థో
హత్వా రిపూన్ సుతశతాని కృతోరుదారః ।
ఉత్పాద్య తేషు పురుషః క్రతుభిస్సమీజే
హ్యాత్మానమాత్మనిగమం ప్రథయన్ జనేషు ॥ 65

టీ:- శ్రీకృష్ణచరితం సమాసతో వర్ణయతి ద్వాభ్యాం - జాత ఇతి.

మాటలతో, వైభవ పూర్వకములైన లీలతో రాజలోకమంతటిని ఆనంద సాగరములో ముంచెను. 63

ఆ భగవంతుని ముఖ శోభను వర్ణించుచున్నాడు. మకర కుండలములతో సుందరములగు కర్ణములు కలిగిన, ప్రకాశించెడి చెక్కిళ్ళతో సుందరమైనట్టి విలాసముతో కూడిన చిరునవ్వుతో నిత్యము ఉత్సవ శోభను వెదజల్లెడి ఆ భగవంతుని ముఖశోభను కన్నులతో పానము చేయుచూ కూడా స్త్రీలు, పురుషులు తృప్తి చెందకపోయిరి. నిమేష ఉన్మేష వ్యవధానమును (కన్నులు మూయడం, తెరవడంతో శ్రీకృష్ణుని దర్శనములో కలిగిన అంతరాయమును) సహించక ఆ నిమేషణ కర్తయగు నిమిని కోపించిరి. 64

శ్రీకృష్ణ చరితము సంక్షేపముగా రెండు శ్లోకములతో తెలుపబడుచున్నది. భగవంతుడు నిజరూపముతో జన్మించిన పిదప మనుష్యాకారము ధరించి తండ్రియగు వసుదేవుని గృహము నుండి గోకులమునకు వెడలి అచట వ్రజవాసుల కోరికను తీర్చి శత్రువులను సంహరించి చాలా మంది స్త్రీలను భార్యలనుగా చేసుకొని వారియందు అనేకమంది

జాతో నిజేన రూపేణ.పశ్చాత్ పురుషో మనుష్యాకారస్సన్ వ్రజగతః. వ్రజవాసినాం ఏధితా అర్థా యేన. తేషు దారేషు సుతానాం శతాన్యుత్పాద్య ఆత్మనిగమం స్వకీయం వేదమార్గం. 65

శ్లో॥ భూమ్యాస్స వా ఉరుభరం క్షపయన్కురూణా
మంతస్సముత్థకలినా యుధి భూప చక్రం ।
దృష్ట్వా విధూయ విజయే జయముద్విఘుష్య
ప్రోచ్యోద్ధవాయ పరమం సమగాత్స్వధామ ॥ 66

టీ:- భూమ్యా ఇతి. అంతస్సముత్థేన నిమిత్తేన ఉరుభరం క్షపయన్. దృష్ట్వైవ భూపావాం చమూర్విధూయ. విజయే జయం అర్జునేన జితమిత్యేవముద్ఘోషం కృత్వా పరమం తత్వముద్ధవాయోపదిశ్య స్వంధామ సమ్యక్తేనైవ రూపేణ జగామేతి. 66

శ్రీ మద్భాగవతే, మహాపురాణే నవమస్కంధే,
చతుర్వింశోఽధ్యాయః
నవమస్కంధః సమాప్తః

పుత్రులను కని (సుతశతము) తనదగు వేదమార్గమును ప్రజలలో విస్తరింపజేసి అనేక యజ్ఞములనొనరించెను. (అనేక యజ్ఞములలో తనను గురించి యజనము గావించెను). 65

కురువంశీయుల మధ్యలో (కౌరవ, పాండవులమధ్య) కల్గిన కలిరూపమగు యుద్ధములో గొప్పదగు భూభారమును తగ్గించి తన దృష్టిచేతనే రాజసమూహమును, అనేక అక్షౌహిణీల సైన్యమును ధ్వస్తము గావించి అర్జునునిపై జయము నిలిపి, అనగా అర్జునుని చేత జయించబడినదని జయమును ఉద్ఘోషింపజేసి పరతత్వమును గురించి ఉద్ధవునకు తెలిపి, తన ధామమును (స్థానమును) ఆ రూపము తోనే చేరెను. (వెళ్ళెను). 66

అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమందు
ఇరువదినాల్గవ అధ్యాయము సమాప్తము.
నవమస్కంధము సమాప్తము.

